# నృత్తరత్నావళి

## ద్వితీయభాగము

శ్రీ జాయసేనాపతి గ్రంథమునకు
సాహితీవల్లభ వ్యాఖ్యానము

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ
అభినవభారతి : గుంటూరు.

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి,
తణుకు.



శ్రీ జమ్ములమడక మాధవరావ శర్మగారు.      శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు.

## శ్రీ సాహితీవల్లభ, ఆంధ్రభోజ

## శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు చౌదరి

సరస సారస్వతస్వరూప సౌందర్యమున సముచిత స్వస్పంద పరిస్పందభావమున ఒకనాటి జన్మోత్సవ సమయమున నా

ఔ చి త్య వి చా ర చ ర్చా

కృతిస్వామియై భావోల్లాసము సంపాదించెను. ఆ యుల్లాసము సముల్లాసమై నా రచనాసక్తి శక్తి యుక్తి నిదానమయినది. తనకు తానై రచనాచోదనమీయగా నేను నేనై శ్రీ జాయసేనాపతి రచిత

నృ త్త ర త్నా వ ళీ

గ్రంథమును నా భాషలో నిరూపించితిని. సాహితీవల్లభాంచిత మొనరించితిని. ప్రథమభాగము ముద్రితము కాగా నిది సమయమని సంభావించి సమర్పించితిని. ఈ ద్వితీయభాగము ముద్రితము కాగా నిది సమయమని సమర్పించుచున్నాను. ఇట్టి సమయాంకము లెన్నియో వలయునని యనుటకు సహృదయులు సాహితీవల్లభులు సరసభావులు సమర్థులు.

మా ధ వ రా మ శ ర్మ.

# శ్రీ నృత్తరత్నావలీ

## ద్వితీయ భాగ

## విషయ సూచిక.

శ్రీ

శ్రీ జాయసేనాపతి విరచిత

# నృత్తరత్నావలీ

## పంచమాధ్యాయః

---

శ్రీ మాధవరామశర్మ విరచిత

సాహితీవల్లభవ్యాఖ్య

శ్రీ జాయసేనాపతి నృత్తరత్నావలీ గ్రంథమునందీయధ్యాయమున కొక విశిష్టత కలదు. సర్వాధ్యాయములకు స్వగతమయిన విశిష్టత యుండును. అయినను దీని విశిష్టత భావనీయము. శ్రీ జాయసేనాపతి కింతటి వైభవము సంపాదించిన శ్రీ గణపతిదేవుడు పాలించు సమయమున దేశమునందు వ్యాపించి ప్రచార ప్రయోగములందున్న దేశీనృత్తరీతులను జాయన యిందు సలక్షణముగా నిరూపించినాడు. వీని స్వరూపప్రతిపాదనమె యీయధ్యాయ విశిష్టత.

దేశీనిరూపణము దేశీలక్షణము సవిస్తరముగా నిందున్నవి. భరతుడు లోకధర్మీనామమున దేశీరీతుల స్వరూపమును కొంతగా నాసూత్రించినాడు. దేశీరీతులు ఆయా పరిసరవాసులయిన దేశీయుల సమాదరముతో నుండును. దేశీరీతులు ప్రాదేశికములు. అవి మారవచ్చును. కాని నాట్యనృత్తవిదులు వానిని లక్షణలక్షితముల నొనర్చి పరిష్కరింతురు. అట్టి పరిష్కృతరీతులు గ్రంథములందు నిరూపితము లగును. అట్టి నిరూపణ మీయధ్యాయమున నున్నది. ఇట్టి దీని విశిష్టత ననుసంధానించుకొని యీయధ్యాయార్థము భావించుట యుక్తము.

వందే శ్రీకంఠమందారం యత్ర గౌరీస్తనోద్గమః 1
ధత్తే విశ్వఫలవ్యక్త్యై ప్రథమ స్తబక శ్రియం

శ్రీశివు డను మందారవృక్షము అచట గౌరీస్తనోద్గమము విశ్వమునకు ఫలాభివ్యక్తి నొనరించుటకై మొదటి స్తబక శోభ ధరించు చున్నది. శ్రీగౌరీస్తన స్తబకశోభ కల శివమందారమును వందింతు నని యిందు సముచితమయిన స్తుతి యున్నది.

భాషాశేషవిభూషణై రనుగుణై స్తై స్తై ర్మనోహారిభి 2
ర్నానాదేశరుచీ న్విదగ్ధపురుషా నావర్జయంతీ గుణైః
భూపాలై రుపలాలితా బహుకలైః ప్రౌఢేవ వారాంగనా
దేశీ సంప్రతి దంతిసైన్యపతినా సాంద్రాదరం వర్ణ్యతే.

దంతిసైన్యపతి యగు జాయసేనాపతి ప్రస్తుతము దేశీరీతిని సమధికాదరమున వర్ణింతునని యిందు సోపష్టంభముగా జెప్పు చున్నాడు. దేశీరీతి ప్రౌఢవేశ్యాసాదృశ్యమున నిం దభివర్ణిత మయి నది. కావున ప్రౌఢవేశ్యాపరముగ నొక భావమును దేశీరీతిపరముగ వేరొక భావమును ఇందు గ్రహింపవలసి యున్నది. ఉభయసాధా రణములయిన ధర్మములు దీనిలో నిరూపితము లయినవి. ఉపమాన రూపముగానున్న ప్రౌఢవేశ్యాపరమయిన భావము నీ విధముగా గ్రహింపవచ్చును.

ప్రౌఢవేశ్య నానాదేశ విశేషాభిరతి కల విదగ్ధపురుషులను తనగుణములచే నావర్జితులను జేయును. వేశ్యాగుణములు నానావిధ ములు. అవి మనోహారములు. అను గుణములగు నాయా భాషణ ములచే వేషవిశేషములచే భూషణములచే వేశ్యలు రాగరసికుల హృదయముల నావర్జింప జేయగలరు. నానావిధ కలావిశేషప్రాభ



స్వర్గీయ :
శ్రీ ముళ్ళపూడి నరేంద్రనాథ్ చౌదరి

ముఖల భూపాలకులా వేశ్యలను ఉపలాలన మొనరించి వారి కలా పాటవములను గాంచఁజేయుదురు. అట్టి వేశ్యలు సాంద్రాదరమున వర్ణింపదగిన వారు.

దేశీరీతి పరమయిన భావ మీ విధమున నుండును. దేశీ రీతులు మనోహరములు. అభిరామగుణోపేతములు. నానా దేశముల సంచరించి యచటి వారి దేశిక నృత్తరీతులను సాదరముగ గుర్తించిన కలాభిమానహృదయులయిన విదగ్ధజనులు దేశీరీతుల విశేషములచే నావర్జితు లగుదురు. ఆ దేశీరీతులలో నాయా దేశభాషావిధానములు ఆయా దేశీయవేషాచారములు తత్తత్ప్రాంతీయ భూషణములు అను గుణములై మనోహరములుగా నుండును. కలాపోషణ మొనరించు కలావిదులయిన భూపాలకు లాయా దేశీరీతులను లాలించి పోషింతురు. అట్టి దేశీరీతుల నిందు నిరూపింప దలంచితిమి.

జాయసేనాపతి నానా దేశరుచికల విదగ్ధపురుషుడు. దేశీరీతి విశేషముల గుర్తించినవాడు. గణపతిదేవుడు దేశీరీతులను లాలించి పాలించినవాడు. వీరిద్దరీ శ్లోకమున సూచితులగుట భావనీయము. అందుననె యీ యధ్యాయమున గణపతి దేవుని విషయమును జాయ సేనాపతి దంతిసైన్యపతి నిరూపించినాడు.

భవంతి ధరణీపాలాః ప్రాయేణాభినవప్రియాః 3
అతస్తత్ప్రీతయేఽద్యాపి యద్యదుత్పద్యతే నవం
నృత్తం తతః స్మృతం దేశీ తత్తద్దేశానుసారతః 4
భూతం శాస్త్రముఖాత్ జ్ఞేయం భవిష్యన్నావగమ్యతే
భవన్నిరూపణీయం స్యాన్నృత్తం దేశీతి సంజ్ఞితం 5

సామాన్యముగా ధరణీపాలకు లందరు అభినవప్రియులుగా నుందురు. పాల్యప్రదేశమున నవనవోన్మేషము సంపాదించుటకు

వారు సాభిలాషు లగుదురు. నవాంశమెచట నున్నను వారాదరింతురు. ఏ ప్రదేశమున నేది క్రొత్తగానున్న దాని వా రభిలషింతురు. వారు నవప్రియులు. వా రభినవప్రియులు. కావున నట్టివారికి ప్రీతి సముత్పాదన మావశ్యకము. వారల ప్రీత్యుత్పాదనమునకై నవ నవముత్పాదింప వలసియున్నది. పాలకులకు ప్రీతిసంపాదించుట పాల్యప్రజలకు ప్రీతినుత్పాదించుట కావున నాయా దేశానుసారమున దేశీనృత్తము నిరూపించుట యుచితము. సర్వకాలసంగతమయిన నృత్తమును మూడువిధముల భావింపవచ్చును.

౧. అతీతకాల నృత్తము.

౨. వర్తమానకాల నృత్తము.

3. భవిష్యత్కాల నృత్తము.

వీనిలో నతీతకాలనృత్తము భూతకాలనృత్తము భూతనృత్తము అనవచ్చును. భూతము=గడచినది. పూర్వకాలమునకు సంబంధించినది. ఇట్టి భూత నృత్తమును శాస్త్రముఖమున గుర్తింపవచ్చును. అట్టి నృత్తనిరూపక శాస్త్రగ్రంథములను నృత్తకోవిదులు సావధానముగా రచించినారు. ఆ నృత్తమును వారిగ్రంథముల వలన దెలియదగును. ఇప్పటి కీ నాలుగధ్యాయములందు నిరూపితమయిన దంతియు ప్రాచీనులు ప్రతిపాదించిన గ్రంథము లందలి నృత్త సంప్రదాయమె ప్రాక్తన సంప్రదాయ పరిజ్ఞానమున్నగాని నృత్త సంప్రదాయార్థములు భాసించవు. వర్తమాన నృత్తము శాస్త్రీయ సంప్రదాయము నవలంబించి సమకాల లోకరంజనాత్మక విధానముల ననుసరించును. సమకాలనృత్తరీతులను ప్రాచీనుల గ్రంథములనుండి గ్రహింపదగును. భవిష్యత్కాలమునకు సంబంధించిన నృత్తముగోచరము కాదు. అది యిట్లుండునని యెట్లు చెప్పగలము. ప్రాక్తనమిప్పటికే మారినది.

మారినదాని ననుసరించియు భవిష్యత్కాలిక మింకను మారును. అది యిట్లు మారుననుట నూహసిద్ధమయిన వర్తమానకాలిక నృత్త భావనమె యగును. నేటినుండి మారినవారి మనసులలో నెట్టి పరిణామముండునో అది భావనాగోచరము కాదు. ఇక వర్తమానకాలమునకు సంబంధించిన నృత్తము మాత్రమె నిరూపణీయము. వర్తమాననృత్తము దేశీనృత్తమన్న సంజ్ఞకలది. అది భవన్నృత్తము. అది నిరూపణీయము. ఆ దేశీనృత్తము నీ యధ్యాయమున నిరూపింతుము.

శ్రీ గణపతిదేవు డభినవపిత్రియుడు. గణపతిదేవుని సమయమున వెలసిన నృత్తరీతులను జెప్పుటకు పూర్వము శ్రీగణపతిదేవుని జెప్పవలయును. ఆ దేవుని సమయకీర్తన మొనరింప వలెను.

ఇదానీం భారతే వర్షే కాలే వైవస్వతాంతరే
కలౌ యాతేషు వర్షేషు భూతబాణాగ్నిసాగరైః 6
మితేష్వానందనంజ్ఞేఒబ్దే జగదానందదాయిని
శశ్వత్కువలయోల్లాసి యశఃప్రాలేయ రోచిషి
ప్రతాప తపనప్రౌఢి తాపితారాతి మానసే
శత్రుప్రాణానిలాహార శ్రీణ కాంక్షియకోరగే 8
విశ్రాణనపయఃపూర విధూతకలికల్మషే
త్యాగధిక్కృతరాధేయ కామధేను సురద్రుమే 9
రూపలావణ్య సౌభాగ్య సవ్రీడ మకరధ్వజే
శౌర్యత్రితయ విజ్ఞాన రహస్తత్త్వ విశారదే 10
మార్గదేశీవిభాగస్య వివేచనవిచక్షణే
మహారాజాధిరాజేఒస్మిన్ గణపత్యవనీశ్వరే 11
సముద్రమేఖలామేనాం బాహునా రక్షతి క్షమాం
యా దేశీ వర్తతే లోకే సాస్మాభిః కధ్యతే స్ఫుటం 12

ఈ భారత వర్షమున వైవస్వతమన్వంతరమున కలియుగమున ౪౩౫౫ సంవత్సరములు గడచిపోగా జగదానందదాయక మయిన ఆనందనామ సంవత్సరమున శ్రీమన్మహారాజాధిరాజ శ్రీగణపతి దేవమహారాజు ఈ భూమండలము పాలించు సమయమున లోకమున నున్న దేశీవిధానమును మేమిచట స్ఫుటముగా నిరూపింతుము. కలిశకము ౪౩౫౫ అనుట కిచట భూత, బాణాగ్ని సాగర పదములు ప్రయుక్తము లయినది. భూతములు పంచభూతములు బాణములు పంచబాణములు. అగ్నులు త్రేతాగ్నులు. సాగరముల చతుస్సాగరములు కాగా భూత ౫ బాణ ౫ అగ్ని ౩ సాగర ౪. ౫౫౩౪ కాగా 'అంకానాం వామతోగతిః' అను నియమానుసారమున ౪౩౫౫ అని నిశ్చయింపవలెను. ౪౩౫౫ కలిశకము. ఇది శాలివాహనశకము. నకు సరిపోవును. హూణశకము 1253-4 నకు సరిపోవును ఆ సమయమున శ్రీగణపతిదేవుడు సాగరపర్యంత భూపరిపాలకుడుగా నుండెను. ఆ ప్రభువు విశేషములిచట నానావిశేషణముల ప్రస్తుతములయినవి. ఆతని యశశ్చంద్రుడు కువలయోల్లాసము కలిగించుచున్నాడు. చంద్రుడు కువలయములకు కలువలకుల్లాసము వికాసమిచ్చును. యశము కువలయమునకు భూవలయమున కుల్లాసమిచ్చును శత్రువుల మానసములను గణపతిదేవుడు తన ప్రతాపమను సూర్యుని ప్రౌఢిచే తపింపజేసినాడు. ఆతని ఖడ్గమను సర్పము శత్రువుల ప్రాణ వాయువుల నాహరించి బలయుతమై యున్నది కలియుగ పాపపంకిలమును తన దానధారాజలములచే క్షాళన మొనరించినాడు. కర్ణుడు కామధేనువు కల్పవృక్షములు ఆతని త్యాగమున ధిక్కృతము లయినవి. గణపతిదేవుని రూపలావణ్య సౌభాగ్యములచే మన్మథుడు లజ్జితుడయినాడు. గణపతిదేవుడు గీత వాద్య నృత్త తత్త్వరహస్య విశారదుడు. మార్గదేశీ విభాగముల గుఱించి వివేచన మొనరించు

టలో నాతడు విచక్షణుడు గణపత్యావసీశ్వరుడు మహారాజాధిరాజు తన బాహుబలమున నీ సముద్రమేఖల భూమిని రక్షించుచున్నాడు. ఈ సమయమున లోకము నందున్న దేశీవిధానమును భావించి గ్రహించి యిందు స్ఫుటముగా నిరూపించుచున్నాను.

దేశీస్థానకాని

నిరూప్యతేఽధునా దేశ్యాం స్థానకాని యథాక్రమం
సమవాదం పరావృత్తం స్వస్తికం వృషభాసనం 13
బ్రాహ్మవైష్ణవశైవాని గారుడం సంహతాభిధం
పృష్ఠోత్తానతలం వర్ధమానం కూర్మాసనాహ్వయం 14
ఏకపార్శ్వగతం నంద్యావర్తాహ్వ చతురశ్రకే
పార్ష్ణిపార్శ్వగతాభిఖ్య మేకజానుగతాహ్వయం 15
పార్శ్వవిధైకపాదాఖ్యే నాగబంధాభిధం తతః
సమేన విషమేనాథ ఖండేనోపపదేన చ 16
యుక్తం సూక్తిత్రయేణేతి వింశతిస్త్రిభిరుత్తరా

సమకాలమున దేశమున నభివ్యాప్తములుగా నున్న దేశీవిధానము లిచట నిర్దిష్టము లగును.

౧. దేశీస్థానకములు ఇరువదిమూడు ౨3
౨ ఉత్ప్లుతికరణములు ముప్పదిరెండు 3౨
3 దేశీభ్రమరీ రీతులు పదమూడు ౧3

ఈ పంచమాధ్యాయమున నీ మూడు విధములగు దేశీవిశేషములు అవాంతరభేదములతో మఱ భేదములతో నిర్దిష్టములగును. షష్ఠాధ్యాయమున గూడ దేశీవిధానములే ప్రతిపాదితములగును.

౧. మతంగప్రోక్త దేశీపాదములు పదునారు ౧౬
౨. పాటములు ఇరువదియెనిమిది ౨౮

3. దేశీచారీవిశేషములు నలువదిరెండు ౪౨
౪. దేశీలాస్యాంగములు నలువదియారు ౪౬
౫. సంకీర్ణగతులు ఇరువదియొకటి ౨౧

సప్తమాధ్యాయమున గూడ కొంత దేశీవిధాన మున్నది. సర్వవిధ దేశీవిధానముల పరిజ్ఞానమున కారంభమున నీ పంచమాధ్యాయ పరిజ్ఞాన మావశ్యకము

దేశీస్థానకములు.

దేశీవిధానమున ముందుగా గుర్తింప దగిన స్థానకములను యథాక్రమముగా నిప్పుడు నిరూపింతుము. దేశీస్థానకములు ఇరువది మూడు కలవు.

సమపాద — పరావృత్త — స్వస్తిక
వృషభాసన — బ్రాహ్మ — వైష్ణవ
శైవ — గారుడ — సంహత
పృష్ఠోత్తానతల — వర్ధమాన — కూర్మాసన
ఏకపార్శ్వగత — నంద్యావర్త — చతురశ్ర
పార్ష్ణిపార్శ్వగత — ఏకజానునత — పార్ష్ణివిద్ధ
ఏకపాద — నాగబంధ — సమసూచి
విషమసూచి — ఖండసూచి— ౨౩

సూచీత్రయము చెప్పుటకు చివరి శ్లోకములో సమవిషమ ఖండ అను నవి ఉపపదములుగా నున్న సూచిత్రియము అని నిరూపిత మయి నది. కావున సమసూచి విషమసూచి ఖండసూచి అను సూచిత్రయము దిష్ట మయినది. ఇవి యన్నియు మూడధికముగా నిరువది యయినవి. ఇక వీనిలక్షణములు క్రమముగా నిరూపితము లగును

౧. సమపాదము

స్వభావావస్థితో దేహో వితస్తిమితమంతరం
అంఘ్ర్యోస్సరలయోర్యత్ర సమపాదం తదుచ్యతే

దేహము స్వభావరీతితో నుండును. సంధిబంధములలో నెచటను పట్టుపట్టి నట్లుండక స్వభావ సహజావస్థానమున నుండవలెనని భావము. సరలముగానున్న పాదముల అంఘ్రిభాగముల యంతరము వితస్తి — జానెడు కొలతతో మితమై యుండవలెను. ఇట్లున్న నది సమపాదము అను దేశీస్థానక మగును.

౨. పరావృత్తం

బాహ్యాభ్యంతరపార్శ్వాభ్యాం యుక్తయోస్తిర్యగస్తయోః
పాదయోర్యత్ర పార్ష్ణిభ్యాం కనిష్ఠికాంగుష్ఠకౌ యుతౌ
గజసాధనికేనైతత్పరావృత్తం ప్రకీర్తితం

బాహ్యాభ్యంతర పార్శ్వభాగములతో కూడుకొనిన పాదములు తిర్యక్ వెనుకగా కూర్పుపొందినవి కాగా నా పాదముల పార్ష్ణిభాగములతో కనిష్ఠికాంగుష్ఠములు కూడుకొని యుండునేని పరావృత్తము అను దేశీస్థానక మగునని గజసాధనికునిచే ప్రకీర్తితమయినది. ఇందున్న వన్నియు గజసాధనిక శ్రీ జాయసేనాపతి కీర్తితములె. అయినను పరావృత్త స్థానకవిషయమైన ప్రత్యేకముగా గజసాధనిక ప్రకీర్తనము చెప్పుట సాభిప్రాయముగ గణింపనుకరించుటలో దేశీస్థానకమైన యీ పరావృత్త స్థానకమును అనుసంధానింపవలసి యుండును.

౨. స్వస్తికం

పాదౌ పాదాంగదస్థానే స్వస్తికౌ జాతు కుంచితౌ
మిథః కనిష్ఠయోః శ్లిష్టౌ యత్ర తత్స్వస్తికం భవేత్

పాదములు పాదాంగ దస్థానము నందుండి స్వస్తికములై యొకప్పుడు కుంచితములై యుండునేని అవి కనిష్ఠికాంగుళుల యందు పరస్పరము శ్లిష్టములై యుండునేని యది "స్వస్తికము" అను దేశీ స్థాన మగును. స్వస్తిక హస్తములు స్వస్తిక పాదము లిదివరలో నిరూపితము లయినవి. వానిలక్షణము చూచి దీని లక్షణము చూచి రూపము నిశ్చిత మొనరించుకొన వచ్చును. ఇట్లె నామసామ్యమున్న స్థలములందు గ్రహింప వలెను.

౪. వృషభాసనం

జానునీ యది సంశ్లిష్టవిశ్లిష్టే స్తో మహీతలే
సువిశ్లిష్టసౌష్ఠవం తత్స్యాద్విశ్లిష్టం వృషభాసనం

భూతలమునందు జానుభాగములు మోకాళ్లు సంశ్లిష్టములై విశ్లిష్టములునై యుండునేని సంశ్లేషము వలని సౌష్ఠవము విశ్లేషము వలని సౌష్ఠవము సంగతముగా నుండునేని యది వృషభాసన స్థానక మగును.

౫. వ్యాఘ్రం

స్థితస్యైకస్య పాదస్య సమగో జానుగోఽపరః
పృష్ఠతః కుంచితో శ్లిష్టో యత్ర తద్వ్యాఘ్రముచ్యతే

సుస్థితమై యున్న యొక పాదమునకు సంబంధించిన విధమున వామపాదము జానుగతమై యుండుటయు దక్షిణపాదము పృష్ఠభాగముగా కుంచితము నశ్లిష్టమై యుండుటయు వ్యాఘ్రస్థానకమునకు

సంబంధించిన రూపము. ఇట్టిశ్లోకమున భావార్థమును గ్రహించుట యుక్తము. బ్రహ్మకు సంబంధించినది బ్రాహ్మము. ఇట్లే వ్యుత్పత్త్యర్థానుసారమున భావము గుర్తించునది.

౬. వైష్ణవం

సమస్థితస్య పాదస్య పురతః కుంచితో మనాక్
తిర్యక్ప్రసారితో ఽన్యశ్చేద్బుధాస్తద్వైష్ణవం విదుః

సమస్థితిలో నున్న పాదము యొక్క పురోభాగమున రెండవ పాదము కొంతగా కుంచితమై తిర్యక్ప్రసారిత మగునేని బుధులు దాని వైష్ణవమను దేశీస్థానక మని యెన్నిక చేసిరి. ఇందు వైష్ణవ స్థానకము యొక్క స్వరూప సంబంధమును గుర్తించునది.

౭. శైవం

సమస్థితస్య పాదస్య జానూత్సంగసమోఽపరః
కుంచితో గమనే తిష్ఠేద్యత్ర తచ్ఛైవముచ్యతే

శైవస్థాన లక్షణ మిట్లున్నది. ఒక పాదము సమస్థితముగా నుండవలెను. రెండవపాద మా పాదమునకు సంబంధించిన జానూత్సంగ సమముగా నుండవలెను. ఈ రెండవ పాదము జానూత్సంగ సమమై కుంచితమై గమనమున నుండవలెను. అప్పుడది శైవస్థానము.

౮ గారుడం

తలేనావస్థితో భూమే కుంచితశ్చరణః పురః
జానునా ప్రష్ఠతోన్యస్తు యత్ర తద్గారుడం విధుః

గారుడమను దేశీస్థాన మీ విధముగా నుండును. కుంచిత మగు చరణము పురోభాగమున భూమి యందు పాదతలమున నుండ

వలెను. రెండవ పాదము జానుభాగమున పృష్ఠతః ప్రసరించునది కావలెను. అప్పుడది గారుడము.

౯. సంహతం

సమపాదే యదా త్వంఘ్ర్యోః గుల్ఫాంగుష్ఠౌ మిథోఽన్వితౌ
సంహతాఖ్యం తదా ప్రోక్తం పుష్పాంజలి విమోచనే

సమపాదస్థితిలో పాదములకు సంబంధించిన గుల్ఫము అంగుష్ఠము అను రెండును పరస్పరము సంగతములై యున్నచో సంహతమను దేశీస్థాన మగుననిరి. దీనిని పుష్పాంజలి విమోచనమున వినియోగింతురు. ఇంతవఱకు వినియోగము సూచితము కాలేదు. ఇచట నది యున్నది. వినియోగము సూచితము కానప్పుడు నాట్యౌచిత్యానుసారమున వినియోగము గుర్తింపవలెనని భావము. వినియోగము సూచితమయినప్పు డితర వినియోగము లున్నను సూచిత వినియోగము విశిష్టమని భావించునది.

౧౦. పృష్ఠోత్తానతలం

సమః స్యాదగ్రతః పాదో యదాన్యః పృష్ఠతః క్షితౌ
స్పృష్టశ్చేదంగులీపృష్ఠః పృష్ఠోత్తానతలం తదా

ఒక పాద మగ్ర భాగమున సమముగా నుండుట, వేరొక పాదము పృష్ఠభాగమున భూమిపై నుండుట, అంగులీపృష్ఠము స్పృష్టమై యుండుటయు పృష్ఠోత్తాన తల దేశీస్థాన స్వరూపము ప్రథమమున దక్షిణ పాదమును అనంతరము వామ పాదము నని యౌచిత్యానుసారముగ గుర్తింప వచ్చును.

౧౧. వర్ధమానం

> పార్ష్ణినా సంగతః పార్ష్ణిః పాదౌ తిర్యఙ్ముఖౌ యదా
> విధీయతే తదా వర్ధమానాఖ్యం పరికీర్తితం

ఒక పార్ష్ణిభాగము వేరొక పార్ష్ణిభాగముతో సంగతమై యుం డుట, పాదములు తిర్యఙ్ముఖములుగా నుండుట కూడి యున్నప్పుడు వర్ధమానము అను పేరు గల దేశీస్థాన మగును.

౧౨. కూర్మాసనం

> జాన్వభ్యంతరగుల్ఫాభ్యాం పృష్ఠతోంఘ్రి స్పృశేన్మహీం
> అన్యః కుంచితజానుశ్చేత్పురః కూర్మాసనం తదా

జానువుల యభ్యంతరమున నుండు గుల్ఫభాగములతో వెను కగా నంఘ్రిభాగము భూమిని స్పృశించుచు నుండగా, పురోభాగ మున నొక పాదము కుంచిత జానువుగా నుండునేని కూర్మాసన మగును. కూర్మాసనవంటి కొన్ని స్థానములు లోకమున ప్రసిద్ధము లయిన కొన్ని యోగాసనముల సామ్యమున సంబంధమును పొంది యుండుట నభ్యూహింప వచ్చును. సర్వసాధారణముగా నాంగికము లన్నియు యోగాను సంధానమున శరీరము నందలి సంధిబంధములు వర్తనోద్వర్తనాదులకు నితరములకు నుపయోగించుటను నృత్తయోగ మనగ గుర్తింప వచ్చును. అంతియే కాక శారీరిక వ్యాయామ విధానములకు నిందు సముచితమయిన సంబంధమున్నది.

౧౩. ఏకపార్శ్వగతం

> అభ్యర్ణే సమపాదస్య పురః తిర్యఙ్మనాక్పునః
> స పార్శ్వాభిముఖశ్చ స్యాదేకపార్శ్వగతం తదా

సమపాదము యొక్క సమీపము నందు ఎదుటగా కొంత నడ్డముగా నుండి మడమల నది పార్శ్వాభిముఖముగా నుండునేని ఏక పార్శ్వగతము అను స్థాన మగును. ఒక పార్శ్వము నందే యిది యిట్లుండుట వలన సార్థకము.

౧౪. నంద్యావర్తం

వర్ధమానస్య పార్ష్ణీ చేద్విశ్లిష్టే షడ్భిరంగులైః
వితస్త్యా వా సమాఖ్యాతం నందావర్తాభిధం తదా

వర్ధమానమను ౧౧ వ, స్థానకమునకు సంబంధించిన పార్ష్ణిభాగములు ఆరంగుళముల వ్యవధానమున విశ్లిష్టములై యుండునేని వితస్తి పరిమాణమున నయిన వ్యవహితములై యుండునేవి నంద్యావర్తమను దేశి యగును. ఇందు వర్ధమాన స్థాన సంబంధము కొంతగా సూచిత మయినది. ఇట్లె కొన్నికొన్ని అన్యోన్య సంబంధము కలవిగనె యుండుటను నృత్తాభ్యాసమున గుర్తింప వచ్చును.

౧౫. చతురశ్రం

అస్యైవ యది పార్ష్ణీ స్యాదష్టాదశభిరంగులైః
అంతరాలమితం తద్దేః చతురశ్రం తదా స్మృతం

పూర్వము నంద్యావర్తము నిరూపిత మయినది. అది వర్ధమానముతో కొంత సంబంధము కలది. ఈ చతురశ్రము కొంత నంద్యావర్తముతో సంబద్ధమై యున్నది. నంద్యావర్తస్థానమునకు సంబంధించిన పార్ష్ణిభాగములు పదునెనిమిది యంగుళముల యంతరాలముతో మితమై యుండునేని చతురశ్రస్థాన మగునని నృత్తవిదులు.

తలచిరి. భరతుడు నిరూపించిన గతిప్రచారములలో పాదముల యంతరాలమెంతగా నుండవలయునో నిరూపించినాడు. వాని సంబంధము నిచట భావించునది. అట్టివాసితో నివి గతార్థములు కాక పోవచ్చును. వీని విశిష్టత యుండును.

౧౬. పార్ష్ణిపార్శ్వగతం

అంతః పార్శ్వం సమస్యాంఘ్రేః మధ్యేఽన్యః పార్ష్ణినా స్పృశేత్
స్వపార్శ్వాభిముఖ స్తిష్ఠేత్పార్ష్ణిపార్శ్వగతాభిధం

సమపాదమునకు సంబంధించిన అంతఃపార్శ్వమున పార్ష్ణిభాగముచే స్పృశింపవలెను. పాదతలమున మధ్యభాగమున పార్ష్ణిభాగముతో స్పర్శమాపాదింపవలెను. వేరొక పాదము స్వపార్శ్వాభిముఖముగా నుండవలెను. అప్పుడది పార్ష్ణిపార్శ్వగతము అగును. దీని లక్షణము విస్పష్టముగ లేదు.

౧౭. ఏకజానునతం

యత్ర పార్శ్వముఖస్యైవ పార్ష్ణినాంఘ్రిర్వియోజితః
చతురంగులమానేన కించిత్కుంచితజానుకః
ఏకజానునతం తత్స్యాదితి దేశీవిదో విదుః

పార్శ్వముఖముగా నున్న పాదము యొక్క పార్ష్ణిభాగముచే అంఘ్రిభాగము వియోజితమగునేని, జానుభాగము కొంతగా కుంచితమై చతురంగుల మానమున నుండునేని అది ఏకజానునత మను దేశీస్థానమగునని దేశీవిదు లనిరి. ఒక జానువు నతముగా నుండుటచే నిది సార్థక నామము.

౧౮. పార్ష్ణివిద్ధం

కించిత్పార్శ్వముఖస్యాంఘ్రేః పార్ష్ణిమన్యస్య యోజయేత్
అంగుష్ఠేన యదా ప్రోక్తం పార్ష్ణివిద్ధాభిధం తదా

కించిత్పార్శ్వముఖముగా నున్న అంఘ్రియొక్క పార్ష్ణిభాగమును అన్యపాదమునకు సంబంధించిన అంగుష్ఠముతో యోజన మొనర్చినచో నప్పుడది పార్ష్ణివిద్ధ మను పేరుకల దేశీస్థాన మని నిర్ణీతము.

౧౯. ఏకపాదం

సమస్థితస్య పాదస్య జానునో బాహ్య పార్శ్వతః
అన్యస్తు బాహ్యపార్శ్వేన సంలగ్నో జానుకుంచితః
స్థానకే యత్ర తత్తజ్జ్ఞైరేకపాదమ్ముదీరితం.

సమస్థితితో నున్న పాదముయొక్క జానుభాగమునకు బాహ్యపార్శ్వముగా అన్యపాదము బాహ్యపార్శ్వమున సంలగ్నముగా నున్నచో నది యేకపాదమను స్థానక మగును.

౨౦. నాగబంధ

ఆసితే ద్విగుణస్యాంఘ్రేః వామస్యోరోర్నివేశయేత్
పృష్ఠే పరస్య చేజ్జంఘాం నాగబంధః స్మృతస్తదా

కాళ్ళపై కాలు వేయగా ద్విగుణముగా నున్న అంఘ్రిభాగమునకు సంబంధించిన యాసనమున ఎడమ ఊరువుయొక్క పృష్ఠప్రదేశము నందు దక్షిణ పాదమునకు సంబంధించిన జంఘాభాగమును కూర్చ వేయుటనుం కాలు మడత వేసి కూర్చొని నప్పుడు ఎడమ కాలి తొడదగ్గర కుడికాలి పిక్కను కలియజేయవలయు నను భావమును గుర్తింప

వచ్చును. ఇట్లున్నరీతి దేశీరీతికి సంబంధించిన నాగబంధము అను స్థానకమగు నని భావము గ్రాహ్యము.

౨౧. సమసూచి

పార్ష్ణిజంఘోరుభిః పాదౌ నీరంధ్రం శ్లిష్టకుట్టిమౌ
తిర్యక్ప్రసారితే యత్ర సమసూచి తదుచ్యతే

పార్ష్ణి, జఘు, ఊరువులతో బిగువుగా కూడుకొనిన పాదములు తిర్యక్ప్రసారితములుగా నున్నప్పుడు సమసూచి స్థాన మగును. కూర్చొనిన సమయమున పాదములు పార్ష్ణిజంఘోరు భాగములతో దట్టముగా కలుసుకొని యుండుట యిందు భావనీయము.

౨౨. విషమసూచి

సమసూచివదేకాంఘ్రిరగ్రతస్స్యాత్ప్రసారితః
అపరః పృష్ఠతో జానుగుల్ఫాభ్యాం స్పృష్టకుట్టిమః
స్వేనాభ్యంతరపార్శ్వేన యస్మిన్విషమసూచి తత్

సమసూచి స్థానములోవలె. ఒక పాదమెదుటగా ప్రసారితము కావలెను. వేరొక పాదము పృష్ఠభాగమున తన యాభ్యంతర పార్శ్వముతో జానుగుల్ఫములతో కుట్టిమమును స్పృశించు నది కావలెను. అప్పుడది విషమసూచిస్థానక మగును.

౨౩. ఖండసూచి

సమసూచిని చేదేకః చరణో ద్విగుణీకృతః
ఉన్ముఖీభూతజానుః స్యాత్ఖండసూచి స్మృతం తదా

సమసూచి స్థానము నందలి యొక పాదము ద్విగుణీకృతమై యుండగా జాను వున్ముఖమై యుండగా ఖండసూచిస్థాన మగును.

మొదట చెప్పిన విధమున నిరువదిమూడు దేశీస్థానకముల లక్షణములు నిరూపితము అయినవి.

దేశీస్థానకముల స్వరూప నిరూపణానంతరము ఉత్ప్లుతి కరణములు ముప్పదిరెండు నిరూపితములు కానున్నవి. ఉత్ప్లుతి-ఎగురుట తదాశ్రితము లయిన కరణములు, వీనిలో అంచిత కరణములు, అలగ కరణములు, లోహడీకరణములు, దర్పసరణాదులు, కపాలస్పర్శనాదులు నని యవాంతర వర్గము లున్నవి.

౧. అంచి కరణములు పదునాలుగు. ౧౪
౨. అలగ కరణములు నాలుగు. ౪
౩. లోహడీ కరణములు ఏడు. ౭
౪. దర్పసరణాదులు మూడు. ౩
౫. కపాలస్పర్శనాదులు నాలుగు. ౪

ఈ ముప్పది రెండు దేశీకరణములు ఉద్దేశపురస్సరముగా నిందు లక్షితము లగును.

### ఉత్ప్లుతి కరణాని.

సంప్రత్యుత్ప్లుతిపూర్వాణి కరణాని ప్రచక్ష్మహే
అంచితం కర్తరీపూర్వమంచితం భైరవాంచితం
ఏకపాదాంచితం క్షేత్రాంచితం స్కంధాంతపూర్వకం
అంచితం లోహడీపూర్వ మంచితం దంతపూర్వకం
ప్రణామాంచితాకం లంకాదాహాంచిత సమాహ్వయం
భ్రాంతపాదాంచితాం గుష్ఠ బంధపూర్వాంచితాభిధే
బలిబంధాచితాభిఖ్య మలగాంచితపూర్వకం
సమకర్తరిపూర్వం చాంచితమేవం చతుర్దశ
అలగః స్యా త్తతః కూర్మాలగమూర్వలగాభిధం

అంతరాలగమిత్యేతచ్చతుర్ధా పరికీర్తితం
లోహడీ ప్రథమా తస్యాః కర్తరీ సమకర్తరీ
బాహుబంధా విచిత్రా స్యాదేకపాదా చతుర్మఖీ
లోహడ్యః షడ్విని ప్రోక్తాః మిలితాః సప్తకీర్తితాః
స్యాద్దర్పసరణం తస్మాదుత్పన్నం జలపూర్వకం
శయనం నాగబంధం చ త్రీణి ప్రోక్తాని పండితైః
కపాలస్పర్శనం తస్మాజ్జాతం వ్యంకోలసంజ్ఞకం
సూచ్యంతం మత్స్యకరణమాహు రేతచ్చతుష్టయం
క్రమాల్లక్షణమేతేషాం సువ్యక్త మభిధీయతే.

ఇక నిప్పుడు ఉత్ప్లుతిపదము పూర్వమున గల కరణములను ఉత్ప్లుతి కరణములను చెప్పుదును. నామతః రూపతః చెప్పుదుమని భావము. ఈ వర్గమున మొదట నాని నామములు నిరూపితములు. అవి యీ విధముగా నున్నవి. అన్నియు నుత్ప్లుతి కరణములె. ఉత్ప్లుతి కరణములలో నయిదు విశేషములున్నవి. అందు మొదటివి అంచిత కరణములు.

అంచితకరణములు ౧౪.

అంచిత — కర్తర్యంచిత — భైరవాంచిత — ఏకపాదాంచిత — క్షేత్రాంచిత — స్కంధాంతాంచిత — లోహడ్యంచిత — దండప్రణామాంచిత — లంకాదాహాంచిత — భ్రామితపాదాంచిత — అంగుష్ఠబంధాంచిత — బహిబంధాంచిత — అలగాంచిత — సమకర్తర్యంచితములు.

అలగకరణములు ౪.

అలగ — కూర్మాలగ — ఊర్ధ్వాలగ — అంతరాలగములు.

లోహడీకరణములు ౭.

లోహడి — కర్తరిలోహడి — సమకర్తరిలోహడి — బాహుబంధలోహడి — చిత్రలోహడి — ఏకపాదలోహడి — చతుర్ముఖలోహడి.

దర్పసరణాదులు ౩.

దర్పసరణ — జలశయన — నాగబంధములు.

కపాలస్పర్శనాదులు ౪.

కపాలస్పర్శన — వ్యంకోల — నూపుర్యంత — మత్స్యకరణములు.

క్రమముగా నీ ద్వాత్రింశద్దేశీకరణములకు సంబంధించిన లక్షణములను సువ్యక్తముగా నిరూపింతుము.

౧. అంచితం

సమపాదస్థితో యత్ర కృతోత్తానోత్ప్లుతిర్ద్వివి
వివృతః పూర్వవత్తిష్ఠేత్ తదంచిత ముదీరితం

మొదట సమపాదమున నుండి ఆకసమున వెల్లకిలగా ఉత్తానముగా ఉత్ప్లుతి నాచరించి పాదములను వివృతముల నొనరించి పూర్వమువలె సమపాదమునని యుండునది. సమపాదమున నుండుట పైకి ఎగురుట కాళ్లులు సాచుట వివృతముగా నుంచుట మరల సమపాదమున నుండుట యను క్రియలు క్రమముగా కూర్పు కలవి యయినచో ఉత్ప్లుతి కరణములలో అంచితమను కరణమగునని నిరూపిత మయినది.

౨. కర్తర్యంచితం

కర్తర్యంచితముక్తం తత్ యత్పాదః స్వస్తికాభిధః

పాదము స్వస్తిక సంజ్ఞకల పాదముగా నుండునేని కర్తర్యంచితమను దేశీకరణ మగును. దీనిలో అంచితత్వసమానధర్మము నంపా

చించుటకై అంచిత కరణము నందలి ఉత్తానోత్ప్లుతి సమాచరణము నిందును కూర్చునది. ఇందు పాదము స్వస్తికముగా నుండుట విశేషము. స్పష్టరూపము నిరూపించు పూర్వార్థము నిట్లభ్యూహించుట యుక్తము కావచ్చును.

౩. భైరవాంచితం

పాదం భూమిస్థితస్యాగ్రేః ఊరుపృష్ఠే ద్వితీయకం
నివేశ్యాంచితమాదధ్యాద్యత్ర తద్భైరవాంచితం.

భూమియందున్న పాదము యొక్క ఊరుపృష్ఠము నందు రెండవ పాదము నుంచి అంచిత విధానము నాచరింపవలెను. అప్పుడది భైరవాంచిత కరణ మగును. ఔచిత్యానుసారమున దక్షిణోరుపృష్ఠమున వామపాదమును కూర్చుట నభ్యూహించునది.

౪. ఏకపాదాంచితం

ఏకపాదాంచితం కుర్యాదేకపాదాంచితం తదా.

అంచితమను ప్రథమ కరణ సామాన్యధర్మము సామాన్యముగా నన్ని యంచితము లందును సంసక్తమగును. మొదట సమపాదావస్థానమున నుండి యొకపాదముచే నంచిత విధాన మాచరింపవలెను. అప్పుడది ఏకపాదాంచితమను అంచిత కరణమగును.

౫. క్షేత్రాంచితం

అంచితాద్యం తయోర్యత్ర భజేమత్కుటికాసనం
రంగక్షేత్రే యతః ప్రోక్తమేతక్షేత్రాంచితం బుధైః.

రంగక్షేత్రము నందుండి అంచిత కరణము యొక్క ఆద్యంతములందు ఉత్కుటి కాసనము వహించునది. అప్పుడది క్షేత్రాంచితమను కరణ మగును. ఉత్కుటి కాసనం ఉద్గతమయిన కటిభాగ

ముందునట్టి యాసనము. మొదట సమపాదమున నున్నపుడు ఉత్కటికాసనరీతి మఱల సమపాదావస్థితిలో నుత్కటికాసనరీతి యుండుట క్షేత్రాంచితము. ఇట్టివానిని ప్రయోగమున దర్శించినపుడు రూపమవధృత మగును. కటియెత్తుగా నుండు నట్లుండియే యుత్ప్లుతినాచరించి మఱల యుత్కటికముగనె యుండవలయునని భావము

౬. స్కంధాంతాంచితం

పూర్వం కృత్వాంచితం యస్మిన్నేకాంసాలింగితక్షితిః
పాదోల్లాసనయా తిర్యగుత్క్షిప్తేత్త్వరితం పునః
స్కంధాంతాంచితముద్దిష్టమిదం నృత్తవిశారదైః.

నృత్తవిశారదులు ఈ స్కంధాంతాంచిత కరణమును ఇట్లుండునట్లుగా నుద్దేశించిరి. మొదటగా నంచిత కరణ మొనరించునది. అందొక భుజముచే భూసంశ్లేషముతో నుండునది. పాదోల్లాసనమాచరించునది. అనంతరము త్వరితముగా నడ్డముగా నట్లె లేచునది. అప్పుడది స్కంధాంతాంచితము.

౭. లోహడ్యంచితం

నిధాయ లోహడీం యస్మిన్నంచితం రచయేద్ద్రుతం
లోహడ్యంచితసంజ్ఞం తన్నర్తకైః పరికీర్తితం.

లోహడి నాచరించి వేగముగా అంచిత మాచరించినచో నది లోహడ్యంచిత కరణము. లోహడీ లక్షణ మితర గ్రంథములలో నిట్లున్నది.

"సమపాదస్థితః సమ్యగుత్ప్లుతో వలితం తతః
పరాఙ్ముఖో యది పతేత్ సహసా సా తు లోహడీ"

ముందుగా సమపాదము నందుండి ఉత్ప్లుత మాచరించి (పైకెగిరి) ఆ సమయముననె వలిత విధానమున వెనుదిరిగి పరా

ఙ్ముఖముగా వేగమున పతన మొనరింపగా నది లోహడి అను దేశికరణము. ఇదియే లోభడి లోహటి అనియు వ్యవహారమున నున్నది. ఇట్టి లోహడి పూర్వము చెప్పిన అంచితము రెండు నుండునేని లోహడ్యంచితము.

౮. దండప్రమాణాంచితం

సమపాదాంచితస్యాంతే దండవత్ప్రణతిర్భువి
క్రియతే యత్ర తద్దండప్రణామాంచితముచ్యతే.

సమపాదాంచిత కరణాచరణాంతమున ఎగిరి భూమిపై పడు నపుడు దండమువలె ప్రణామ మొనరించువిధమున నున్నచో నది దండప్రణామాంచితము. ప్రణామ మొనరించుటకై దండాకారముగా భూమిపై పడుట లోకప్రసిద్ధము. సాష్టాంగ దండప్రణామ మను వ్యవహార మున్నది.

౯. లంకాదాహాంచితం

అంచితం రచయన్ అంగం ప్రత్యావృత్య పరాఙ్ముఖః
యత్రాసీత మహీపృష్ఠే భజన్నుత్కటికాసనం
లంకాదాహాంచితం తత్స్యాదన్యైరుక్తా మురోంచితం.

దేహమును అంచిత కరణానుకూలముగా నొనరించి ప్రత్యావర్తన మొనరించి వెనుకకు తిరిగి పరాఙ్ముఖుడుగా నుండి భూతలము నందు ఉత్కటి కాసనమున నుండవలెను. ఉత్కటిక — గొంతు కూర్చొనుట. ఇట్టి విధానమునకు లంకాదాహాంచిత మని పేరు. దీనినే కొందరు ఉరోంచిత మని వ్యవహరించిరి. వీరెవరో తెలియదు.

౧౦. భ్రాంతపాదాంచితం

పాదమేకం పరిభ్రామ్య తత్పృష్ఠేన సమాశ్రితః
జంఘామధ్యం ద్వితీయస్య రచయిత్వాంచితం మహీం

అలింగ్య స్కంధయుగ్మేన తతః కృతవివర్తనః
పదోల్లాలనయా తిష్ఠేత్తత్స్యాద్భ్రాంతపదాంచితం.

ఒకపాదము పరిభ్రమణము పొందుచు, తత్పృష్ఠమున జంఘా మధ్యము నాశ్రయించుట, రెండవ పాదమునకు అంచిత విధానమును రచించుట, స్కంధయుగ్మమున భూమి నాలింగనము చేసికొనుట, ఆ విధానమునుండి మరలి వివర్తన మాచరించి పదోల్లాలనముతో నుండుట అనునవి యిందుండగా నిది భ్రాంతపదాంచితమను దేశీకరణ మాయినది.

౧౧. అంగుష్ఠబంధాంచితం

అంగుల్యంగుష్ఠమధ్యాభ్యాం సంయుజోః పాదయోర్మిథః
కృత్వాంచితం విధీయేతాంగుష్ఠబంధాంచితాభిధం.

ఈ దేశీకరణ మంగుష్ఠబంధాంచిత నామమున నున్నది. కావున లక్షణ శ్లోకములో "అంగుష్ఠబంధాభ్యాం" అని యుండునో! అనిపించుచున్నది. అంగుష్ఠాంగులుల బంధములతో కూడుకొనిన పాదముల కన్యోన్యము అంచిత విధాన మాచరించి అంగుష్ఠ బంధాంచిత కరణమును నిర్మింప దగును అని భావము నిందు గుర్తించునది.

౧౨. బలిబంధాంచితం

అంజలిం పృష్ఠతో బద్ధ్వా మధ్యసంశే యదోన్ముఖం
అంచితం రేచయేత్ప్రోక్తం బలిబంధాంచితం దదా
గజదంతేన పురతః కృత మేతత్పరే జగుః.

పృష్ఠభాగమున వెన్నెముక మధ్యభాగమున నున్ముఖమగు నట్లుగా అంజలి కూర్చి అంచిత విధానమును రేచిత మొనరించునది.

అప్పుడది బలిబంధాంచితమను దేశీకరణ మగును. ఎదుటగా గజ దంతమును సంయుత హస్తమున నిది యాచరింపదగునని కొందరనిరి.

౧౩. అలగాంచితం

అలగాంతే కృతం వేగాదంచితం చాలగాంచితం.

ఇటుపై అలగకరణములు నిరూపితములు కానున్నవి. వానిలో అలగమనునది మొదటిది. దానిలక్షణ మచట స్పష్టమగును. ఉత్ప్లుతి నాచరించి యాకసమునని అవాఙ్ముఖుడై వివర్తన మొనరించి ఉత్కటాసన మాచరించిన నలగమగును. అట్టి యలగ కరణాంత మున వేగముగా నంచిత మొనరింపగా నది అలగాంచిత మను దేశీకరణ మగును.

౧౪. సమకర్త్ర్యంచితం

ఆదావంఘ్రీ సమౌబద్ధ్వా స్వస్తికావంచితం యదా
సంపద్యతే యదాప్రోక్తం సమకర్తరికాంచితం.

మొదట పాదములను సమముగా కూర్పవలెను. స్వస్తికము లగునట్లు నంచితముగా నుంచవలెను. ఇట్టిరీతి సంపన్నము కాగా నది సమకర్త్రికాంచితమను దేశీకరణ మయినది.

ఇప్పటికీ విధముగా నీ దేశీవిధానమున అంచిత కరణ చతుర్దశకము నిరూపిత మయినది. ఇటుపై అలగకరణ లక్షణములు నాలుగు నిరూపితము లగును.

అ ల గ ల క్ష ణ ం.

౧౫. అలగం

ఉత్ప్లుత్యావాఙ్ముఖో వ్యోమ్ని వివృత్యాగ్రే పతన్భువి
ఉత్కటాసనమాదధ్యాద్యత్రేదమలగం మతం.

4 ]

ఇది అలగమను దేశీకరణ లక్షణ మగును. ఇందు మొదట ఉత్ప్లుతి యుండవలెను. పిమ్మట ఆకాశమున నవాఙ్ముఖముగా నుండ వలెను. తూర్పుదిశగా నుండి యుత్ప్లుతి నాచరించినచో నాకాశ మునవే అవాఙ్ముఖముగా తిరుగవలెను. అప్పుడచట అవాఙ్ముఖముగా నుండి వివర్తన మాచరించి మొదట భువిపై ఉత్కటాసన మాచరింప వలెను. ఉత్కటాసనము, ఉత్కటికాసనము ఉత్కటాసన మనునది స్థానవిశేషము. తృతీయాధ్యాయమున నిది నిరూపిత మయినది. నాట్యవేదము "స్ఫిక్పార్ష్ణీ నాంసమాగమః" అని దీని లక్షణ మున్నది. ఇది యుత్కటాసనమె కాని కొందరు తలచినట్లు కుక్కుటాసనము కాదు. ఉత్కటాసనము పితృసివావజలతర్పణమున ఆచమన విధాన మున విపియుక్త నుగుట యుద్ధమునకు తగిన యుపవేశములం దుపయోగించుట నిరూపితము.

౧౬. కూర్మాలగం

కూర్మాలగం తదేవ స్యాదంతే కూర్మాసనం యది.

అలగ లక్షణమంతయు నిందున్నది. తుదకొక్క విశేషము న్నది. అంతమున కూర్మాసనమున్నచో కూర్మాలగ కరణమగును.

౧౭. ఊర్ధ్వాలగం

యదంతేఽస్యోర్ధ్వపాదాభ్యాం స్థితిరూర్ధ్వాలగం భవేత్.

అంగలక్షణ మన్నిట సంక్రాంత మగును. అలగకరణ కర ణాంతము నందూర్ధ్వపాదములతో స్థితి యున్నచో నూర్ధ్వాలగ కరణమగును. వెల్లకిలపడి పాదము లూర్ధ్వముగా స్థితి యుతములగు నట్లుగా కూర్చుట యుండవలి రూపము.

౧౮. అంతరాలగం

ఉద్వాహితమురో బాఢం జంఘోపాంతే చ మస్తకం
కుర్యాచ్చేదలగస్యాంతే తదా స్యాదంతరాలగం

జలగ లక్షణ మిందునున్నది. అలగాచరణాంతము నందు బాగుగా శిరము ఉద్వాహితమై జంఘోపాంతమున నుండ వలెను. వక్షము దిటవుగా నుండవలెను. అలగాంతమున నిట్లుండగా నది అంతరాలగ మగును. ఇట్లలగభేదములు నాలుగు లక్షితములయినవి. ఇక లోహడీ కరణముల సప్తకమునకు లక్షణకథనము ప్రసక్తము.

## లో హ డీ ల క్ష ణ ము.

౧౯. లోహడీ

ఉత్ప్లుత్య సమపాదస్థః తిర్యగావర్తితత్రికః
పరాఙ్ముఖః పతేద్యత్ర లోహడీ సా ప్రకీర్తితా

సమపాదము నందుండి యుత్ప్లుతి నాచరించి త్రికమును తిర్యగావర్తితము చేసి పరాఙ్ముఖుడుగా భూమిపై మరల సమపాదమున నుండుచో లోహడియను దేశీకరణ మగును. లోహడ్యంచిత కరణము నిరూపించునపుడు లోహడీ స్వరూపమావశ్యక మయినది. అలగాంచిత కరణ నిరూపణమున అలగ స్వరూప మావశ్యక మయినది. కొన్నిస్థలములందు త్తరభాగ గతములు పూర్వభాగము లంగపేక్షితము లగుచుండును. పూర్వాపరములు రనుసంధానమున వానిని గుర్తింపవచ్చును. దేశీవిధానములలో గాని మార్గవిధాన ములలోగాని పరస్పరసంబంధముండుట యంతట ప్రసిద్ధముగనె యున్నది.

౨౦. కర్తరిలోహడీ

సైవ స్యాత్స్వస్తికాంఘ్రిభ్యాం కృతా కర్తరిలోహడీ

లోహడీ కరణమునె స్వస్తికాంఘ్రి విధానమున నాచరించిన కర్తరిలోహడి యగును. త్రికావర్తనమున పరాఙ్ముఖత్వమునను స్వస్తికపాదరీతి యుండుట యిందలి విశేషము.

౨౧. సమకర్తరిలోహడీ

లోహడ్యాద్యంతయోః పాదౌ సమే స్వస్తికతాం గతౌ
క్రమాచ్చేన్నర్తకైః ప్రోక్తా సమకర్తరిలోహడీ

లోహడీ కరణము నందలి యాద్యంతములలో పాదములు సమములుగా నుండి స్వస్తికాకృతిని క్రమముగా పొందునది యయినచో నది సమకర్తరి లోహడీ కరణమగును.

౨౨. బాహుబంధలోహడీ

శుద్ధా యా లోహడీ సైవ గజదంతేన సంయుతా
యదా ప్రకీర్తితా బాహుబంధాద్యా లోహడీతదా

శుద్ధమయిన లోహడీకరణము ఇతరములతో వ్యామిశ్రణము పొందని లోహడి. ఇందు గజదంతమను సంయుత హస్తముతో సంయుతమై యున్నచో నప్పుడది బాహుబంధపదము పూర్వమున గల లోహడి బాహుబంధలోహడి యగును.

౨౩. చిత్రలోహడీ

కాయస్య చక్రవద్భ్రాంత్యా తిర్యక్చేత్పార్శ్వతః కృతా
లోహడీ యది సా ప్రోక్తా నర్తకైశ్చిత్రలోహడీ

దేహమునకు చక్రాకారముగా భ్రమణము కూర్పవలెను. ఆభ్రమణమున పార్శ్వభాగముగా తిర్యగ్రూపముగా లోహడి కూర్పవలెను. ఇట్లుండగా నిది చిత్రలోహడి యగును. కాయభ్రమణము తిర్యగ్భ్రమణము పార్శ్వ లోహడి చిత్రత నాపాదించును. గావున నిది చిత్రలోహడి.

౨౪. ఏకపాదలోహడీ

ఏకాంఘ్రిస్థానకే కాయః స్యాచ్చేదేకాంఘ్రిలోహడీ

దేహము ఏకాంఘ్రిస్థానకమున నుండగా లోహడీవిధానముండు నేని యది ఏకాంఘ్రిలోహడీ యగును. ఒక పాదము నందుండియె యున్నస్థితి నాచరించుటలో విశిష్టత యున్నది.

౨౫. చతుర్ముఖలోహడీ

లోహడీ చేచ్చతుర్దిక్షు స్యాచ్చతుర్ముఖలోహడీ

లోహడీ విధానము నాలుగు దిక్కులందును నుండునేని చతుర్ముఖ లోహడీ యగును. అవ్యవధానముగ నాల్గుదిక్కులందును లోహడి నాచరించుటలో రమ్యత యుండును.

ఇట్లిచట లోహడీ లక్షణమునకు సంబంధించిన సప్తకము సలక్షణముగా నిరూపిత మయినది.

ఇక దర్పసరణాదులు మూడు నిరూపితములు కానున్నవి.

౨౬. దర్పసరణం

వైష్ణవస్థానకః పాదః త్ర్యశ్రః పార్శ్వముఖశ్చ యః
తత్పార్శ్వదిశి కాయస్య తిర్యక్ స్యాచ్చక్రవద్భ్రమః
యస్మిన్నంతే పరః పాదః త్ర్యశ్రః స్వస్థానమాచరేత్
తద్దర్పసరణం నామ నృత్యజ్ఞైః పరికీర్తితః

దీనిలో పాదము వైష్ణవస్థానకము నందుండుట త్ర్యశ్రముగా పార్శ్వముఖముగా నుండుటయు నావశ్యకము. ఆ వైష్ణవస్థానక దిశగా శరీరమునకు తిర్యగ్రూపముగా చక్రాకారముగ భ్రమణ మావశ్యకము. ఇట్టి విధానము సమాప్తము కాగా తదంతమున నందు ఇతరపాదము త్ర్యశ్రముగా నుండి స్వస్థానాచరణముతో నుండుటయు నావశ్యకము. ఇట్లావశ్యకముల నాచరింపగా నృత్యవిదులు దీనిని దర్పసరణ మను దేశీకరణ మగునని ప్రతిపాదించిరి.

౨౭. జలశయనం

తస్యాంతే జలశాయీవ శయానః స్యాన్మహీతలే
యదా తదా సమామ్నాతం శయనం జలపూర్వకం

ఈ చెప్పిన దర్పసరణ కరణాచరణాంతమున జలమున శయనించిన వానివలె భూతలమున శయనించి యున్నచో నది జలపదము పూర్వమున గల శయనము జలశయన కరణ మగునని సమామ్నాత మయినది.

౨౮. నాగబంధః

విధాయ కరణం దర్పసరణం నాగబంధవత్
యత్రాసీత తదా ప్రోక్తం నాగబంధాభిధం బుధైః

దర్పసరణమను కరణమును నాగబంధము వలె నాచరించి యుండునేని యది నాగబంధ కరణమగు నని బుధులు నిరూపించిరి. ఇట్లు దర్పసరణాది త్రికము నిరూపిత మయినది.

ఇక కపాలస్పర్శనాది చతుష్కమును నిరూపింపవలెను.

కపాలస్పర్శనాదులు.

౨౯. కపాలస్పర్శనం

కపాలస్పర్శమాహుస్తత్కురుతే యత్ర నర్తకః
లోహడీమలగం బద్ధ్వా స్పృశేన్మూర్ధ్నా మహీం మనాక్
కపాలచూర్ణమిత్యుక్తం యదన్యైస్తన్న శోభనం

నర్తకుడు ఇదివరలో నిరూపించిన లోహడీ నాచరించి అలగమును కూర్చి శిరముతో భూమిని కొంతగా స్పృశించునేని యది కపాల స్పర్శన మను కరణ మగును. అలగమున తొడకు సమపదస్థితి యున్నది. లోహడిలో నంతమున పరాఙ్ముఖమ్ముగా పాతమున్నది. ఇందు కపాలమున మహీస్పర్శనమున్నది. కావున కపాలస్పర్శన

కరణ మయినది. ఈ కరణమునకు కొందరు కపాలచూర్ణము అను నామవ్యవహార మభిమానించిరి. అది మాకు యుక్తముగ తోచదు.

౩౦. వ్యంకోలం

కపాలస్పర్శనం యత్ర కుర్వన్నలగసంభవం
అంతరాలగవాం స్తిష్ఠేత్ వ్యంకోలం తదుదీరితం
నతపృష్ఠాభిధానం తు కేచిదేతత్ప్రచక్షతే

అలగకరణ సంభవ మయిన కపాలస్పర్శ కరణ మొనరించుచు అంతరాలమున అలగమున్న విధానమున నున్నచో నది వ్యంకోల కరణ మగును. దీనిని కొందరు నతపృష్ఠ మను నామమున పలుకుదురు. ఇది వ్యంకోలమనుట యుక్తము.

౩౧. సూచ్యంతం

ఆపూర్వ్విషమఖండాది సూచీనాం చాత్ర కేచన
యస్య యస్య విరామే తు సూచీం రచ్యేత కించన
తత్తత్సూచ్యంతమిత్యుక్తం కరణం నృత్తకోవిదైః

ఆయా కరణము లొనరించిన పిమ్మట సూచీరచన మొనరించినచో నది సూచ్యంత మగు నని నృత్తకోవిదు లనిరి. సూచి యంతమున నుండుటచే నిది సూచ్యంతము. ఈ యధ్యాయ ప్రారంభము నుండి సూచించిన దేశీస్థానకము లలో సమసూచి విషమసూచి ఖండసూచి యను మూడు సూచివిధానము లున్నవి, ఆ సూచీవిశేషముల లోని యేదేని సూచి యిచట ప్రయుక్తము కావచ్చు నని కొందరు తలచిరి. ఆంగికాభినయములలో సూచీపదమున గ్రహింపదగినవి యనేకములు కలవు. సూచీనామమున దేశీచారియు కలదు. అందుననె కొందరు విషమ ఖండాది సూచీ విశేషములలో నొకటి పరిగ్రాహ్యమని భావించిరని జాయన యనెను.

ఈ లక్షణము నందలి తు్రిటితము భరత కోశాధారమున పూరితి మయినది.

౩౨. మత్స్యకరణం

కస్యాపికరణస్యాన్త ఉత్తానః శయితః క్షితౌ
నితంబోన్నమనా న్మధ్యాం యస్మిన్నావర్త్య వామతః
.... .... .... .... ....
తన్మత్స్యకరణం ప్రోక్తం మత్స్య వత్పరివర్తనాత్

ఏదేని కరణాచరణాంతము నందు నర్తకుడు ఉత్తానముగా వెల్లకిలగా శయనించిన వాడై నితంబోన్నమన మొనరించి మధ్య మును వామభాగమునకు ఆవర్తింపజేయునది. జలమున సంచరించు మత్స్యమువలె మజ్జనోన్మజ్జనములు నమనోన్నమనములు మునుగుటలు తేలుటలు నితంబోన్నమన మధ్యావర్తనముల వలన స్ఫుటములగు నట్లొనరించినచో నిది మత్స్యకరణ మగును. మత్స్యమువలె పరి వర్తనమున్నందున నిది మత్స్యకరణ మయినది.

ఇప్పటికి మొదట నుపక్రమోద్దేశమున నిరూపితములయిన ద్వాత్రింశత్కరణములు ఇట్లు సలక్షణముగా నిరూపితము లయినవి.

దేశీవిధానమున భ్రమరీభేదములు కలవు. వానినిచట నిరూ పింపవలసి యున్నది. దేశీభ్రమరీ విశేషములు పదమూడిచట నిర్దిష్టము లగును. మధ్యలో కొంత గ్రంథపాతమున్నది. సర్వభ్రమరీ లక్షణ నిరూపణానంతరము కేవల సంకీర్ణరూపమున భ్రమరీభేదకథ నము తత్ప్రస్తారము నిరూపిత మగును. ఈ ప్రస్తార విశేషము లిందు లేవు. వానిని గ్రంథకర్త గ్రంథాంతరమున సవిశేషముగా ప్రతి పాదింప దలచెను.

## భ్రమరీలక్షణం.

పదైరంతర్బహిశ్ఛత్ర తిరిపా తాలగోచితైః
విద్యుచ్చక్ర శిరో హస్త కుంచితాంగైర్విశేషితాః
త్రయోదశ భ్రమర్యః స్యుస్తాసాం లక్షణముచ్యతే

భ్రమరీవిశేషములు పదమూడు కలవు. వాని లక్షణ మిచట నిరూపిత మగును. అంతరాది పదములతో విద్యుదాదిపదములతో విశేషితము లయిన భ్రమరులు ఆయా పదములతో గూడుకొనిన భ్రమరులు అని ఉక్తిచమత్కారమున భ్రమరీ సంకేతమును కర్త యిందు సూచించెను. వాని నామముల నీవిధముగా గుర్తించునది.

అంతర్భ్రమరి — బాహ్యాభ్రమరి
ఛత్రభ్రమరి — తిరిపభ్రమరి
ఓతభ్రమరి — అలగభ్రమరి
ఉచితభ్రమరి — విద్యుద్భ్రమరి
చక్రభ్రమరి — శిరోభ్రమరి
హస్తభ్రమరి — కుంచితభ్రమరి
అంగభ్రమరి —

౧. అంతర్భ్రమరీ ౨. బాహ్యాభ్రమరీ

సముత్క్షిప్తేన పాదేన భుజంగత్రాసితాంఘ్రివత్
వామేన దక్షిణావర్తవామావర్తపరేణ చ
శరీరం భ్రామ్యతే వేగాన్న చ భ్రాంత్యా పరస్య యత్
అంతర్భ్రమరికాఖ్యేయం అస్యా ఏవ విపర్యయాత్
బాహ్యభ్రమరికా ప్రోక్తా విశేషః కింత్వయం పునః
స్ఫిజాం ద్రుతపార్ష్ణేయం ద్విగుణేనాంఘ్రిణా భ్రమః

యా ప్రదక్షితో భ్రాంతిరప్రదక్షిణతశ్చ యా
తామంతర్భ్రమరీం బాహ్యాభ్రమరీం చ పరే విదుః

ఈ శ్లోకములలో అంతర్భ్రమరి బాహ్యాభ్రమరి అను రెండు భ్రమరీ విశేషముల స్వరూప లక్షణ మున్నది. అం దంతర్భ్రమరీ స్వరూప మీా విధముగా నున్నది. భుజంగత్రాసితము నందువలె పాదమును ముందుగా సముత్క్షేప మొనరింపవలెను. దక్షిణా వర్త వామావర్తపరమగునట్లు వామపాదము ననుసంధానింప వలెను. వేగముగా శరీరమును భ్రమింపజేయ వలెను. ఇందు పరపాదమునకు భ్రాంతియుండదు. వామపాదావర్తనము శరీరభ్రమణము ననునవి చెప్పిన విధమున నున్నచో నిది అంతర్భ్రమరిక అను భ్రమరీ విశేష మగును.

ఈ అంతర్భ్రమరీ విపర్యయమున్నచో బాహ్యాభ్రమరి యగును. భుజంగత్రాసితాంఘ్రివలె దక్షిణ పాదముండుట దక్షావర్తవామావర్తమున నుండుట, శరీరము వేగముగా భ్రమణము పొందుట యుండగా బాహ్యాభ్రమరిక యగునని భావము. కాని కొంతవిశేష మిందున్నది. ఈ విశేషసూచనమునకై యిందున్న అను వాక్యము అందలి పదముల యన్వయము సంగతముగా భాసించుట లేదు. అయినను భావార్థము నిట్లు భావింప వచ్చును.

దక్షిణపాదమున నిలబడి వామపాదమును కుంచిత మొనరించి వామావర్తముగా సంచరించునది. సవ్యేతర పాదమున నుండి సవ్యాంఘ్రి కుంచన మాచరించి సవ్యావర్తముగా సంచరించునది. సవ్యావర్తమనుట ప్రదక్షిణముగా నని భావము. భరతకోశ సంగృహీతమయిన బాహ్యాభ్రమరీ స్వరూప మిట్లున్నది. సర్వార్థము గుర్తించిన జాయసేనాపతి "ప్రదక్షిణాశో భ్రాంతిః అప్రదక్షిణతశ్చ"

అని సూచించెను. ఇట్టిదిది బాహ్యభ్రమరి. బాహ్యభ్రమరిలో దుత్రితపార్ష్ణి యగు పిఱుదు భాగమునకు రెట్టింపుగా పాదమునకు భ్రమణ ముండుటయు జాయపతికి సమ్మతమనిపించును.

౩. ఛత్రభ్రమరీ

విష్ణుక్రాంతవదుత్క్షిప్య వామాంఘ్రిః కుంచితః పునః
పతనోత్పతనైరన్యైః పాదాస్య భ్రమణం జనాత్
యత్ర ప్రదక్షిణం కుర్యాత్సా ఛత్రభ్రమరీ మతా

ఈ కరణమున నీ రూపమున్నది. విష్ణుక్రాంతమను కరణములో వలె ఉత్క్షేప మొనరించిన పిమ్మట వామాంఘ్రి కుంచిత మొనర్ప వలెను. పత నోత్పతనములతో గూడుకొనునది కావలెను. అన్య పాదము వేగమున భ్రమణము పొంద వలెను. ప్రదక్షిణముగా సంచారము కూర్పవలెను. అప్పుడది ఛత్రభ్రమరి యను భ్రమరీ విశేష మగును

౪. తిరిపభ్రమరీ

కుంచితం పాదముత్క్షిప్య పార్శ్వనాక్షిప్య పృష్ఠతః
అన్యాంఘ్రేః స్వస్తికం కృత్వా శరీరం భ్రామయేద్యదా
తిర్యక్ఛేద్దండపక్షాభ్యాం యదా స్యాత్స్వస్తిచ్యుతిః
తిరిపభ్రమరీత్యేషాం తదా తద్జ్ఞైర్నిగద్యతే
ఉత్ప్లుత్య ఘటయిత్వాపి జానునోః స్వస్తికం భవేత్
పూర్వవద్యత్ర సా ప్రోక్తా తిరిపభ్రమరీ పునః

కుంచితమగు పాదమును ఉత్క్షేపించి, పృష్ఠభాగముగా పార్శ్వ మున నాక్షిప్త మొనరించి అన్యపాదముతో స్వస్తికమును సంపా దించి, శరీరమును భ్రమింపజేయ వలెను. తిర్యక్కుగానున్న దంత

పక్షహస్తములచే స్వస్తికవిచ్యుతి కావించునది. అప్పుడది తిరిప భ్రమరి యగునని దేశీవిధానవిదు లనిరి. ఈ భ్రమరీ విధానమున వేరొక భావమును గలదు. ఉత్ప్లుతి నాచరించి జానువులకు స్వస్తిక మాచరించి భ్రమణ మనుసరించునది. అప్పుడు నిది తిరిపభ్రమరి యగును.

ఈ తిరిపభ్రమరి నిరూపణానంతరము మొదటి యుద్దేశానుసారమున ఓతభ్రమరి నిరూపింప వలసి యున్నది. కాని దాని లక్షణ మిచట లేదు. త్రుటితమైనది. వేమభూపాలుని సంగీత చింతామణిలో ఓతాభ్రమరీ లక్షణ మీవిధముగా నున్నది. అది ప్రకృతమున భావనీయము.

౫. ఓతాభ్రమరీ

కృతోత్ప్లుతిర్వామపాదతలేన తు ముహుర్ముహుః
తాడయన్దక్షిణస్యోరుం యత్ర భ్రామ్యేత్ప్రదక్షిణం
ఔతా భ్రమరికా సేయా నృత్తవిద్భిరుదాహృతా

ప్రథమముగా నుత్ప్లుతి నాచరించి వామపాద తలమున ముహుర్ముహుః దక్షిణోరుభాగమును తాడన మాచరించుచు ప్రదక్షిణముగా పరిభ్రమణ మాచరించినచో నది ఓతాభ్రమరిక యగునని నృత్తవిదు లుదాహరించిరి.

౬. అలగ భ్రమరీ

నమనోన్నమనైః పూర్వకాయస్య క్షితిమస్పృశన్
దక్షిణం ప్రసృతం పాదం ముహుః కుర్వన్ ద్రుతం భ్రమన్
తిరశ్చీనో భవేద్యత్ర సాలగభ్రమరీ మతా

భూమిని స్పృశింపకుండగనే పూర్వకాయమునకు సంబంధించిన నమనోన్నమనములతో నుండుటయు, దక్షిణపాదమును మఱలమఱల

ప్రసృత మొనరించుటయు, వేగముగా భ్రమణ మాచరించుటయు, తిరశ్చీనముగా నుండుటయు అలగ్రభమరీ స్వరూపము. కొందరిట్లును భావించిరి. వైష్ణవస్థానమున నుండి వామపాదమున భూమిపై నుండి పాదమును ప్రసారిత మొనర్చి భూమిన స్పృశింప కుండగనే పాదమును భ్రమింప జేయుచు, ఊర్ధ్వకాయమున తిరశ్చీనుడై నమనోన్నమనము లాచరించుచున్నచో నలగ్రభమరి యగును. అని పూర్వపశ్చాత్క్రియాభేదము కాని అదియు నిదియు నేకవిధమె.

౭. ఉచిత భ్రమరీ

విశాఖస్థానకే తిష్ఠన్ తిర్యక్కోల్లాలనైః సమైః
యుగపద్దండపక్షాభ్యాం వామహస్తేన కుం లిఖన్
ముహుః ప్రదక్షిణం కుర్వన్ భురితం త్వరితం యదా
మండలేన పరిభ్రామ్యేదుచితభ్రమరీ తదా

విశాఖ స్థానకమున నుండుట, తిర్యగ్రూపమున హస్తములను దండపక్షములనుగా నుంచుట, ఆ హస్తములను సమోల్లాలనములతో నుండునట్లాచరించుట, వామహస్తమున భూమిని స్పృశించుట ముహుః ప్రదక్షిణ మొనరించుట భురితముగా త్వరితముగా మండలాకారమున పరిభ్రమించుట అనునవి యుండుచో ఉచిత భ్రమరి యగును. సమపాదమున నుండి శరీరమునకు భ్రమణము సంపాదించినను ఉచితభ్రమరి యగునని కొందరనిరి. అంతకన్న నిది రమ్యముగా నుండును.

౮. విద్యుద్భ్రమరీ

విద్యుద్భ్రాంతాం ముహుః కుర్వన్ దక్షిణేనాంఘ్రిణా యదా
ప్రదక్షిణం పరిభ్రామ్యేత్సా విద్యుద్భ్రమరీ భవేత్

దక్షిణపాదమున విద్యుద్భ్రాంత కరణము ముహుః ఆచరించుచు ప్రదక్షిణ విధానమున పరిభ్రమించినచో విద్యుద్భ్రమరి

యగును. చతుర్థాధ్యాయములో నిరూపించిన కరణములకు ఇందలి దేశీవిధానములకు సంబంధ ముండుట స్పష్టమె యయినను విద్యు ద్భ్రాంతాది పదములను నిరూపించుట వలన నింకను విశదమగు చున్నది.

భ్రమరుల ఉపక్రమములో నామసంకేతము ప్రదర్శించిన విధమున విద్యుద్భ్రమరి యనంతరము హస్తభ్రమరి పూర్వము చక్రభ్రమరి శిరోభ్రమరి అను రెండు భ్రమరుల లక్షణము నిరూ పింపవలసి యున్నది. కాని యా భాగము గ్రంథమున త్రుటిత మయినది. అయినను తద్భావగ్రహణమున కుపాయము కలదు. వేమ భూపాల లక్షణ మిట్లుకలదు.

౯. చక్రభ్రమరీ

స్థానకే ఖండసూచ్యాఖ్యే హేమస్యాగ్రతలేన తు
మహీతలమవష్టభ్య దక్షిణం చరణం పునః
చక్రవద్భ్రమయేద్యత్ర సా చక్రభ్రమరీ మతా

ఖండసూచి యను స్థానకము నందుండి వామపాదముయొక్క అగ్రతలమున భూతలము నణచిపెట్టి దక్షిణచరణమును చక్రమువలె భ్రమింపజేసినచో నది చక్రభ్రమరి యగును. భూమిపైనున్న పాదము నాకర్షించుచు త్రిపతాక హస్తమును వహించుచు చక్రా కారమున భ్రమించుట చక్రభ్రమరి యగునని కొందరు భావించిరి. ఈ భ్రమరీ లక్షణ భాగములో నీ గ్రంథమున "యత్రసైవం నకృ త్సకృత్" అని యొక్క పాదమున్నది.

౧౦. శిరోభ్రమరీ

మస్తకేన మహీభాగే స్థిత్వాథ చరణద్వయం
ఊర్ధ్వీకృత్య యదా తిర్యక్ పరిభ్రమణమాచరేత్
తదా శిరోభ్రమరికా కథితా నృత్తకోవిదైః

ఇదియు వేమ నిరూపిత లక్షణమే. భూభాగమున శిరమును మోపియుండి రెండు పాదములను ఊర్ధ్వముగా నొనర్చి తిర్యక్పతి భ్రమణ మాచరించినచో నప్పుడు శిరోభ్రమరి యగునని నృత్త కోవిదులనిరి. ఈ లక్షణ నిరూపణమున నీ గ్రంథములో "శిరో భ్రమరికా మతా" అని మాత్రము లభించినది.

"శిరసైవభువవిస్థితో్ర్ధ్వీకృతౌ చరణే దధత్
పరిభ్రమతి యత్రి తిః సా శిరోభ్రమరీ మతా"

అని సంగీత రత్నాకరము నందలి లక్షణము భావమంతయు సమానము. శిరముంచి పాదములు సాచి మూడు పర్యాయములు పరిభ్రమించుట మాత్రమె యిందు విశేషము. నిశ్చలముగా నుండి కేవలశిరమును భ్రమింప జేయుట కరయుగమును వేగముగా పరి భ్రమింపజేయుటయున్నను శిరోభ్రమరి యగునని కొందరు భావించిరి.

౧౧. హస్తభ్రమరీ

.... .... .... .... ....

వామహస్తతలేనోద్వ్యం తిష్ఠన్ వ్యోమముఖక్రమః
అపసవ్యం భ్రమేద్యత్ర సా హస్తభ్రమరీ భవేత్

ఉద్దేశానుసారముగా నిది హస్తభ్రమరీ లక్షణము. ఇందు మొదటి భాగము కొంత త్రుటితమయినది. ఇందు "వ్యోమముఖ క్రమః" అని యున్నది. అది దిఙ్ముఖ క్రమార్థకము కావచ్చును. శార్ఙ్గదేవాదులు కొందరు "దిగ్భ్రమతి" నిర్దేశించిరి. ఇది యా దిగ్భ్రమరియే యగునో? వేమభూపాలుడు నిరూపించిన దిగ్భ్రమరీ లక్షణ మిూ విధముగా నున్నది.

క్రమాదాశాసు సర్వాసు కరావష్టబ్ధభూతలః
భ్రామయంశ్చాపకృత్తిష్ఠేద్యది దిగ్భ్రమరీ తు సా

భూతలమున కరతలములచే పూనికపూని [కరావష్టబ్ధ భూతలుడై యనుట] సర్వదిక్కులందును సంచరించుచు అసకృత్ మాటిమాటికి భ్రమణ మొనరించునేని యది దిగ్భ్రమరి యగును. ఇట్టి భావార్థముతో జాయపతి చెప్పిన హస్తభ్రమరిని భావింపవచ్చును.

వామహస్త తలమున భూతలమున మోపియుండి వ్యోమ ముఖముగా క్రమరీతి కలిగి అపసవ్యముగా భ్రమణ మొనరించునేని యది హస్తభ్రమరి యగును అని జాయన లక్షణ భావము.

౧౨. కుంచిత భ్రమరీ

చిత్రభ్రమరికాం కుర్యాద్భుజంగత్రాసితాంఘ్రిణా
యదా విద్భిస్సమాఖ్యాతా కుంచితభ్రమరీ తదా

భుజంగత్రాసిత పాదమున చిత్రభ్రమరికను ఆచరింప వలెను. అప్పుడది కుంచిత భ్రమరి యగునని నృత్తదేశీవిధాన విదులనిరి. నాట్యపరిభాషలో చిత్రపదమున కనేకార్థములు కలవు. గతి తిర్యఙ్ముఖము కరము త్రిపతాకముగా నున్నచో చిత్రమగును. పాద భ్రమణము మధ్యభ్రమణము హస్తభ్రమణము నున్న చిత్రవ్యవహారము కల్గును. ఇట్టి చిత్రరీత్యనుసంధానమున చిత్రభ్రమరికను కూర్చినచో కుంచిత భ్రమరి యగును.

కొందరీవిధముగా కుంచిత భ్రమరిని సంకేతించిరి. జాను నికుంచన మొనరించి భ్రమణము కూర్చినచో కుంచిత భ్రమరి యగును. కొందరిట్లనిరి. భుజంగత్రాసిత పాదము కూర్చి, చరణమున కప్రదక్షిణముగా నమనోన్నమనములుకూర్చి శరిరమును భ్రమణము పొందునట్లు చేసినచో కుంచిత భ్రమరి యగును. అవి ఇట్టి భావము లందే స్ఫురించుటకు జాయపతి కుంచితభ్రమరి లక్షణ మిట్లు నిరూపించెను.

౧౩. అంగభ్రమరీ

సమపాదే స్థితః స్థానే మధ్యస్య వలనాద్భృశం
పఠతో భ్రామయేత్తూర్ణం పూర్వకాయం కరౌ దధత్
ప్రయోగవశగౌ దండపక్షాఖ్యావవ్యవస్థితౌ
యస్యామభిహితా తజ్జ్ఞైరంగభ్రమరికేతి సా

సమపాద స్థానమున నుండి మధ్యమున కధికముగా వలనము కూర్పవలెను. పూర్వకాయమును వేగముగా నంతట భ్రమింప జేయవలెను. ప్రయోగవశగములు నవ్యవస్థితము లయిన దండపక్షములను హస్తములను ధరింపవలెను. అప్పుడు దానిని అంగభ్రమరిక యందురు.

ఇట్లీ విధముగా నిచట పదమూడు భ్రమరీ విశేషములు నిరూపితము లయినవి. ఇటుపై కేవలములు సంకీర్ణములను విభాగమున భ్రమరీ భేదములు నిరూపించుట యావశ్యకము.

చక్రాంగౌతా శిరోహస్త తిరిప చ్ఛత్ర కుంచితైః
భవంత్యుపపదై రష్టభ్రమర్యః కేవలా ఇమె
అన్తర్బాహ్యాలగై ర్విద్యుదుచితాభ్యాం చ సంయుతాః
కేచలా గుణితాశ్చ స్యురన్యాసాం సంకరాన్మిధః
పంచానాం వా చతస్రాణాం మిశ్రాణాముభయోరపి
భ్రమర్యస్సంభవంత్యన్యాః క్రమవ్యుత్క్రమ భేదతః
శతాని సప్తషష్టిశ్చ విచిత్రం చతురైః కృతాః
అంతర్బాహ్యాలగై ర్యుక్తాస్తద్వద్బాహ్యాంతరాలగాః
తథాంతరాలగా బాహ్యా అలగాంతర్బహిర్గతాః

బాహ్యాంతరాలగాశ్చైవమలగా బాహ్యకాంతరాః
క్రమవ్యుత్క్రమతశ్చైవ త్రిస్రః షణ్ణవతేః పరాః
భ్రమర్యస్తద్వదన్యాశ్చ కల్పనీయాః పథామునా
ఏతాసామపి విజ్ఞేయః ప్రస్తారః కూటతానవత్
సచాస్మాభిః స్ఫుటం గీతరత్నావల్యాం ప్రపంచితః

చక్ర, అంగ, ఓతా, శిరో, హస్త, త్రివ, ఛత్ర, కుంచితము లను నుపపదములతోఁ గూడుకొనిన యెనిమిది భ్రమరులు కేవల రూపములు. ఈ కేవల భ్రమరులు అంతర్భ్రమరి బాహ్యభ్రమరి అలగభ్రమరి అనువానితోఁ విద్యుద్భ్రమరి ఉచితభ్రమరులతోఁ సంయుతములై ఇతరముల పరస్పరసాంకర్యము వలన గుణితములు కాగా క్రమభేదమున వ్యుత్క్రమభేదమున నితరములగు భ్రమరు లనేకములు సంభవించును. కేవల భేదములకు మిశ్రభేదములకు అంతర్భ్రమర్యాదు లయిదింటితోఁ సంబంధ ముండుటయు నాల్గింటితోఁ సంబంధముండుటయు త్రికముతోఁ సంబంధముండుట ద్వికముతోఁ నుండుట యను విశేషమున ననేకాన్యభేదములు కలుగును. చతుర సమ్మిశ్రణమున గలుగు నీ విచిత్రవిశేషములు "శతాని సప్తషష్టిశ్చ"

ఈచతుర విచిత్ర సమ్మిశ్రణము ఇట్లుండును.

౧ అంతర్బాహ్యాలగ సంయోగము.
౨ బాహ్యాంతరాలగ సంయోగము.
3 అంతరాలగ బాహ్య సంయోగము.
౪ అలగాంతర్బాహ్య సంయోగము.
౫ బాహ్యాంతరాలగ సంయోగము.
౬ అలగబాహ్యకాంతర సంయోగము.

ఇట్టి వాని క్రమ సంబంధమునను వ్యుత్క్రమ సంబంధమునను భ్రమరులనేకములు కలుగుటను ఈ నిరూపించిన మార్గానుసారమున నభ్యూహించి నిశ్చయించుట యుక్తము. దీనికిని కూటతానమునకు వలె కలుగు ప్రస్తారము తెలియదగినది. ఈ విశేష విధినంతను మేము గీతరత్నావలి అను గ్రంధమున సవిశేషముగా నిరూపించితిమి.

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ
గజసాధనిక శ్రీ జాయ సేనాపతి
విరచిత నృత్తరత్నావల్యాం
దేశీస్థానక కరణ భ్రమరీలక్షణం నామ
పంచమాధ్యాయః

ఆంధ్రభోజ, సాహితీవల్లభ
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజ
భావసాధక శ్రీ మాధవరామశర్మ
విరచిత సాహితీవల్లభాఖ్యవాఖ్య
దేశీస్థానక కరణ భ్రమరీలక్షణం
పంచమాధ్యాయము

శ్రీ

శ్రీ జాయసేనాపతి విరచిత

# నృత్తరత్నావలీ

## షష్ఠాధ్యాయః

---

పంచమాధ్యాయారంభమున నిరూపించిన విధమున నిందును దేశీరీతులు ప్రతిపాదితము లగును. మతంగోక్త ప్రకారమున షోడశ దేశీపాదములు, అష్టావింశతి చారులు, భౌమములయిన దేశీచారులు, ఆకాశగతములయిన దేశీచారులు, దేశీలాస్యాంగములు, గతిభేదములు, భేదాంతరములు ఈ షష్ఠాధ్యాయమున నిరూపితము లగును. గతు లనంతము లనియు ప్రతిపాదిత మగును.

### దేశీపాదాః

మతంగేనోదితాన్ దేశీనృత్తశోభా విధాయినః
పాదాన్ షోడశ సంఖ్యాకానృధయామోఽదునా వయా

మతంగోక్తము లయిన దేశీపాదములు పదునారుకలవు. అవి యన్నియు దేశీనృత్తమున శోభావిధాయకములు. వానినిప్పుడిచట మేము నిరూపింతుమని యావక్రమవచనము. ఇవియు గణపతిదేవ సమకాలమున లోకమునందు వ్యాపించి యున్నవనియే భావము. దేశీవిధానముల జెప్పుటలో కేవలము స్వాత్మప్రత్యయమును మాత్రమె జాయపతి యాధారముగ గైకొనుటలేదు. ఇట్టివి లోకామోదము పొందియుండుటయు గాక నాట్యవిదుల భావసంవాదము పొందినవె యని సూచించుట కిది సహకారి యగును. ఇట్టి నాట్య

విశ్వంపాద సంపత్తిసి జాయసేనాపతి యంతట సూచించుచునే యున్నాడు. జాయన ప్రాక్కాలమున సమకాలమున అనంతరకాలమున నివి యిట్టివి ప్రచలితములుగనె యున్నవని నాట్యసాహిత్య గ్రంథములు సూచించుచున్నవి.

మతంగోక్తము లయిన దేశీపాదముల నామము లీ విధమున నున్నవి.

సరికా స్వస్తికోల్లాలౌ స్ఫురికార్ధపురా తధా
పురాటీ వేష్టనోద్వేష్టే ఖుత్తార్ధస్ఖలితాభిధా
ప్రావృతః పృష్ఠతః క్షేపో లతాక్షేపో నికుట్టకః
సమస్ఖలితకోత్క్షేప ఇత్యేషాం లక్ష్మ కథ్యతే

సరికాదులు దేశీపాదములు. వీనిని కొందరు దేశీచారీ విశేషములలో భావించిరి. ఇవి పాదములనుటయే జాయన సమ్మతము.

| | | | |
|---|---|---|---|
| సరిక | — స్వస్తిక | — ఉల్లాల | — స్ఫురిక |
| అర్ధపురాటీ | — పురాటికా | — వేష్టన | — ఉద్వేష్టనం |
| ఖుత్తా | — అర్ధస్ఖలితికా | — ప్రావృతం | — పృష్ఠోత్క్షేప |
| లతాక్షేప | — నికుట్టక | — సమస్ఖలిత | — ఉత్క్షేప |

వీని లక్షణము లీవిధమున నున్నవి.

౧. సరికా

పురస్సరో ద్వయోరేకః పాదశ్చేత్సరికా మతా

రెండు పాదములలో నొకపాదము పురస్సరముగా నున్నచో సరిక యను దేశీపాద మగును. "పాదస్యైకస్యసరణాత్సరికా" అని వేమాదుల లక్షణము.

౨. స్వస్తికః

స్వస్తికః స్వస్తికాకారధారిణోః పాదయోర్మతః

రెండు పాదములకు స్వస్తికాకార ధారణముండునేని స్వస్తికమను దేశీపాద మగును. పాదములు స్వస్తికీకృతములై కుట్టనమున నున్నచో స్వస్తికపాదమని కొందరి భావము. పాదపాటము భావాలువు హస్తము హస్తపాటము గతి పాదమణి చాలకము భ్రమరి కరణము మండలము దేశీస్థానము రేచితము అంగహారము వర్తనము ఉల్లేపము ఉద్వర్తనము మొదలగునవి స్వస్తికపదములతో గూడినవి యీ నృత్తశాస్త్రమున గోచరించును. వాని నాయా స్థలభేదానుసారమున లక్షణ విశేషములతో గుర్తింపవలసి యున్నది.

౩. ఉల్లాలః

ఉల్లాసనం క్రమేణాంఘ్ర్యోః యత్రోల్లాలః స కథ్యతే

ఈ ఉల్లాలము ఉల్లోలమనియు నున్నది. రెండు పాదములకు క్రమముగా ఉల్లసనమున్నచో ఉల్లాలమను దేశీపాద మగును. ఆకాశమున క్రమముగా పాదముల కుల్లాలనమున్నచో నుల్లాల మగునని కొందరి భావము. అన్యుల భావములని యనుటయుగాని యిందేయవియు ప్రయోగానుగతములై భాసించుట గుర్తించునది.

౪. స్ఫురికా

పద్భ్యామంగులిపృష్ఠేన పార్శ్వయోః పృష్ఠతోఽగ్రతః
గతిర్యత్ర స్థితిర్వా స్యాత్తాం విదుఃస్ఫురికాం బుధాః

సమపాదములతో పురోభాగమునకు సరణ ముండుట స్ఫురిక యగునని కొందరి భావము. అంతకన్న జాయన లక్షణమున విశేషము రంజనము కలదు. అంగులి పృష్ఠములతో పార్శ్వభాగములకు పృష్ఠభాగమునకు అగ్రభాగమునకు గతి యుండునేని అథవా స్థితియేని యుండునేని స్ఫురిక యను దేశీపాదమగునని బుధులందురు. ఇది జాయన భావము.

౫. అర్ధపురాటీ

యదోద్వృత్తేన పాదేన నికుట్టేన నికుట్యతే
ఉద్వృత్తశ్చరణోఽ న్యోర్ధపురాటీ సాభిధీయతే

భూమియందున్న ఉద్వృత్తము నికుట్టితముగా నున్న పాదము ఉద్వృత్తముగానున్న అన్యపాదమును నికుట్టిత మొనరించినచో నది అర్ధపురాటిక యను దేశీపాద మగునని నృత్తవిదు లందురు.

౬. పురాటికా

నికుట్టనం మిథః పద్భ్యాముద్వృత్తాభ్యాం పురాటికా

ఉద్వృత్తములయిన రెండు పాదములతో పరస్పరము నికుట్టన మున్నచో పురాటిక యను దేశీపాద మగును. ఉద్వృత్తములగు పాదములకు మిథస్తాడన ముండుట యని భావము.

౭. వేష్టనం

వేష్టనం తద్వదన్యస్య పదైనైకేన వేష్టనం

ఒక పాదముతో స్థితితో నున్న పాదమునకు వేష్టనము సంపాదించుట వేష్టన మను దేశీపాదకర్మ వేష్టనము చుట్టుకొనుట. ఒకపాదమున వేరొకపాదము చుట్టుట.

౮. ఉద్వేష్టనం

పశ్చాద్గతేన తేనైవ పాదేనోద్వేష్టనం పునః

వెనుకగా ప్రసరించిన పాదముచే యథాస్థిత పాదమునకు ఉద్వేష్టనము కూర్చినచో నది యుద్వేష్టనమను దేశీపాదమగును.

౯. ఖుత్తా

తాడనం చరణాగ్రేణ భువః ఖుత్తాభిధీయతే

చరణాగ్రమున ధరణీఘాతమున్నచో భూతాడనమున్నచో నది ఖుత్తాయను దేశీపాద మయినది. ఖుత్తాది పదముల ఉత్పత్తి వ్యుత్పత్తులను విశదపఱచు నాల్యకోశ మావశ్యక మనిపించును.

౧౦. అర్ధస్ఖలితికా

అర్ధస్ఖలితికా తిర్యగేకాంఘ్రేః స్ఖలనం స్మృతా

ఒక్క పాదమునకు అడ్డముగా స్ఖలనముండుట అర్ధస్ఖలితిక యను దేశీపాదమందురు. వ్యవహారములో దీనిని అడ్డస్ఖలితిక అందురు.

౧౧. ప్రావృతం

లీలాంగలతా యత్ర వలితా చరణం భవేత్

ఉద్వృత్తం ప్రావృతం తత్స్యాత్పుష్పేషోః కేలికాననం

నట్టువరాలి లీలావిలాస సహిత మయిన అంగలత వలిత మగునేని, చరణము. ఆచరణము ఈ చరణమును ఉద్వృత్త మగునేని [పైకెత్తినపుడు] అది ప్రావృతమను దేశీపాద మగును. ఈ ప్రావృతము పుష్పేషువునకు కేలీకాననము. కేలికాననము కామక్రీడా స్థానము.

౧౨. పృష్ఠోత్క్షేపః

పృష్ఠతశ్చరణోత్క్షేపం పృష్ఠోత్క్షేపం ప్రచక్షతే

పశ్చాన్నిక్షిప్య యత్రాంఘ్రిం లీలయాగ్రే ప్రసార్య చ.

పృష్ఠభాగముగా చరణోత్క్షేపమున్నచో పృష్ఠోత్క్షేపమగును. దీని వివరణ ముత్తరార్ధమున నున్నది. పాదమును పశ్చాద్భాగమున నుంచి విలాసముగా నగ్రభాగమునకు ప్రసారితముచేసి పృష్ఠభాగమున నుత్క్షేపణ మొనరించునది. అప్పుడది పృష్ఠోత్క్షేప మను దేశీపాద మగును. పృష్ఠోత్క్షేప పదమున పృష్ఠమున కుత్క్షేపము భావించకుండుటకై ఉత్తరార్ధ వివరణ ముచితముగా నున్నది.

౧౩. లతాక్షేపః

మహీ నికుట్యతే తేన లతాక్షేపస్స ఉచ్యతే

ఈ లతాక్షేపలక్షణమున ఇప్పుడే నిరూపించిన పృష్ఠాక్షేప లక్షణమనుగతము కావలసియున్నదని "తేన" పదము చెప్పును. పాదమును పశ్చాద్భాగమున కూర్చి పురోభాగమునకు ప్రసారితము చేసి యా పాదమున భూ నికుట్టన మొనరించినచో లతాక్షేపమను దేశీపాదమునుగా గుర్తింప వలెను.

౧౪. నికుట్టకః

అగ్రేణ కుంచితస్యాంఘ్రేః అగ్రే స్థానం నికుట్టకః

కుంచిత పాదము యొక్క అగ్రభాగమున అగ్రభాగమున స్థానము కూర్చుట నికుట్టకమను దేశీపాద మగును. నికుట్టక కరణము, హస్త నికుట్టనము, ఈ నికుట్టిత దేశీపాదము అనువానిని భావ సాంకర్యము లేకుండునట్లు గ్రహించుట యుక్తము.

౧౫. సమస్ఖలితః

అగ్రతః పృష్ఠతః పాదౌ భవేతాం పార్శ్వతోఽథవా
యుగపత్స్ఖలితౌ యత్ర సా సమస్ఖలితా మతా

పాదములు రెండును అగ్రభాగమునగాని పృష్ఠభాగమునగాని పార్శ్వముగాగాని యుగపత్కాలముననె స్ఖలితములగునేని యది సమస్ఖలిత యను దేశీపాద మగును.

౧౬. ఉత్క్షేపః

ఆజానునః స్థితస్యాంఘ్రేః కుంచితస్యాపరస్య చేత్
ఉత్క్షేపః స్యాత్పురః పశ్చాద్యత్రోత్క్షేపః స ఉచ్యతే

జానుపర్యంతము ప్రసారము పొందిన పాదము కుంచిత మాకుంచితమునైన అన్యపాదము యొక్క పురోభాగమున గాని పశ్చా

ద్భాగమునగాని ఉత్క్షేపము కలదయినచో ఉత్క్షేపము అను దేశీపాద మగును. ఈ దేశీపాదపదము దేశీపాట మని దేశీపాద మని వ్యవహృతమయినది ఇట్లు దేశీపాదములు పదునారు నిరూపితము లయినవి.

ఇటుపై ఇరువదియెనిమిది పాటమణులు — పాటములు నిరూపితము లగును. పాటపదమున కనేకార్థము లున్నవి. పాట పాటమణి పదము లీగ్రంథమున దేశీపాదమను నర్థమున ప్రయుక్తము లయినవి పాద పాదమణి అనియు కొందరు వీనిని సంకేతించిరి. వాద్యవర్ణసమూహము పాటము. తదనుసారమున నిందు పాదగతి యుండుట నభ్యూహింప వచ్చును.

పాటమణయః

దేశీవృత్త పయోరాశేః ప్రేక్షకాణాం మనోహరాః
విచిత్రాః కతిచిత్పాటమణయోఽస్మాభి రద్ధృతాః
యోగికైర్నామభిస్సర్వే విజ్ఞేయాస్తే మనీషిభిః

దేశీనృత్త రీతి యనునది యొక మహాసాగరము. ఆ సాగరము నుండి ప్రేక్షకులకు మనోహరము లగు కొన్ని విచిత్రము లయిన పాటమణులను మే ముద్ధరించితిమి. సాగరము నుండి మణుల నుద్ధరింతురు. సాగరమున మణులెన్నియో గలవు. వాని నన్నిటి నుద్ధరించుట శక్యము కాదు. జలనిధి యంతరుదరముచేగ తెచ్చినను కొన్ని మణులను మాత్రమె తీసికొని రాగలరు. అట్లె దేశీనృత్తమున నెన్నియో విధానములు కలవు. వాని నన్నిటిని నిరూపించుట శక్యము కాదు. కతిపయములను మాత్రమె నిరూపింప వచ్చును ఇవి యన్నియు ప్రేక్షకమనోహరములు. విచిత్రములు. ఈ పాటముల విషయమున మణిస్వరూపము నిరూపించుట సముచితముగ నున్నది. పండితరాయ

జగన్నాథుడు రసగంగాధరమున నిట్లె చెప్పినాడు. నా నవరసగంగాధరమున నీ యర్థము విశదముగా నిరూపితమయినది.

"నిమగ్నేన క్లేశైర్మననజలధే రంతరుదరం
మయోన్నీతో లోకే లలిత రసగంగాధర మణిః"

ఇందు నిరూపితములయిన పాటమణుల నన్నిటిని మనీషులగు వారు యౌగికములగు నామముల ననుసరణమున దెలియవచ్చును. ఆయా నామపదముల వ్యుత్పత్త్యర్థములు వానిస్వరూపమును గొంతగా నిరూపింపగలవు ఇక నా పాటముల నామముల నీ విధముగ గుర్తింప వచ్చును.

ఉరుద్వితయ పార్శ్వోరు వ్యత్యాస స్వస్తికాః త్రిభిః
తల పార్శ్వ క్రమైశ్చ స్యాతూర్ధ్వైస్తాడిత మష్టధా
సమ స్వస్తిక పర్యాయ పృష్ఠ విచ్యుత పార్శ్వతః
పరం షడ్విధ ముద్వృత్తం తతః స్వస్తికవిచ్యుతం
స్యాత్తలోద్ఘట్టితం పాదతలోద్ఘట్టిత సంజ్ఞకం
కలనూపురకం చిత్రలుఠితే కుడుపాలగే
చతుష్కోణం త్రికోణాఖ్యమథ మంజీరశింజితం
కుచుంబునీ షడశ్రం చ లంఘితం ప్రతిలంఘితం
ఇత్యష్టావింశతిః ప్రోక్తాః పాటాః పాటవిచక్షణైః

పాటముల తంత్రము గుర్తించిన పాట విచక్షణులు ఇరువది యెనిమిది పాటములను పరిగణించి నిరూపించిరి. ఇందు తాడితపద మంతమున గల పాటము లెనిమిది కలవు. ఉద్వృత్తపదాంతములగు పాటములారు కలవు. ఇవికాక స్వస్తిక విచ్యుతాదులున్నవి. వాని పేరుల నీ విధముగా దెలియునది.

ఊరుద్వయ తాడితము — పార్శ్వోరు తాడితము
వ్యత్యాస తాడితము — స్వస్తిక తాడితము
వి తాడితము — తల తాడితము
పార్శ్వ తాడితము — క్రమ తాడితము
సమోద్వృత్తము — స్వస్తికోద్వృత్తము
పర్యాయోద్వృత్తము — పృష్ఠోద్వృత్తము
విచ్యుతోద్వృత్తము — పార్శ్వోద్వృత్తము
స్వస్తిక విచ్యుతము — తాలోద్ఘట్టితము
పాదతలోద్ఘట్టితము — కలనూపురము
చిత్ర పాటము — లంఘితము
కులుపము — అలగ పాటము
చతుష్కోణము — త్రికోణము
మంజీర శింజితము — కుచుంబిని.
షడశ్రిము — లంఘిత ప్రతిలంఘితము

యథాక్రమముగా వీని లక్షణ స్వరూపములు నిరూపితము లగును.

౧. ఊరుద్వయతాడితం

తలాభ్యాం తాడయేదూరూ సముత్ప్లుత్య పరస్పరం
జవేన క్రమశో యత్ర తదూరుద్వయతాడితం

ఉత్ప్లుతి నాచరించి పాదతలములచే పరస్పర మూరువులను వేగముగా తాడన మొనరించునది. ఆ పాదతలమున నీ యూరువును ఈ పాదతలమున నా యూరువును వేగముగా క్రమముగా తాడన మొనరింప వలెను. అప్పుడది యూరుద్వయ తాడితమను దేశీపాట మణి యగును. అంగులి పృష్ఠమున నుండుటయు నుత్ప్లుతి నాచ

రించుటయు క్రమముగా తలములచే తాడనమొనరించుటయు నూరు ద్వయతాడిత మని యన్యులనిరి. భావము సిందు సంగృహీతమే తలతాడనమొ కరతలతాడనమొ పాదతలతాడనమొ స్పష్టముగ మూలమున లేకున్నను ఔచిత్యానుసారమున పాద తలమొయిదుపరిగాహ్యము. ఇవి యన్నియు పాటములు పాదములయినందున పాదకర్మయే ప్రతిపాద్యము. కరతల కర్మ రూపాంతరమున నున్నది. ఊరుద్వయమునకు తాడనమున్నందున ఊరుద్వయతాడిత మయినది. ఇట్లే యౌగికార్థములను అంతట గ్రహింపవచ్చును.

౨. పార్శ్వోరుతాడితం

పాదమభ్యంతరావృత్త్యా స్వపార్శ్వగమితం తతః
తిష్ఠంతమంగులీపృష్ఠే తలేనోరు యదా పరః
తాడయేత్కథితం తజ్ఞైస్తదా పార్శ్వోరుతాడితం

అభ్యంతరావృత్తి నాచరించి స్వపార్శ్వమునకు జేర్చిన అంగులీపృష్ఠమందున్న పాదమునకు సంబంధించిన తొడను అన్యపాదము తలమున తాడనము చేయునేని నాట్యవిదులా విధానమును పార్శ్వోరుతాడితమను దేశీపాట మని యనిరి. ఒకపాద మభ్యంతరావృత్తి నొనరింపవలెను. స్వపార్శ్వము చేరవలెను. అంగులీ పృష్ఠభాగమున భూమిపై నుండవలెను. అప్పుడపరచరణ తలమున నాయూరు తాడన మొనరింపవలెను. అప్పుడు దానిని నృత్తవిశారదులు పార్శ్వోరుతాడిత మనిరి.

౩. వ్యత్యాసతాడితం

ఏకస్యాంగులిపృష్ఠేన ద్వితీయస్య తలేన చ
యత్ర పాదస్య పర్యాయాదసకృత్తాడయేన్మహీం
తిష్ఠన్వా దిక్షు గచ్ఛన్వా తత్స్యాద్వ్యత్యాసతాడితం

ఒక పాదముయొక్క అంగులి పృష్ఠభాగమున భూమి తాడన మొనర్పవలెను. అట్లే రెండవ పాదముయొక్క తలభాగమున భూమి తాడన మొనర్పవలెను. ఇట్లు పర్యాయమున నటుగానిటుగా నసకృత్తుగా భూమి తాడన మొనర్పవలెను. ఒకచో నుండిగాని దిక్కులలో గమన మొనరించుచుగాని యిట్లు పాదపర్యాయమున భూతాడన మొనర్పవలెను. అప్పుడది వ్యత్యాస తాడితమను దేశీపాటమగును.

౪. స్వస్తికతాడితం

సమస్థితస్య పాదస్య పృష్ఠే స్వస్తిక మాచరన్
ఏకాంఘ్రిరంగులీపృష్ఠైస్తిష్ఠేదన్యస్య పార్శ్వగః
తద్వత్స్వాన్యద్యత్ర పూర్వస్తు తలేనావని తాడనం
విదధీత సమాఖ్యాత మేతత్స్వస్తికతాడితం

ఒకపాదము సమస్థితపాదముయొక్క [illegible] భాగమున స్వస్తిక మాచరించుచు అంగులీ పృష్ఠములతో నుండవలెను [illegible] పాద పార్శ్వగతమై యుండవలెను. అట్లే రెండవ పాదము [illegible] నాచరింపవలెను. స్వస్తిక మాచరించిన పాదము సమస్థితముగా నుండగా రెండవపాద మీ పాదపృష్ఠమున స్వస్తిక మాచరించుటయు అంగులీ పృష్ఠమున నుండుటయు పాదపార్శ్వగతముగా నుండుటయు నభ్యాస్యము. [illegible] భూతాడన మీ పాదమున నాచరింప దగుననుట విశేషము. ఇట్లుండగా నిది స్వస్తిక తాడితమగునని నృత్త విశేషజ్ఞులు కీర్తించిరి.

౫. వితాడితం

అంగులీపృష్ఠపార్ష్ణిభ్యాం తలేనాపి మహీతలం
నిహత్య విరతే పాదే పార్శ్వమన్యో వ్రజేన్నిజం
నిఘ్నన్నుర్వీం ముహుర్యత్ర తద్వితాడిత ముచ్యతే

ముందుగా నొక పాదము అంగులీ పృష్ఠ భాగములచే పాద తలముచే మహీతలమును నిహత్య — తాపు తాచియాగా వేరొక పాదము భూమిని తాకుచు తానున్న పార్శ్వము చేరవలెను. ఇట్లు రెండు పాదములచే మఱలమఱల జేయువలెను. కాగా నిది వితాడితము అను దేశీపాట మగును.

౬. తలతాడితం

అంగులీపృష్ఠభాగేన పురః పూర్వముఖాంఘ్రిణా
స్థిత్వా పరేణ తత్పార్ష్ణిభాగే తిర్యఙ్ముఖేన చ
తాలాభ్యాం క్రమశో యత్ర సశబ్దం తాడనం భువః
పర్యాయేణ విధీయేత తదుక్తం తలతాడితం

పురోముఖముగా నున్న పాదమునకు సంబంధించిన అంగులీ పృష్ఠభాగముచే నెదుట యుండుటయు, అన్యపాదము మొదటిపాదము యొక్క పార్ష్ణిభాగమునందు తిర్యఙ్ముఖముగా నుండుటయు నావశ్యకము. అనంతరము పాదతలములచే క్రమముగా శబ్దము కలుగునట్లు భూతాడన మొనరింపవలెను. ఇట్లు పర్యాయమున నాచరింపవలసియున్నది. అప్పుడది తలతాడితమను పాటమణి యగును.

దీనినిట్లును భావింపదగును. పురోముఖ పాదమంగులి పృష్ఠముగా నుండగా నర్తకుడు తిర్యఙ్ముఖుడై ఆ పాదపార్ష్ణి బాహ్యపార్శ్వమున భూమిని స్పృశించుచుండవలెను. తదనుక్రమమున పాదతలములచే భూమిపై సశబ్దతాడన మాచరింపవలెను. ఇట్లు పాదపర్యాయమున నాచరింపదగును. అప్పుడది తలతాడితము.

౭. పార్శ్వతాడితం

ఉత్ప్లుత్య పార్శ్వయోరంఘ్ర్యోః పర్యాయేణ ద్రుతం మహీం
తాడయేత్తలపృష్ఠాభ్యాం యత్ర తత్పార్శ్వతాడితం

పార్శ్వమండల—ఉరోమండల—ఉరఃపార్శ్వార్ధమండల—ముష్టికస్వస్తిక, నలినీపద్మకోశ, అలపద్మోల్బణ, లలిత, వలిత ములు ౧౯—౨.

హస్తలక్షణము, వరదాభయహస్తములు, వక్షోలక్షణము, సమ, ఉద్వాహిత, ఆభుగ్న, నిర్భుగ్న, ప్రకంపితములు, ౧౯౬, పార్శ్వ లక్షణము, వివర్తిత, అపసృత, ప్రసారిత, సమున్నత, నతములు,౧౯౭. జఠరకర్మ, క్షామ, స్వల్ప, పూర్ణములు, కటిలక్షణము, రేచిత, కంపిత, భిన్న, నివృత్త, ఉద్వాహితములు, ఊరుకర్మలు ౨౦౧, కంపన, వలన, స్తంభ, ఉద్వర్తన, నివర్తనములు, జానుకర్మలు ౨౦౩, ఉన్నత, వివృత, నమ్రి, అర్ధకుంచిత, కుంచిత, సంహిత, సమములు, జంఘాకర్మలు ౨౦౫, పరివృత్త, నత, క్షిప్త, ఆవర్తిత, ఉద్వాహిత ములు, మతాంతరము, భ్రమిత, నిసృత, కంప, తిరశ్చీన, బహిర్గత ములు, పాదలక్షణము ౨౦౮, సమ, అగ్రతలసంచార, కుంచిత, ఉద్ఘట్టిత, అంచితములు, అన్యమతము, తాడిత, ఘట్టితోత్సేధ, సుట్టిత, మర్దిత, అగ్రగ, పార్ష్ణిగ, పార్శ్వగ, సూచీసంజ్ఞక, అంగులీపృష్ఠగ, తలాహతి, పాదాంగులీలక్షణము ౨౧౩, ఉత్క్షిప్త, కుంచిత, స్తబ్ధ, అవక్షిప్త, స్వభావజ, అనంగుష్ఠయుత, అంగుష్ఠసంయుతములు, అంగు ష్ఠముత్రివిధము, ౨౧౬.

3. తృతీయాధ్యాయము : ౨౧౯—౩౦౬ చారీస్థానకమండలలక్షణము.

చారీపదవ్యుత్పత్తి ౨౨౧, చారీలక్షణము, చారీస్వరూప వివేకము, స్వరూపభేదనామములు, భూచారులు, ఆకాశచారులు, సమపాద, స్థితావర్త, జనిత, స్యందిత, అపస్యందిత, బద్ధ, శకటాస్య, విచ్యవ, ఏలకాక్రీడిత, చాషగతి, ఉత్స్యందిత, అడ్డిత, సమోసరిత మత్తల్లి, మత్తల్లి అధ్యర్ధిక, ఊరూద్వృత్త ౨౪౦.

యుండవలెను. అన్యోన్యము అభిముఖ కలములతో నుండవలెను. మధ్యమధ్యలో భూతలమును కిలభాగములతో తాడన మొనరిం చునవిగా నుండవలెను. ముహుర్ముహుః ఉత్ప్లుతి తలసామ్ముఖ్యము ధరాపృష్ఠతాడనము కూడుకొనగా నిది సమోద్వృత్త పాదమణి యగునని నృత్తవిశారదులు నిరూపించిరి.

౧౦. స్వస్తికోద్వృత్తం

ఉత్ప్లుత్య స్వస్తికాకారౌ పరాఙ్ముఖతలే మిధః
పాదావంగులిపృష్ఠేన తిష్ఠతః పృధివీం ముహుః
తలాభ్యాం తాడయేయేతాం స్వస్తికోద్వృత్తనామని

పాదములు ఉత్ప్లుతి నాచరించి స్వస్తికాకారమున పరాఙ్ముఖ ములుగా నున్న తలభాగములు కలవై యంగులిపృష్ఠమున నుండ వలెను పిమ్మట పాదతలముచే భూమిని తాడన మొనరించుచుండ వలెను. అప్పుడది స్వస్తికోద్వృత్తమను పాదమణి యగును. స్వస్తిక తాడిత మను పాటమణి యిందే నిరూపిత మయినది. అందలి ఏక పాదరీతిని ఇందలి పాదద్వయరీతిని సావధానముగా గుర్తింప వచ్చును.

౧౧. పర్యాయోద్వృత్తం

స్థితయో రంగులీపృష్ఠే రంఘ్ర్యో రేకం పురో వ్రజేత్
అపరః పృష్ఠతశ్చైవ పర్యాయేణ ముహుః క్రియాం
ఉత్ప్లుతోత్ప్లుత్య కుర్వీత పర్యాయోద్వృత్తసంజ్ఞకం

రెండు పాదము లంగులీపృష్ఠభాగమున నుండగా వానిలో నొక పాదము పురోభాగమునకు గమింపవలెను. మరియొకటి పృష్ఠ భాగమునకు గమన మొనరింపవలెను. ఉత్ప్లుతోత్ప్లుత్య ఎగిరెగిరి పర్యాయమున నిట్లాచరించవలెను. ముహుర్ముహుః ఆచరింపవలెను.

మొదటి పాదమునకు పురోగతి, రెండవ పాదమునకు పురోగమనము కాగా, మరల రెండవపాదమునకు పురోగమనము మొదటిపాదమునకు తిరోగమనము కూర్పవలెను. ఇట్టిది పర్యాయగతిక్రియ యనుట పూర్వనిరూపితమె.

౧౨. పృష్ఠోద్వృత్తం

> కృత్వా ముహుః సమోద్వృత్తౌ తలేనాస్పృష్ట భూతలౌ
> తథా సమాశ్రితౌ పృష్ఠ పార్శ్వాభిముఖ పార్శ్వకౌ
> తిష్ఠతో యత్ర చరణౌ పృష్ఠోద్వృత్తం తదిష్యతే

సమోద్వృత్తమను పాటము తొమ్మిదవదిగా నిరూపితమయినది. తలతాడనము లేకుండునట్లుగా సమోద్వృత్తమును మరలమరల నాచరించి పాదములను పృష్ఠోన్ముఖతలములగునట్లు పార్శ్వాభిముఖ పార్ష్ణిభాగములుగా నుండునట్లు కూర్చినచో పృష్ఠోద్వృత్త పాటమగును.

౧౩. విచ్యుతోద్వృత్తం

> పృష్ఠస్వస్తిక విశ్లేషాదేతదేవ కృతం యది
> దేశీనృత్తరహస్యజ్ఞైః వితృుతోత్వృత్త మిష్యతే

ఇప్పుడే నిరూపించిన పృష్ఠోద్వృత్త పాటమును పృష్ఠమునందలి స్వస్తికము యొక్క విశ్లేషమున నాచరించినచో మువాలుర్మువాలు ఆచరించినచో విత్యుతోద్వృత్త పాట మగునని దేశీనృత్తరహస్యజ్ఞులు భావించి నిరూపించిరి.

౧౪. పార్శ్వోద్వృత్తం

> సమా వుత్ప్లుత్య చరణౌ ఏకపార్శ్వతలౌ ముహుః
> తిష్ఠతోంగులిపృష్ఠేన పర్యాయాత్పార్శ్వయో ర్ద్వయోః

మధ్యే మధ్యే మహీపృష్ఠం తాడయంతౌ తలేన యత్
పార్శ్వోద్వృత్తం తదా ప్రాహుః పదపాట విచక్షణాః

పదపాట విచక్షణులు పార్శ్వోద్వృత్త పాటలక్షణమును ఈ విధముగా నిశ్చయించిరి. మొదట చరణములు రెండును సమముగా ఉత్ప్లుతి నాచరింపవలెను. ఏకపార్శ్వోత్థలములై యుండవలెను. మఱల మఱల నట్లె యుండుట యుక్తము. అట్లున్నవై రెండుపార్శ్వము లందును అంగులిపృష్ఠమున ప్రసరింపవలెను. మధ్యమధ్యలో పాద తలమున మహీపృష్ఠతాడనము చేయునవిగా నుండదగును. అప్పుడు పార్శ్వోద్వృత్త మగును పార్శ్వతాడిత మేడవది యిందు గుర్తు రావచ్చును. దానిలో పాదతలమున భూతాడనము ముఖ్యము. దీనిలోనది మధ్యేమధ్యేయనుటచే గౌణము. ఇట్లే యితరములందును కొన్ని విశేషములు కలవు

౧౫. స్వస్తికవిచ్యుతం

తిష్ఠంతా వంగులీపృష్ఠే స్తథైవ రచితోత్ప్లుతీ
స్వస్తికేన చ్యుతిం పాదౌ యుగపత్కురుతో ముహుః
యత్ర తద్జ్ఞైస్తదాఖ్యాతం నామ్నా స్వస్తికవిచ్యుతం

రెండు పాదములు అంగులీ పృష్ఠములతో నున్నవై యట్లె యుత్ప్లుతి నాచరించినవై సమసమయమునను స్వస్తికమునకు ముహుః విచ్యుతిని సంపాదించునవి యగునేని నృత్తతత్త్వజ్ఞులు స్వస్తిక విచ్యుతమగునని యనిరి. ఉత్ప్లుతితో స్వస్తిక రచనము పతనములో విశ్లేషము కూడుకొనును. స్వస్తికము విచ్యుత మగుట యుండును గావున స్వస్తిక విచ్యుత మనుట యుక్తము.

౧౬. తాలోద్ఘటితం

యత్ర పాదౌ తలాగ్రాభ్యాం తిష్ఠంతౌ క్రమశో ముహుః
పార్ష్ణిభ్యాం మేదినీపృష్ఠే తాలపాతానుసారతః

తాడయంతే చతుర్దిక్కం కురుతశ్చే ద్గతాగతం
తత్తాలోద్ఘట్టితం ప్రోక్తం దేశీనృత్త విశారదైః

తలోద్ఘట్టితమనియు నీ తాలోద్ఘట్టితమునను వ్యవహారము కలదు. పాదములు రెండును తలాగ్రభాగమున నున్నవై క్రమముగా తాలపాతానుసారముగా భూతలమునందు పార్ష్ణి భాగములచే ముహుః తాడనము చేయునవి యగునేని చతుర్దిక్కముగా గతాగతముల నొనరించునవి యగునేని యది తలోద్ఘటిత మను పాటమణి యగునని దేశీవృత్త విశారదులు నిరూపించిరి. సంగ్రామధనంజయు డీ విధముగ లక్షణము నిరూపించెనని వేమభూపాలుడు స్మరించెను.

౧౭. పాదతలోద్ఘట్టితం

ఏకః స్థానానుయాయీ స్యా త్పాటా నుత్పాదయే త్పరః
చారీర్వా చరణః పాదతలోద్ఘట్టిత నామని

అంగులీనిష్ఠములుగా నున్న రెండుపాదములలో నొకటి యథోచితముగా తాలపాతము ననుసరించుచుండి నడవలెను. స్థానానుయాయిగా నుండవలెననుటలో నిదియె భావము. అపర చరణము పాటములనుగాని చారులనుగాని యుత్పాదింప వలెను. ఇట్లున్న నిది పాదతలోద్ఘటిత పాటమణి యగును

౧౮. కలనూపురం

తిష్ఠన్నంగులిపృష్ఠేన స్వవ్యాపారం సమాచరేత్
యత్ర తన్నృత్తతత్త్వజ్ఞైః కథితం కలనూపురం
అన్యత్రాపి భవే దేత దౌచిత్యా త్తాలవాద్యయోః

పాదము అంగులి పృష్ఠమున నుండి స్వవ్యాపార మాచరించు చున్నచో కలనూపుర మగునని నృత్తతత్త్వజ్ఞులు నిరూపించిరి.

తాలవాద్యముల యౌచిత్యానుసారమున నీ కలనూపుర మన్యపాట ములందు నుండును. అంగుళీపృష్ఠమున నున్న పాదము స్వవ్యాపార మాచరించుటను ఈ విధముగా గుర్తింపవలెను. ఇందే మంజీర శింజిత మను ఇరువదియయిదవ పాటమణి యున్నది. మంజీరశింజిత ముతో నీ కలనూపురమునకు సంబంధము కలదు. మంజీరశింజిత ములో రెండు రెండు ఘాతముల యంతరాలమున పాదతలముచే భూతలమునకు ఆహతి సంపాదించుట కలదు. రెండవపాదము త్రిః త్రిః తాడిత ద్వితీయాంఘ్రిగా నుండుటయు నీ మంజీరశింజితమున నున్నది. అట్టి మంజీరశింజితమునందువలె అనగా త్రిస్త్రిస్తాడిత మంజీరశింజిత మునందు వలె పరచరణము స్వవ్యాపారము కలదగుట కలనూపు రము నందలి స్వవ్యాపార మగును. గ్రంథాంతర పాఠాంతరమున నిచట మంజీరశింజిత ప్రసక్తి యున్నదని పరిష్కర్త సూచనము వేమభూపాలుని కలనూపురములో మంజీరశింజిత ప్రసంగమున్నది.

౧౫. చిత్రపాటః

చిత్రపాటలక్షణము రత్నావలిలో త్రుటితమయినది. స్పష్టార్థ మీాయని "పాదశ్చే చ్చిత్రపాటోఽలగే భవేత్" అనునదియే యున్నది. కాల లక్షణార్థమునకై వేమభూపాలుని లక్షణ మిచట భావనీయము.

> "పాదం కుంచితముద్యమ్య స్వస్తికాకారతో భువి
> విన్యస్య చాంగుళీపృష్ఠే స్తేనాంతర్భ్రమరీమపి
> కృత్వా చేదలగం కుర్యాత్ త చ్చిత్ర మితి కథ్యతే"

కుంచితమగు పాదమును పైకెత్తి భూమిపై స్వస్తికాకార ముగా నుంచి అంగుళీపృష్ఠమున పాదమున అంతర్భ్రమరిని కూర్చ

వలెను అలగమును గూడ కూర్పవలెను. అప్పుడది చిత్రపాట మను దేశీపాటమణి ఈ చిత్రిపాట లక్షణ కథన సమయమునసనె విచిత్ర లక్షణమును కల్పించుచున్నది. అది యిచట మొదటి పరిగణనమున లేదు.

"పాదస్యోదంచనా దూర్ధ్వం కృత్వాంతర్భ్రమరీమపి
అలగం క్రియతే యత్ర తద్విచిత్రం ప్రకీర్తితం"

పాదమున నూర్ధ్వముగా నుదంచనము సంపాదించుట అంత ర్భ్రమరి నాచరించుట అలగమాచరించుట అను మూడు క్రియ లున్నచో నది విచిత్రమగును అని దీని భావము.

౨౦. లుఠితం

తిష్ఠతో గచ్ఛతో వాంఘ్రేః పార్శ్వమన్యః స్వపార్శ్వగః
సశబ్ద మంగులీపృష్ఠతలాభ్యాం లుఠనం ద్రుతం
యత్ర కుర్వీత తత్రోక్తం బుధైర్లుఠితసంజ్ఞయా

నిలబడి యున్నప్పుడు గాని గమనమొనరించు నపుడుగాని ఒకపాదమునకు సంబంధించిన పార్శ్వమును వేరొక పాద మనుసరించి అంగులీ పృష్ఠతలములతో సశబ్దముగా వేగముగాలుఠనము పొర్లుట దొర్లుట కలదయినచో నది లుఠితమను పేరు గల పాదమణి యగు ననిరి. "తదాలుఠితమాచష్ట రూప నారాయణో నృపః" అని వేము భూపాలుడు రూపనారాయణుడు సాదరాభిమానములతో దీని నుట్టంకించెను

౨౧. కులుపం

పార్శ్వయోరున్ముఖం పార్ష్ణిం నామదక్షిణయోర్దధత్
చరణాంగులిపృష్ఠేన హన్యాద్భూమిం క్రమాత్పునః
అన్యః సమస్థితో యత్ర కులుపం తదుదీరితం

కులుపమె కుడుపము. లడ్డలకు భేద మేమి ? దీని లక్షణ మిట్లూ భావనీయము. ఒకపాదము సమస్థితమై యుండుట యావశ్యకము. రెండవ పాదము క్రమముగా వామదక్షిణ పార్శ్వములందు పార్శ్వో న్ముఖముగా పార్ష్ణి భాగమును ధరింప వలెను. చరణాంగులి పృష్ఠమున భూతల తాడన మొనరింపవలెను. ఇట్టి దీనిని దేశీనృత్త విశారదులు కుడుప మని కులుప మని వ్యపదేశించిం.

౨౨. అలగపాటః

జానుక్షేత్రే స్థితస్యాంఘ్రేః చతుష్కోణం యదాచరేత్
అన్యః ఖే కుంచితోత్క్షిప్తః స్వజానువలనాద్యదా
బుద్ధై రలగ మిత్యేష తదా పాటః ప్రకీర్తితః

దీనిలో నొక పాదము జానుభాగము నందుండగా చతుష్కోణ మాచరింప వలెను. వేరొక పాదమాకాశమున జానువలనము వలన కుంచితము ఉత్క్షిప్తమై యుండవలెను. అప్పుడది అలగపాటము కాగలదు. ఇందు మొదట చతుష్కోణమాచరించుట నిట్లు గుర్తింప వలెను. దీని యనంతరమె చతుష్కోణపాటము నిరూపితము కానున్నది. ఆ చతుష్కోణ స్వరూప మిందు సంగతము కావలెను. సమస్థితిలో నున్న పాదమునకు పురోభాగమునను పృష్ఠభాగమునను క్రమముగా స్వస్తికమును విచ్యుతి నాచరించుచు విదిక్కులందును భూమి తాడన మొనరించుట చతుష్కోణ రీతి. అట్లే యిచట జాను పర్యంత మెత్తిన పాదమున చెప్పిన విధమున చతుష్కోణ మాచ రింపదగును.

౨౩. చతుష్కోణం

సమస్థితస్య పాదస్య పృష్ఠతః పురతః క్రమాత్
స్వస్తికం తచ్చ్యుతిం కుర్వన్నుర్వీం హన్యాద్విదిక్షు చేత్
అన్యోంఘ్రిరంగులీపృష్ఠైః చతుష్కోణం మతం తదా

పాదము సముస్థితమై యుండగా పృష్ఠతః పురతః క్రమముగా స్వస్తికమును స్వస్తికచ్యుతిని ఆచరించుచు విదిక్కులలో భూమిని తాడనము చేయునది. రెండవపాదము విదిక్కులందు అంగుళీ పృష్ఠములతో నుండి సంచరించునది. అప్పుడది చతుష్కోణ మను పాటమగును.

౨౪. త్రికోణం

ఏతదేవ త్రికోణం స్యా దగ్రే చేత్సకృదాహతిః

ఈ త్రికోణపాటము నందా చతుష్కోణపాట సంబంధము సంగత మగును. చతుష్కోణ పాటమున నన్ని దంతయు నుండగా అగ్రభాగమున సకృదాహతియె యుండునేని త్రికోణ పాటమని యగును.

౨౫. మంజీరశింజితం

ఘాతా యత్రాంగులీపృష్ఠే స్తాలపాత పురస్సరం
పార్ష్ణినాపి తథా కుర్యా దేకాంఘ్రిరపరః పునః
ద్వి ద్వి ఘాతాంతరాలే చే త్తలేనాహతి మాచరన్
నిజపార్శ్వం వ్రజేన్మంజు తదా మంజీరశింజితం
త్రి తాడిత ద్వితీయాంఘ్రి ర్యద్వా మంజీరశింజితే

తాలపాతపురస్సరముగా అంగులీపృష్ఠములచేనయిన ఘాతము లందుండును. అట్లే పార్ష్ణిఘాతములు నుండును. ఒక పాదమున నొనరింపదగిన క్రియ లిట్లుండగా అన్యాంఘ్రి క్రియావిశేషము లిట్లుండును. రెండవపాదము రెండు రెండు ఘాతముల యంతరాలమున పాదతలమున భూతలమునందాహతి నాచరించుచు మంజుగమనమున నిజపార్శ్వము చేరునది కావలెను. అప్పుడది మంజీర శింజితమను

పాటమణియగును. కలనూపురపాటములో దీని సంబంధముండుట అచట నిరూపిత మయినది ఈ లక్షణము నందలి చివరి పాదము కొన్ని పాఠములందు కలనూపుర సన్నిధిలో నున్నదని సూచిత మయినది. ఇందలి ద్వితీయాంఘ్రి తాలకిర్యానుసారమున త్రితాడన ముతో నుండుటయు మంజీర శింజితమున నున్నదని తద్భావము స్వీకార్యము.

౨౬. కుచుంబినీ

తలాభ్యామస్పృశన్భూమిం పార్శ్వోద్వృత్తం ద్రుతం యదా
విధీయేత తదా తద్జ్ఞైస్సమాఖ్యాతా కుచుంబినీ

పాదతలముచే భూమిని స్పృశింపకుండగనే వేగముగా పార్శ్వోద్వృత్తము నాచరించినచో నది కుచుంబిని యను పాటమణి యగునని నృత్తవిదులనిరి. తాలగతి వర్తిక్రియలో నిది కుకారప్రచు రముగా నుండునని కుచుంబినియని యనిరని కొందరనిరి.

౨౭. షడశ్రం

సమోద్వృత్తం విధాయాఽఘ్రిం పురతస్థితః సమా
అంగులీపృష్ఠభాగేన పృష్ఠోన్ముఖతలౌ పునః
మధ్యే కృత్వా సమోద్వృత్తం పృష్ఠేపి పురతో యదా
ముహురేవం క్రియా యత్ర షడశ్రం త దుదాహృతం

షడశ్రమునకే షట్కోణమని పేరు. వేమభూపాలుడు షట్కోణమనియె యనెను. మొదటగా పాదమును సమోద్వృత్త ముగా నిర్మించి కూర్చవలెను. అనంతరము పురోభాగమున పాదము లను సమముగా నుంచవలెను పిమ్మట అంగులీపృష్ఠభాగమున పాద ములను పృష్ఠోన్ముఖతలములుగా నుండునట్లు సంధానింప వలెను మధ్యలోకూడ సమోద్వృత్తము కూర్చవలెను. పృష్ఠమునందును

పురోభాగమునందును మఱలమఱల నిట్లే యాచరింపవలెను. అప్పుడది షడ్రశమగును ఇట్లుండుదానినే నృత్తవిద్యా విశారదులు షట్కోణమనియు వ్యవహరించిరి.

౨౮. లంఘిత ప్రతిలంఘితం

అగ్రితోంగులి పృష్ఠేన త్ర్యశ్రీభూయ భువి స్థితం
చరణం చరణోఽన్యశ్చే ల్లంఘయే త్ప్రతిలంఘయేత్
పర్యాయేణ తదామ్నాతం లంఘితప్రతిలంఘితం

మొదలుగా చరణమును అగ్రభాగమున భూమియందు అంగులి పృష్ఠముచే త్ర్యశ్రముగా చేయవలయును ఆచరణమును అన్యచరణము లంఘింపవలెను. ప్రతిలంఘింపవలెను. ఇట్లు పర్యాయక్రమమున ఆ పాదముతో నీ పాదమునకు, ఈ పాదముతో నా పాదమునకు లంఘన ప్రతిలంఘనము లాచరింపవలెను అప్పుడది లంఘిత ప్రతిలంఘిత మను పాటమణి యగును.

ఇప్పటి కిట్లు అష్టావింశతి పాటములు నిరూపితము లయినవి. వీని సాంకర్యమున నింక నెన్నియేని పాటములు కల్పితములు కావచ్చును. వానిని నృత్తవిశారదు లభ్యూహింప వచ్చును.

అన్యే చ సంకరాచ్చైవం మిథస్సౌందర్య కారిణః
పాటాః కల్ప్య విచిత్రా స్యుః న ఛేకైః ప్రౌఢబుద్ధిత

ఈ నిరూపితము లయిన అష్టావింశతి పాటముల పరస్పర సంబంధమున సాంకర్యమున నితరములగు పాటములును విచిత్రములై పరస్పరము సౌందర్యహేతువులై ఎన్నిగచేసి కల్పింపదగినవై యున్నవి. వానిని నృత్తచతురమతు లభ్యూహింప వచ్చును. కాని ప్రౌఢ బుద్ధికృతముగా అన్యోన్యమును కల్పింపరాదు. సంకీర్ణభేదముల సంభావించుట చాలును.

పాటసంకేత వికులు పాటమణి సమారంభమున నిట్లు సూచించిరి.

"విచిత్రాః పాటమణయో లక్ష్యే కైశ్చిత్ప్రదర్శితాః
'స్వబుద్ధ్యాకల్పయంశ్చైవ మన్యానప్యాచరే' దితి
వదతా మునినా తేన మతంగేనాపి సూచితాః"

ఇది రూపనారాయణ వేమభూపాల వచనము విచిత్రము లగు పాటమణులను కొందరు లక్ష్యమున ప్రదర్శించిరి. ఇట్టి ప్రదర్శనము బృహద్దేశి రచించిన మతంగముని సూచనముననె యున్నది. మతంగముని "స్వబుద్ధ్యా కల్పయం శ్చైవ మన్యానప్యాచరేత్" అని యనెను స్వబుద్ధిచే కల్పనమొనరించి యన్యముల నాచరింప దగును అని మునిభావము. జ్యాయనభావము నిట్లే భావించుట యుక్తము.

## దేశీచార్యః

భరతానుసారముగా భూచారీ విశేషములు ఆకాశచారీ విశేషము లిదివరలో నిరూపితము లయినవి. దేశీరీత్యనుసారముగా భూచారులను ఆకాశచారులను నిరూపింప వలసి యున్నది. వాని నిరూపణము ప్రస్తుత మావశ్యకము. ఇంకను ప్రసంగానుసారమున నీ యధ్యాయమున మరికొన్ని విశేషములు నిరూపితము లగును.

౧ భౌమదేశీచారులు ౨౬
౨ ఆకాశదేశీచారులు ౧౬
3 దేశీలాస్యాంగములు ౪౬
౪ సంకీర్ణగతులు ౨౧

ఇట్టివిధముగా నిరూప్యమాణములగు వీ కి తగిన సాంగత్య మున్నది. సర్వసంభావనను న జ్యాయనుడు దేశీచారీ ప్రక్రమము నిట్లుపక్రమించు చున్నాడు.

దేశీవృత్తస్య సంక్షేపం బృహద్దేశ్యాం నిరూపయన్
మతంగోఽకధయత్పాటలక్షణావసితౌ యదా
స్వబుద్ధ్యా కల్పయిత్వైవ మన్యా నపి సమాచరేత్
తతశ్చిరంతనాచార్యాః పాదానుత్పాద్య తాన్పునః
దేశీచార్య ఇతి ప్రాహుః తేషాం చరణధర్మతః
భౌమ్యో నాభస్య ఇత్యేతాః కధ్యంతే ద్వివిధాః పునః

బృహద్దేశీగ్రంథము నందు మతంగముని దేశీవృత్తమునకు సంబంధించిన సంగ్రహమును నిరూపించెను. అందు పాటలక్షణము లను జెప్పి వాని యవసానమున నిట్లు చెప్పెను. "వృత్తవిశారదులగు వారు తమ బుద్ధివిభవమున నిట్లితరములను గూడ కల్పించి ప్రయో గింపవలయును" అని. కావున చిరంతనాచార్యులు కొందరు స్వబుద్ధి విభవమున నింకను కొన్ని పాదములను కల్పించిరి. అట్లు కల్పించిరి కాని వానిని వేరుగా పాదములని యనలేదు. వానిని "దేశీచారులు" అని సంకేతించిరి. చారులలో చరణధర్మమున్నది. ఈ కల్పిత పాదము లందును చరణ ధర్మమున్నది. చరణధర్మముండుటచే వీనిని చారులనుట యుక్తముగ నున్నది. కావున నీ చారులు భౌమచారులని, ఆకాశచారు లని రెండువిధములుగా విభాగించి నిరూపింతుము. పాటమణుల పరస్పర సాంకర్యము వలన గలుగు విచిత్ర పాటమణులు ఈ చారుల కన్న భిన్నములు. ప్రౌఢబుద్ధులు సాంకర్య సిద్ధ పాటము లను అభ్యూహించి కల్పించు కొనవచ్చును. కాని ప్రత్యేక రూప మున పాటమణుల కల్పింప నక్కరలేదు. అట్లు కల్పితము లగు

పాటమను లుండవచ్చును. అట్టివి చరణధర్మసామ్యమువ చారులని యంగీకరించి భావించుట యుక్తము.

ఆదౌ సమనఖా పార్ష్ణిరేచితా తలదర్శినీ
అర్ధమండలికా తిర్యక్కుంచితాఖ్యాపకుంచితాః
కాతరోత్కుంచితా తిర్యఙ్ముఖా నూపురవిద్ధికా
మదాలసా వరావృత్తా తథా లంఘితజంఘికా
మరాలా స్ఫురికా చోరువేణీ సంఘట్టితాభిధా
హరిణత్రాసితాభిఖ్యా కరిహస్తా కులీరికా
స్తంభక్రీడనికా నామ్నా రథచక్రోరుతాడితాః
సంచారితాథ విశ్లిష్టా తలోద్వృత్తాభిధేత్యమూః
భూచార్యోపి నిరూప్యంతే వింశతిః షడ్భిరుత్తరాః

ఇరువదియారు భూచారీవిశేషములు కలవు. వానినామము లీ విధమున నున్నవి.

సమనఖ — పార్ష్ణిరేచిత — తలదర్శిని
అర్ధమండలిక — తిర్యక్కుంచిత — అపకుంచిత
కాతర (పకటి) — ఉత్కుంచిత — తిర్యఙ్ముఖ
నూపురవిద్ధిక — మదాలస — వరావృత్త
లంఘితజంఘిక — మరాలిక — స్ఫురిత
ఊరువేణి — సంఘట్టిత — హరిణత్రాసిత
కరిహస్త — కులీరిక — స్తంభక్రీడనిక
రథచక్ర — ఊరుతాడిత — సంచారిత
విశ్లిష్ట — తలోద్వృత్త

విద్యుద్భ్రాంతా పురః క్షేపే అవక్షేపాంఘ్రితాడితే
డమరీ భ్రమరీ దండపాదా బద్ధోర్ధ్వజానుకా

అలాతాందోలితా సూచీ విక్షేపా హరిణప్లుతా
జంఘాలంఘనికా జంఘావర్తా చేతి ప్రచక్ష్మహే
ఏతా షోడశ సంఖ్యాతాశ్చారీ రాకాశికాః క్రమాత్

ఆకాశచారులు పదారు కలవు. వాని నామము లీ విధముగ నున్నవి.

విద్యుద్భ్రాంత — పురఃక్షేప — అవక్షేప
అంఘ్రితాడిత — డమరి — భ్రమరి
దండపాద — బద్ధ — ఊర్ధ్వజాను
అలాత _ ఆందోలిత — సూచి
విక్షేప — హరిణప్లుత — జంగాలంఘనిక
జంఘావర్త.
యథాక్రమముగా వీని లక్షణముల నిరూపింతుము.

భూచార్యః

౧. సమనఖా

సమపాదే స్థితౌ స్థానే తిరశ్చీనౌ ప్రసర్పతః
యదా పాదౌ సమాఖ్యాతా తదా సమనఖాభిధా

ఈ సమనఖాదు లన్నియు దేశీచారులు. వీని పేర్లు సాధారణముగా పూర్వచారీ నామములతో కరణనామములతో సమముగా నుండవచ్చును. లక్షణము మాత్రము వేరు.

పాదము సమపాదమున నుండి తిర్యక్ప్రసారిత మగుట పాదములు రెండును సమపాదస్థానమున నుండి తిరశ్చీనములై ప్రసరించుట యున్నచో సమనఖమను పేరుగల దేశీచారి యగును. దేశీవిదుల కిది సమ్మతము.

౨. పార్ష్ణిరేచితా

స్థానకే యత్ర పార్ష్ణీ స్తః పార్ష్ణిపార్శ్వగతాభిధే
రేచితౌ సా పరిజ్ఞేయా నర్తకైః పార్ష్ణిరేచితా

పార్ష్ణి పార్శ్వగతముగా నున్న స్థానమున రెండు పాదము లుండగా పార్ష్ణి భాగములు రేచితము లగునేని యది పార్ష్ణిరేచిత యను దేశీచారి యని నర్తకు లాదరించిరి. పార్ష్ణి భాగములకు రేచిత ముండుటచే నిది పార్ష్ణిరేచిత మయినదనుట యౌగికార్థసంగతి స్పష్టము. ఇక్లై యథా సంభవముగ నామసార్థక్యము భావించునది.

౩. తలదర్శినీ

సంహతాస్థానమాస్థాయ తిర్యంచే పృథగాయతౌ
చతురశ్రౌ బాహ్యపార్శ్వాభ్యాం స్వపాదే తిష్ఠతో యది
యదా తదా సమాఖ్యాతా నర్తకైస్తలదర్శినీ

పాదములు రెండును సంహతస్థానము. పాదములు కలిసి యుండు స్థానము పొందినవై తిర్యగ్గతములై పృథగ్గతములై వేరు వేరుగా నాయతములై చతురశ్రములై స్వబాహ్య పార్శ్వములతో నుండునేని తలదర్శిని దేశిచారి యగునని నర్తకులు తలచిరి. ఇందలి చతురశ్రత్వమును వేమభూపాలుడు నిరూపింప లేదు.

౪. అర్ధమండలికా

భూమిఘృష్టతలౌ మందం బాహ్యతో భ్రామ్యతః క్రమాత్
యత్రాంఘ్రీ గచ్ఛతః పశ్చాత్సార్ధమండలికా తథా

ఎందు పాదములు తలభాగములచే భూమి ఘర్షణ మొనరించినవై నెమ్మదిగా బాహ్యభాగము నుండి క్రమముగా భ్రమణము

పొందునవి యగునో, పశ్చాద్భాగమునకు గమనము పొందునవియు నగునో అచట అర్ధమండలిక అను దేశీచారి యగునని యనిరి. పాదతలములచే భూతల ఘర్షణము భ్రమణము పశ్చాద్గమనమను మూడు విధానములు అర్ధమండలికాచారీ రూప సంపాదకములు.

౫. తిర్యక్కుంచితా

కుంచితం చరణం యస్యాం తిరశ్చైతన్మహుః క్రమాత్
స్వపార్శ్వే నిక్షిపేత్తిర్యక్కుంచితా సా విధీయతే

ఎందుచరణము కుంచితమై తిర్యగ్భాగముగా ముహుఃక్రమమున తనపార్శ్వమున నడ్డముగా నిక్షిప్తమగునో అచట కుంచితయను దేశీచారి యుండునని నృత్తవిదుల వ్యవహారము. తిర్యక్ కుంచితమగు రూపమున్నందున నిది తిర్యక్కుంచితా దేశీచారి యందురు.

౬. అపకుంచితా

చరణౌ కుంచితౌ కించిత్పృష్ఠతో గచ్ఛతః క్రమాత్
యస్యామేషా సమాఖ్యాతా నృత్తజ్ఞైరపకుంచితా

రెండు చరణములు కుంచితములై క్రమముగా పృష్ఠగమన మొనరించునవి యగునేని అపకుంచితయను దేశీచారి యగును. ఆకుంచిత పాదములకు క్రమశః పశ్చాద్గతి యా భావము.

౭. కాతరా సకటీ

సంధ్యావర్తస్థితౌ యస్యాం చరణా వపసర్పతః
పశ్చాద్దేశే సమాఖ్యాతా నర్తకైః స్సకటీతి సా

ఇచట లక్షణ వాక్యములో దేశీనామము సకటి యని యున్నది. మొదట పరిగణనములో కాతరా నామమె యున్నది.

ఇతరులు కాతరా పదమునకు పర్యాయ పదమును చెప్ప లేదు. ఇందు మాత్రమె సకటి యున్నది. కాతరా పదము వ్రాతలో సకటిగా మారి యుండునా లక్ష్యనామానుసారమున నిది కాతర వేమాదులు నిది కాతరాలక్షణ మనిరి.

పంచమాధ్యాయమున దేశీస్థానకములలో నంద్యావర్తము ౧౮ అనునది కలదు. అట్టి నంద్యావర్తస్థితిలో వెనుక భాగమునకు పాదములు అపసర్పణము పొందునవి యగునేని దేశీవృత్తవిచక్షణులు కాతర సకుటి యను దేశీచారియగు ననిరి.

౮. ఉత్కుంచితా

ఉత్క్షిప్య కుంచితే యత్ర చరణౌ పురతః క్రమాత్
విక్షిప్యేతే పురః ప్రోక్తా సేయముత్కుంచితాభిధా

పాదము లుత్క్షిప్తములై కుంచితములై పురోభాగమున క్రమముగా నిక్షిప్తములగునేని యది ఉత్కుంచిత మను పేరుగల దేశీచారి యగును.

౯. తిర్యఙ్ముఖా

స్థానకే వర్ధమానే తు పాదౌ సవ్యాపసవ్యతః
సరత స్త్వరితే యత్ర సేయం తిర్యఙ్ముఖా స్మృతా

వర్ధమాన మనునది గీతము కలదు. వర్ధమానము సంయుత హస్తము కలదు. వర్ధమానము దేశీస్థానము కలదు. ఇచట వర్ధమాన దేశీస్థానకమె వివక్షితము. పంచమాధ్యాయములో వర్ధమాన స్థానము ౧౨ నిరూపిత మయినది. అట్టి వర్ధమానస్థానకమున పాదములు సవ్యాపసవ్యముగా నుండి త్వరితముగా జరుగుట పొందునవి యగునేని యది తిర్యఙ్ముఖ యను దేశీచారి యగునని యనిరి.

సవ్యాపసవ్య భాగములకు వేగముగా ప్రసరణము పొందునవి యగుట యని భావము స్పష్టము.

౧౦. నూపురవిద్ధికా

స్వస్తికే స్థానకే పాదౌ పార్ష్ణినాగ్రతలేన చ
రేచితౌ భవతో యత్ర సా స్యాన్నూపురవిద్ధికా

స్వస్తికమను దేశీస్థానకము. దేశీస్థానకము పంచమాధ్యాయమున మూడవదిగా నిరూపితమయినది. ఇట్టి స్వస్తిక దేశీస్థానమునందున్న పాదములు పార్ష్ణి భాగమున పాదాగ్రతలభాగమున రేచితము లయినచో నూపురవిద్ధిక యను దేశీచారి యగును. నూపురమనునది నారీమణుల పాదాభరణము. అది గుల్ఫపరిభూషణము. ఇందలి పాద రేచితమందు నూపుర శింజానములుండుట భావనీయము.

౧౧. మదాలసా

మద్యమత్తాలసస్యేవ గతిః స్యాదవ్యవస్థితా
యస్యాం చరణయోస్సేయం యథార్థాఖ్యా మదాలసా

మద్యముచే మత్తుడలసుడయిన వాని గమనమువలె పాద గమన మవ్యవస్థితముగా నుండునేని యది మదాలస మను దేశీచారి యగును మదిరాపానమత్తునివలె చరణములు విసంష్ఠులములుగా విన్యస్తము లగునేని హస్తములును లోలితములుగా నుండునేని మదాలస దేశీచారి యనుట సార్థక నామము.

౧౨. పరావృత్తతలా

పృష్ఠోత్తానతలం పాదో బాహ్యతశ్చేత్ప్రసారితః
తదా దేశీరహస్యజ్ఞైః పరావృత్తతలా స్మృతా

పరావృత్తతల మను నిచట పేరుగల దేశీచారి మొదట పరావృత్త మనియె యున్నది. పాదము పృష్ఠమున ఉత్తానతలముగా

నుండి బాహ్యముగా ప్రసారితమగునేని దేశీరహస్యజ్ఞులు దీనిని పరావృత్తతల మను దేశీచారి యగునని పరిగణించిరి పశ్చాద్భాగ మున నుత్తానితతలమై భూతలమును స్పృశించుచు పాదము బహిః ప్రసృత మగుట పరావృత్త తల మగును. మొదట ఛందోనుకూల ముగా పరావృత్త పదముననె యిది వ్యవహృతమయిన సిది పరా వృత్తతలమె. ఇట్టే వేమాదులు నిరూపించిరి. నాట్యభాషలో పరా వృత్త పదమున శిరము, బాహువు, దేశీస్థానము, జంఘ, అంగ హారము అనునవి పరావృత్త పదవాచ్యములు. పరావృత్తతల మనునది దేశీచారి. అందువనె దేశీరహస్యజ్ఞులు పరావృత్త తల మనిరని జ్యాయను డనెను.

౧౩. లంఘిత జంఘికా

ఖండసూచినిచేత్పాదంతతమాకృష్యవేగతః

తజ్జంఘాలంఘ్యతేఽన్యేన తదాలంఘితజంఘికా

పంచమాధ్యాయములో ఖండసూచి యను దేశీస్థానకము నిరూపిత మయినది. ఖండసూచకము జంఘాకర్మ కలదు. ఖండసూచి యను దేశీస్థానకమున ప్రసృత మయిన పాదమును వేగముగా నాకర్షించి దాని జంఘాభాగమును అన్యపాదమున లంఘించుట యున్నచో నది లంఘిత జంఘిక యను దేశీచారి యగును. జాను సమీపమున జంఘ కుంచితమై ప్రసారితమై లంఘన మొనరించుట యిందు భావనీయము. వేగాకర్షణము లంఘనమిం దావశ్యకము.

౧౪. మరాలికా

నంద్యావర్తే స్థితౌ యుగ్మపార్శ్వ పాదాగ్రయోదపి

రేచితే చరణే యత్ర సర్వతస్సా మరాలికా

నంద్యావర్త మను దేశీస్థానకము పంచమాధ్యాయమున గరవదిగా నిరూపిత మయినది. నంద్యావర్తస్థానకము నందున్న చరణములు పాదాగ్రము లందును యుగ్మపార్శ్వములుగా నండి సర్వతః అంతట రేచితము లయినచో నది మరాలిక యను దేశీచారి యగును. ఈ మరాలికయె మరాలపద వ్యవహారమున నున్నది. నంద్యావర్తస్థితి పార్ష్ణిప్రపద రేచనము పురతః ప్రసరణము మరాలా దేశీ చారి.

౧౫. స్ఫురితా

భూపృష్ఠ బాహ్యపార్శ్వాభ్యాం పార్శ్వయోస్సరణం ద్రుతం
పురతో యత్స్వసౌ తజ్జ్ఞైః స్ఫురితా పరికీర్తితా

భూపృష్ఠము నందున్న పాదముల బాహ్యపార్శ్వములచే పార్శ్వభాగములకు సరణముండుట, సత్వరముగా పురతః సరణ ముండుట స్ఫురిత మను దేశీచారి యగును అని తద్విదు లనిరి.

౧౬. ఊరువేణీ

కృత్వోచ్చైః స్వస్తికం పాదం పార్శ్వాభ్యాం పురతో యదా
చరణౌ ఘర్షతో భూమిం ఊరువేణీ భవేత్తదా

పాదమును స్వస్తికముగా నొనరించి పురోభాగమున పార్శ్వ భాగములతో పాదములు భూమి ఘర్షణ మొనరించుట ఊరువేణీ లక్షణముగా నిందున్నది. ఊరువులు స్వస్తిక సంయుక్తములుకాగా పాదములు పార్శ్వభాగములచే భూమియందు ఘర్షణ మొనరించుట ఊరువేణీ లక్షణ మని వేమభూపాలు డనెను. ఈ లక్షణమున గూడ ఊరుస్వస్తికము సంభావ్యము. ఊరుస్వస్తికము నిజపార్శ్వములచే భూఘర్షణము నున్నచో ఊరువేణీ దేశీచారి యగును.

౧౭. సంఘట్టితా

ముహు ర్విషమసూచిస్థౌ పాదౌ వుత్ప్లుత్య భూతలే
పతన్తౌ ఘట్టయే ద్యత్ర సేయం సంఘట్టితా మతా

విషమసూచి యను దేశీస్థానము పంచమాధ్యాయమున ౨౨ వదిగా నిరూపిత మయినది. పాదములు ముహుఃవిషమసూచిస్థానకమె నందున్నవె ఉత్ప్లుతి నాచరించి భూతలమున పతన మొనరించుచు పరస్పరము ఘట్టన మొనరించునవి యగునేని సంఘట్టిత యను దేశీచారి యగును.

౧౮. హరిణత్రాసితా

కుంచితే చలితే పాదతలే స్వస్తికతాం గతే
ఉత్ప్లుత్య సంహతే యత్ర పాతితే తా మిమాం జగుః
హరిణత్రాసితాభిఖ్యాం చారీం చారీవిచక్షణాః

పాదతలములు కుంచితములు చలితములు కాగా స్వస్తికత్వము పొందగా ఉత్ప్లుతి కరణానంతరము సంహితములు పాతితములు నయినచో దీనిని హారిణత్రాసిత మను పేరు గల దేశీచారి యని చారీ విచక్షణులు నిరూపించిరి. హరిణత్రాసిత యనునది దేశీచారులలో భౌమచారి. హరిణప్లుతనామమున దేశీచారి ఆకాశచారి నిరూపితము కాగలదు. హరిణప్లుత మను కరణము నిరూపితము. హరిణప్లుత, మృగప్లుత నామములతో చారి నిరూపిత మయినది. ఈ నామవిశేషముల యనుగతిని సమీక్షించుట యావశ్యకము.

౧౯. కరిహస్తా

సంగతస్థాన మాస్థాయ పార్ష్ణిభ్యా మవనీతలం
ఘృష్యతే యత్ర పాదేన కరిహస్తేతి తాం విదుః

కరిహస్త మను నృత్తహస్త మిదివరలో నిరూపిత మయినది. ఈ కరిహస్తము దేశీచారి కరిహస్త మను కరణము చతురములో

నిరూపితము. సంగతస్థాన మనునది దేశీస్థానకములలో ౯ వదిగా నిరూపిత మయినది. అచట సంగతమని లేదు. సంహితమని యున్నది. ఇచటి సంగత పదముచే నచటి సంహితపదమునే గుర్తింప వలెను. సంహితమను దేశీస్థానకము నందుండి పాదము పార్శ్వములచే నవనీతలమును ఘర్షణ మొనరించునేని కరిహస్త మను దేశీచారి యని యనిరి.

౨౦. కులీరికా

నంద్యావర్తాభిధం స్థాన మాశ్రితౌ చరణౌ యదా
తిరశ్చీనం ప్రసర్ప్యేతే తదా ప్రోక్తా కులీరికా

పాదములు నంద్యావర్తమను స్థానకము నాశ్రయించినవై తిరశ్చీనముగా ప్రసర్పితములగునేని కులీరికయను దేశీచారి యగును. తిరశ్చీన ప్రసారము తిర్యక్ప్రసారము నంద్యావర్తనము పంచమాధ్యాయమున నిరూపితము.



౨౧. స్తంభక్రీడనికా

పార్శ్వ ప్రసారితస్యాంఘ్రేః తలేన స్యాన్ముహు ర్యదా
స్థితాంఘ్రిపార్శ్వసంశ్లేషః స్తంభక్రీడనికా తదా

పార్శ్వప్రసారిత మయిన పాదముయొక్క తలభాగమువ స్థితాంఘ్రి పార్శ్వమునకు ముహుఃసంశ్లేషము సంపాదించినచో ఒక పాదతలమున వేరొక పాదము తాడితమగునేని యది స్తంభక్రీడనిక యను దేశీచారి యగును.

౨౨. రథచక్రా

చతురశ్రస్థితే పాదౌ పరిశ్లిష్టౌ ప్రసర్పతః
పృష్ఠతో వా యదా ప్రోక్తా రథచక్రా తథా బుధైః

చతురశ్రమనుస్థానకము పంచమాధ్యాయమున ౧౫వదిగా నిరూపిత మయినది. అట్టి చతురశ్రస్థానమున నున్న పాదములు పరిశ్లిష్టములై ప్రసర్పితములు కావలెను. పృష్ఠభాగమునకేని ప్రసర్పితములు కావలెను. అట్లయినచో నది రథచక్ర మను దేశీచారి యగు నని బుధుల నిర్ణయము. పరస్పరము సంశ్లిష్టము లయిన పాదములు పురతః ప్రసారము కాని పృష్ఠతః ప్రసారముకాని పొంద వచ్చును.

౨౩. ఊరుతాడితా

ఏకపార్శ్వస్థ ఉత్ప్లుత్య హన్యాదన్యోరు మంఘ్రిణా
భూస్థితేన సశబ్దం తత్తదా స్యా దూరుతాడితా

ఒక పార్శ్వము నందుండి ఉత్ప్లుతి నాచరించి భూగత మయిన పాదముచే రెండవ పాదముయొక్క ఊరుభాగము తాడన మొనరించినచో నపుడు ఊరుతాడిత మను దేశీచారి యగును. ఊరు భాగమున తాడనము కలది యగుటచే ఊరుతాడిత మగుట స్పష్టము.

౨౪. సంచారితా

ముహురాకుంచితం పాద ముత్క్షిప్యాన్యేన యోజయేత్
తలేన చరతా తిర్యగ్యదా సంచారితా తదా

తిర్యక్ప్రసారము పొందిన తల సంచారము కల పాదమును ముహుః కుంచిత మయిన అన్యపాదమును ఉత్క్షేపించి పైకినెత్తి యోజన మొనరింప వలెను. ఆ కుంచితపాదమున కుత్క్షేపము తలభాగమున తిర్యక్సంచారిపాదముతో యోజనము ననునవి యిందు ముఖ్యములు. ఇట్లుండగా నిది సంచారిత యను దేశీచారి యగునని నృత్తకోవిదులు కీర్తించిరి.

౨౫. విశ్లిష్టా

స్థానకే పార్ష్ణివిద్ధేఽంఘ్రీ విశ్లిష్టా వుపసర్పతః
ఉతాపసర్పతో యత్ర విశ్లిష్టా సా నిగద్యతే

పార్ష్ణివిద్ధ మను స్థానకము పంచమాధ్యాయములో ౧౬ వదిగా నిరూపిత మయినది. అట్టి పార్ష్ణివిద్ధస్థానకమునందున్న పాదములు విశ్లిష్టములై ఉపసర్పణము పొందినను లేదా అపసర్పణము పొందినను విశ్లిష్ట యను దేశీచారి యగునని అభిజ్ఞులు తలచిరి. అంఘ్రుల విశ్లేష ముండుటచే నిది విశ్లిష్ట యయినది.

౨౬. తలోద్వృత్తం

పాదయోరంగులీ పృష్ఠభాగేన గమనం పురః
క్రియతే త్వరితం యత్ర తలోద్వృత్త మిదం విదుః

అంగులీపృష్ఠభాగమున పాదములకు పురఃప్రదేశమునకు త్వరితముగా గమనము కూర్చినచో తలోద్వృత్త మను దేశీచారి యగును. పరిపదమున నుండి సత్వరపురస్సరణము తలోద్వృత్త మునకు రూప సంపాదకము.

ఇట్లు షడ్వింశతి దేశీభూచారులు నిరూపితము లయినవి. ఇక షోడశాకాశ దేశీచారుల నిరూపణము పరిసంగ ప్రాప్తము.

ఆ కా శ చా ర్యః

౧. విద్యుద్భ్రాంతా

ఫాలస్యోపరి వై క్షిప్య పాదముత్క్షిప్య కుంచితం
స్వపార్శ్వభ్రామితం న్యస్యే ద్విద్యుద్భ్రాంతా భవే త్తదా

నాట్యభాషలో విద్యుద్భ్రాంత పదమున గుర్తింప దగినవి యనేకములు కలవు. విద్యుద్భ్రాంత చారి కరణము అంగహారము

ఇచట విద్యుద్భ్రాంత దేశీచారి శబ్దసంవాద మున్నట్లే కొంతలక్షణ సంవాదము భావసంవాదము నుండును. కావుననే సమానపద వ్యవహారము సంగతము. ఇట్లే యనంతర స్థలము లందును గ్రాహ్యము, ఫాలభాగమునకుపైగా వేగముగా కుంచిత పాద ముంచి స్వపార్శ్వమునకు భ్రమణము కలుగునట్లు చేయవలెను. అప్పుడు విద్యుద్భ్రాంతమను ఆకాశగత దేశీచారి యగును. లలాట పర్యంత పాదోత్క్షేపము భ్రమణము. పార్శ్వమున న్యాస మీ దేశీచారీ స్వరూపము. పాదము పృష్ఠభాగమున వలిత మగుట మస్తక స్పర్శ మొనరించుట ఊర్ధ్వాధఃపార్శ్వము లందు మండల భ్రమణ మొనరించుట తుదకు ప్రసారిత మొనరించుట మార్గచారీ స్వరూపము. దేశీచారులలో కన్న మార్గచారీ విశేషములలో నవయవ సన్న్యాసము లధికముగా నుండును. మార్గచారులలో పరస్పరానుగతి యున్నంతగా దేశిచారులలో నుండదు. మార్గచారులు పరస్పరానుషంగమున నున్నవై కరణముల స్వరూప పరిష్కారముల కుచితయోగప్రదాన మొనరింపగలవు. దేశీచారులు స్వమాత్రపరిధిలో పర్యాప్తశోభాసంపాదకములై రంజనాధిక్యమున రమ్యములుగా భాసించును. మార్గచారులలో నాకాంక్షితము, సాకాంక్షముగా నుండుటయు నభ్యూహ్యము. వీనిలో నిరాకాంక్ష శోభ యున్నది. ఇట్లే వివేకము నౌచిత్యానుసారమున నంతట భావించుట యుక్తము.

౨. పురఃక్షేపా

పాదం కుంచిత ముత్క్షిప్య ప్రసార్య పురతో ఉద్ధృతం
స్వస్థానే నిక్షిపే ద్యత్ర పురఃక్షేపేతి తాం విదుః

కుంచిత మగు పాదము నుత్క్షేపించి పైకి లేచునట్లొనరించి, పురోభాగమున నుద్ధృతముగా ప్రసారిత మొనరించి స్వస్థానమునందు

కూర్చుండి అప్పుడది పురఃక్షేప యను ఆకాశ దేశీచారి యగునని యనిరి. "పురతోఽద్భుతం" అను స్థలమున "అద్భుతం" అనుట కన్న "జవాత్" అని యుండుట యుక్తము. వేగముగా పురతః ప్రసారముండుట తద్భావము. అథవా, అద్భుతపదముననే వేగార్థము భావించునది "జవాత్" అని వేమభూపాలు డీస్థలమున ప్రయోగించెను.

౩. అవక్షేపా

బాహ్యపార్శ్వేన సంశ్లిష్య పృష్ఠమూరోః వరస్య చేత్
పాదోఽన్యః స్వనితంబస్య సమీపం గచ్ఛతి ద్రుతం
అవక్షేపా తదా లక్ష్యవేదిభిః పరికీర్తితా

ఒక పాదము యొక్క ఊరుభాగమును పృష్ఠమును అన్యపాదము బాహ్యపార్శ్వముగా స్పృశించి సంశ్లేష మొనరించి వేగముగా స్వనితంబ సమీపము చేరువేని లక్ష్యవిదులు దీనిని అవక్షేప దేశీచారి యగునని సంకేతించిరి. ఈ అపక్షేపమును అవక్షేపమని యు నందురు.

౪. అంఘ్రితాడితా

వైశాఖస్థానకే క్షిప్త్వా ముత్ప్లుత్య దివి పాదయోః
తలాభ్యాం తాలికాం దద్యా ద్యత్రోక్తా సాంఘ్రితాడితా

వైశాఖస్థానకము స్థానకములలో నిరూపిత మయినది. అట్టి వైశాఖస్థానకము నందుండి వేగముగా నాకాశమున సముత్ప్లుతి నాచరించి పాదముల తలభాగములచే పరస్పరము తాడన మొనరించునది. తాలిక నిచ్చునది. కరతలములచే తాలము వేయునట్లు పాదతలములచే తాల మొనరించుట యను భావమును గ్రహింపవచ్చును ఇట్లుండగా నిది అంఘ్రితాడిత యను దేశీచారి యగును.

పై శాఖస్థానకమునవె కాక సమసూచిస్థానకము నందుండియు ని ట్లొనర్ప వచ్చును. అప్పుడు అంఘ్రి తాడితాచారి యగునని వేమ భూపాలు డనెను.

౫. డమరీ

జానుదఘ్నం సముత్క్షిప్య కుంచితం చరణం ద్రుతం
యదాన్తర్బహిరావృత్త్యా భ్రామయే డమరీ తదా

కుంచిత మగు పాదమును జానుపర్యంతము వేగముగా ఉత్క్షేప మొనరించి అన్తర్బహిరావృత్తి విధానమున భ్రమణ మొనరింప వలెను. అప్పుడది డమరి యను దేశీచారి యగును. ఒక పాదమునకు జానుపర్యంతస్థితి వేరొక పాదమునకు కుంచితరీతి యుత్క్షేపము అంతర్బహిశ్లిష్ట మయిన భ్రమణ మనునవి యిందలి యాకారములు.

౬. భ్రమరీ

ప్రసార్య పురతః పాదం శరీరం భ్రామయే ద్బహిః
ద్రుత మన్యతలభ్రాంత్యా యత్ర సా భ్రమరీ మతా

పురః ప్రదేశమునకు పాదమును ప్రసారిత మొనరించి శరీర మును వెలుపలగా వేగముగా భ్రమింప జేయ వలెను. ఇట్టి శరీర భ్రమణమున రెండవ పాదతలమునకు భ్రమణము నుండ వలెను. ఇట్లుండగా నిది భ్రమరి యను దేశీచారి యగును. భ్రమరీపదమున చారిని గ్రహింతురు. దేశీచారిని గ్రహింతురు. ఇచటిది దేశీచారి.

౭. దండపాదా

విశ్లేష్య స్వస్తికం తిర్య గూర్ధ్వ మంఘ్రేః ప్రసారణం
యత్ర సా దండపాదేతి దేశీవిద్భి రుదాహృతా
పార్శ్వప్రసారితస్యోరుం స్థితాః పాదః కృతాప్లుతిః
తలేన తాడయేత్త్యేపి స్థితమేవం యది స్పృశేత్
ఊరుపృష్ఠే స్వపార్శ్వేన దండపాదేతి మన్మతం

దండపాదము చారి యున్నది. దండపాదము కరణ మున్నది. దండపాదము దేశీచారి యున్నది. ఇచట దేశీచారి దండపాదము ఇచట రెండు లక్షణములను జ్యాయనుడు నిరూపించు చున్నాడు. రెండవ లక్షణము జ్యాయన సమ్మత మయిన లక్షణము మొదటి శ్లోకము నందలి లక్షణార్థ మిట్లు గ్రాహ్యము. స్వస్తికమును విడనాడి పాదమును తిర్యగూర్ధ్వభాగములకు ఆవర్తితము చేసి ప్రసార మొనరించినచో దేశీవిదులగు పండితులు దండపాద యను దేశీచారి యగు ననిరి.

కాని జాయన మత మీా విధముగ రెండవ శ్లోకమున నిరూపిత మయినది. మొదటగా ఊరువు పార్శ్వమునకు ప్రసారితము కావలెను. ఆ యూరువు ననుసరించి పాదము ఉండవలెను. ఆ పాద మాప్లుతి నాచరింప వలెను. పాదతలమున తాడన మొనరింప వలెను. ఆ పాదము కూడ తన పార్శ్వముతో ఊరుపృష్ఠమున స్పృశింప వలెను. ఇట్లుండగా నిది దండపాద మను దేశీచారి యనుట జాయ సేనాపతి సమ్మతము.

ఈ దేశీపాదముల పేరులు పూర్వ నిరూపితము లయిన చారీ కరణముల పేరులతో సమముగా నున్నవి. కావున దేశీచారుల లక్షణ నిరూపణములలో వేరు వేరు మతము లున్నచో నెవరి మతము పూర్వచారీ కరణాదుల లక్షణములకు సన్నిహిత సంగతి కలిగి యున్నదో సహృదయులు సమీాక్షింప వలెను. నామ సామ్య మున్నను భావసామ్యము దేశీచారులలో లేకపోవుటయు నుండ వచ్చును. అయినను జాయపతి సమసమయ సంప్రవృత్తములను సమీాక్షించి నిరూపించినందున తన్మతము భావనీయము.

౮. బద్ధా

యతోపరితలః పాదః స్వస్తికస్యాగ్రతో భవేత్
ఈషదాందోలితః సేయం బద్ధేతి పరికీర్తితా

ఇదివరలో బద్ధచారి నిరూపిత మయినది. ఈ బద్ధ దేశీచారి స్వస్తికపాదమునకు సంబంధించిన ఉపరితలపాదము అగ్రభాగముగా నుండునేని ఈషదాందోలితముగా నుండునేని యది బద్ధ దేశీచారి యగును.

౯. ఊర్ధ్వజానుః

ఊర్ధ్వజానుం విసిష్వాద్య యస్యాం పాదం న కంపయేత్
ఊర్ధ్వజాను రియం దేశ్యాం చారీ ప్రోక్తా మనీషిభిః

ఊర్ధ్వజానుపదము చారీకరణ దేశీచారులను సూచించును ఊర్ధ్వజాను వను ఆకాశచారి తృతీయాధ్యాయములో నిరూపిత మయినది. కుంచితపాదమును వక్షఃపీఠపర్యంత మెత్తుట ఊర్ధ్వజాను చారిలో నున్నది. అట్లూర్ధ్వజానువును కూర్చి ఆ యెత్తిన పాదమును కంపింపజేసినచో ఊర్ధ్వజాను వను దేశీచారి యగునని మనీషుల భావము.

౧౦. అలాతా

కించిత్ప్రసారితం పృష్ఠే పాదమన్యేన లంఘయేత్
త్వరితం యత్ర సా తజ్జ్ఞైరలాతేతి ప్రకీర్తితా

అలాత మొకమండలము. అలాత మొకకరణము. అలాత మంగహారము. అలాతము చారి అలాత దేశీచారి. ఇది యిచట ప్రస్తుతము పృష్ఠభాగమున కొంతగా ప్రసారిత మయిన పాదమును అన్యపాదమున లంఘన మొనర్ప వలెను అప్పుడది అలాతా దేశీ చారి యగు ననిరి.

౧౧. ఆందోలితా

యస్యామాందోలితః పృష్ఠతః కుంచితో ముహుః
భవే దాందోలితేత్యేషా చతురైః పరికీర్తితా

ఆందోలిత బాహు వున్నది. ఆందోలిత శ్వాస మున్నది. ఆందోలిత కటి కలదు. ఆందోలిత దేశీచారి కలదు. ఇది దేశీచారి పృష్ఠభాగముగా కుంచిత మయిన పాదము ముహుః ఆందోలిత మయినచో ఆందోలిత దేశీచారి యగునని చతురులు కీర్తించిరి.

౧౨. సూచీ

ఉరుపృష్ఠం ద్వితీయస్య ముహుః పార్శ్వేన సంస్పృశన్
కుంచితః ప్రసృతోఽగ్రాంఘ్రిర్యత్ర సూచీతి సా స్మృతా

సూచీగాత్రవ్యాములు. కరణము, చారి, కరవ్యాపారము, దేశీమండలము, పాదము, దేశీచారి. ఒక పాదపార్శ్వముచే రెండవ పాదము యొక్క ఊరుపృష్ఠమును ముహుః స్పృశించుచుండ వలెను. పాదము కుంచితమై తీక్ష్ణాగ్రముగా ప్రసృతము కావలెను. ఇట్లున్నచో నిది సూచి యను దేశీచారి యగు ననిరి.

౧౩. విక్షేపా

ప్రసార్య పురతో యస్యాం చరణం గగనాంగణే
ముహు రాకుంచయే దేతాం విక్షేపేతి ప్రవక్ష్యతే

చారీనృత్తవిశారదులు విక్షేప యను దేశీచారీ స్వరూపము నీవిధముగా నిరూపించిరి ఎదుటగా నాకాశమున పాదమును ప్రసారిత మొనరించి ముహుః ఆకుంచన మొనరించుచున్నచో విక్షేప మగును.

౧౪. హరిణప్లుతా

భూయో భూయః సముత్ప్లుత్య ప్రసార్య చరణౌ పతేత్
భూతలే యత్ర సా తజ్ఞైః వ్యాహృతా హరిణప్లుతా

మఱలమఱల ఎగిరెగిరి పాదములను ప్రసారితములనుగా జేసి భూతలమునపడ వలెను. అప్పుడది హరిణప్లుత దేశీచారి యగును. హరిణప్లుత పదమున కరణము ఉత్ప్లుతి కరణము దేశీచారి చారి నృత్తకరణము భయానక గతి దేశీతాలము ద్వాదశాక్షరవృత్తము గ్రాహ్యములు.

౧౫. జంఘాలంఘనికా

తిర్యగాకుంచితస్యాంఘ్రే రుద్వృత్తస్యోత్ప్లుతౌ యదా
అన్యేన లంఘయే జ్జంఘాం జంఘాలంఘనికా తదా

మొదట పాదమును తిర్యగాకుంచితముగా జేయ వలెను. ఉత్ప్లుతిలో నుద్వృత్త మొనర్పవలెను. అన్యపాదమున జంఘాలంఘన మొనరింప వలెను. తిరశ్చీన చరణమును పురోభాగమునకు కించిదాకుంచిత మొనరించి ఉత్ప్లుతితో గగనముననె యొకపాదమున లంఘన మొనర్పదగునను భావమును గూడ నిందు సంగతము చేసికొన వలయును.

౧౬. జంఘావర్తా

అంతరభ్రమణస్యాంఘ్రే స్తలం పృష్ఠేన జానునా
బాహ్యతో భ్రమత స్తస్య జానుపార్శ్వే వినిక్షిపేత్
అసకృద్యత్ర సా జ్ఞేయా జంఘావర్తాభిధా బుధైః

అంతర్భ్రమణముతో నుండు పాదము యొక్క తలభాగమును అన్యపాదమునకు సంబంధించిన జానుపృష్ఠముతో గూర్ప వలెను. ఆ జానుపూర్ధ్వభాగమున నుంచ వలెనని భావము. ఆ అన్యపాదము కూడు బాహ్య భాగమున భ్రమణముతో నుండవలెను. ఆ జాను పార్శ్వమున మొదటి పాదము కూర్ప వలెను. ఇట్లు అసకృత్ప్రయోగ మావశ్యకము. ఒక పాదమున కంతర్భ్రమణము అన్యపాదమునకు

బాహ్యభ్రమణము ఇందున్నది జానుపృష్ఠమున పాదతల విన్యాసము మొదట. జానుపార్శ్వమున పాదతల విన్యాసమనంతరము కలదు. ఇట్టిరీతి కసకృత్ప్రయోగ మావశ్యకము. జంఘాభాగముల కావర్తన ముండుటచే నిది జంఘావర్తాఖ్య దేశీచారి యయినది.

ఇట్లిచట షోడశాకాశ చారీ విశేషములు నిరూపితము లయినవి. మార్గచారీ నిరూపణమున జాయసేనాపతి ప్రథమముగా భౌమచారీ విశేషములను అనంతర మాకాశచారీ విశేషములను నిరూపించెను. ఆ విధానమునే యీ దేశీచారీ విశేష నిరూపణమున గూడ ననుసరించెను. చారీవిధానము లన్నియు కట్యాదిపాదాంత చేష్టావిశేషములతో నుండుట తృతీయాధ్యాయారంభమున నిరూపిత మయినది. చారీశబ్దవ్యుత్పత్తియు నచట ప్రతిపాదిత మయినది. అచట చెప్పినను మఱల నిచట నీ వాక్యము స్మృతికి దెచ్చుట యుచితము.

నృత్తే నాట్యే చ చారీభిః
వినా కించి న్న వర్తతే.

ఈ నిరూపించిన దేశీచారీ విశేషములు కాక ఇంకను నాలుగు దేశీచారీ విశేషము లిందు నిరూపితములు కావలసి యున్నది. ఈ చారీచతుష్టయ మితరగ్రంథము లందు కానవచ్చుట లేదు.

తలసర్పణిక — హంసరుతం
తిత్తిరిగతి — అంతరపద్మాసనము

అని వీని నామములు. వీనిలో అంతరపద్మాసన మను నాలవది దేశీస్థానములలో కొన్ని గ్రంథముల పరిగణితము నిరూపితము నయినది. భౌమాకాశదేశీచారీ సాంకర్యమున నింక నెన్నియో

చారులు రాఁదగి యున్నవని నిరూపితము కాఁగలదు. ప్రసిద్ధ చారీ సంబంధమును సంకీర్ణచారీ స్వరూపమును సిభాలనమున గుర్తించి భావకులు వీసని సంభావించుట యుక్తము కాఁగలదు. ఈ చారీ చతుష్టయ స్వరూప మీా విధమున నుండును.

౧. తలసర్పణికా

పర్యాయేణాగ్ర పాశ్చాత్య భాగాభ్యాం తలయో ర్ద్రుతం
ప్రసర్పేతాం చతుర్దిక్కం చరణౌ యత్ర సా బుధైః
తలసర్పణికా ప్రోక్తా పరైః సైవ కులీరికా

రెండుపాదములును అగ్రతలమున పృష్ఠతలమునకు వేగముగా పర్యాయక్రమమున చతుర్దిక్కముగా ప్రసరించునవి యగునేని నాట్య బుధులు తలసర్పణిక యను దేశీచారి యగునని యనిరి. కొందరు దీనినే కులీరికా నామమున భామదేశీచారి ౨౦ వదిగా నిరూపిత మయినది. అందు నంద్యావర్తస్థానాశ్రయ మున్నది. అది యిందు లేదు కావున దీనికి తలసర్పటికా నామమె సముచితము పాదతల ములచే ప్రసర్పణ మిందు కలదు. కావున నీ నామమె సముచితము.

౨. హంసరుతం

ఆజంఘామధ్య ముత్క్షిప్య స్థితస్యాంఘ్రేః పురో యదా
ఊర్ధ్వాధఃప్రేరణై ర్ద్విత్రై ర్గానపాటానుసారిభిః
నూపురం ముఖరీకుర్యాత్పర్యాయేణ విహాయపి
తదాహంసరుతింబ్రూతేపాదంజాయచమూపతి.

స్థితపాద మెదుటగా పాదమును జంఘామధ్యపర్యంత ముత్క్షిప్త మొనరించి గానానుకూలము లయిన పాటరీతుల ననుసరించునట్టి ఊర్ధ్వాధఃప్రేరణములచే రెండు మూడు పర్యాయములు నూపురమును ముఖరీకృత మొనరింప వలెను ఊర్ధ్వాధః ప్రేరణములు రెండుమూడు

పర్యాయము లుండుటను నూపుర ముఖరీకరణము స్త్రీపర్యాయము లుండుటను ఔచిత్యానుసారమున నభ్యూహించునది. గగనమున నీ నూపుర ముఖరీకరణమును పర్యాయమున నొనరింప వలెను ఆ పాదముచే నొక మారును, ఈ పాదముచే నొక మారు నాచరింప వలెను. ఇట్టి విధానము రంజనాధిక్యము సంపాదించును. ఇట్టి యీ రీతి హంసరుతమను దేశీచారీరీతి యగునని జాయచమూపతి నిశ్చయించు చున్నాడు. నిరూపించుచున్నాడు. ప్రత్యేకముగా నీ చారీ విషయమున స్వనామసంకీర్తనముచే దీనినితరులు నిరూపింప లేదని జాయచమూపతియే భావించి నిరూపించినాడని గుర్తింపవచ్చును.

౩. తిత్తిరిగతిః

ఆలంబ్యాలంబ్య భూభాగ మంగుల్యగ్రైః ప్రసర్పతః
అకర్షతా తలే యత్ర పురతః పృష్ఠత స్తధా
ప్రేరయంతౌ చ చరణౌ సా తిత్తిరిగతిర్మతా

చరణములు రెండును భూ భాగమును పట్టిపట్టి దుమికిదుమికి అంగుళుల యగ్రభాగములతో ప్రసరించునవి కావలెను. భూతలము నందున్న ఆకర్షించు వస్తువుతో బాటుగా పురతః పృష్ఠతః చరణములు ప్రేరణము కలవియు కావలెను. అప్పుడది తిత్తిరిగతి చారి యగును. తిత్తిరి పిట్టగంతులు వేయుచు భూమి నున్న వస్తువాకర్షించు చుండగా ముందునకు వెనుకకు పాదములు (వేళు (గోళ్ళు) లతో ప్రసరించుచు పాదములను ప్రేరణ మొనరించుచు రీతిని భావించి యిం దనుకరింప దగును. శ్లోకార్థ స్పష్టతకై యీ చెప్పిన భావము నేని సంగతపఱచు కొనుట యుక్తము.

౪ అంతరపద్మాసనం

ఉత్ప్లుత్య గగనే పద్భ్యాం బద్ధ్వా పద్మాసనం పునః

విశ్లేష్య త్వరితం తిష్ఠే ద్భుధః పద్మాసనా న్తరే
వ్యోమ్ని పద్మాసనం బద్ధ్వా కృత్వా తస్య చ విచ్యుతిం
తద్రై వోపవిశత్యుర్వ్యాం యత్ర సమ్యక్సుశిక్షితః

ఆకాశమున కెగిరి అచటనే పాదములతో పద్మాసనము బంధించి వెంటనే మఱల విడదీసి భూతలమునకు వచ్చునప్పటికి త్వరితముగా పద్మాసనాంతరము కూర్చి యుందున్నచో నట్టి నాట్యబుధుని విన్యాసమును అంతరపద్మాసన మందురు. ఇందే మరి యొక భేదము. ఉత్ప్లుతి చాచరించి ఆకసమునందు పద్మాసనము బంధించి ఆ పద్మాసనమునకు విచ్యుతి నాచరించి యచ్చే భూమియం దుపవిష్టతయినచో సమ్యక్ సుశిక్షితుడయిన యీ నర్తకుని విన్యాసమంతర పద్మాసన మగును.

ఇప్పటికి దేశీచారీ విశేషము లన్నియు నిరూపితము లయినవి. చారీ రీతు లింకను గలవా? భౌమాకాశచారులు కాక మరి నాలుగు చారులు నిరూపితములు కదా! కటి పాదోరు జంఘా విన్యాసముల విశేషము నెన్నియోని భావితములు కావచ్చును. కావున నితరచారీ విశేషవిషయమున నాశంక యుదయించును. అందులకై జాయను డిట్లు సూచించుచున్నాడు.

చారీణాం వ్యోమభూస్థానాం పాటానామిహ సంకరాత్
హస్తాద్యంగవిశేషాచ్చ భవే దేషా మనంతతా
హస్తాద్యంగక్రియా చాత్ర స్యాత్ప్రయోగానుసారిణీ

దేశీచారు లిట్లు లక్షణ యుక్తముగా నిరూపితము లయినవి. ఇందు భౌమములు ఇరువదియారు, ఆకాశగము పదునారు, అధికముగా నాలుగు మొత్తము నలుబదియారు చారీ రీతులు నిరూపితము లయినవి. ఇవియే కాక ఇంకను చారు లుండవచ్చును. ఎట్లుండ

వచ్చును? ఇట్లుండవచ్చును. భౌమచారులు ఆకాశచారులు పాటములు నిరూపితము లయినవికదా! వానిసాంకర్యము వలన చారుల సంఖ్యాకము లగును. సంకరస్య భావః సాంకర్యం. సంకరము మూడువిధములు. అంగాంగీభావ సంకరము, ఏకవాచకానుప్రవేశ సంకరము, సందేహ సంకరము అని. నాల్గవది సమప్రధాన సంకరమును కలదు. త్రివిధ సాంకర్యమునగాని చతుర్విధ సాంకర్యమున యసంఖ్యాకములయిన భేదములు కలుగును. వానినన్నిటి లెక్కించుట దుశ్శకము కావున చారు లనంతములు. భౌమములు ౨౬ ఆకాశగతములు ౧౬ పాటములు ౨౮. వీని సాంకర్యమె బహుభేదముల నిచ్చును. ఇంక నిందు హస్తాదులయిన అంగముల విశేషముల వలన గూడ నానాభేదములు గలుగును. నాలుగు విధములకు నాలుగు విధముల సాంకర్యము కలుగగా నట్టి సాంకర్యము వలన చారు లనంతములగుచున్నవి. వాని లెక్కించుట శక్యముకాదు. వాని నేల నిరూపింపలేదు? ఇంకను కొన్నిటి నయిన నిరూపింప లేదేమి? సౌందర్యావహములగు వానినె యిందు నిరూపించితిమి. ఈ నిరూపితముల వలననె రంజనాధిక్యమున్నది. ఇట్టివె యిచట నిరూపితములు.

చారీరీతు లన్నియు కట్యూరుజంఘాపాదముల సన్నివేశవిశేషముల వలన గలుగునని కదా! ఇందు హస్తాద్యంగ విశేషప్రసక్తి యేల? హస్తాద్యంగ విశేషమున గూడ సాంకర్యము కలుగునని తత్కృతముగా గూడభేదానంత్యము సిద్ధించునని యనుట యేల? ఇట్టి దూశంకా నివారణమునకై జాయపతి "హస్తాద్యంగక్రియా చాత్ర స్యాత్ప్రయోగానుసారిణీ" యనెను. ఈ దేశీచారులలో హస్తాద్యవయవముల క్రియావిశేషములును ప్రయోగానుసారమున సంగతము లగును. దేశీవిధానములలో నవియు సంగతము లయిననె

శోభా విశేషము కలుగును. కావున వాని సంబంధము నిందావశ్యక మని భావింప వలెను.

## దేశీలాస్యము

దేశీలాస్యస్య భేదానాం ప్రసిద్ధానాం సమాసతః
ప్రవ్యక్తాని విధాస్యామః లక్షణాన్యధునా వయం

సుకుమారమగు నృత్యము నృత్తము లాస్య మని అది మధుర మని పూర్వము నిరూపిత మయినది. శివు డుద్ధతముగా నృత్త మొన రింపగా ఉమాదేవి సుకుమారముగా నృత్త మాచరించినది. అట్టి సుకుమార ప్రయోగ మంతయు మధురమై లాస్య మయినది. "ఉమా తుష్యతి లాస్యేన" అట్టి లాస్యమునకు సంబంధించిన లాస్యాంగములు మార్గ రీత్యనుసారముగా నాట్యధర్మ ప్రయుక్తముగా నిరూపితము లయినవి. అట్లే లోకధర్మప్రయుక్తములగు దేశీవిధానము లందును లాస్యరీతులు కలవు అవి దేశీలాస్య రీతులు. దేశీలాస్యాంగములు అవియు ఇచట నిరూపణీయములు. దేశీలాస్యాంగములు ననేకము లుండవచ్చును. వాని నన్నిటిని సంకేతించుట శక్యము కాదు. అందు ప్రసిద్ధములయిన వానిని సౌందర్యావహము లగు వానిని శోభా సంపాదకములగు వాని నిచట సంగ్రహముగా నిరూపింతుము. వానికి మేమిప్పుడు ప్రవ్య క్తము లయిన లక్షణములను నిరూపింతుము. ఇచట "వయం విధాస్యామః" మేము నిర్మింతుము. అని సాభిమాన ముగ జాయసేనాపతి చెప్పుట సాభిప్రాయముగ నున్నది.

### దేశీలాస్యాంగాని

సౌష్ఠవం స్థాపనా రేఖా డాలః చాలిః చలావలిః
లలిః త్కకని రుల్లాసః సుకలాస మురోంగణం
భావః ధరహరం కిత్తుః దేశీకారం నిజావణం

డిల్లాయీ లవణిః గీతవాదితాభినయాహ్వయాః
లయః కోమలికోయారః తతోఽనీకీతి సంజ్ఞకః
అంగహారమనోధర్మోవంగానంగం వివర్తనం
రింకా ముఖరసశ్శేవా విహసీ ధసక స్తలం
వితలం రసవృత్తిశ్చ తతో మసృణతాభిధం
అనుమానం ప్రమాణాఖ్యం లంఘితాంశగతీ తథా
సుసంధిః పాదపాటాఖ్యం గతిస్థం చందనాభిధం
షట్చత్వారింశ దిత్యేషా మథ లక్ష్మణ ముచ్యతే

ఈ ప్రఘట్టమున దేశీలాస్యాంగముల నామములున్నవి. ఇవి యన్నియు నలుబదియారు కలవు.

| | | |
|---|---|---|
| సౌష్ఠవ | స్థాపవ | రేఖ |
| డాల | చాలి | చలావలి |
| లలి | త్ర్యకని | ఉల్లాస |
| సుకలాస | ఉరోంగణ | భావ |
| ధరహార | కిత్తు | దేశీకార |
| నిజాపణ | డిల్లాయి | లవణి |
| గీతవాద్యత | అభినయ | లయ |
| కోమలిక | ఓయార | అనీకి |
| అంగహార | మనోధర్మ | అంగ |
| అనంగ | వివర్తన | ఝంక |
| ముఖరస | శేవ | విహాసి |
| ధసక | తల | వితల |
| రసవృత్తి | మసృణత | అనుమాన |
| ప్రమాణ | లంఘిత | అంశగతి |
| సుసంధి | పాదపాట | గతిస్థ |
| చందనములు | | |

ఈ నలుబదియారును దేశీలాస్యాంగ నామములు. ఈ నామములు సంస్కృతాభిజ్ఞులగు వారలకును క్రొత్తగా నుండును. దేశీరీతులు దేశవ్యాప్తములై దేశీయ నామములతో వ్యవహార ప్రసిద్ధములై యుండును. అట్టి వింద సంస్కృతీకృతములై యుండును. నృత్త లక్షణ కారులు దేశీ లాస్యాంగములను నిరూపించిరి. కాని వారివారి గ్రంథములలో నామములు భిన్నభిన్నములుగా నున్నవి. కొన్నిటిని జూచి కొన్నిటిని సరిదిద్దుకొనవలసిన ఆవశ్యకతయు నుండును. పాల్కుఱికి సోమనాథుని గ్రంథముల లోని కొన్ని నామములు వీని సంవాదముతో నున్నవి. కొన్ని నృత్తశాస్త్ర గ్రంథములలో నిందలి నామములు నామాంతరములతో నున్నవి. ఇట్టివన్నియు సమీక్షాకుశలకక్షీపర్వములు.

యథాక్రమముగా వీని లక్షణ మిక ప్రవ్యక్తముగ ప్రతిపాదితమగును.

౧. సౌష్ఠవం

యదుక్తం సౌష్ఠవం స్థానం తదేవాత్రావగమ్యతే
కింతు తస్యావగంతవ్యా ఖర్వతా త్రివిధా జనైః
చతుర్భిరథ వాష్టాభిరథ ద్వాదశభి ర్మతా
అంగులైరిహ నర్తక్యా జాను వంక్షణ నామనాత్
ఇచ్ఛయా భూమిపాలానాం తత్తద్దేశానుసారతః
అతః పరం తు ఖర్వత్వం పరం నృత్యే న శోభతే

దేశీలాస్యాంగములలో సౌష్ఠవము మొదటిది. ఈ ప్రథమలాస్యాంగమునకు సర్వలాస్యాంగము లందు నావశ్యకత యున్నది. ఇది యున్న నే లాస్యాంగములు శోభావహములు కాగలవు. తృతీయాధ్యాయమున నిరూపితము లయిన వైష్ణవస్థానకాదులలో నవశ్య

ముగా నీ సౌష్ఠవముండుట యపేక్షితము. "సౌష్ఠవే నోపశోభితం వైష్ణవం స్థానకం" వైష్ణవస్థానకము సౌష్ఠవముతో కూడినదై శోభించుట యున్నది. అచటనే సమపాద స్థానకము నందును సహజమయిన సౌష్ఠవముండవలయుట సూచిత మయినది. ఇట్లు స్థానకము లన్నియు సౌష్ఠవ సముపేతము లయిన శోభించుట ప్రసిద్ధము సమ్మతమును. అంగహారములు సౌష్ఠవోపేతములు కావలెనని యున్నది. నృత్త సర్వస్వము సౌష్ఠవ సహిత మయినదని రాణించు ననుట ఆయా స్థలములం దభివ్యక్తమగుచునే యున్నది. వ్యాయామ మొనరించువారు సమధికముగా సౌష్ఠవమున లెస్సగా యత్న మాచరింపవలయు ననియు నచట నిరూపిత మయినది. "సాధక స్తేన హీనాంగో నాచ్ఛే నృత్తే నశోభతే" సౌష్ఠవము లేకున్నచో హీనాంగుడగు సాధకుడు నాట్యమున గాని నృత్తమున గాని శోభింప డనియు స్పష్టముగా నిరూపిత మయినది. వ్యాయామాపేక్షిత మయిన సౌష్ఠవ మచట విశదముగా నున్నది. సౌష్ఠవ మనునది వ్యాయామ మొనరించు సాధక పురుషులకు మాత్రమె యపేక్షిత మని భావింపరాదు. అది నాట్యనృత్త ప్రయోగ దీక్షానక్తులగు స్త్రీపురుషుల కందర కపేక్షితము. అందుననె యచట నిరూపితములయిన రెండుశ్లోకములిచట నిరూపితము లయినవి. ఇచట రెండుమూడుగా నున్న శ్లోకములు తృతీయాధ్యాయమున నున్నవి. వీని భావ మచట నిరూపిత మయినది. అయిన నర్థసంగతికై యిచట నిరూపణము యుక్తము.

తృతీయాధ్యాయమున సౌష్ఠవముకల స్థాన మేది నిరూపిత మయినదో యదియే యిచట నుండవలయు నని యనగమ్య మాన మగుచున్నది. అచట సౌష్ఠవస్వరూప నిరూపణమున "యత్రనాంగ

మతీవోచ్చం నాతిఖర్వం" అని యున్నది. దేహమత్యంత మున్నత ముగా నుండరాదని ఖర్వముగా పొట్టిగా నుండరాదని దానిభావము. అచట సౌష్ఠవమునకు సంబంధించిన ఖర్వత స్వకీయము లగు ప్రమాణానుసారమున మూడు విధముల నుండుటను తెలియవలసి యున్నది.

జాను వంక్షణ నమనము వలన మూడు విధముల ఖర్వత యుండవచ్చును. జాను నమనము మోకాలు వంచుట వంక్షణ మనగా ఊరువులసంధి గజ్జలు. పొత్తికడుపు నకును తొడకును మధ్య నందు. అట్టి వంక్షణనమనమునను ఖర్వత కలుగును. జానువంక్షణముల మనముల వలన మూడు విధముల పొట్టితనము కలుగును. నాలుగంగులముల ఖర్వత, ఎనిమిది యంగుళముల ఖర్వత, పండ్రెండంగులముల ఖర్వత. ఇట్లు త్రివిధ ఖర్వత యున్నది లాస్యాంగముల నభినయించు నర్తకి యిట్టి మూడు విధములగు ఖర్వభావములలో నేదేని కలిగియుండ వచ్చును. పొడవుగా నున్న నర్తకి యయినచో ద్వాదశాంగుల ఖర్వత, పొట్టిగా నున్న నర్తకి యయినచో చతురంగుల ఖర్వత యుక్తము. భూమ పాలకుల యిచ్చానుసారమున ఆయా దేశానుసారమున నిట్టి ఖర్వతను మాత్రమె యంగీకరించి నిశ్చయింప దగును. ఇంతకన్న వేరుగా ఖర్వత్వ ముండుట నృత్యమున శోభింపదు. కావున నర్తకి కాదలచిన కన్య యీ సౌష్ఠవము కలది యగుట యావశ్యకము.

౨. స్థాపనా

రేఖయాలంకృతా రమ్యా స్థితిర్ముఖరసేన చ
నృత్యస్యాభినయానాం యదంతే సా స్థాపనా మతా

నృత్తాంతము నందు గాని యభినయముల యంతమున గాని రేఖాలంకృత మయిన రమ్యస్థితి, ముఖరస రాగ రంజిత మయిన

స్థితి స్థాపన యనదగి యున్నది. రేఖ యనునది యొక లాస్యాంగము. ఇందే మూడవదిగా నిర్దిష్ట మగును. ముఖరస మను నదియు లాస్యాంగము. ఇందే ౩౧ వదిగా నిరూపిత మగును. స్వస్వస్థానము లందు సన్నివేశ రమ్యములై సౌష్ఠవోపేతములై శోభాతిశయ కారులై కామోదయకారు లయిన యవయవముల రమ్యస్థితిని రేఖ యందురు. అట్టి రేఖాలంకృత రమ్యస్థితి స్థాపన. ఆ యా నృత్తములకు సముచితము లయిన అభీష్టము లయిన నైపథ్య రచనల వలన వేషభూషా విశేషముల వలన గలుగు ప్రసన్న మయిన ముఖము యొక్క రాగకాంతి ముఖరస మన దగును. అట్టి ముఖరసమున గలుగు రమ్య స్థితి, స్థాపన అయా విశేషముల వలన గలుగు రమ్యస్థితి నృత్తారంభమున నుండ వచ్చును. నృత్తాంతమున నృత్త మొనరించి శ్రమపడి యున్న సమయమున గూడ నున్ననే స్థాపన యగును. పూర్వాపూర్వనిరూపితముల యపేక్ష యుత్తరోత్తరములం దున్నచో పాఠక సహృదయులకు ధారావాహిక మయిన విషయ నిరూఢి కలుగును. ఇచట నిరూపింపబోవు వాని యపేక్ష యున్నది కావున పునః పునరనుసంధానమున నిందలి విశేషములు భావనీయములు కావలసి యున్నది.

౩. రేఖా

అంగానాం యత్ర సర్వేషాం మిథశ్శోభావిధాయినాం
సౌష్ఠవే సన్నివిష్టానాం స్వక్షేత్రేషు యదాస్థితిః
హరేదఖిలచిత్తాని సా రేఖేత్యభిధీయతే.

అందరు నర్తకీ రంగమునకు రారాదు. కొందరే నర్హులు. నర్తకి సర్వావయవములు సమవిభక్తములై సుస్లిష్టములై యుండవలెను. సర్వావయవములు పరస్పరము శోభాసంపాదన మొనరించు

నవిగ నుండవలెను. ఏ యంగమున కాయంగము రమ్యముగ నుండుట కాక ఒక యంగము వేరొక యంగమునకు శోభాసంపాదకముగ నుండవలెను. అట్లు మిసశ్శోభాసంధాన సమర్థము లయిన యంగము లన్నియు స్వాస్థానమున సంగతములై యుండ వలెను. అట్టి యంగ ములు తమతమ స్థానములందు సముచిత సాంగత్యము కలదై యుండగా నట్టిస్థితి సర్వసహృదయ చిత్తహరణ సమర్థమయినచో రేఖ యను దేశీలాస్యాంగ మగును.

౪. ఢాలః

మందానిలచలద్పద్మదలాంతజలబిందువత్
నిభృతోఽంగస్య సంచారో నృత్యేసౌ ఢాలఉచ్యతే.

నృత్యమునందు నిభృత మయిన నిబిడమయిన నిండుగా నున్న గంభీరముగా నుండు సావధానముగ సాభిప్రాయముగ నుండు అంగ సంచారమునకు ఢాల మని పేరు. మందానిలముచే కదలు పద్మ దలము నందలి దలాంతమున నున్న జలబిందువు వలె అంగ సంచా రము నిభృతముగా నుండ వలెను. కించిచ్చలనముతో నున్నకరము నందలి ముక్తాఫలము ముక్తామణి, మంచిముత్యము వలె అంగసంచా రము మనోహరముగా నుండవలెను. నర్తనమున నట్లు నిభృత మయిన గాత్రచలనము ఢాల మను దేశీ లాస్యాంగ మగును.

౫. చాలిః

మృదు మధ్య లయం తాలసామ్యరమ్యం సమాగమం
త్ర్యశ్రత్వబహులం పాద కర కట్యూరు చాలనం
సమమేవ భవేద్యత్ర సా చాలి రభిధీయతే.

నర్తన మొనరింపదలచిన నర్తకి యాచరించు పాదపాణి కట్యూరుచాలనము ఎట్లుండ వలయునో యీ చాలి దేశీ లాస్యాంగ

ములో నున్నది. ఆ కరపాదముల కట్యూరువుల చాలనము మృదు మధ్యలయాన్వితముగా నుండ వలెను. విలంబిత లయరీతి కాని దు్రతలయరీతి కాని యుక్తము కాదు. అందుననె మధ్యలయాన్విత మనుట. అవియు మృదువుగా నుండుట యావశ్యకము. తాలప్రాణము లయ శబ్దార్థము క్రియానంతర విశ్రాంతికి లయమని పేరు. అది దు్రతమధ్య విలంబిత భేదమున త్రివిధము "లయనాల్లయ" తాలాంతరాలవర్తి కాలమునకు లయ మని పేరు. లయము తాల సామ్యరమ్యముగ నుండవలెను. తాలసామ్యమున మనోహరము కావలెను. తాలగతి ననుసరించియె లయ ముండును. త్ర్యశ్యాదిజాతి తాలములలో మధ్యవిలంబిత లయరీతు లుండును. కావున త్ర్యశ్ర మిశ్రఖండ సంకీర్ణ జాతులలో ద్రుతలయ ముండదు. నృత్తమున దు్రతలయ ముపయోగి కాదు. ఇంక నీ చాలి సమాగమముగా నుండవలెనని యిందున్నది. ఈ పదమున సంకేతిత మయిన భావము గోచర మగుట లేదు. వేమభూపాల లక్షితములో నిచట "నేత్రహారి విభ్రమ నిర్భరం" అని యున్నది. సచమత్కృతి అనియు కలదు. సవిభ్రమం అని సవరించుకొందమా? సమ్+ఆగమ=సమాగమ సమ్యగ్విధానమున నవయవ విన్యాస మను నర్థము కల్పించుట క్లిష్టాన్వయ మగునో? ఇట్టి యీ చాలి త్ర్యశ్రత్వ జవాలం. త్ర్యశ్రజాతి తాల ప్రమాణానుసారమున నుండ వలెను. లఘువర్ణ నియమాను సారమున చతురశ్ర త్ర్యశ్రమిశ్ర ఖండ సంకీర్ణ సంజ్ఞ కల జాతు లేర్పడినవి. అందు చతురశ్రము చాతుర్వర్ణము. త్రశ్రము త్రివర్ణము. మిశ్రము సప్తవర్ణము. పంచవర్ణము ఖండము, సంకీర్ణము నవవర్ణము, ఇచట వర్ణ మనుట లఘువని సంకేతము. ఈ చాలి త్రశ్రతా ప్రచుర ముగా నుండ దగును. కావుననె మధ్యలయా న్వితమనుట. ఇట్లు పాదకర కట్యూరుచాలనము సమముగా నుండగా నిది చాలి యను

దేశీ లాస్యాంగమగును. పాదవిన్యాస మొక కాల నియమమునను కరచాలనము వేరొక కాల నియమమున నుండరాదు. అన్నియు సమకాల చాలనముతో నుండుటయె యుక్తము. కావున నిది నేత్ర మనోహరమై చమత్కారకమై విభ్రమనిర్భరమై రమ్య మగును.

౬. చలావలిః

> సైవ సామ్ముఖ్యభూయిష్ఠా సౌష్ఠవం న విముంచతి
> యదా ద్రుతలయోపేతా తదా ప్రోక్తా చలావలిః

ఇందు చలావలియని యున్నది. దీనిని చలావలి యనియు నందురు. ఈ నిరూపించిన కట్యాదు కరపాద చాలనాత్మక మయిన చాలియె సామ్ముఖ్యభూయిష్ఠమై అభిముఖ్యమున రచితమై నదై నచో సౌష్ఠవము నువిడనాడనిది యగును. అప్పుడది! ద్రుతలయోపేతము కాగా చలావలి యను దేశీలాస్యాంగ మగును. నృత్తమున ద్రుత లయ రీతి యుపయోగి కాదని పూర్వము నిరూపిత మయినది. సర్వ సామాన్యముగ నదియట్లె మధ్యలయ విధానమున నున్న చాలి ససౌష్ఠవమై లఘుప్రక్రియా పరిదర్శనమునకు అభిముఖరచితమై ద్రుతలయ సహితము కావచ్చు ననుట యిందు విశేషవిధిగా గ్రహింపవచ్చును.

౭. లలిః

> సంగీతప్రాప్తిసంభూతః తత్సౌందర్యనిరంతరః
> ఆనందాతిశయః కోపి లలి రిత్యభిధీయతే
> తాలచ్ఛందానుగం తిర్యగుపాంగాదివిచాలనం
> సుకుమారం విలాసాఢ్యం లలి రిత్యూచిరే పరే.

ఈ దేశీలాస్యాంగమున కిచట రెండు లక్షణము లున్నవి. మొదటిది జ్యాయనసమ్మతము. రెండవది అన్యసమ్మతము. సంగీత

ప్రాప్తి సంభూత మయిన ఆనందాతిశయము సంగీత సుందరతా నిరంతర మయినచో లలితయను లాస్యాంగ మనుట జ్యాయన సమ్మతము. సౌందర్యసంపన్న మగు సంగీత సంప్రాప్తి వలన సంభవ మయిన హర్షమునకు లలి యని పేరు. ఆ హర్షమధి భూమింగతముగా నుండ వలెను. గాన సంపత్తి వలన సర్వతః రస సంపూరణము జరుగగా సాధకుడు దదాస్వాదభరితైకాగ్రుడై యంతర్ముఖుడై హృష్టుడగును. అనంతరము ఆస్వాదయుత వేద్యాంత రసంపర్క శూన్య మయిన స్వరూప మాత్రావస్థానమున నుండును. అప్పు డానంద నిష్యంద మభివ్యక్త మగును. ఇది లలిలాస్యాంగమున ననుభూయ మానమగు ఆనందాతి భూమి.

జ్యాయనుడు సూచించిన లలివిషయమున నన్యమత మీ విధమున నున్నది. తాలచ్ఛం దానుగతమయిన తిర్యగుపాంగాది విచాలనము సుకుమారము విలాసాఢ్యము కాగా లలి యగునని కొందరు పలికిరి. సౌకుమార్య సముజ్జ్వలము తాలానుగతము సరసము తిరశ్చీన మయిన అంగముల చాగుచాలనము కల నృత్యము లలి యను లాస్యాంగ మగును. నృత్త చతురు లీ లాస్యాంగము నీ విధముగ సంకేతించిరి. ఆ స్వరూపమున కీ స్వరూపమున కంతర మధికముగ నున్నది. అయిననేమి? అభిజ్ఞు లట్లు సూచించిరి. సూచితములలో నాద్యమతము జాయపతి సమ్మతము. ద్రష్టుగా శ్రోత్రిగా జాయసేనాపతి యనుభూతి పరమమయిన మతమును సమ్మతముగ భావించెను.

౮. తృకని:

ప్రకారైః శిరసస్తాలలయచ్ఛందానుసారిభిః
గతౌ యద్వత్ స్థితౌ తద్వత్తద్భావమనోహరైః
రసికప్రేక్షకానందదాయినీ తృకని ర్భవేత్.

ఆయా భావ మనోహరము లయిన శిరః ప్రకారములు తాల లయ చ్ఛం దానుసారులుగా నుండుట యిం దావశ్యకము. ఛంద మనునది కరములతో నొనర్చు నాదన విధానము శిరఃకంపన ప్రకారములు తాల లయానుసారమున నుండుటయు కాక వాద్యవాదన విధానానుసారములుగాగూడ నుండుట యావశ్యకము, "గతౌ యద్వత్ స్థితౌ తద్వత్" శిరఃకంపనములు గతిలో నెట్లు తాలలయాదుల ననుసరించుచు నుండునో స్థితి యందును తాల లయాదుల ననుసరించు నవిగనె యుండవలయును. అట్లుండగా రసికు లయిన ప్రేక్షకుల కానంద దాయక మగు విధానమును తృకని యను లాస్యాంగ మని తద్విదులు పరిభాషించిరి.

౯. ఉల్లాసః

తాలాద్ద్వి త్రి గుణైః శైఘ్ర్యాద్భావాభివ్యంజకైర్యదా
శ్లథసంధిభిరంగస్య సూక్ష్మైరుల్లసనం విదుః

నర్తకి యొక్క అంగ సముల్లసనములతో గూడుకొనిన విధానమునకు ఉల్లసనము ఉల్లాసము అని పేరు. నర్తకి త్వరావిశేషముచే శీఘ్రతాతిశయముచే తాలసంబంధమున ద్విగుణములు త్రిగుణములు నయిన భావాభివ్యంజనములతో నంగవిన్యాసము లుండవలెను. ఆ యుల్లసనములు శ్లథసంధులుగా నున్నను లలితమధురములుగా నుండి భావాభివ్యంజన మొనరించునవిగనే యుండును. అట్టి అంగ సముల్లసనములతో నుండు విధానము ఉల్లాస మను పేరు కల దేశీలాస్యాంగ మగును. నర్తకి లాఘవాతిశయమున వేగావేశమున భావాభివ్యంజకము లగు నంగవిన్యాసములను మఱలమఱల నాచరింపగా ద్విగుణముగా త్రిగుణముగా సముల్లసనమున ప్రదర్శింపగా లలిత మనోహరములగు నా విన్యాసములు కుల్లాసమను పేరు గలుగుట నభ్యూహించునది.

౧౦. సుకలాసం

హరణం గీతవాద్యానాం మధ్యే మధ్యే విధీయతే
శోభనం ప్రౌఢనర్తక్యా సుకలాసం తదా భవేత్.

ఈ లక్షణ శ్లోకమునందపేక్షితాంశ పూరణ మావశ్యకముగా నున్నది. నర్తన ప్రౌఢికల నర్తకి నర్తన మొనరించుచు మధ్య మధ్యలో గీతవిధానములకు వాద్యవిధానములకు సముచితమగు మేలనము. సంయోజనము సంపాదించునదై శోభనముగా నర్తన మొనరించునది యగునేని సుకలాసమను దేశీలాస్యాంగ మగును. గీతమునకు వాద్యమునకు నర్తనమునకు ఏకీకరణముండుట యావశ్యకము. ప్రౌఢనర్తకి యీ త్రితయ సామరస్యమున రమ్యతను సంపాదింప గలదు. స్వభావ సముచితముగా నర్తనమాచరించు గీత ప్రసారమునకు వాద్యవిధానమునకు మధ్యలోమధ్యలో నవకాశమిచ్చి వాని సమ్మేలనము జతపఱచుకొని యభినయము నాచరించునది కావలెను. అప్పుడా నర్తకి ప్రతిభాప్రౌఢత భాసించును. అప్పుడది సుకలాసమనులాస్యాంగ మగును. అంగచాలనము గీతవాద్య మేలనము ప్రతిభాశోభన నర్తనము అనునవి సుకలాసమునకు శోభా సంపాదక రూపములు.

౧౧. ఉరోంగణం

ఊర్ధ్వాధః పురతః పశ్చాత్స్కంధయోః స్తనయోరపి
ద్రుతం విలంబితం యద్వా లలితం తాలమానతః
పర్యాయాచ్చాలనం యత్ర స్యాదుక్తం తదురోంగణం

ప్రగల్భ యగు నర్తకి స్కంధములకు స్తనములకు పర్యాయ క్రమమున చాలనము సంపాదించుట యీ యురోంగణమున

ముఖ్యము. భుజచాలనము స్తనచాలనము లలితముగా నుండ దగును. తాల మానానుసారముగ నుండ వలెను. ద్రుతముగా చాలన మొనరింప వచ్చును. విలంబితముగా చాలన మొనరింప వచ్చును. సర్వము తాలమానానుసారమున నుండ వలెను. ఆ స్కంధ స్తనచాలనమును ఊర్ధ్వాధః పురతః పశ్చాద్భాగముల కుండ దగును. ఇట్లీ కుచాంసచాలన మురోంగణమను దేశీలాస్యాంగము.

కొందరు కుచాంసములకు లలితముగా అల్పముగా తిర్యక్చాలన మున్నచో సురింగము అని పేరు పెట్టిరి. తాలకాలనియమానుసారమున ద్రుతగాత్రకంపనముతో కుచాంసచాలన మున్నచో నురోంకణ మగు ననిరి. అంతట కుచాంసచాలన మావశ్యకము.

౧౨. భావః

స్యాన్నృత్తసహితం గీతం వాద్యం చ లయసమ్మితం
నర్తక్యాః ప్రాప్య హృష్యంత్యాః పుష్యంత్యాః పులకాంకురాన్
నృత్తస్య విరతిః క్షిప్రం భావ ఇత్యభిధీయతే

నర్తకి నర్తన సమయమున నృత్తసహిత మగు గీతమును లయసమ్మిత మగు వాద్యమును పొంది సంతుష్టయై పులకాంకుర పరిపుష్టయై యున్నచో నా సమయముననే వేగముగా నృత్తము విరత మొనరించుట మను లాస్యాంగ మగునని యనిరి. నృత్తగీత వాద్య త్రితయ సమ్మేలనము లభింపగా నర్తకి సంతుష్ట పులకిత యయి నపుడు తదనుభూతిపారవశ్యమున నున్నప్పుడు వెంటనే నృత్త విరతి యుచిత మని దానిని భావ లాస్యాంగముగా జాయపతి నిరూపించెను. సర్వసామరస్యమున సంతుష్టయై విలాసమధురముగా నర్తన మొనరించుట భావ మని కొంద రనిరి.

౧౩. ధరహారం

భుజావధి యథా శీఘ్రం కంపనం కుచకుంభయోః
సముల్లసతి నర్తక్యాః తదా ధరహారం మతం

ప్రౌఢనర్తకీ కుచకుంభములకు భుజావధికముగా శీఘ్రకంపనము సముల్లసించు నేని ధరహార మను లాస్యాంగ మగుట సమ్మతము. కుచాంసములకు కంపనము చాలనము ఉరోంగణములో సూచిత మయినది. ఇందు కేవలము కుచములకే కంపన ముద్దిష్టము. ఉరోవష్టంభమున కుచస్పంద ముండును. కక్షస్ఫురణమున కుచాంచలచలన ముండును. అట్లు కాక ఇందు కుచముల కుసురులకు కలుగు కలుగజేయు కంపన చాలనము లుద్దిష్టములు. అవి దృశ్యమానసుందరములు. ధరహారస్వరూప మిట్టిది.

౧౪. కిత్తు

స్తనయో ర్భుజయోః కట్యోః స్పందనం తాలసమ్మితం
సలీలం నర్తకీ కుర్యాద్యత్ర తత్కిత్తు కీర్తితం

కిత్తు లాస్యాంగము కిస్తు అనియు కొందరి వ్యవహారమున నున్నది. నర్తకి సలీలముగా తాలసమ్మితముగా స్తనములకు భుజములకు కటిభాగములకు నేత్రనందనముగా స్పందన మొసరించు నేని యది కిత్తు అను దేశీనాస్యాంగముగా కీర్తిత మయినది. కటి స్తన భుజముల కొక సమయముననె తాలసమ్మిత స్పందనము కలుగదు. ఒక్కొక పర్యాయ మొక్కొక జంటకు అట్టి సలీలస్పందన ముండుట సహృదయ నేత్ర నందనముగా నుండును. లోకరంజనమున కిట్టివి మధ్యే మధ్యే సమాయోజితము లగుట సుందరము.

౧౫. దేశీకారం

నానాదేశోద్భవం నృత్యం తత్తద్రీతి మనోహరం
అగ్రామ్యం దృశ్యతే యత్ర దేశీకారం తదుచ్యతే

నానాదేశ సముత్పన్న మయిన నృత్యము తత్తద్రీతి. మనోహరముగా నున్నను అగ్రామ్యముగా గోచరించిననె యది రమ్యమగును. ఒక్కొక దేశాచారవిచారానుసారమున నొక్కొకరీతి యాయా దేశజనులకు మనోహరముగా నుండవచ్చును. కాని యవియే యన్యదేశీయుల కగ్రామ్యముగా నుండదు. జుగుప్సావహములు సభ్యమర్యాదాభంజకము లగు వానిని నృత్యయోగమున నిరూపింపరాదు. నానారీతి శోభా సుందరముగా భాషించినను జుగుప్సావహములుగా నుండు వానిని పీడాదాయకము లగు వానిని అమంగలాత్మకము లగు వానిని ప్రయోగమార్గమున కూర్పరాదు. అగ్రామ్యముగా నున్ననె వాని ననుసంధానించి కూర్ప దగును. ఇట్టి అగ్రామ్య రమ్య దేశీలీతి దేశీకారమును దేశీలాస్యాంగ మగునని దేశీధర్మవిదులు కీర్తించిరి.

౧౬. విజాపణం

సౌష్ఠవం రేఖయా యుక్తం ప్రేక్షకేచ్ఛాప్రమాణవత్
హస్తానుగత భావార్ద్ర దృష్టిభిః సుమనోహరం
అప్రయత్నకృతం నృత్యే విజాపణ ముదీరితం

సౌష్ఠవ స్వరూపము రేఖారూపము నిరూపిత మయినది. అప్రయత్నకృత మగు సౌష్ఠవము ప్రేక్షకుల యిచ్ఛానుసారముగా రేఖాయుక్త మగునేని హస్తానుగతము లగు భావార్ద్రదృష్టులచే నత్యంతము మనోహరముగ నుండు నేని నృత్తమున నది విజాపణమను దేశీలాస్యాంగ మగును. "యతో హస్త స్తతో భావః" యనినట్లుగా హస్త మెటుగా ప్రవర్తించునో యటుగా దృష్టి ప్రసరింపవలెనని, దృష్టి యెటుగా ప్రసరించునో యటుగా భావము ప్రసరింపవలె ననునది సామాన్యముగా నభినయమున సిద్ధ మయిన తత్త్వము.

హస్తానుగతము లగు దృష్టులు భావార్ద్రములై యుండుట యావశ్య కము. ఈ విధాన మంతయు నయత్నకృతముగా నుండవలయుట వివక్షితము. ఏదియు యత్నకృతముగా నుండరాదు. ఇట్లనుటచే స్వాభావసహజముగా నుండవలయు నను భావమును గుర్తింపరాదు. రసభావాభినివేశమున నర్తన మొనరించు నపు డపేక్షితము లన్నియు రసభావ ప్రవణములై యహమహమికతో ప్రసరించునవి కావలయునే కాని పృథగ్యత్నసంపాద్యముగా నుండరాదు. ఆనందవర్ధనుడు చెప్పిన అపృథగ్యత్ననిర్వర్త్యమానత యనునది కావ్యధర్మ మయినను నృత్యధర్మము నగుననియె జ్యాయనుడు "అప్రయత్నకృతం" ప్రయోగించెను.

౧౭ డిల్లాయీ

భావార్ద్రహృదయం హేలామంథరామంద సౌష్ఠవం
శ్లథం మధురమంగం చేత్ డిల్లాయీ కధితా తదా

నర్తన మొనరించు నర్తకి శరీరము భావార్ద్రహృదయముతో నుండవలెను. హేలామంథరముగ నుండవలెను. పూర్ణసౌష్ఠవముతో నుండవలెను. శ్లథమై మధురమై యుండవలెను. ఇట్లున్నచో నది డిల్లాయి యను దేశీచారి యగును.

౧౮. లవణిః

యత్రాంగానాం ప్రయోగేషు సమసం దుష్కరేష్వపి
అశ్రమేణ భవేత్సోయం లవణిః ప్రణిగద్యతే

ఈ లవణి లవణీపదమున నవణీ పదమునను వ్యవహృత మయినది. దుష్కరము లయిన నృత్తప్రయోగము లందును ప్రౌఢ నర్తకి అంగములకు సమన మశ్రమముగ నప్రయత్నముగ కూర్చి నచో లవణి యను దేశీలాస్యాంగ మగును. సామాన్యముగా నర్తకి

నృత్త మభ్యసించిన వారంద రంగనమున మొనరింప గలరు. కొన్ని దుష్కరప్రయోగ ములలో వా రట్లొనరింప లేరు శరీరస్థౌల్యమున గాని సంధిబంధముల యస్వాధీనత వలన గాని వా రట్లు చేయలేరు. అభ్యాసపాటవము గల నర్తకి యట్లు చేయ గలుగ వచ్చును. వారును కొన్ని దుష్కరములనే యాచరింపగలరు. దుష్కరముల నన్నిటి నాచరింప జాలరు. ఆచరించినను వారి పృథవ్యత్న మందు గోచరించును. వా రందు శ్రమపడి రనిపింప వచ్చును. ప్రౌఢనర్తకియె సర్వప్రయోగము లందును అవి యెంత దుష్కరములుగా గోచరించినను అశ్రమముగ నాచరింపగలదు. అట్టి నర్తకీవిధానమునె లవణి యను దేశీలాస్యాంగ మని వ్యవహరింతురు.

౧౯. గీతవాద్యతా

సుగీత వర్ణ కాకుభ్యాం సదృశస్య లయేన చ
వాద్యస్యానుగుణం నృత్యే ద్యత్ర సా గీతవాద్యతా

నర్తకి వాద్యానుగుణముగ నర్తన మొనరించినచో గీత వాద్యత యను దేశీలాస్యాంగ మగును. ఆ వాద్యము లయవిధాన సదృశ మగుటయు గీతవర్ణానుగత మగుటయు కాకుస్వరమున కనుగుణ మగుటయు నావశ్యకము. గీతవాద్యానుగుణముగా గీతాక్షరానుగత ముగా లయసంబద్ధముగా వాద్య మొందును గావున వాద్యానుగుణ ముగా నర్తకి నర్తన మొనరింప వలసి యున్నది. అట్లున్ననే గీత వాద్యత యుండును. నృత్త గీత వాద్య సామరస్యము సూచిత మయినను తత్సామరస్యమున నర్తకి ముదిత యగుటయు కాక తదనుగతముగా నృత్త మొనరించుటయు నిందు వివక్షితము.

౨౦. అభినయః

గీతవాద్యేఽను కరణాన్యంగహారాంశ్చ....
.......................... యథాప ద్విదధీత చేత్

అంగై శ్చేతోహరై ర్భావగర్భై రభినయ స్తదా
గీతార్థాభినయోఽన్యైస్తు గణ్యతేఽభినయః పునః

అభినయ మను దేశీలాస్యాంగమునకు సంబంధించిన రెండు మతము లిచట రెండు శ్లోకములలో నిరూపితము లయినవి. మొదటి లక్షణశ్లోకముతో త్రుటి యున్నది. తద్భావము నీ విధముగా గ్రహింప వచ్చునని భావము. గీతమును వాద్యమును అనుసరించి కరణములను అంగహారములను రేచకములను చారులను యథా విధిగా నాచరించినచో అభినయ మను దేశీలాస్యాంగ మగును. రెండవ మత మీా విధముగ భావనీయము. మనోహరములు భావ గర్భములు నయిన యంగవిన్యాసములతో నభినయించుట గీతార్థ మనుగతముగా నభినయించుట యున్నచో కొందరు అభినయ మను దేశీలాస్యాంగ మనిరి. కరణాంగహారాదుల యథావిధి విధానము గీతవాద్యానుగతముగా నుండుట యభినయ మగు ననునదియె జాయ సేనాపతి సమ్మత లక్షణ మని భావింప వచ్చును.

౨౧. లయః

ప్రవర్తమానే ఏకస్మిన్ నవౌ యత్ర పదౌ లయౌ
యోజయంత్యా యథాయోగ్యం నర్తక్యాపి ప్రగల్భయా
నృత్యేతే చక్రవద్భారు నృత్యేఽసౌ లయ ఉచ్యతే

ఒక విధముగ ప్రవర్తించుచుండగా నా సమయముననే మఱల రెండు లయ విధానములను యోజన మొనరించి ప్రగల్భనర్తకి యథాయోగ్యముగా నర్తన మొనరించు నేని నృత్యమున నది లయ మను దేశీలాస్యాంగ మగును. ఒక లయరీతిలో నితర లయవిధాన ములను యథోచితముగా నాయోజనము చేయవలెను. అప్పు డది చక్రప్రవృత్తి వలె సుందరముగా నుండును. మూడు విధము లగు

లయరీతులు తగిన విధమున ప్రవృత్తములు కాగా చక్రవచ్చారుత యుండునని జాయన భావము. లయలక్షణముతో పరోకరీతియు కలదు. మనోహరవిలాసవిన్యాసములు కల కరములకు సవిలాసచలన ముండుటయు లయ లాస్యాంగ మగును.

౨౨. కోమలికా

లయ క్రీడాభిరంగానాం వర్తనా వలనాదిభిః
సజ్యతే సుకుమారాభిరార్ద్రతా మనసో భృశం
తన్వంగ్యా సహజా నృత్యే సేయం కోమలికా మతా.

సుకుమారము లయిన వర్తనావలనాదులు కల అవయవ లయ క్రీడా విధానముల వలన మనస్సునకు మిక్కిలి యార్ద్రత కలుగునేని, సహజ మగు చిత్తద్రుతి యుదయించునేని నృత్యమున నది కోమలిక యను దేశీలాస్యాంగ మగును. వర్తనా వలనాదు లన్నియు సౌకుమార్య తరంగితములై యుండుటయు లలిత చేష్టిత ములతో నుండుటయు, నృత్తక్రియకు నవీనత నాపాదించును. ఇట్టి దత్యంతము కోమలముగా నుండునని నృత్తజ్ఞులు కోమలిక యనిరి.

౨౩. ఓయారః

నృత్యస్యావయవాః పూర్వప్రక్రాంతా స్తాలయుక్తిభిః
గత్యా సర్వాంగశోభిన్యా వర్ధేర న్నుత్తరోత్తరం
నర్తక్యా శ్చతురాయాశ్చే దోయారః కీర్తిత స్తదా.

పూర్వ ముపక్రాంతములై ప్రవర్తించు చున్న నృత్యావ యవము లన్నియు తాలవిశేష సంబంధమున ఉత్తరోత్తర మభివృద్ధి పొందునవిగా నుండునేని, సర్వాంగములకు శోభాసంపాదక మగు గతిచే రమ్యములుగా నుండునేని చతురనర్తకీ సాధ్యము లగు నీ విధానములకు ఓయార మని పేరు. దీనిని దేశీలాస్యాంగముగా

నభిజ్ఞులు పరిగణించిరి. నర్తకి సర్వాంగశోభనము లయిన గతివిభ్రమ ములతో ప్రక్రాంతనృత్తావయవములను ద్విగుణములనుగా త్రిగుణ ములుగా నొనర్ప వలెను. ఇందు తాలయుక్తి సహకరించును. ఇట్టిదిది ఓయారలాస్యాంగము. ఇదియు ఓయార మని కొందరి భావము. శిరమును కొంతగా పైకెత్తి అడ్డముగా నుంచుట దీనిని ఓయ్యార మనియు నందురు. తెలుగుదేశమున ఒయ్యార మొలకబోయుట కలదు.

౨౪. అనీకి

గీతవాద్యే యదా తాలలియే చ స్ఖలనం వినా
నర్తకీ తనుతే నృత్తం తదానీకీతి కీర్తితా.

గీత వాద్యముల విషయమున గాని తాలలయవిధానమున గాని స్ఖలనము లేకుండునట్లుగా నర్తకి నృత్త మాచరించు నేని అనీకి యను దేశీలాస్యాంగ మగు నని నృత్తవిదులు కీర్తించిరి.

౨౫. అంగహారః

స్మరచాపలతేవాంగయష్టిః పార్శ్వద్వయేన చేత్
సవిలాసా మిలత్తాలలయా వినమతి క్రమాత్
హరణాదంతరంగాణా మంగహార స్తదా మతః

అంగహార మను నిది అంతరాంగముల హరణ మొనరింప గలదు. అంతరంగ హారము. మనోహారము, మన్మథధనుర్లత వలె నున్న నర్తకి అంగయష్టి సవిలాసముగా తాలలయవిధానములతో గూడినచో పార్శ్వద్వయమున క్రమముగా నొదిగినచో వినత మయినచో అంగహార మను దేశీలాస్యాంగ మగును. ఒక్క-పార్శ్వ మున నొక పర్యాయ మొదుగుటయు వేరొక పార్శ్వమున వేరొక

పర్యాయ మొదుగుటయు నిందు మనోహరముగ నుండగా నంగహార మగును. అటు నిటు నతి వినతి కల నర్తకి దేహము కందర్పధనుర్వల్లీ మనోహర మని యందురు.

౨౬. మనోధర్మః

ఉపదిష్టా త్పృథ గ్దృష్ట్యా మనోనృత్త్యనుకూలయా
హస్తాద్యంగక్రియాయోగం ప్రాప్తయా వ్యంజితో గుణః
కోప్యపూర్వో మనోహారీ మనోధర్మో నిగద్యతే.

నాట్య దేశికు డుపదేశించిన దాని కన్న వేరుగా నర్తకి తన మనోవృత్తి కనుకూల మయిన దృష్టి ననుసరించి హస్తాద్యభినయ వాభినయమున నొకానొక అపూర్వ మనోహరగుణము నభివ్యక్తము చేయు నేని మనోధర్మ మను దేశీలాస్యాంగ మగును. నర్తకి యనుస రించు నృత్తము మనోనుకూలవృత్తి రచితమై ఉత్తరోత్తరము మనోహరాంగోపాంగములచే నపూర్వభంగి రుచిరముగా నున్నచో నృత్తవేదులు మనోధర్మ మందురు. ఇది ప్రగల్భనర్తకీ ప్రతిభా విశేషము నృత్తభావిత యయిన నర్తకి తన మనమును నృత్తవశము చేసికొనగా నా మనోధర్మ మంతయు నపూర్వభంగీ సుందరమై యగును.

౨౭. అంగం. ౨౮. అనంగం

నృత్తే యల్లాస్య ముద్దిష్టం నిజై రంగై స్తదాన్వితం
అంగమిత్యుచ్యతే అనంగం తాండవాంగ తరంగితం.

నృత్తము నందు లాస్య ముద్దిష్ట మయినది. అది మధుర మని సుకుమార మని వ్యపదిష్టము. అట్లు సముద్దిష్ట మయిన సుకుమార లాస్యమును నర్తకి తన యవయవ విన్యాస విశేషములచే సమన్విత మొనరించు నేని అంగమను దేశీలాస్యాంగ మందురు. ఇంతవఱ కిది

అంగ లాస్యాంగ లక్షణము. అనంతరము అనంగ లాస్యాంగ లక్షణము. ఉద్ధతముగా నిర్దిష్ట మయిన నృత్తము తాండవము. తాండవాంగ తరంగిత మయిన నృత్తము అనంగ మను పేరు కల దేశీలాస్యాంగ మగును.

౨౯. వివర్తనం

కరణభ్రమరీ పాదచారీ హస్తై ర్యథోచితం
వాద్యాక్షరసమం నృత్యే ద్యత్ర తత్స్యా ద్వివర్తనం.

వివర్తన మూష్టకర్మ కలదు. వివర్తనము దేశీనృత్తమును కలదు. ఈ వివర్తనము దేశీలాస్యాంగము. కరణములు భ్రమరీ విశేషములు. పాదములు చారీవిశేషములు. హస్తములు అనువాని ప్రయోగములచే తగిన విధమున వాద్యాక్షర సమముగా నర్తకి నర్తన మొనరించినచో వివర్తన మను దేశీలాస్యాంగ మగును. కరణాదుల ప్రయోగములలో వాద్యములకు సంబంధించిన సంకేతాక్షరములకు తగి యుండు విధమున నర్తన మొనరించుట యత్యంత మావశ్యకము.

౩౦. ఝుంకా

ఉద్ధృత్య చాలయిత్వాంగ మాహరంతీ సవిభ్రమం
జనం వంచయమానేవ పార్శ్వతః పురతోఽథవా
నర్తకీ తనుతే నృత్తం యదా ఝుంకా తదా మతా.

దేహము సముద్ధృతము కావించి చాలన మొనరింప జేసి సవిలాసముగా నభినయ మాహరించునదై ప్రేక్షకజనులకు వంచనము చేయు దాని వలె పార్శ్వభాగముననో పురోభాగముననో నర్తకి నృత్త మొనరించునేని దాని ఝుంక యను దేశీలాస్యాంగ మందురు. సభ్యసమక్షమున నృత్త మొనరించుటకుగా నంగసముత్క్షేప సముద్ధృ

మముతో నర్తకి యుండగా "పార్శ్వభాగముగా నీ నర్తకి నృత్య మొనరించును" అని ప్రేక్షకులు తలచు నట్లుండి పురోభాగమున నృత్య మొనరించుట ఝుంక. "ఈ నర్తకి పురోభాగమున నృత్య మొనరించును" అని సభ్యు లనుకొను నట్లుండి పార్శ్వభాగముగా నర్తన మొనరించుటయు ఝుంక.

వేమభూపాలు డీ విధముగా ఝుంకారూపము నిరూపించెను. కించి దుద్ధతిపూర్వకముగా విలాసయుతముగా పురోభాగమునకు గాని పార్శ్వభాగమునకు గాని దేహమును లలితముగా చలిత మొనరించి, సామాజికుల హృదయమునవే పలుకు చున్నట్లుగా నృత్య మొనరించు నేని యది ఝుంక యగును. "కథితా ఝుంకా శ్రీమతా వేమభూభుజాం" అని సాదరకథన మిందు గలదు. ఈ లక్షణమున విశదము కాని "జనం వంచయమానేవ" అను నంశము జాయ్యప్రతిపాదనమున గలదు. ఇట్లు భావ్యమాన సుందరము లింద్యన్నవి.

౨౧. ముఖరసః

తత్తన్నృత్తోచితాభీష్ట నేపథ్యరచనాభువః
ప్రసన్నముఖరాగస్య కాంతి ర్ముఖరసః స్మృతః

ఒక్కొక్క నృత్తమున కొక్కొక్క నేపథ్యరచన యుక్తము. వేషభూషారచనము నేపథ్యము. ఒక్కొక నర్తకి యొక్కొక నేపథ్య రచన యభీష్టముగ భావించును. ఒక్కొక దేహమున కొక్కొక యాహార్య ముచితము. కాగా ఆయా నృత్తవిధానముల కుచితము లయిన అభీష్టములు నయిన నేపద్యరచనల వలన కర్తకి విశిష్టమగు ముఖరాగము కలది యగును. అట్లు ప్రసన్నముఖరాగమునకు సంబంధించిన కాంతి ముఖరస మను దేశీలాస్యాంగ మగును. ప్రసన్న

ముఖరాగ కాంతి ముఖరస మనుటచే ముఖరాగ రూపమును గుర్తింప వలసి యున్నది. భావరసానుకూలముగా ముఖరాగ ముండుట యావశ్యకము అది రసభావప్రకాశకము. రసాంచిత ముఖ్యరాగము లేకున్నచో నభినయ మెంత లక్షణయుతముగ నున్నను శోభింపదు. సముచితముగ ముఖరాగ మున్నచో నభినయ మల్పముగ నున్నను ద్విగుణముగ శోభించును ముఖరాగ మున్నచో నేత్రము ప్రతి క్షణము నవ నవముగ రాణించును. ముఖరాగము రసాత్మక మనో వృత్తి ప్రకటించును.

ముఖరాగ మెనిమిది విధములు. స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామము, వికస్వరము, అరుణము, మలినము, పాండురము నని అభినయోద్దేశమున ముఖరాగము సహజము, ప్రసన్నము, రక్తము, శ్యామము నని చతుర్విధముగా నుండుట సోమేశ్వర మతము. ద్వితీయాధ్యాయములో ముఖరాగము విశదముగ నిరూపిత మయినది. ముఖరాగము చతుర్విధమని జాయపతి నిర్ణయము. శృంగారాద్భుతహాస్యములలో ప్రసన్నముఖరాగ మావశ్యక మని ద్వితీయమున నిరూపిత మయినది. "నాంగికాభినయో భాతి ముఖ రాగవినా కృతః" ముఖరాగము లేక ఆంగికాభినయము శోభింపదు. "ఆంగికాభినయస్యాస్య ముఖరాగో హి జీవితం" ఆంగికాభినయము నకు ముఖరాగము జీవితము. అట్టి ప్రసన్న ముఖరాగ కాంతి ముఖరస మనుట యుక్తముగా నున్నది

౩౨. తేవా

ఉత్తరంగే యదాపాంగే స్వభావా ద్భావగర్భితౌ
నర్తనే వామనేత్రాయాః స్యాతాం తేవా తదా మతా.

నర్తనము నందు సుందర నేత్రములు కల నర్తకి అపాంగ

ములు ఉత్తరంగములై స్వభావరమ్యముగా భావగర్భితములుగా నున్నచో తేవ యను దేశీలాస్యాంగ మగును. మృగశాబాక్షి యపాంగములు మఱల మఱల తరంగితములై శోభాయమానము లగుట అవి భావసూచకములు నగుట లాస్యాంగ తేవ.

౩౩. విహసీ

స్మితం వక్త్రస్య విహసే పద్మస్యేవ మనోహరం,

నర్తన మొనరించు నప్పుడు నర్తకి ముఖమున మనోహర మగు స్మిత ముండుట విహసి యను దేశీలాస్యాంగ మగును. అది పద్మమునకు వలె మనోహరము. పద్మమునకు వికసనమువలె ముఖ మునకు స్మితము మనోహరము. ముఖము సుందరముగా నుండుట విహసి యని కొందరి భావము. ముఖస్మితము పద్మసౌ దర్య పేశల ముగా నుండుట నంద రభిమానించిరి. హాస మారువిధములు స్మితము హాసితము, విహాసితము ప్రహాసితము, అతిహాసితము అప హాసితము నని. ఇందు మొదటి ద్వికము త్తముల హాసము. ఇట్లు స్మిత ముండుటయె విహాసి. ఇదియు నవసరాపేక్షితముగా నుండుట యుక్తము. సర్వసమయము లందును దంతములు వెలి వేయుట యుక్తము కాదు. స్మితము చిరునగవు, అదియె యుక్తము. కనుపుటల కదలిక కపోలముల కుంచనము ఓష్ఠముల స్పందము ముఖముద్రా శోభ స్మితముట స్ఫురింప జేయ గలవు.

౩౪. ధసకః

చంచరీక సమద్వల్లీ లీలానుకారిణీ
స్తనాధోద్దేశ సమనాద్యదా త్రస్తేవ నర్తకీ
వాద్యామగం విలాసాఢ్యం స్తనాధోనయనం సకృత్
మధ్యే మధ్యే ప్రకుర్వీత నృత్తస్య ధసక స్తదా.

తుమ్మెదలచే వంగు వల్లి లీల ననుకరించునదై నర్తకి చెదిరిన
విధమున స్తనాధోద్దేశమును నమన మొనరించినచో మధ్యభాగము
నకు సొంపుగా వంపులు మార్చినచో వాద్యానుగతముగా విలాస
బహుళముగా స్తనములకు అధోనయన మాపాదించినచో నది ధసక
మను దేశీలాస్యాంగ మగును. నృత్త మొనరించు నప్పుడు మధ్య
మధ్యలో మధ్యము వంచుట, కుచముల నమనము కూర్చుట సకృత్
ఉండ వలెను. ఈ నమన నయనములను జూచు ప్రేక్షకు లభినందింతు
రని అసకృత్ ఆచరింపరాదు. అప్పుడే అది ధసకము. నృత్త మధ్య
ములో విలాస భర నిర్భరముగా కుచకుంభనమనము, తాలవాద్య
లయాన్వితముగా శరీరయష్టి ప్లవనము సుందరమై మాద్యన్మధుకరా
క్రాంత కుసుమస్తబకానత వల్లరీవంజులముగా నుండు ననుటను
చంచరీక నమద్వల్లీ లీలానుకారిణీ పదమున జ్యాయన రమ్యముగ
సూచించినాడు.

౨౫. తలం

పాటాద్యాః ప్రతిభాసంతే దుష్కరా స్సుకరా ఇవ
క్రమాద్యంగసమాయుక్తా యత్ర త త్తల ముచ్యతే.

నృత్తాంగములుగా నిరూపితములయిన పాటాదులు దుష్క-
రము లయినను సుకరములుగా ప్రతిభాసించునేని క్రమముగా
నన్నియు సర్వాంగసమాయుక్తములుగా గోచరించునేని తల మను
దేశీలాస్యాంగ మగును. అంగప్రత్యంగముల వలన చలన వివర్తన
వ్యావర్తనాదుల నందర నాయాసముగ నాచరింప జాలరు. కొందరు
శ్రమపడి యాచరించి నట్లుండును; వారి యంగవర్తనము లంతగా
ననుకూలములు కాకుండుట హేతువు. కొందర ప్రశమముగా నాచ
రింతురు. దుష్కరములును వారలకు సుకరములుగా నుండును.
అట్లనాయాసముగ నవి యాచరితము లగుటయు కాక అంగసమా

యుక్తములై క్రమానుసంహితములై ధారావాహికముగా శోభా పరిసారము కలవిగా నుండును. అట్లుండుట తలము.

౩౬. వితలం

చారీపాటాదికం యత్ర సుకుమారం నిసర్గతః
కృతం బలేన కఠిన మేత ద్వితల మీరితం.

మార్గరీతిలో నిరూపించినవి కాని దేశీరీతిలో నిరూపించినవి కాని చారీపాటాదికములు స్వభావసహజముగా సుకుమారములుగా నున్నను బలకృతములుగా యత్నకృతములుగా శ్రమకృతములుగా కఠినము లయినవిగా గోచరించు నట్లు నాచరించినచో నప్పుడు వితలము అను దేశీలాస్యాంగము లగును. 'సుకుమారములుగా నొనరింపగా తల మగుట యిచట నిరూపిత మయినది. తల వితల ములకు వైరుద్ధ్యము కల దని సూచించుట యిందు ముఖ్యము కాదు. కొందర ట్లాచరించిన సుందరము. కొందర రిట్లాచరించిన సుందరము. తల మాచరించు వారిలో ప్రక్రియాలాఘవ కౌశలములు సుందరము లై భాసించును. వితల మాచరించు వారి కాయపాటవము ననుసరించి యాచరణీయము లందలి క్లేశసాధ్యత స్ఫురించుచుండును. ఆచరించు వారి ప్రాభవము, ఆచరణీయ ప్రాభవము ననుసరించి వీని రమ్యతను భావింప దగును.

౩౭. రసవృత్తిః

సంభోగో విప్రలంభో వా గీతస్యార్థోఽభినీయతే
అంగై ర్యథోచితై ర్వృత్తై స్తద్భావాకృష్టచిత్తయా
నర్తక్యా యత్ర భావజ్ఞా రసవృత్తిమిమాం విదుః.

సంభోగశృంగారరూప మయిన గీతార్థ మభినయించు నప్పుడు గాని, విప్రలంభశృంగారరూప మయిన గీతార్థ మభినయించు నప్పుడు

గాని తత్తద్భావాకృష్ట చిత్త యగు నర్తకి తత్తత్సంభోగ విప్రలంభ ములకు సంబంధించిన భావములచే సమాకృష్ట హృదయయై యథో చితాంగవిన్యాసములతో నృత్తవిశేషములతో నభినయించునేని భావజ్ఞులగు భావుకులు దీనిని రసవృత్తి యను దేశీలాస్యాంగ మగునని యనిరి. ప్రథమాధ్యాయమున వివరింపితము లయిన లాస్యాంగదశక ములో రసాకృష్టచిత్తయగు నర్తకి యభినయింప వలయు విశేషములు సూచితము లయినవి. ఆ యంశముల నిచట భావించుట యుక్తము. గేయపదాది లాస్యాంగములలో మార్గసంపత్తి నాట్యధర్మత భావ నీయము కాగా నిచటి వానిలో దేశీసంపత్తి లోకధర్మత భావనీయ మని భావించుట యుక్తము. రసవృత్తిత ప్రయోగ ప్రయోక్తృ భావకులలో నావశ్యకము.

౩౮. మసృణతా

అభివ్యంజిత శృంగారా స్నిగ్ధా దృష్టి ర్విరాజతే
నృత్త హస్త సఖీ యస్యామియం మసృణతా మతా.

నర్తన మొనరించు నర్తకికి దృష్టి యనునది హస్తసఖి, నర్తకి స్నిగ్ధదృష్టి శృంగార మభివ్యంజనము చేయునది యగునేని మసృణత యను దేశీలాస్యాంగ మగును. "యతో హస్తః తతో దృష్టిః" యనిన విధమున హస్తము ప్రసరించిన వైపుగా దృష్టి ప్రసరింప వలెను. అట్లు ప్రసరించినచో దృష్టి హస్తసఖి యగును. ముగ్ధ స్నిగ్ధ రసనిర్భర యగు దృష్టి నృత్తహస్తానుగతముగా నుండుట యావశ్యకము. అట్టి దృష్టిప్రసారము శోభావహము.

౩౯. అనుమానం

నృత్తం ప్రస్తుతయో ర్గీతవాద్యయో స్సదృశం దృతం

కృతైకభ్రూలతాక్షేపా వితర్కయతి నర్తకీ
దోలాయితమనా యస్మిన్ననుమాన మిదం మతం.

నృత్తారంభసూచకముగా గీతము వాద్యము ప్రస్తుతములు కాగా సదృశనృత్తకరణమునకై ఒక కనుబొమ నెత్తి నర్తకి డోలాయిత మనస్కయై వితర్క మొనరించునది యగునేని అనుమాన మను దేశీలాస్యాంగ మగుట సమ్మతము. గీతానుకూలముగ వాద్యము, వాద్యానుకూలముగ గీతము ప్రవృత్తము కాగా ఉభయానుకూలముగ నర్తకి నృత్త మాచరింప వలెను. సర్వసమాకారమున నుండు మొదటి యుపక్రమగతిలో నెట్టి నృత్త మపేక్షిత మగునో వెంటనే గోచరింపదు. అట్టి యనుకూల నృత్తాలోచనాసక్తయై నర్తకి ఉన్నమితైకభ్రూలతయై డోలాయమాన మానసయై యాలోచన మొనరించుట వితర్కము. అట్లు వితర్క మొనరించి నిశ్చయించి నృత్త మొనరించుట నర్తకీ స్వభావము.

౪౦. ప్రమాణం

ప్రమాణం గీతవాద్యాభ్యాం నృత్తస్య సమతా భవేత్.

నృత్తమునకు గీతముతో వాద్యముతో సమత్వ ముండుట ప్రమాణము అను దేశీలాస్యాంగ మగును. గత వాద్య నృత్తములు మూడును సమానముగ నుండ వలెను. నృత్త ప్రదర్శనము ముఖ్యముగ భావింతురు. గీతము లేక గీతార్థానుసరణము లేక నృత్తము శోభింపదు. నృత్తము నందలి అంగోపాంగముల కదలిక లన్నియు వాద్యము ననుసరించియె యుండును. గీతము ననుసరించి వాద్యము, వాద్యము ననుసరించి నృత్తము నృత్తోద్దేశమున గీతము నుండుటయె యుక్తత. గీత వాద్య నృత్త సామరస్య మావశ్యకము. గీతగానము వాద్యవాదనము నృత్యనర్తనము దేనికవి వేరు వేరుగా సామర

స్యము విడనాడి ప్రాధాన్యము కలపి కారాదు. ప్రమాణాతీతములు కారాదు. గీత వాద్యము లారబ్ధములు కాగా నర్తకి తదనుసంధానమున నృత్య మారంభించి గీతావాద్య సమత్వము సంపాదించుట యావశ్యకము. ఇట్టిది ప్రమాణ దేశీలాస్యాంగము.

౪౧. లంఘితం

యదా విశ్రమ్య విశ్రమ్య లంఘయంతీ ముహు ర్ముహుః
లాస్యస్యావయవాన్నృత్యే నర్తకీ లంఘనం తదా.

నృత్యమున నర్తకి నర్తన మొనరించుచు నాగి యాగి లాస్యమునకు సంబంధించిన యవయవములను ముహుర్ముహుః లంఘన మొనరించుచు, అప్పు డప్పు డొక్కొక యంగమును దాటవేయుచు, అనంతరాంగప్రయోగ మాచరించుచు నర్తన మొనరించు నేని లంఘన మను దేశీలాస్యాంగ మగును. కొన్నిటి కొన్నిటి నట్లు దాటవేయుట యొకవిధ మగు నర్తన ప్రౌఢి. వరుసగా నన్నిటిని ధారావాహికముగా ప్రయోగించుట కలవడుదురు. మధ్యలో నొక యంగ వలనమును విడిచినచో ననంతర నర్తన ప్రయోగమున సమర్థులు కాక పోవచ్చును. అట్లుకాక ఒక యంగమును విడనాడినను అంగాంతర మందికొని నర్తన మొనరించుటలో కొందరె సమర్థు లగుదురు అది యొక ప్రౌఢి అభిజ్ఞులు ప్రేక్షకులుగా నున్నప్పు డిట్టి ప్రయోగ చాతుర్య ప్రదర్శన ముండును. అది లంఘిత లాస్యాంగము.

వాద్యావయవములను ముహుర్ముహుః ఉల్లంఘించి నర్తకి విశ్రమ్య విశ్రమ్య ఆగి యాగి నర్తించుటను లంఘిత మని కొందరు భావించిరి. అట్టి భావనమును జ్యాయన ప్రతిపాదనములో భావనీయము కా గలదు.

४२. అంగగతిః

శస్త్ర వ్యాయామ భేదేషు న_ర్తనేష్వితరేష్వపి
రమ్యానంశాన్ క్షణం నృ_త్తే నర్తకీ దర్శయేద్యదా
ఉచితావసరే కాంశ్చి_త్తదాంగగతి రుచ్యతే.

శస్త్రప్రయోగభేదము లందును వ్యాయామాచరణభేదము లందును ఇతరము లగు న_ర్తన భేదము లందును కొన్ని రమ్యము లయిన యంశము లుండును. కొన్ని ప్రయోగానుగతికి సంబంధించిన నృ_త్తవిద్యాప్రక్రియ లుండును. నృ_త్త మొనరించు న_ర్తకి సముచితావసరమున కొన్ని రమ్యము లగు నంశములను క్షణ మవధానమున ప్రదర్శించినచో నప్పుడు అంశగతి యను దేశీలాస్యాంగ మగును. రమ్యాంశము లనుట తాత్కాలిక చమత్క్రియాపాదకము లని భావము. ఇట్టి రమ్యాంశములు సంగీతప్రయోగమున నుండును. వాద్యవిధానము లందు నుండును. నృ_త్తములో నుండు నట్టి వానిని చతుర న_ర్తకి యనుభవవిశేషమున గు_ర్తింప గలదు. విశిష్ట ప్రేక్షకులు సదస్యులుగా విచ్చేసి నప్పుడు వారి యభిరుచి విశేషములను గు_ర్తించిన న_ర్తకి వారి చి_త్తరంజనానుకూలము లయిన రమ్యాంశములను నృ_త్తమున ప్రదర్శించి తదభినందన మొందగలదు. అప్పు డంశగతి లాస్యాంగ మనుట తద్విదులకు సమ్మతము.

४३. సుసంధిః

భాండవాద్యా త్పృథ గ్భాండవాద్యప్రాప్తౌ విచక్షణా
తాలా_త్తాలాంతరప్రాప్తౌ యథా సంధి ర్న లక్ష్యతే
తథా చే న్న_ర్తకీ నృత్యే త్సుసంధి స్సోఽభిధీయతే.

నృ_త్తారంభమున నుపయు_క్త మయిన యొక భాండవాద్యము వాదనవిధానమున నుండగా, దానికన్న వేరుగా నొక భాండ

వాద్యము (ప్రాప్తమయినపుడు ఉపక్రమమున నొకవిధమగు తాల ముపక్రాంతమై దాని కన్న వేరుగా నొక తాలము ప్రయోగ ప్రాప్తమయినప్పుడును, నర్తకి చకిత కాక విచక్షణయై సంధి యుండ నట్లు నర్తన మొనరించు నేని సుసంధి యను దేశీలాస్యాంగ మగును. వాద్యవాదన సమర్థుడు ఒక వాద్యమున కన్న మరొక వాద్యమునకు సంధి యుండ నట్లుగనె వాదన మొనరించును. ఒక తాలమున కన్న వేరొక తాల ముపయోగించు నాతడును అంతరము గోచరింప కుండునట్లుగనె ప్రయోగించును. వాని నుపలక్షించి విచక్షణ యగు నర్తకి నృత్తమున సంధి గోచరింపకుండు నట్లు సాను సంధానమున నున్నట్లుగా నర్తన మొనరించిన సుసంధి యని భావము.

౪౪. పాదపాటః

స్ఫుట ముచ్చారయంతీవ వాద్యపాటాక్షరాణి చేత్
పాదపాతై ర్నిజైః పూర్వకాయరేఖా మముంచతీ
నర్తకీ లలితం నృత్యే త్పాదపాట స్తదా మతః

పాదపాటమునకె పాదమణి యనియు పేరు. పాదపాటమును కొందరు దేశీచారి యనియే భావించిరి. మతంగుడు పదునారు పాద పాటముల నంగీకరించెను. జ్యాయనుడును నిరూపించెను. ఇచటి పాద పాటము దేశీలాస్యాంగము. పాట మనునది నాట్యవిద్యలో నొక సాంకేతిక పదము. వాద్యవర్ణసమూహమునకు పాట మని పేరు. "స పాటో యశ్చ శబ్దానాముచ్చారో వాద్యసంగినాం" వాద్యసంగతము లగు శబ్దముల సముచ్చారమును పాట మందురు. "మృదంగ వీణామురజాది జన్మా కరాభిఘాత ప్రభవస్తు పాటః" అని రఘునాథ లక్షణము.

నర్తన మొనరించు నర్తకి వాద్యపాటాక్షరములను స్ఫుటముగా నుచ్చరించునదై తన పాదపాటములచే లలితముగా నర్తన మొనరించు నేని పాదపాటమను దేశీలాస్యాంగ మగును. ఇట్టి యీ నర్తనమున పూర్వకాయ రేఖ నేమాత్రము విడనాడరాదు. పూర్వకాయ మచంచలముగా నుండగా రేఖాసౌష్ఠవసంపన్నముగా నుండగా నిరంతర నిజపాద పాటములచే వాద్యాక్షరముల నుచ్చారణ మొనరించు చున్నట్లుండ వలెను. ఊర్ధ్వదేహము కదల రాదు. పాదములె పలుకు నట్లుండ వలెను. అప్పుడు పాదపాటము.

౪౫. గతిస్థం.

మార్గదేశీగతం యద్వా సమగ్రం లక్షణాన్వితం
వాద్యతాలయుతం నృత్తం గతిస్థం ప్రణిగద్యతే.

మార్గసంప్రదాయానుగత మగు నృత్తము కాని, దేశీసంప్రదాయానుగత మయిన నృత్తము కాని, సమగ్ర మయిన లక్షణాన్విత మగు నృత్తము వాద్య తాల యుతముగా నున్నచో గతిస్థ మను దేశీలాస్యాంగ మగును. వాద్య తాల యుతముగా నృత్త ముండుట యావశ్యకము. అట్లు కాకున్న నది యుక్తము కాదు. అట్లున్న గతిస్థ మగును.

౪౬. చండనం

గీతానుగస్య వాద్యస్య గీతేన రహితస్యవా
ఉచితం నర్తనం కృత్వా తదంతే ప్రౌఢనర్తకీ
నృత్యస్య త్యాగమాధత్తే సౌష్ఠవేన యుతాథవా
క్షణం నిష్పందితై రంగై స్తిష్ఠే చ్చిత్రార్పితా యథా
యత్ర చండన మిత్యేత న్నర్తకైః పరికీర్తితం.

నృత్తరంగమున నర్తన మొనరించు ప్రౌఢనర్తకి గీతానుగత మగు వాద్యమునకు తగిన విధమున నర్తన మొనరించి గాని, గీతరహిత మయిన వాద్యమునకు తగిన విధమున నర్తన మొనరించి గాని, తదంతమున సముచిత సౌష్ఠవముతో కూడుకొనినదై నృత్తమునకు త్యాగ మొనరించునేని తా నొనరించు నృత్త మాపునేని చందన మను పేరు కల దేశీలాస్యాంగ మగును. వాద్యము గీతసహిత మయినను కాకున్నను తదుచితముగా తా నొనరించు నృత్తమును తదంతమున వెంటనే యాపుట యిందలి రూపము. వెంటనే యాపి సౌష్ఠవముతో నుండుట ప్రౌఢనర్తకీ విలాసము. అది చందనము. అథవా, ఇదియు చందనము. వాద్యోచితనృత్తానంతరము వెంటనే క్షణకాలము చిత్రార్పిత వలె నిష్పందావయవములతో నిలబడు నేని చందన మగును. వాద్యాంతమున నే యంగభంగిలో నున్నదో ఆ యంగభంగిలో క్షణకాల మట్లె యుండుట ప్రేక్షకుల మనోధారణ మునకు తగినట్లుండి యభినందనాస్పద మగును.

ఇప్పటి కిట్లు ఉద్దిష్టము లయిన దేశీలాస్యాంగములు నలుబది యారును నిరూపితము లయినవి. ఈ దేశీలాస్యాంగ భావనము సర్వవిధ నృత్య రమ్యతాసంభావనమున సహకారి.

## గతిలక్షణం.

ఇటుపై గతిలక్షణ నిరూపణముతో నీ యధ్యాయము సమాప్త మగును. తాలవిధానానుసారమున గతులు మూడు విధములు. అవి శుద్ధగతులు సంకీర్ణగతులు నగును. ఏకవింశతి సంఖ్యాకము లయిన సంకీర్ణగతులు కలవు. తాలముల లయవిధానములు కూడ పరివర్త సమానము లని మానసామ్యము కలవి యని భేదమున నున్నవి. తదనుసారమున గతులు ఏకసర ద్విసర త్రిసర భేదముల నుండును.

ఇవి యన్నియు చారులతో పాటములతో లాస్యాంగములతో గూడినవై యనేకభేదములు కలవగును. ఇట్టి గతు లన్నియు మనోహరములు. వీని నిరూపణ మిచట అవసర ప్రాప్తము.

నర్తనే గతయస్త్రిస్రో ద్రుతమధ్యవిలంబితాః
దీర్ఘాల్పతాలకాలేషు సంభవం త్యఖిలే ష్వపి
ఏతాః శుద్ధాః పునస్తాసాం సంకీర్ణాః సంకరాన్మిథః
ఆదిమధ్యావసానేషు రాజన్తి స్వయమేవ యాః
తాః శుద్ధాః స్యు ర్ద్వయో ర్యోగా త్సంకీర్ణా స్తస్సృజా మపి.

నర్తకీ నర్తనము నందు మూడు గతు లున్నవి. ద్రుతగతి మధ్యగతి విలంబిత గతి యని వాని పేరులు. సర్వవిధము లయిన తాల కాలము లందును ఇవి సంభవించును. దీర్ఘతాలకాలమున మధ్యతాలకాలమున అల్పతాలకాలమున నివి సంభవించును. ఈ విధముగా నాయా తాలకాలానుసారమున సంభూతము లగు నీ గతులు శుద్ధములు. మరికొన్ని సంకీర్ణములు. ద్రుత మధ్య విలంబిత తాలకాలమానముల పరస్పర సాంకర్యము వలన సంకీర్ణగతు లేర్పడును. ఆది మధ్యావసానములలో నీ గతు లన్నియు స్వయముగ శోభించు నవి యగును. కావున నివి శుద్ధములు. రెండు విధము లయిన తాలకాలముల సంబంధమున ప్రసరించు గతివిశేషముల సంబంధమునను, మూడు విధము లయిన గతివిశేషముల సంబంధమునను సంకీర్ణగతు లేర్పడును.

ద్వివారచరణన్యాసం తాలస్యైకస్య మానతః
కుర్వతీ నర్తకీ గచ్ఛేద్యస్యాం సా కథితా ద్రుతా
ఏకవారం తు మధ్యా స్యా త్తాలమానం తు తత్పునః
ఏకవార మియన్? ధీరైః వినిర్దిష్టా విలంబితా.

గతిక్రియ లక్షణ మచట నున్నది. ఒక తాల మానమునకు రెండు పర్యాయములు నర్తకి చరణన్యాస మొనరించినచో తాలమునకు రెండు పాదన్యాసములుగా నర్తకి గమన మొనరించినచో నది ద్రుతగతి యగును. ఒక తాలమానము ననుసరించి యొక పర్యాయమె పాదన్యాస మొనరించిన మధ్యగతి యగును. విలంబిత గతి నిరూపక మయిన లక్షణాంశము శుద్ధసాపేక్షముగా నున్నది. ఉన్నది యున్న విధమున వివక్షితార్థ మిచ్చుట లేదు. ఈ భాగ మిందుండ దగును ఒక తాలమానమున కధికముగా నర్తకి పాదన్యాస మొనరించుట విలంబిత గతి యగును. ద్రుత మధ్య విలంబిత గతు లీ విధముగా తాలమానానుసారమున నున్నవి. ఇవి శుద్ధములు.

విలంబితద్రుతా మధ్యవిలంబా ద్రుతమధ్యమా
తిస్రః స్యుర్వృత్తయస్తాసాం ఇతి షట్సంకరాద్వయోః
తయోరేవ తు కస్యాశ్చిదావృత్త్యా సంభవంతి షట్
మధ్యాద్యంతే ద్రుతాద్యంతే విలంబాద్యంతిమే ఇతి
ద్రుతమధ్యవిలంబాధ మధ్యద్రుత విలంబితా
విలంబద్రుతమధ్యా చ మధ్యలంబిత సద్రుతా
లంబమధ్యద్రుతా తద్వద్ద్రుతలంబితమధ్యమా
భవంతి సంకరాత్ షట్స్యుః తేమాతా ఏకవింశతిః

ఈ మూడు గతులకు మూడు వృత్తులు కలవు. వాని నామములు.

౧ విలంబిత ద్రుతగతి
౨ మధ్యమ విలంబగతి
3 ద్రుతమధ్యమ గతి

వీనిలోని వాని యటు నిటు సాంకర్యము వలన ఆరు భేదములు కలుగును. పై మూడు వృత్తులకు సాంకర్యసిద్ధము లయిన షడ్భేదముల సంబంధము కలుగగా ౩×౬=౧౮ పదునెనిమిది భేదములు సిద్ధము లగును. ఇవి సంకీర్ణములు. మొదటి శుద్ధభేదత్రయమున గూడి గతిభేదములు ఇరువదియొకటి యగుచున్నవి. విలంబితద్రుతములకు రెండిటి కావృత్తి యొనరించుటలో మధ్యమమునకు నావృత్తి గూర్చి షడ్భేదములను సిద్ధపఱచ వచ్చును. వాని స్వరూపకథనమున నీ విధానము గుర్తించుట యుక్తముగా నుండును. మధ్యమము మధ్యంతముల నుండుట, ద్రుత మాద్యంతముల నుండుట, విలంబిత మాద్యంతములనుండుట భావనీయము కాగా నిట్టి రూపము లేర్పడును.

౧ ద్రుతమధ్యవిలంబిత
౨ మధ్యద్రుతవిలంబిత
౩ విలంబితద్రుతమధ్య
౪ మధ్యవిలంబితద్రుత
౫ విలంబితమధ్యద్రుత
౬ ద్రుతవిలంబితమధ్య

ఆద్యంతము లందు ద్రుతమధ్యవిలంబితములను జాయపతి సంతోక్తిగా చెప్పుటచే గతి ననుసరించు సుగతి కల నర్తకి ఆ యాస్థానము లం దనుసంధాన విశేషము కూర్పవలె నని భావము. ఇంక పదలి విశేషాంశములను తాలవాద్యాకరగ్రంథముల నుండి గ్రహించుట యుక్తము.

పరివర్తనమానా యే తాలానాం నియతా లయాః
మానసామ్యయుజో యే చ తై రేవ ప్రోక్తయా గతా
నర్తనీయం విపర్యాసాదప్యుక్తోఽర్ధాంగరేఖయా

ఆదితాలైకతాలాఖ్య మంఠికా ప్రముఖా ఇమే
పరివర్తసమాజ్ఞేయాస్తాలాస్తాలవిచక్షణైః
ప్రతితాలద్వితీయాఖ్యౌ నిస్సారుక తృతీయకౌ
ఏవమాదీ మిథో జ్ఞేయౌ తజ్జైర్మానసమాలితి.

గతివిధానము తాలానుసారి కాగా తాలవిధాన మిందు నిరూపిత మగును. తాలముల లయరీతులు పరివర్తసమానము లని మానసామ్యము కలవి యని రెండు విధములుగా నియతములై యున్నవి. పరివర్తన శబ్దార్థ మీ విధముగ నిర్గాహ్యము. తాల శాస్త్రము నందు పరివర్తనము పారిభాషికపదము. తాలలయ విధానమున పరివర్తన మంగము. గీతమున గాని నాట్యమున గాని పాదభాగముల ఆవృత్తిని పరివర్తన మందురు. ఇచట పాద మనగా ఏకకల ద్వికల చతుష్కలాదులలో ప్రయుక్త మగు విభాగము. గీతనాట్యముల తుదివరకు తాలమునకు పునఃపునరావర్తన మావశ్య కము. దానికే పరివర్తన మని పేరు. తాల కాల ప్రమాణము మానము. తత్సామ్యమున తాల లయ విధానము లుండును. పరివర్త సమానములుగా మానసామ్యము కలవిగా ప్రసిద్ధము లయిన తాల లయవిధానములదే గతిప్రౌఢి సంపాదించిన నర్తకి నర్తనరంగమున నర్తన మాచరింప వలెను. శరీరము నందలి పూర్వభాగసంచారమున గూడ నీ గతిప్రచారము ననుసరించి నర్తింపవలసి యుండుటను గతి విదులు చెప్పిరి.

ఆదితాలము ఏకతాలము మంఠిక మొదలయిన దేశీతాల ములు పరివర్తసమానము లని తాలలక్షణవిదుః లనిరి. ప్రతితాలము ద్వితీయతాలము నిస్సారుక తాలము అను దేశీతాలములు పరస్ప రము మాన సమానములని తద్విదు లనిరి. ఆ యా తాలముల స్వరూపవివేక మీ విధముగ నున్నది.

౧ ఆదితాలము. "ఆదితాలేలఘుః, లఘునా త్వాది తాలః స్యాత్" ఒక్కలఘు వాదితాలము.

౨. ఏకతాలము. "ఏకద్రుతేన ఏకతాలః" ఒక్క గురువుండుట ఏకతాలము. లక్ష్యమున ఏకతాలము రక్తిప్రదము కాదని ఏకతాలస్థానమున ఆదితాలము నివేశిత మయిన దని యందురు.

3. మంఠిక. ఇదియు దేశీతాలము. "మంఠికా లొఘుతద్వంద్వం" రెండులఘువులు రెండు గురువు లుండుట మంఠికా తాలము.

౪. ప్రతితాలము. దేశీతాలమె "లఘుద్వంద్వా న్మార్ధ్వం స్యాద్గగనద్వయం" ప్రతితాలమున రెండు లఘువులు రెండు గురువులు నుండును. కొందరు "లఘునా చ ద్రుతాభ్యాం చ ప్రతితాలః ప్రకీర్తితః" ఒక లఘువు రెండు గురువు లుండుట కొందరి భావము.

౫. ద్వితీయ తాలము. "ద్రుతద్వంద్వా లఘుశ్చాంతే" ద్వితీయ తాలమునందు రెండు గురువులు తుద కొక లఘువు నుండును.

౬. నిస్సారుకము. "విరామాంతం లఘుద్వంద్వం తాలే నిస్సారుకే భవేత్" నిస్సారుక తాలము నందు విరామాంత మున రెండు లఘువు లుండును. విరామ మనగా, "విరామః తాల కాలోఽత్ర స్యాత్ ద్రుతాత్కించిదూనితః" ద్రుతకాలము కన్న కించిత్ తక్కువ యయిన కాలము.

గతిభేదాః

గతిరేకసరాఽన్యా తు ద్విసరా త్రిసరా తతః
త్రిసస్తు గతయో దిక్షు సంభవంత్యఖిలాస్వపి
సతాలా సహజా పాదసృతి రేకసరా మతా

సకృదాద్యం వినిక్షిప్య నిక్షిపేచ్చరణం పరం
భూపృష్ఠనికటే తస్య న్యస్యన్నాద్యం పురస్సరం
యస్యాం పర్యాయశో ధీరైః ద్విసరేయ ముదీరితా
అస్యామేవ యదా పూర్వస్త్రివారం చరణస్సరేత్
ద్వివారం పూర్వవచ్చాన్యః త్రిసరేతి తదామతా.

మరి కొన్ని గతిభేదము లిందు ప్రదర్శితము లగును. ఏక సరగతి ద్విసరగతి త్రిసరగతి యని మూడు గతులు కలవు. ఇవి సర్వదేశలందును ప్రసరించును.

౧ ఏకసర. తాలవిధానము ననుసరించిన సహజ మగు పాద ప్రసారము ఏకసరగతి యనుట సమ్మతము. ఏకస్వర మనునొక వర్ణాలంకారము కలదు. స రి గ మ ప ధ ని అను స్వరములకు క్రమముగా నారోహణము వలన ఆరోహి ఏకస్వరము కల్గును. ని ధ ప మ గ రి స అను వ్యుత్క్రమమున నవరోహ మున్నచో అవరోహి ఏకస్వర మగును. స్వరము లన్నియు క్రమముగా ఏకఘాత రుచిరము లయినచో ఏకస్వర మగును. తాల మొకలఘువుతో నుండుటను ఏకఘాత రుచిర మనునది సూచించును. ఇది ఆదితాలాను గతమై ఆనుపూర్వీవిశిష్టమై యుండును.

౨ ద్విసర. మొదట నొక్క పర్యాయ మొకచరణము నుంచి రెండవ చరణమును భూపృష్ఠ మయిన సమీపభాగమున నుంచునది. ఆ రెండవ చరణమునకు మొదటి చరణమును పురస్సర ముగా నుండునట్లు కూర్చునది. మఱల రెండవ చరణమును మఱల మొదటి చరణమును పర్యాయమున గూర్పవలెను. ఇట్టి విధాన మునకు ద్విసర మని పేరు. ద్విసరమును వర్ణాలంకారము కలదు. స్వరయుగమును రెండు పర్యాయము లుచ్చరించి వేరొక స్వరము

నొక్క పర్యాయ ముచ్చరింప వలెను. సరి సరి గరి గరి గమ ఇట్లే వ్యుత్క్రమమున మ గరి గరి గరి సరి స. ఇది రూపకతాలానుగతమై ఆనుపూర్వీవిశిష్టముగా నుండును.

3 త్రిసర. ఈ ద్విసరగతి యందలి మొదటి చరణము మూడు పర్యాయములు ప్రసరించినచో రెండవపాదము పూర్వము వలె ద్వివారము ప్రసరించినచో త్రిసర అను గతి యగును. త్రిస్వర మను వర్ణాలంకారము కలదు. ఇందు స్వరత్రయమును రెండు పర్యాయము లుచ్చరింప వలెను. అనంతర మున్న స్వరము నొక పర్యాయము పలుక వలెను. ఇది రూపకతాళానుగతముగా నుండి ఆనుపూర్వీవిశేషము కల దగును. సరిగ సరిగమ రిగమప.

ఈ నిరూపించిన ఏకసర్వర ద్విస్వర త్రిస్వర విశేషములకు ఏకసర ద్విసర త్రిసర గతులకు సంబంధ మూహించునది.

## భేదాన్తరాణి

అగ్రతః పృష్ఠతో వర్జ్యం దిక్షు షట్స్వపతాస్వపి
స్వస్తికం ఘటయేత్పూర్వః పరో విశ్లేషయంశ్చరేత్
ఏతాస్వేవ యదా తాః స్యుస్తదా స్వస్తికపూర్వకాః
అనంతాః స్యురిమాశ్చారిపాట లాస్యాంగ సంగతాః

ఈ చెప్పిన గతిభేదములు స్వస్తికపూర్వకములు కాగా భేదాంతరములు కలుగుట యిచట నిరూపితము లగును. అగ్రభాగమును విడనాడి పృష్ఠభాగమును విడనాడి యితరము లయిన ఆరుదిక్కు లందును మొదటి పాదమున స్వస్తికమును కూర్చవలెను. రెండవ పాదమున విశ్లేష మొనరించుచు సరింప వలెను. ఇట్లనుసరింపగా నీ ఏకసరాది గతులలో స్వస్తికపూర్వకము లయిన గతిభేదము లేర్పడును. ఇట్టి గతులు చారి పాట లాస్యాంగ సంగతములై అనంత

భేదములు కలవగును. వాని నన్నిటిని సంఖ్యానించుట శక్యము కాదు. అభ్యాసానుసారముగా సమర్థు లగు వారు ప్రయోగమున సరి చూచుకొనుట యుచితము

సలీలాః సౌష్ఠవోపేతాః సోల్లాలాః సాక్షివిభ్రమాః
సహస్తకరణాః కస్య గతయో న మనోహరాః

అధ్యాయోపసంహారమున జాయసేనాపతి గతిప్రశంస యొనరించుట యిందున్నది. లీలాసహితములు సౌష్ఠవోపేతములు ఉల్లాలయుక్తములు నేత్రవిభ్రమ సహితములు హస్తాచరణ సహితములు నయిన గతు లేరికి మనోహరములు కావు? అవి యట్టివి సర్వమనోరములు. వీనిలో లీలాసౌష్ఠవోల్లాలాక్షివిభ్రమ హస్తకరణ పదములు సాభిప్రాయముగా ప్రయుక్తము లయినవి.

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ
గజసాధనిక శ్రీ జాయసేనాపతి
విరచిత నృత్తరత్నావల్యాం
దేశీస్థానక కరణ భ్రమరిలక్షణం నామ
షష్ఠాధ్యాయః

ఆంధ్రభోజ, సాహితీవల్లభ
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజ
భావసాధక శ్రీ మాధవరామశర్మ
విరచిత సాహితీవల్లభాఖ్యవ్యాఖ్య
దేశీ పాటచారలాస్యాంగ గతిలక్షణము
షష్ఠాధ్యాయము.

శ్రీ

శ్రీ జాయసేనాపతి విరచిత

# నృత్తరత్నావలీ

## సప్తమాధ్యాయః

---

ఈ సప్తమాధ్యాయమున సర్వసంభావనీయము లగు విశేషములు కలవు నృత్యారంభ యోగ్యము లయిన తిథులు నిర్ణీతము లయినవి. వాని జూచి యారంభ యోగ్యములు కాని వానిని గుర్తింప వచ్చును. రంగభూమి స్వరూప మున్నది. నాట్యశిక్షారంభ సమయమున జేయ వలయు పూజావిశేషము లున్నవి. శిక్షాపద్ధతి కలదు. శిక్షాయోగ్య యగు కన్య స్వరూపము ఆ కన్య నేపథ్యము శిక్షోపకరణములు నిర్దిష్టములగును. అభ్యాసక్రమము పాటవమునకు కారణము లయిన నృత్తరహస్యములు నిర్ణీతము లయినవి.

భావప్రాధాన్య మంతట అపరిహార్యము. దృష్టి మనోభావములు కరానుసారులుగా నుండుట కరములు రసవినియోగమున నుండుట నిర్దిష్ట మగును. వాద్యపద్ధతి తద్భేదములు నున్నవి. నర్తకి ప్రవేశించి యొనరింప వలసిన విధానములు చిత్రపద్ధతి దేశీనృత్త భేదములు వికటనర్తనము ప్రేంఖణ నర్తనము సూడనర్తనము రాసక నర్తనము పాత్రప్రాశస్త్యము రాసకోచిత మయిన గీతము గీతార్థాభినయము నిరూపిత మగును.

నర్తనమున ప్రవేశ నిర్గమనాదులలో కొన్ని విశేషములు కలవు. నర్తకీ సంఖ్యయు నియతము. శివప్రియ నర్తనము సవిశేష

ముగా దెలియ దగి యున్నది. శివోత్సవములలో నది యాచరణీ యము. చిన్ను నృత్తము కందుక నర్తనము భాండిక నృత్తము వివిధ రుతముల ననుకరించుట అది హాస్యప్రాయ మగుట దాని వినోద ఫలత్వము ఇందు నిరూపితము కాగలదు. నర్తనము నందలి గానము లన్నియు కిరాత రూపుడయిన శివుని స్తుతిరూపములుగా నుండును.

పురుషులును కొన్నిటిని ప్రయోగింప జనును. చారణనృత్తము సౌరాష్ట్రనర్తనము బహురూప నర్తనము కోలాట నర్తనము నిరూపితములు కాగలవు. ఎందును గ్రామ్యత యుక్తము కాదు. నర్తకీ లక్షణము నర్తక లక్షణము గుర్తింపదగి యున్నది. బృందగీతి తద్భేదములు ఉత్సవాదులలో నుపయోగించుట యిందుండును. రంగమంటపము దాని భేదములు వర్ణితము లగును. సభాపతి లక్ష ణము సభ్యగుణములు ఇందు నిరూపితములు కాగలవు. ఇట్టీయధ్యా యము సర్వసహృదయసంభావ్యముగా నిరూపిత మగును. నృత్తగౌర వము గుర్తించుట కిది యావశ్యకము.

ఇందు మొదట నృత్యారంభ యోగ్యము లయిన తిథుల వార నక్షత్రముల విచారణ మిట్లున్నది.

తిథిస్సర్వా వినా రిక్తా త్రయో వారా బుధాదిమాః
హస్తః శతభిషక్పుష్యావనూరాధోత్తరాత్రయం
ధనిష్ఠా రేవతీ జ్యేష్ఠా నృత్యారంభే ప్రశస్యతే-

శూన్యతిథికాక సర్వతిథులు నృత్యారంభమున యుక్తములే యగును. బుధ గురు శుక్రవారములు మూడు సముచితములు. హస్త శతభిషక్కు పుష్యమి అనూరాధ ఉత్తరాత్రయమనదగిన ఉత్తర ఉత్తరాభాద్ర ఉత్తరాషాఢ నక్షత్రములు ధనిష్ఠ రేవతి జ్యేష్ఠ అను నక్షత్రములు నృత్యారంభమున సముచితములు.

## రంగభూమిః

సౌధే కేలివనే రమ్యే శాద్వలేఽన్యత్ర వా శుభే
స్థానే యోగ్యా విధాతవ్యా వితానాదివిచిత్రితా
స్థిరా శ్లక్ష్ణా సమా గౌరీ కృష్ణా వా రంగభూర్మతా
హేమంతే శిశిరే చోష్ణా వసంతగ్రీష్మయోర్హిమా
ఘనాగమాపగమయోః సాధారణగుణా తథా

రంగభూనిర్ణయ మిందున్నది. రాజసౌధమున రంగశాల యుచితము కేలివన ముచితము. కేలివన మనుట అచటనున్న ప్రాసాదము వివక్షితము కావలెను. రమ్యముగా నున్న శాద్వల మందును నృత్యరంగము కూర్ప వచ్చును శుభాస్పదమయిన యితర స్థలమునందును నృత్తవినోదనము యుక్తముగా నుండును. ఆ యా స్థలములందు పైయాచ్ఛాదనము లేకున్నచో వితానాదివిచిత్రతను సంపాదింప వలెను. అట్టి సముచిత స్థానము నందు రంగభూమి యుండుట యుక్తము. హర్మ్యమున గృహమధ్యమున మనోహర ప్రాంగణమున ఉద్యానమున శాద్వలస్థానమున నృత్తవినోదము యుక్తముగా నుండునని మానసోల్లాసాదులందు కలదు. అట్టి భావము జ్యాయన రచనలో సంగృహీత మయినది. రంగభూమి స్థిరము శ్లక్ష్ణము సమముగా నుండ వలెను ఎగుడు దిగుడుగా నుండక నిమ్నోన్నతభాగముల సర్దుబాటుతో నుండవలెను. నున్ననై మెత్తగా నుండవలెను. ఇట్లున్న రంగభూమి గౌరవర్ణముతోగాని నీలవర్ణముతోగాని యుండ దగును. ఈ వర్ణములతో నున్నచో దృశ్యము సదస్యులకు రమ్యము కాగలదు.

హేమంత శిశిర సమయములం దుష్ణత కలిగించునదిగా, వసంతగ్రీష్మ సమయములలో శీతలత నాపాదించునదిగా వర్షా

శరత్సమయములలో సాధారణ గుణాశ్రయముగా నుండుట యుక్తము. అట్లున్న నే సదస్యులు దృశ్యశ్రవ్యలగ్నమానసు లగుదురు.

## విఘ్నేశ్వరాది పూజా.

విఘ్నేశ్వరం సురజ్యేష్ఠం వైకుంఠప్రముఖాన్సురాన్
భారతీం చండికాం మాతృసమాజం కులదేవతాం
ఆతోద్యమఖిలం తాలం దండికాం స్థాణయోర్ద్వయం
రంగభూమి ముపాధ్యాయం కన్యకాం చ యధావిధి
విప్రేణాభ్యర్చయేత్ శుభ్రైర్గంధపుష్పాక్షతాంబరైః
ధూపైరారాత్రికైర్దీపైర్నైవేద్యైర్వివిధై రపి

రంగశాలలో నర్తనారంభ సమయమున కొన్ని పూజావిధానముల నొనరింప వలసి యున్నది. వాస్తువిద్యాతంత్రానుసారమున భవనము స్థావరాత్మకముగ నున్నను చేతనాత్మకముగ నుండుటయు ప్రసిద్ధము. సర్వదేవతాత్మకముగ నుండుటయు నున్నది. కావున నచట మొదటగా సురజ్యేష్ఠుడయిన విఘ్నేశ్వరుని పూజింప వలెను. పిమ్మట విష్ణ్వాది దేవతల నర్చింప వలెను. భారతీదేవిని చండికాదేవి నారాధింప వలెను. మాతృసమాజనామమున జెప్పదగిన సప్తమాతృకల నారాధింపదగును. బ్రాహ్మి మాహేశ్వరి కౌమారి వైష్ణవి వారాహి ఐంద్రాణి చాముండేశ్వరి అను వారు సప్తమాతృకలు. కులదేవతారాధన మావశ్యకము. కులదేవతలు కులపాలికలు కామేశ్వరి ఉమాదేవి హైమవతి శ్రీదేవి మాధవి మొదలగు ప్రసిద్ధ నామములతో కులదేవతలారాధనముల నందుకొందురు.

నృత్యరంగస్థలమున నావశ్యకములయిన ఆతోద్యములను తాలమును దండికను స్థాణాద్వయమును రంగభూమిని నృత్తవిద్యోపాధ్యాయుని నవవర్ష కన్యను యథావిధిగా సంప్రదాయ విదుడయిన

శ్రోత్రియబ్రాహ్మణునిచే నర్చింప జేయవలెను. శుభ్రములయిన గంధపుష్పాక్షతాంబరములతో ధూపములతో ఆరార్తికములతో దీపములతో వివిధములగు నైవేద్యములతో విప్రుడర్చన మొనరింప వలెను.

శిక్షాపద్ధతిః

షట్సప్తవర్షదేశీయాం గౌరీం యద్వా తు రోహిణీం
కన్యాం చార్ధోరుకం గాఢం వసానాం శిక్షయేత్క్రమం
తతః స్తనోద్గమే జాతే దధానామపి కంచుకం

నాట్యాచార్యుడు నాట్యము నృత్యము నృత్తము శిష్యులకు శిక్షణమున శిక్షిత మొనరింప వలెను. ఈ శిక్షాపద్ధతి యిట్లున్నది. ఆరుగాని ఏడుగాని సంవత్సరముల వయసుకల కన్యనుగాని, అంతకన్న చిన్న వయసుకల గౌరి యనదగు కన్యనుగాని, అథవా; తొమ్మిది సంవత్సరముల వయసుకల రోహిణి యనదగు కన్యనుగాని గాఢముగా చిన్నలాగు (అర్ధోరుకము) ధరించిన దాని నృత్యక్రమ శిక్షిత నొనర్పవలెను. వయసధికముగా నున్నచో నవయువములు నృత్తశిక్షణోచితముగ నుండ జాలవు. కావున లేతవయసుననె శిక్షణ మీయ వలయును. ఆ కన్యకు స్తనోద్గము మంకురించినచో కంచుక ధారణము యుక్తము. రవిక ధరించు కన్యకకు శిక్షణమిచ్చుట యుచితము ఇట్టిందు కన్య శిక్షాయోగ్య. ఆ కన్యా నేపథ్య మర్ధోరుకము. స్తనాంకురము వోటమరించినచో కంచుకము. అట్టి పిల్లకు నాట్యాభ్యాసశిక్షణ మిచ్చుట రమ్యము. శ్రీమమనునది నృత్తాభ్యాసము.

నాట్యశిక్షణమున కొన్ని యుపకరణము లున్నవి. అట్టి యుపకరణములను అవధానవిశేషమునకూర్చి యుంచవలెను. శిక్షణ విధానమున కొక దండిక యావశ్యకము. ఆ దండికా లక్షణ మిట్లున్నది.

## దండికాలక్షణం.

వైణవీం దండికాం శ్లక్ష్ణాం దోషహీనాం సుఖగ్రహాం
సప్తభిః పర్వభిర్యుక్తాం మూలతో గాత్రవర్తనైః
గాత్రసౌష్ఠవసిద్ధ్యర్థం కన్యానాం స్తనసంమితాం
ప్రాగగ్రముదగగ్రం వా స్థూణయోర్వినివేశయేత్
హస్తాభ్యాం దండికాం ధృత్వా నర్తకీస్థైర్యసిద్ధయే
ఆచార్యస్యోపదేశేన మార్గ దేశీ విభాగతః

శిక్షాపద్ధతి యందలి దండిక వెదురుతో సిద్ధమయిన దండము వేణుదండము వైణవదండిక. ఆదండిక శ్లక్ష్ణము నున్నగా నుండ దగును. దోషరహితము కావలెను. పొరుపు లుండరాదు. పేడు రేగరాదు. ముడులుసుడు లుండరాదు. పట్టుటకు యోగ్యముగా చక్కగా నుండ వలెను. సుఖగ్రహము కావలెను. ఏడుకణుపులతో నుండవలెను. ఆ దండమును మొదటి నుండియు కణుపుల దగ్గర మలచి నున్నగా జేయ వలెను. ఆ దండిక నర్తన మొనరించు కన్యల స్తనసంమితమై యుండ దగును. హృదయ ప్రమాణముగ నుండ వలెను. ఆ దండము స్వరూప సౌష్ఠవము కలది యగుటకై ప్రాగగ్రముగాని ఉదగగ్రముగాని రెండు స్థూణముల మధ్యకూర్చి యుంచ వలెను. అప్పుడది వంపులు దీరి తిన్నగా నున్నగా నగును. అట్లు యుక్త రూపమయిన దండికను స్థైర్యసిద్ధికై నర్తకి ధరింప వలెను. మార్గదేశీ విభాగమున ఆచార్యుని యుపదేశానుసారముగ నా నర్తకి ప్రవర్తింప వలసి యుండును. దండికను చేతబట్టి నర్తకి పాదగతు లభ్యసించుట మొదటి రీతి. ఇట్లు దండికోపయోగ మున్నది. దీని యనుసారమున నర్తకి యభ్యాస మొనరించుట యుక్తము.

## అభ్యాసక్రమః

స్థానాదీన్సుకరరానాదౌ ప్రయోగాన్దుష్కరాన్తతః
అభ్యసేచ్ఛనకైర్నిత్యం యథా శ్రాంతిర్న జాయతే
బుద్ధ్వా సిద్ధాన్ప్రయోగాంస్తాంస్తాలైస్సంయోజయేత్పునః
అథైతాన్వక్త్రవాద్యేన గీతేనాపి క్రమాత్తతః

నర్తనాభ్యాస మొనరించు నర్తకి ముందుగా సుకరములగు వాని నభ్యసింప వలెను. తృతీయాధ్యాయమున నిరూపితము లయిన స్థానములు సుకరములు. స్థానమె స్థానకము. అది భావిగత్యనుకూలము. నర్తనాద్యంతిము లందీ స్థాన మావశ్యకము. "స్థిత్వా గచ్ఛేత్ తదంతేపితిష్ఠేత్" ఆద్యంతిములలో స్థాన మావశ్యకము. స్థానము లేకున్నచో నే ప్రయోగము నుండదు. భావయోగము కల శరీరాంగ విన్యాసవిశేషము స్థానము. నిశ్చలముగా నుండి మొదటగా నేత్ర కర్మాభ్యాస మొనరించుట యుక్తము. భావయోగమున నేత్రకర్మ లలవఱచుకొన వలెను. వైష్ణవ స్థానము మొదలగునవి తృతీయమున నిరూపితము లయినవి ఇట్లు సుకరములయిన స్థానాదులను నర్తకి ప్రథమాభ్యాసమున గుర్తింప వలెను. అనంతరము దుష్కరములగు ప్రయోగముల నభ్యసింప వలెను. నెమ్మదిగా నెమ్మదిగా నభ్యసింపవలెను. తొందరపడరాదు. నిత్య మభ్యసింప వలెను. శ్రమ కలుగకుండున ట్లభ్యసింపవలెను. ఆ పిమ్మటనే సిద్ధ ప్రయోగముల ననుసరించునది. ఇట్లభ్యసించిన వానినన్నిటిని తాళములతో సంయోజింపజేసి పునఃపునః అభ్యసింపవలెను. అనంతరము వక్త్రవాద్యమున కూర్పవలెను. వక్త్రవాద్యము = స్వరములను నోటితో బలుకుట, వాద్యధ్వనులను నోటితో ననుట వాని పరుసలను ముఖమున ననుట. ఇట్లు వక్త్రవాద్యమున గూర్చి యభ్య

సించిన యనంతరము గీతముతో యోజన మొనరించి యభ్యసింప వలెను. ఇట్లు క్రమముగా నభ్యసించుట శిక్షాపద్ధతి.

గురుం సంతోష్య బృందేన సహ స్వర్ణాంబరాదిభిః
శుభే హి పూర్వవత్పూజాం విధాయాతోద్యవాదకైః
సార్ధం సర్వేణ బృందేన శ్రమం కుర్వీత నర్తకీ.

సక్రమముగా శిక్షాపద్ధతి ననుసరించిన నర్తకి తన బృందముతోఁగూడి గురుపూజ నాచరింప వలెను. స్వర్ణాంబరాదులతో నారాధింప వలెను. పూర్వమువలె శుభసమయమున పూజనిర్వహింప వలెను. అనంతరము ఆతోద్యవాదకులతో తననర్తకీబృందముతో గూడి నర్తకి నృత్తాభ్యాస మొనరింప వలెను. గురుసమక్షమున గుర్తించి గురుదక్షిణలిచ్చి నర్తకీబృందముగూడి గీతవాద్యసమ్మిలితముగా నభ్యాస మొనరింపవలెను. నలుగురు కలిసి యభ్యాస మొనరించునప్పుడు చక్కగా విశేషములను గుర్తింప వచ్చును. పొరబాటులను సర్దుకొన వచ్చును. ఈ యభ్యాసమె ప్రౌఢి నిచ్చును.

ప్రౌఢాయామథ నర్తక్యాం గీతే వాద్యేఽథ నర్తనే
పారంపర్యాత్సమాయాతమభ్యాసస్యాప్యగోచరం
శ్లోకానాం పంచకేనాత్ర సార్ధేన ప్రకటీకృతం
రహస్య ముపదేష్టవ్య మాచార్యేణేద మాదరాత్.

అభ్యాస విశేషమున నర్తకి ప్రౌఢ కాగలదు. గీతమున నర్తనమున వాద్యమున నర్తకి ప్రౌఢ కావలయును గీతార్థము ననుసరించి నర్తించుటలో వాద్యానుసారమున నర్తించుటలో నేర్చిన విధమున దోషరహితముగ నర్తించుటలో నేర్పుగలది కావలెను. "నే నదోషముగ నర్తింపగలను" అను ఆత్మవిశ్వాసము కలది కావలెను. అప్పుడు పారంపర్యమున సమాగతము లయిన విశేషము

లను బాగుగా గ్రహింపగలదు. అభ్యాసమున గోచరముకానట్టివి సాంప్రదాయకములయిన విశేషము లనదగినవి సమధికముగా నుండును. వానిని సావధానముగ నర్తకి గుర్తింప వలసి యున్నది. నాట్యాచార్యుడు శిక్షాపద్ధతి ననుసరించి యభ్యాసదార్ఢ్యమున ప్రౌఢ యయిన నర్తకి నుద్దేశించి యాదరముగ కొంత ఉపదేశింప వలసి యున్నది. ఇదియే సమయము సాంప్రదాయిక మభ్యాసాగోచర మగు నాట్యరహస్యము నుపదేశింప వలెను. అది సార్ధశ్లోక పంచక మున నిందున్నది. ఆ యుపదేశము గ్రహించి నర్తకి నర్తకి కాగలదు.

## నృత్తరహస్యం.

గీతస్యావయవానంగైః భావాన్ దృష్టివిచేష్టితైః
హస్తైరర్థం, లయం పద్భ్యాం, వర్ణాన్వాద్యైః ప్రదర్శయేత్
గీతాక్షరసమం వాద్యమవాద్యం గీతమేవ వా
లాస్యాంగైః పాదహస్తాద్యైస్తన్మిశ్రైః నృత్తమానయేత్
ప్రాణేశం భావయంతీ స్వం మానసేన సభాపతిం
గీతార్థాపతితా న్భావా న్వ్యంజయంత్యనురంజయేత్
యేషు యేషు ప్రయోగేషు ప్రేక్షకాణాం రుచిర్భవేత్
సమ్యక్ జ్ఞాతేంగితా కామం భంగ్యా తాంస్తాన్ ప్రదర్శయేత్
రసానాం వినియోగేషు యతో హేతోః కరో భవేత్
దృష్టిస్తత్ర మనశ్చ భావశ్చ తత ఏవ భవేత్క్రమాత్
రసానాం పునరుత్పత్తిర్భావైర్భవతి భావితైః

ఇచట నిరూపించిన సార్ధశ్లోకపంచకములో పదునొకండు పంక్తులలో నృత్తరహస్యము కలదు. అందలి విషయము లిట్లున్నవి. గీతము యొక్క యవయవములను అంగములచే ప్రదర్శింప వలెను. భావములను దృష్టివిచేష్టితములచే ప్రదర్శింప వలెను. హస్తములచే

నర్థమును పాదములచే లయమును పాటములచే వర్ణములను అభిన యించి ప్రదర్శింప వలెను. పాద హస్తాదుల విన్యాసములతో గూడు కొనిన లాస్యాంగములచే నృత్తి మనుసరింప వలెను. ఆ నృత్తము గీతాక్షర సమమయిన వాద్యముననుసరించి యుండును. వాద్య రహితమయిన గీతము ననుసరించియు నుండును. అట్టి నృత్తమును హస్తపాదాద్యభినయ మిశ్రమయిన లాస్యాంగ ప్రదర్శనమున ప్రయోగింప వలెను.

నర్తకి సభాపతిగా నున్న సహృదయుని మనసులో తన ప్రాణేశ్వరునిగా భావించి గీతార్థానుగతములై యున్న భావములను అభివ్యంజన మొనరించునదై రంజింపజేయ వలెను. ఏయే ప్రయోగ ములలో ప్రేక్షకుల కభిరుచి యుండునో ఆ యభిరుచిని బాగుగా గుర్తించి చక్కగా నా యా భంగీవిశేషములచే నా యా భావములను ప్రయోగమున ప్రదర్శింప వలెను కరవిన్యాసము రసప్రయోగము లందు వినియోగములందు ననుగతమై యుండును గావున దృష్టి మనస్సు భావము ఆక్రమముననె యనుసరించి యుండవలెను. బాగుగా భావితములయిన భావముల వలననె రసనిష్పత్తి యుండును. కావున రసోత్పత్తికి తగిన విధమున భావప్రయోగము భావనీయముగ నుండుట యుక్తము. మనము దృష్టి హస్తము ఒకదానికొకటిగా సంబద్ధమై యుండి రసవినియోగము పొందునది కావలయును. కావున రసపర్యవసాన స్థితికి తగిన విధమున నృత్త మాచరింపవలయు ననుట నృత్త రహస్యము.

## వాద్య పద్ధతిః

అథ పాత్రస్య నృత్తార్థం కథ్యతే వాద్యపద్ధతిః
మతంగస్య మతే ప్రోక్తా బృహద్దేశీవిధానతః
నృత్తప్రకరణే శుద్ధా విచిత్రా చేతి సా ద్విధా.

ఇక పాత్రము నృత్త మొనరించుటకై వాద్యపద్ధతి నిరూపిత మగును. వాద్యానుసారమున నృత్త మొనరింప వలెను. గావున వాద్యవిధాన మిచట నిరూపిత మగును. బృహద్దేశీవిధా నానుసారమున మతంగుని మతమున వాద్యపద్ధతి నిరూపిత మయినది. నృత్త ప్రకరణము నందు వాద్యరీతి శుద్ధము విచిత్రము నని రెండువిధములు. మతంగుడు బృహద్దేశి యను గ్రంథమునకు రచయిత. సంగీత శాస్త్రకారు లందరు మతంగుని ప్రమాణముగా నెన్నుదురు. విషయ పరామర్శమున మతంగకౌశలము ప్రశంసనీయము. అతడు నిరూపించిన వాద్యపద్ధతి యిందు నిరూపిత మగును.

సమహస్తో భవేత్తత్ర ప్రాక్ సర్వాతోద్యసంభవ
ప్రావృడారంభ సంరంభ గంభీరాంభోధర ధ్వనిః
రంగప్రత్యూహ శాంత్యర్థం నాయకస్యాపి వృద్ధయే
వాదనాత్సమహస్తాద్యైః పాఠైరన్వర్థసంజ్ఞకః
భృశం సమప్రహారాభ్యాం హస్తాభ్యామపి వాదనాత్.

నృత్యరంగస్థలము నందు మొదటగా సర్వవాద్య సముత్పన్నమగు సమహస్తమును వాదన మావిష్కృతము కావలెను. సర్వ వాద్యమున వాదనము నసమ శ్రుతిమహితమగు నాద మావిర్భావము పొంద వలెను. ఆ ధ్వని వర్షారంభ సంరంభము కల గంభీరాంభోద ధ్వనిగా భాసింప వలెను. ఆ గంభీర ధ్వని రంగవిఘ్నముల నన్నిటిని శాంతింప జేయ గలదు. ఈ ధ్వనిచే విఘ్నములు నశించును. నాయకుని అభ్యుదయమునకు నిది సూచకము. సమహస్తాది పాట విధానములతో వాదన మున్నందున నీ గంభీర ధ్వని సమహస్త మను సార్థక నామమున నున్నది. బాగుగా సమ ప్రహారము కల హస్తములతో వాదన ముండుట వలన గూడ నిది సమహస్త నామ సార్థక్యమున నున్నది.

తదను ప్రవిశేద్రంగే సమపాదేన నర్తకీ
కృతసందంశికా కుర్యాద్వామపాదం నికుట్టితం
ముఖత్రయేణ కుర్వీత సాంగేన పుటిలం తతః
తతః ప్రవర్తయేద్గీతమద్వైతి ద్వినివర్తయేత్.

గంభీరధ్వని యాపూరణానంతరము నర్తకి సమపాదమున నున్నదై ప్రవేశింప వలెను. అట్లు రంగమున ప్రవేశించి సందంశ మను అసంయుత హస్తమును పట్టవలెను. సందంశ హస్తము ద్వితీయాధ్యాయమున నిరూపిత మయినది. ఈ సందంశము అగ్రసందంశము, ముఖ సందంశము, పార్శ్వసందంశము నని మూడు విధములు. సమయ వినియోగ సముచితముగా సందంశ హస్తముద్ర నవలంబించి వామపాదమును నికుట్టిత మొనరింప వలెను. అనంతరము ముఖత్రియమను వాదన విధానమైన పుటిల మను వాద్య పద్ధతిని ప్రవర్తింప జేయ వలెను. అప్పుడు గీతమును ప్రసరింప జేయ వలెను. అనంతరము దీని నివర్తింప జేయునది.

ముఖత్రియము. గీతనృత్త ప్రారంభ విధానమునకు ముఖ మని పేరు. ముఖమనునది యొక తాళవిశేషము. నాలుగున్నర మాత్రలు కలది. ముఖ సంజ్ఞక విధానమును మూడు పర్యాయము లాచరించుట యిందావశ్యకము. సాంగముగా ముఖత్రయమున పుటిలము ప్రవర్తింప జేయునది. ఒకానొక చిత్రవాద్యమున నుండుట ముఖవాద్యము కాదగును. చిత్రవాద్యముతో నున్న ముఖవాద్యమును ఘటిల మందురు. నర్తకుడు వాద్యశ్రుతులను గుర్తించినవాడును ముఖవాద్యవిశారదుడుగ నుండుట యావశ్యకము కదా! చిత్రవాద్యమున నుండు ముఖవాద్యము ఘటిలము కాగా నీ పుటిలము ప్రవర్తింప జేయుట యుక్తము. అందు గీతప్రవృత్తి యుక్తము. అనంతరము నివర్తన ముందునను భావమును పై స్థలమున గుర్తించునది.

కశిచన గతయః

కుర్యాన్ముఖత్రయేణాథ పద్దైరంగైః ప్రవేశికం
విదధీత కియత్కాలం గతిం మంఠికయా తతః
క్రమా త్తదనుయోజేన ఖండయత్యా పదేన చ
మలపేన తథాంగేన పాశైశ్చ సుమనోహరైః
శుష్కవాద్యం ప్రయుంజీత ప్రవేశపదయోః పునః
శంఖకాంస్యాదిసంభూతా మృదంగకరటోద్భవాః
పాటావిచిత్రతాహేతోః వాద్యాః శ్రోత్రసుఖావహాః

నృత్తమున ప్రవర్తించిన నర్తకి రంగమున నొనరింప వలసిన కొన్ని గతివిశేషము లిచట నిరూపితములు కాగలవు. ముఖత్రయము ననుసరించి పదములచే అంగములచే తగిన విన్యాసముల ప్రద ర్శించుచు నర్తకి ప్రవేశితము నాచరింప వలెను. ప్రవేశిక మనునది యొక నృత్తవిశేషము. ఇది ప్రవేశికము నగును. "ప్రవేశయతి పాత్రాణి రంగం" పాత్రలను రంగమున ప్రవేశింప జేయునది. ప్రవేశసూచకము లయిన గీతపద్ధతులు ప్రసరించుచుండగా నర్తకి ప్రవేశ మొనరింప వలెను. ముఖత్రయ మనుట - ముఖ మనునది గీతాంగము. గీతనృత్త ప్రారంభ విధానమును ముఖ మందురు. ముఖ మనునది యొక తాలవిశేషము. ఇట్లు గీతాంగ ముఖత్రయమున పదవిన్యాస మంగవిన్యాసము సముచితముగా నుండునట్లుగా నర్తకి ప్రవేశ మొనరింప వలెనని భావము.

అనంతరము కొంతకాలము మంఠికావిధానమున గతి ననుస రింపవలెను. మంఠిక యనునది యొక తాలవిశేషము. పరివర్త సమానము లయిన తాలములలో మంఠిక యున్నదని షష్ఠాధ్యా యము తుదిభాగములో నిరూపిత మయినది. ఈ మంఠికయె మట్ట

పదమున నున్నది. మంఠిక దేశీతాలము. మంఠికాతాల విధానమున గతి నొనరించిన పిమ్మట యోజ విధానమున ఖండయతి యను సారమున పదవిధానమున మలప విధానమున అంగరీతులచే మనోహరము లగు పాటములచే శుష్కవాద్యమును ప్రయోగింప వలెను. ఇచటనున్న యోజాదిపారిభాషిక పదముల భావము నిట్లు గ్రహింప దగును.

౧. యోజ: ఇది యోజనము నగును. యోజ యనునది యొక తాలవిశేషము. ఈ యోజతాలమునకె ఢేంకి యనునామము నున్నది.

౨. ఖండయతి: దేశీపద్ధతికి సంబంధించిన వాద్య విధానములలో నొక విశేషము.

3. పదము: ఇది యొక ప్రబంధాంగము. వాద్య ప్రబంధము, ఆది నుండి వాదన మొనరించి పాట విధానమున యతి విడనాడినచో పదమని యందురు. దీనిని దీప్తనర్తనమున నుపయోగింతురు. ప్రబంధాంగము లారు కలవు వానిలో పద మొకటి.

౪. మలపము: వాద్యవిశేషము వాద్యప్రబంధము దీప్తనర్తనమున వినియుక్త మగును.

ప్రవేశమున పదప్రసారమున శుష్కవాద్యమును ప్రయోగింప వలెను. శ్రోతృసుఖావహము లయిన వాద్యములను విచిత్రతా సంపాదనమునకై ప్రయోగించుట యుక్తము. అట్లై పాటప్రయోగ మావశ్యకము. శంఖము కంచు వాద్యము మొదలగు వాని వలన నుత్పన్నము లయిన పాటములను ప్రసరింప జేయవలెను. మృదంగ కరటసముత్పన్నములగు వానిని ప్రయోగింప దగును. మృదంగము

ప్రసిద్ధమై కరట మొక యాతోద్యము. ఇరువదియొకటి యంగుల ముల పొడ వుండును. మత్స్యాకృతిగా నుండును. ఉత్సవ వివాహ యాత్రాదులలో దీని వినియోగింతురు. ఇట్టి వాద్యముల వలన సముత్పన్నము లయిన పాటాది వాద్యముల నిచట ప్రయోగింప వలెను ఇచటి గతి ప్రసంగమున వాద్యరీతియు నున్నది. ఇక నీ ప్రసక్తిలో తాల సంగతికై వాద్యవిధానములు నిరూపణీయములు కావున వాని నిరూపింప వలెను.

నిర్దిష్టోఽయం విధిర్నిత్యం భావి తాలచతుష్టయే
గీతం మట్టేన తత్రాదౌ కించిత్కాలం ప్రవర్తయేత్
తతః పూర్వోక్తమేవాత్ర శుష్కవాద్యం తతః పరం
అవచ్ఛేదం తతః కుర్యుః అవధానపరాయణాః
స్యాద్ద్వితీయతృతీయాభ్యాం చతుర్థేనాప్యయం విధిః
తాలేనేతి మతంగేన నిర్దిష్టా శుద్ధపద్ధతిః

ఉక్రాంత మయిన శుద్ధపద్ధతి స్వరూప మిచట నుపసంహృత మగును. నృత్తారంభ విధానమున నిది నిత్యవిధి. ఇట్లిది నిర్దిష్టము. తాల చతుష్టయమున నిది నియతముగ నుండవలెను. ఆరంభము నందు కొంతకాలము మట్టవిధానమున గీతమును ప్రవర్తింప జేయ వలెను. మట్ట మొక తాలవిశేషము. ఇది మంఠికయు నగును. కించిత్కాలము మట్టతాలమున గీతప్రవర్తన మయిన పిమ్మట పూర్వము చెప్పిన శుష్కవాద్యమును ప్రసరింపజేయ వలెను. ఆ పిమ్మట అవచ్ఛేద మావశ్యకమని అవధాన పరాయణు లాదర మున నిరూపింతురు. అవచ్ఛేదము వాద్యాంగము, మతంగు డీ శుద్ధపద్ధతిని నిరూపించుచు ద్వితీయ తాల తృతీయ తాలములచే గాని చతుర్థతాలమునన గాని యీ విధి యుండు ననెను.

విచిత్రపద్ధతిః

స్వరైర్బద్ధేన పాటైశ్చ క్రమేణ కరణత్రయం
గేయం వర్ణస్వరోపేతం గాయనైరథ వాదనైః
వాద్యం యథాక్షరం యత్ర సా చిత్రా పద్ధతిః స్మృతా
నర్తకీ నర్తనం కుర్యాత్తత్ర వాద్యాక్షరైస్సమం.

అది శుదపద్ధతి. ఇది విచిత్రపద్ధతి. ఇందు ముందుగా స్వరములతో పాటములతో నొక క్రమమును సుబద్ధముగా నొసరింప వలెను. అట్టి క్రమమున గీతవాద్యనృత్తములను త్రయమును గూర్చ వలెను. వర్ణ స్వరోపేతమయిన గేయమును గాయకులు కూర్పవలెను. వాదకులు గేయగత విశేషానుసారముగ యథాక్షరముగా వాద్యమును కూర్పవలెను. వాద్యాక్షరములతో సమముగా తగినట్లుగా నర్తకియు నర్తన మొనరింప వలెను. ఇట్లుండుట యిది చిత్రపద్ధతి ఇదియె విచిత్రపద్ధతి.

దేశీనృత్తభేదాః – పేరణీలక్షణం.

రంజకో రూపసంపన్న ప్రఖ్యాతః ఖ్యాతవంశజః
భావుకో రసికస్తాలవేదీ గమకకోవిదః
ధ్వనిశారీరసంపన్నో రాగాంగాదివిచక్షణః
పంచాంగకుశలో౽వ్యంగస్సర్వభాషావిశారదః
సురేఖో వాద్యవిత్ప్రౌఢః ప్రస్తావోచితభాషణః
గాతా గీతప్రబంధానాం లాస్యతాండవపద్ధతేః
విద్వానుత్ప్లుతిపూర్వేషు కరణేషు సలాఘవః
భ్రమరీపాదవిన్యాసాలప్తిజ్ఞః ప్రేరణీ మతః
వరాటకమయైర్జాతరూపరత్నమయైరపి
భూషణైర్భూషితో భాస్వద్భస్మోద్ధూలితవిగ్రహః

శిఖావాన్మండితశిరా దధత్పుస్తఫణాధరం
ఏకేన రంగయష్టిం వా కరేణాన్యేన చామరం
బిభ్రత్ ఘుర్ఘరికాజాలే జంఘయోర్దృఢసంయతే
ఏకశో ద్వంద్వశో వాపి క్రమాత్పూర్వప్రవేశితైః
చతుర్భిరథవా షడ్భిరష్టాభిర్వా సహాయకైః
అభితః సహితః స్వస్య దధానైస్తుల్యవేషతాం
సమపాదేన వా తిష్ఠన్ భుజంగత్రాసితేన వా
కృతే యవనికాక్షేపే సతి రంగభువం విశేత్.

ఇటుపై దేశీనృత్త భేదములు నిరూపితములగును ఇట్టి నృత్తవిదుడగు వానికి పేరణియను పేరు కలదు. పేరణీ లక్షణ మిందున్నది. కలావిదుడు సభాజన మనోహరుడు నృత్తశాస్త్రజ్ఞుడు పేరణి నృత్త మొనరించును. పేరణి రంజకుడు జనరంజనము సంపాదించుటకు సమర్థుడు కావలెను. రూప సంపన్నుడు కావలెను. రూప మనునది యాభరణములు శోభారమ్యాకార ముండుట. అభూషణ రమ్యాకృతి రూపము ప్రఖ్యాత సాంప్రదాయిక వంశమున జన్మించిన వాడగుట యుక్తము. ధానసాతని సంప్రదాయ పరంపరాగతములయిన నృత్తవిశేషముల రహస్యములు తెలిసిన వాడని విశద మగును. అక్షై స్వయముగ దాను ప్రఖ్యాతుడు కావలెను. కేవలము వంశ ప్రతిష్ఠల గౌరవమున గౌరవము పొందువాడగుటకాక తన విద్యా విశేష ప్రాభవమునను ప్రఖ్యాతుడు కావలెను. ఆతడు భావింప సమర్థుడగు భావుకుడగుటయు విభావానుభావముల సంచారిభావముల సంబంధవిశేషమున సముల్లసితస్థాయి భావమున రసీకృతాత్ముడై రసాస్వాద మొనరించు రసికుడు కావలెను. ఇట్లు రసరసనాత్మక దృష్టి కలవాడై వ్యుత్పత్తి విశారదుడగు కలావిదుడు పండితుడు విపశ్చిదపశ్చిముడు కావలెను. అందుననే ఆతడు తాలవేది గమక

కోవిదుడు నగుట యావశ్యకము. సుస్వర సంపత్తి కల శారీరము కలవాడగుట ముఖ్యము. తగిన గాత్రసంపత్తి యున్ననే సర్వము రాణించును. ఇంకను రాగాంగాది విచక్షణః పంచాంగ కుశలః అగుట యావశ్యకము. రాగాంగములు మొదలగు వానిలో నాతడు విచక్షణుడు. రాగోపాధికమయిన ప్రేమ పండ్రెండు విధములు. ఇవి సాత్త్విక రాజస తామస గుణముల సంబంధమున నుండును. హరిద్రా రాగము, కాంపిల్య రాగము, రీతిరాగము, రోచనా రాగము మొదలుగా నున్నవి ఇట్టిరాగ విశేషములను గుర్తించుటయు నావశ్యకమే. కాని యది యిందు ముఖ్య వివక్షితము కాదు. గ్రామ రాగచ్ఛాయా మాత్రోపజీవనమున రాగాంగత కలుగును. అది యిచట ఆవశ్యకము. షడ్జాదిగ్రామముల వలన వెలువడు రాగముల చ్ఛాయ యుండగా రాగాంగ స్వరూప మేర్పడును. ఇట్లు రాగాంగాదులలో రసభావ సముచితము లయిన రాగవిశేషములలో నాతడు విచక్షణుడగుట వివక్షితము.

అట్లె పంచాంగకుశలః పేరణాంగము లయిదు కలవు. అవి పంచాంగములు ఈ యధ్యాయముననే నిరూపితములు కాగలవు. నృత్తము, కైవారము, ఘర్ఘరము, వికటము, గీతము అనునవి పంచాంగములు. వీనియందాతడు కౌశలము కలవాడు కావలెను. అంగవైకల్యము కలవాడు కారాదు. స్వరహీనుడు కారాదు. సర్వ భాషావిశారదుడు కావలెను. అప్పుడే యా యా దేశభాషారీత్యనుసారి దేశీనృత్తరీతులను గుర్తింపగలడు సౌష్ఠవము కల శోభా సుందరము లయిన యవయవముల విన్యాసము కలవాడు కావలెను. అది స్ఫురేఖత వాద్యవిదుడు ప్రౌఢుడు ప్రస్తావన ముచితముగా సంభాషింపగలవాడు గీత ప్రబంధములను చక్కగా గాన మొనరింపగల వాడు లాస్యరీతులను తాండవ విధానములను బాగుగా గుర్తిం

చిన వాఁడు విద్వాంసుఁడుగా నుండ వలెను. ఉత్పత్తి పూర్వకము లయిన నానావిధ కరణముల ప్రయోగమున ననాయాసముగ లాఘవము కలవాఁడగుట యుక్తము. భ్రమరీ విధానములలో తగిన పాద విన్యాసములను గుర్తించువాఁడు కాదగును. నానావిధములగు నాలాపములను తెలిసిన వాఁడును కావలెను ఇట్లున్నచో పేరణ యగును ఇంతవరకిట్లు అతని స్వరూప స్వభావ గతము లయిన విశేషము లుల్లిఖితము లయినవి

అతని యాహార్య మీ విధమున నుండును. అతఁడు భూషణ భూషితుఁడు కాదగును. ఆ భూషణములు వరాటకమయములు కావచ్చును. సువర్ణ రత్నమయములు కావచ్చును. ఇట్లుండి భాస్వద్భస్మోద్ధూళితవిగ్రహః; చక్కఁగా ప్రకాశించు భస్మోద్ధూళనమున రమ్యమగు దేహము కలవాఁడు కావలెను. శిఖ కలవాఁడు ముండిత శిరస్కుఁడు పుస్తఫణాధరము ధరించిన వాఁడు కాదగును. పుస్తము తద్భేదములు ప్రథమాధ్యాయములో ఆహార్యలక్షణ కథనావసరమున నిరూపితము లయినవి. పుస్తభూషాంగ రచన సజీవ మగు నాహార్యము సంధిమ వ్యాజిమ చేష్టిమ ములని యున్నది. అందు సంధిమము కిలించచర్మ వస్త్రాద్య సంధానమున నుండును. కాగా వస్త్రాదులచే నిర్మించిన ఫణ పడగకుచ్చుకల పాగాధరించుట, చక్కఁగా నిర్మితములయిన శిరోవేష్టనము ధరించుట ఇందభ్యాహము.

ఆ పేరణి ఒక హస్తమున రంగయష్టి ధరించి, అన్యహస్తమున చామరము ధరించి యుండ దగును. ఇట్టి పేరణి యవనిక తొలగింపగా రంగస్థలమున ప్రవేశించుటలో కొంత విధాన మున్నది. తనతో సమాన మయిన వేషము ధరించిన కొందరు తనకన్న ముందుగా రంగము ప్రవేశించి యుండ దగును. వారును పేరణి వలె సముచి

తాహార్యధారులు. వారు వారి జంఘాభాగములందు రెండు పాదము లందు నసుట ఘర్ఘరికాజాలములను దృఢముగా కట్టి కూర్చియుండ దగును. ఘర్ఘరిక కింకిణీ జాలము గజ్జెలు నియత సంఖ్యతో కూర్చిన గజ్జెలను వారు ధరించి యుండవలెను. వారొక్కొక్కరుగా గాని ఇద్దరిద్దరుగా గాని క్రమముగా పూర్వమే ప్రవేశితులై యుండదగును నాలుగారెనిమిది సహాయకులతో పేరణి కూడుకొని రావలెను. వారందరు స్వసమాన వేషధారులు. ఇట్టి పరివారమున ప్రవేశించు పేరణి సమపాదమున, నిలబడి ... భుజగ త్రాసితావస్థానమున గాని రంగస్థలము ప్రవేశింపవలెను.

ఇట్టిచటి పేరణీ స్వరూపము తదనుయాయి రూపము తత్స హాయక రీతి బాగుగా భావనీయము. తెరదీయగనె యిట్టి పేరణి యిట్లుగా రంగమున నవతరించుట ప్రేక్షకులకు సుందరముగా నుండును. శాస్త్రీయముగ నుండును.

పేరణాంగాని.

పేరణాంగాని పంచ స్యుః నృత్తకైవార ఘర్ఘరాః
వికటం గీతమిత్యేతేషాం క్రమాల్లక్ష్మ ప్రచక్ష్మహే
తన్నృత్తం యద్ద్విధాప్రోక్తం లాస్యతాండవభేదతః
ఇతివృత్తప్రఖ్యాత చక్రవర్తి ధరాధిపాన్.
గుణైః శౌర్యాదిభిః స్తుత్వా తైస్తైరేవ సభాపతేః
స్తుతిర్వితన్యతే యస్మిన్ కైవారోఽత్ర సకీర్తితః
అతాలం తాల యుక్తం చ ఘర్ఘరీవాదనం క్రమాత్
అత్రోక్తో ఘర్ఘరస్తస్య ప్రకారాస్సప్త కీర్తితాః

పేరణ మొనరించు నాతడు పేరణి. అట్టి పేరణిలక్షణము నిరూపిత మయినది తత్సహాయులను తత్ప్రవేశమును జెప్పిన పిమ్మట

పేరణాంగములను జెప్పుట యుక్తము. ఇచట నా పేరణాంగము లున్నవి. పేరణాంగములు అయిదు కలవు. నృత్తము, కైవారము, ఘుర్ఘురము, గీతమునని వీని కిచట స్వరూపలక్షణము నిరూపితమగును.

ఈ పంచకములో నృత్తము లాస్య మని తాండవ మని రెండు విధములు. ఈ నృత్తము పూర్వాధ్యాయములలో నిరూపిత మయినది.

కైవారము రెండవది. కథావస్తువు నందత్యంతము విఖ్యాతు లయిన చక్రవర్తులను ధరాధిపులను వారివారి శౌర్యతా ధీరతా వీరతా విశేష రూపము లయిన గుణములచే స్తుతిని విస్తరముగా నిరూపించుట కైవారము అనదగును. అట్టి విశేషములతో సభాపతి స్తవ మొనరించుటయు కైవారమగును.

ఘుర్ఘురము మూడవది. ఇది యేడువిధములు. తాళయుక్తముగ గాని తాలరహితముగ గాని ఘుర్ఘురీ వాదన ముండుట ఘుర్ఘురమను పేరణాంగ మగును. ఘుర్ఘుర ప్రకారములు సప్తవిధము లని కీర్తించిరి.

చావడః పడివాడాఖ్యః ధుంధః సిరిభిరాభిధః
తతః ఖలు హులాలగ్నపాటౌ సిరిపిటీ తతః
క్రమాల్లక్షణమేతేషాం కథయామోఽధునా వయం.

ఈ యేడును ఘుర్ఘు భేదములు. చావడము, పడివాడము, ధుంధము, సిరిభిరము, ఖలువాలము, అలగ్నపాటము, సిరిపిటి యని వీని నామములు. ఈ నామములు సంస్కృతాభిజ్ఞులకు క్రొత్తగా నుండవచ్చును. దేశీవిధానముల కిట్టి నామము లుండుట యుక్తమని జ్యాయన భావించెను. ఇక క్రమముగా వీని లక్షణములు నిరూపితము లగును. మేము నిరూపింతు మని గ్రంథకర్త యనుటలో నభిమానము కలదు.

సశబ్దం చావడః పాదః తలాభ్యాం తాడనం భువః
పాదాగ్రశ్లిష్టభూర్భూమిం పార్ష్ణిభ్యాం పార్ష్ణినాథవా
పర్యాయాత్కుట్టయేద్యస్మిన్ పడివాడః స కీర్తితః
రుద్ధః స్యాద్యుగపత్స్రుత్వా పురః పాదతలాగ్రయోః
దుష్కరో యః ప్రయోగః స్యాద్విరలో హాస్య సాధకః
స్వభావాద్భూస్థయోరంఘ్ర్యోర్ఝంఘాభ్యాం కంపనం ముహుః
ప్రసృతస్యాంబరే దిక్షు యద్వా సిరిభిరో మతః
భూశ్లిష్టాగ్రగలస్యాంఘ్రేః పార్ష్ణ్యా ఘట్టయతి క్షితిం
ఏకస్య తాదృశస్యైవ పార్ష్ణినాన్యస్య రేచనం
బాహ్యాభ్యంతరతః స్యాచ్చేత్తదా ఖలుహులో మతః
ఊర్ధ్వాధఃక్షేపకంపాభ్యాం వ్యోమ్ని ఘర్ఘరవాదనం
క్రమాచ్చతణయోర్యత్ర సమతోఽలగ్నపాటకః
పురతః పృష్ఠతః పార్శ్వద్వయే చ సరణం యదా
భూమిలగ్నతలస్యాంఘ్రేః భవేత్సిరిపిటీ తదా.

ఈ వరుసలో సప్తఘర్ఘరప్రకారముల లక్షణము లున్నవి. వాని భావముల నిట్లు గుర్తింప వచ్చును.

౧ చావడము.

పాదతలములచే శబ్దము కలుగునట్లుగా భూతాడన మొనరించుటను చావడ మందురు. దీనినే చాపదాప యని కొందరు వ్యవహరించిరి. అవదాప మనియు ననిరి.

౨ పడివాదము.

పడివాట మనియు దీని వ్యవహారము. పాదాగ్రమున భూమిశ్లేష మొనరించి పార్ష్ణిభాగములచే గాని యొక పార్ష్ణిభాగమున గాని

భూమిని పర్యాయక్రమమున కుట్టిత మొనరించినచో వడివాద మగును.

3 రుంధము

పాదతలాగ్రముల నెదుటగా యుగపత్కాలమున నొకే సమయమున గతిప్రసర ముండునట్లాచరించినచో, అట్లె యుగపన్నృత్త మొనరించినచో రుంధ మను ఘుర్ఘరప్రకార మగును. ఇది దుష్కర ప్రయోగము. వికలము, హాస్యసాధకము. ఈ రుంధప్రకారమును కొంద రంగీకరింప లేదు. కొంద రంగీకరించిరి.

౪ సిరిభిరము.

స్వభావసహజముగా నంఘ్రిభాగములు భూగతములై యుండగనే జంఘాభాగములచే ముహుః కంపన మాచరించినచో సిరిభిర మను ప్రకార మగును. యద్వా, ఒక్క పాదమును జంఘను ముందుకు చాచి ప్రసరింపజేసి వెలుపలగా దిశలలో కంపనము కలుగునట్లాచరించినచో నదియు సిరిభిర మగును. ఒక పాదమును ముందునకు ప్రసారిత మొనరించి వేరొక పాదము యొక్క జంఘాకంపన మొనరించుటయు సిరిభిర స్వరూపముగా భావించునది. జాయనానుయాయులీ సిరిభిర స్వరూప మిట్లభిమానించిరి.

౫ ఖలుహులము.

పాదాగ్రతలము భూశ్లిష్టమై యుండగా నాయంఘ్రి పార్ష్ణి భాగమున భూఘట్టన మున్నచో, అట్లే భూశ్లిష్టాగ్రతలముగా నున్న అన్యపాద పార్ష్ణిభాగమున బాహ్యాభ్యంతర ప్రదేశము లందు రేచన మొనరించినచో నది ఖలుహుల మను ఘుర్ఘర ప్రకార మగును.

౬ అలగ్నపాటము.

చరణము నూర్ధ్వమునకు క్షేప మొనరించి నప్పుడు చాచి నపుడు మఱల అధఃక్షేప మొనరించి నపుడు దించినపుడు చరణము లందున్న ఘర్ఘర వాదనము క్రమముగా నున్నచో అలగ్నపాట మను ఘర్ఘరప్రకార మగును. ఒకసారి యొక పాదమున కూర్ధ్వక్షేప మున అధఃప్రసారమున ఘర్ఘరవాదనము కూర్చుటయు, మఱల వేరొక పాదమున నట్లే యాచరించుటయు నుండగా నలగ్నపాట మగును. దీనిని కొంద రలగపాట మనిరి.

౭ సిరిపిటి.

భూలగ్నతల మయిన పాదమునకు పురోభాగమున పృష్ఠ భాగమున పార్శ్వభాగము లందును సరణము ప్రసరణము నుండునేని సిరిపిటి యగును. దీనిని కొందరు సిరిపాట మనిరి.

ఇట్లిచట మొదట నిరూపించిన ఘర్ఘరప్రకారము లేడును నిరూపితము లయినవి ఘర్ఘరవాదనమున మరి కొందరు మరి కొన్ని భేదములు నిరూపించిరి. వానిని జాయన స్మరించనే గాని నిరూపింప లేదు. ఆ యన్యభేదముల సంకేత మీా విధమున నున్నది.

పార్శ్వగం ఘట్టితం సూచీం అంగులీపృష్ఠగం వినా
షడన్యే పాదభేదాః స్యుర్రత్ర ఘర్ఘరవాదనే,

ఘర్ఘర వాదనమున నింక నారు భేదములు కలవు. ఇది యన్యమతము. రెండవ యధ్యాయములో పాదభేదములను పరిగణించు సమయమున

తాడితము — ఘట్టితోత్సేధము — ఘట్టితము — మర్దితము
అగ్రగము — పార్ష్ణిగము — పార్శ్వగము — సూచి — అంగులి
పృష్ఠగము — తలాహతి.

యను పది పాదభేదముల నితరు లంగీకరించుట నుల్లేఖించెను. అందు పార్శ్వగ ఘట్టిత సూచి అంగులీపృష్ఠగములను నాల్గింటిని విడనాడిన మిగిలిన ఆరు పాదభేదములు ఘర్ఘరప్రకారములుగా పరిగణింప దగినవి కాదగునని యిచట నిరూపించెను. ఆ నాల్గింటిని విడనాడినచో ఘట్టిత, తాడితోత్సేధ, మర్దిత, అగ్రగ, పార్ష్ణిగ, తలాహతిభేదము లాఱింటు సంగ్రాహ్యము లగును. ఘర్ఘరవాదనమున నవి యుపకారు లని "ఘర్ఘరాణాం చ వాదనే ఘర్ఘరీవాదనాదిషు, కింకిణీ విధౌ" అను పదములచే నిరూపించెను. ఆ పాదభేదము లన్యకథితము లనుటచే స్వసమ్మతములు కావని యభ్యూహ్యము. అందలి వానినే యిందును నిరూపించెను. కావున నివియు నట్టివే యగును. అన్యమతమయినను కొంత యుపాదేయత యున్నందుననే అచట నిచట నిరూపించెను.

ఇట్లు ఘర్ఘరభేదములు నిరూపితము లయినవి. ఇక మొదట ప్రసక్తము లయిన పేరణాంగములలో వికటము గీతము ప్రస్తుతము నిరూపణీయము. అందు వికట మిట్లున్నది.

వికటం.

పిశాచవానరాదీనాం వేషచేష్టానుకారతః
వికృతై రాననోష్ఠాక్షి కుక్షి దోశ్చరణాదిభిః
వితాలం వికృతం నృత్తం హాస్యకృద్వికటం విదుః
కైశ్చిద్వాగడ మిత్యుక్తం ఖాండికానాం ప్రసిద్ధితః

పేరణాంశములలో నిది నాలవది. పిశాచవేషచేష్టానుకారమునను వానరాదుల వేషచేష్టానుకారమునను తాలరహితముగా వికృతముగా నర్తన మొనరించుట వికట మను పేరణాంగము. ఇందు

ముఖము, ఓష్ఠము, నేత్రములు, ఉదరములు, బాహువులు, పాదములు మొదలగు నంగము లన్నియు వికృతములుగా నుండవలెను. ఈ వికటనృత్తము హాస్యము కలుగ జేయును. వికృతాకార వికృతచేష్టా వికృతవేష వికృతభూషా వికృతభాషా విశేషములచే హాస ముదయించుట లోకప్రసిద్ధము. భాండీకప్రసిద్ధి ననుసరించి యీ వికట నృత్తమును కొందరు "వాగడము" అను నామమున వ్యవహరింతురు. మర్కట పిశాచాది హాస్యవేష సమాశ్రయము వికృతాభినయో పేతము అగు నిది వాగడ మగునని కొంద రనిరి.

భాండికులు భాండీరులు, ఈ వర్గము వారి నుండి గాయకులు నర్తకులు బహువిధము లగు దేశీరీతులను స్వీకరించిరి. ఈ పేరణి పద్ధతికి సంబంధించిన అంగపంచకమును ఇతరులు పరిగణించి నట్లు లేదు. జాయనుడె నిరూపించెను. తదనుయాయులు పరిగ్రహించిరి. ఇవి కొందరి గ్రంథములలో నామాంతరములతో నున్నవి

## గీతం.

శుద్ధైశ్ఛాయాలగై ర్యద్వా రాగై రాలప్తిసంయుతాః
ప్రబంధా యత్ర గీయంతే గీతం తదభిధీయతే.

ప్రబంధములను గానము చేసినచో గీత మను పేరణాంగ మగును. ఆ ప్రబంధములు ఆలప్తి - ఆలాపముతో గూడి యుండ దగును. రాగములతో గూడి యుండ దగును. శుద్ధము లగు ఛాయాలగములతో నయిన నుండదగును. ఛాయాలగ మొకవిధమగు గీతము. ఒకరాగమున వేరొకరాగమునకు సంబంధించిన ఛాయ కూడి యున్నచో అన్యచ్ఛాయాప్రవృత్తి యుండగా రాగాంశవిదులు దానిని రాగచ్ఛాయ యందురు రాగము నందలి స్వరము యొక్క మంద్రస్థానమున గాంభీర్యము మాధుర్యము ఘనత్వము కూడి

యుండగా నది ఛాయ యగు నని యనిరి. ఛాయలో షడ్జస్వర ముండదు. ఋషభస్వరము మంద్రముగా నుండును. ఇతర స్వరము లల్పముగా నుండును. శృంగారమున నిది వరిగీత మగును. సాయం సమయమున ఛాయారాగము గానము చేయుదురు.

ఆలప్తిసంయుతము లయిన ప్రబంధములు. ఆలప్తి ఆలాపము రాగాలాపమున కాలప్తి యని పేరు. ఇది భూరిభంగిమనోహరము. అక్షరవర్జితము రాగప్రయోగమున నాలాప మను సంజ్ఞ కలదు. ప్రబంధము లను గానము చేయుట, ప్రబంధ మనునది గీతవిశేషము. అది యొక గానవిశేషము. సంగీతరత్నాకర మందలి చతుర్థాధ్యాయ మంతయు ప్రబందరూప గానవిశేషమునే నిరూపించు చున్నది. అందలి చతుర్థాధ్యాయమునకు ప్రబంధాధ్యాయ మనియు పేరు. ప్రబంధపదార్థమును స్పష్టముగా గుర్తించుట యావశ్యకము.

రంజక మగు స్వరసందర్భమునకు గీత మని పేరు. ఆ గీతము గాంధర్వ మని గాన మని రెండు విధములు. శ్రేయోహేతు వగు ననాది సంప్రదాయము గంధర్వ ప్రయుక్తము గాంధర్వము. వాగ్గేయకారుడు రచించిన లక్షణాన్వితము జనరంజనము నగునది గానము, అట్టి గానవిశేషరూప మగునదియె ప్రబంధము, నిబద్ధగాన మని అనిబద్ధగాన మని గానము రెండు విధములు. ధాతువులతో నంగములతో బద్ధ మగునది నిబద్ధగానము. బంధరహిత మదు ఆలాప మనిబద్ధగానము నిబద్ధగానమున మూడు సంజ్ఞావిశేషము లున్నవి. ప్రబంధము వస్తువు రూపకము నని, ప్రబంధావయవ మగు ధాతువు నాలుగు విధములు. ఉద్గ్రాహము మేలాపకము ధ్రువము ఆభోగము నని ధాతుభేదమున ప్రబంధభేదము కలుగును. ద్విధాతు ప్రబంధము త్రిధాతుప్రబంధము చతుర్ధాతు ప్రబంధము నని

ప్రబంధాంగము లారు కలవు. అవి స్వరబిరుద పద తేనక పాట తాలములు. ఇట్టి ధాతువులచే నంగములచే నిబద్ధ మగు గానమునకు ప్రబంధ మని పేరు.

మేదిని ఆనందిని దీపని భావని తారావలి యని ప్రబంధజాతు లయిదు గలవు. ప్రబంధము రెండువిధముల నుండును. అనిర్యుక్తము నిర్యుక్తము నని. అనియమమున అనిర్యుక్తము నియమమున నిర్యుక్తము నగును. ప్రబంధము మఱియు మూడు విధముల నున్నది. సూద ప్రబంధము ఆలి ప్రబంధము విప్రకీర్ణ ప్రబంధము నని. అవాంతరభేద పరిగణనమున ప్రబంధము లనేకవిధములు. ఇట్టు ప్రబంధములు ప్రగీతము లగునేని గీత మను పేరణాంగ మగు నని పరమతాత్పర్యము.

ఇట్లు పేరణాంగము లయిదు నిచట నిట్లు లక్షితము లయినవి. ఇటుపై పేరణి పద్ధతిని నిరూపింప వలసి యున్నది.

పేరణి పద్ధతిః

సమహస్తాభిధే వాద్యే వాదితే సమనంతరం
శుష్కవాద్యం భవేద్యత్ర్యా రిగవణ్యా పదేన చ
పైసారాపరనామ్నాథ యత్యోపశమనాఖ్యయా
ప్రవిశ్య ప్రేరణీ నృత్యే త్తతః కైవార మాలపేత్
చాలయేచ్చరణం తాలరహితం ఘుర్ఘరైస్తతః
ద్వితీయం తాలమారభ్య మార్గదేశిగతై రథ
కృత్వాంతే వాదనం తాలై రేకయాంతరయాపి చ
యోజయేత్సకలాతోద్యనాదైః ప్రహరకైస్సహ
లగ్నప్రహరణే పాటం భ్రమరీకరణాన్వితం
విషమం తాండవః నృత్యేద్వికటాంగ మతః పరం

స రాగమాలపేద్యేన జనః సర్వోనురజ్యతే
సూదస్యాద్య మధో గాయేత్ప్రబంధం వాచయేచ్చ తం
ముహుర్ధ్రువపదే గీతే తత్తుల్యాం వాదయేద్యతిం
విధాయ ప్రేరణీ తాయాన్ సమాన్ ద్వి త్రి గుణానపి
యత్యంతే యోజయే త్తద్వ ద్ఘర్ఘరీవాదనాన్యపి
ఆభోగం గాపయిత్వాంతే యత్యా ప్రహరణేన వా
గజరే వాద్యమానే తైః నృత్యే ద్వికట ముచ్చకైః
తకారేణ సమం కుర్యాచ్ఛందనం ప్రేరణీ పునః
సూదస్థిత ద్వితీయాది ప్రబంధానేవమేవ చేత్
ప్రయుంజీత తదా ప్రోక్తా బుధైః ప్రేరణిపద్ధతిః

పేరణి పద్ధతి యిందున్నది. ఆతోధ్యమేలనానంతరము సమహస్త మను వాదన మావశ్యకము. సమహస్త మను వాద్యము వాదిత మయిన పిమ్మట శుష్కవాద్యమును ప్రవర్తింప జేయవలెను. ఆ శుష్కవాద్యము యతితో నుండవలెను. రిగవణితో నుండవలెను. పదమున నుండవలెను. ఇందు సమహస్తము, శుష్కవాద్యము, యతి, రిగవణి, పదము అను సాంకేతికపదముల యర్థము నీ విధముగా భావింప వచ్చును సమహస్త మనునది యొక వాదన రీతి. మొదట సర్వాతోద్యసంభూతముగా సమహస్త వాదన మావశ్యకము. ఈ సమహస్తమును సమపరిహార మనియు భావింప వచ్చును. “సమ పరిహారో యుగపత్కరద్వంద్వేన ఘాతతః” సమకాలమునను హస్త ద్వయమున ఘాత మొనరించినచో సమపరిహార మగును.

శుష్కవాద్యము— వాద్యము నాల్గువిధములు. శుష్కము, గీతానుగము, నృత్తానుగమము, ద్వాయానుగమము అని గీతనృత్త రహితముగా నుండునది స్వతంత్రముగా నుండునది శుష్కవాద్యము. ఇట్టి దీనిని గోష్ఠి అందురు.

యతి:- "లయ ప్రవృత్తి నియమో యతిః" లయ ప్రయోగ నియమ మునకు యతి యని పేరు. ఈ యతి మూడు విధములు. సమయతి, స్రోతోగత యతి, గోపుచ్ఛ యతి యని వీనిలో నవాంతర భేదములు కలవు. ఇది లయప్రకరణమునకు సంబంధించిన యతి. వాద్యప్రకరణమునకు సంబంధించియు యతి కలదు. వాద్యప్రబంధ ములు నలుబది మూడు కలవు. యతి మొదలగునవి వాద్యప్రబంధ ములు. యతి ఓతా గజరము రిగోణి కవితను పదము మొదలగు పైసార మంతమున గల వన్నియు వాద్య ప్రబంధములు. వాద్య వాద్యఖండము బహువిధము లగు విరామములతో కూడు కొను నట్లుగా వాదిత మగునేని యతి యను వాద్య ప్రబంధ మగును. దీనికే జక్కా అనియు పేరు కలదు. ఏ వాద్యప్రబంధమున కేని ప్రారంభములు యతివాదన ముండును. అప్పుడు దీనిని వాద్యజ్ఞులు "ఉట్టవణము" అని యందురు. యతి యనునది ఏకరూపాక్షరము. కూటవర్ణములతో నుండును గాని ఉపక్రాంత వర్ణానుసారమునను సమాపిత మగును. అత్యంతకోమలము బంధకాఠిన్య వర్జితము తాలము ఛందస్సు అను వాని యభివ్యంజనమున ప్రకాశమాన మగును.

రిగవణి— ఇదియే రిగోణియు. దీప్తనృత్తమున రిగోణియుండును. లలితనృత్తమున ఉట్టవణము లలితముగా నుండునేని రిగోణి ఉపశమ యుక్త మగును. దీప్తనృత్తమున రిగోణి యుద్ధతముగనె యుండును. వాదకారబ్ధ మయిన బహుకోలాహలముతో నిది యుండును. మధ్య మధ్యలో వాదకుడు వాద్యధ్వని మేలనమున స్థూలధ్వని రూపమగు కోలాహల మొనరించును. ఆ యా వాద్యములకు నియతము లయిన వర్ణములతో శుద్ధవర్ణములతో నిది నిర్మిత మగును. సర్వవాద్య సాధారణము లయిన కూటవర్ణములతో రిగోణి నిర్మిత మగును.

వ్యస్తసమ సము లయిన పాటములతో నిది నిర్మిత మగును. పాట మనగా, వాద్యవర్ణ సమూహము, తాళానుగ మయిన వాద్యవర్ణ సందోహము. వాద్యసంగతము లగు శబ్దముల యుచ్చారణము. "మృదంగ వీణా మురజాదిజన్మా కరాభిఘాత ప్రభవస్తు పాటః" కరాభిఘాతము వలన గలుగు మృదంగాదిధ్వని పాట మనియు నందురు. ఉట్టవణము = వాద్యమునకు తగిన వ్యావకాక్షరము లగు తద్ధిధోం టే అను వర్ణములతో నున్నదై ఆద్యంతములందు 'దేం' కారణముతో నుండును. ఇంక నిట్టివిశేషములు రిగోణిలో నున్నవి.

పదము— ఇది యొక ప్రబంధాంగము. వాద్యప్రబంధము. దీప్త నర్తనమున దీని నుపయోగింతురు. మొదట యతి వాదన మొనరించి తుదకు పాటమున విడనాడినచో నది పద మగును. ఇందు ఉద్గ్రాహమల్పము. ధ్రువ మత్యంతదీర్ఘముగా నుండదు. తుదకు ఖండణ ముండును. కాగా నిది పద మను వాద్యప్రబంధము. దీనిలో ఉద్గ్రాహ ధ్రువ ఖండణ పదార్థము లిట్లున్నవి.

ఉద్గ్రాహము— వాద్యప్రబంధములకు సంబంధించి ఖండ - శుద్ధ - కూట - పాటాక్షలచే మొదట నిర్మిత మయిన వాద్యవాదన మునను ఉద్గ్రాహమని పేరు గీతము మొదట ఉద్గ్రాహ్య మగుటచే ఉద్గ్రాహ్య మనియు నందురు. ధ్రువము తాళాంగక్రియ ఛోటికాశబ్ద పూర్వక మగు హస్తపాతమునకు ధ్రువ మని పేరు. ధ్రువ మొక తాలము. ధ్రువాదితాలము లేడు కలవు ధ్రువము, మఠ్యము, రూపకము, ఝంప, త్రిపుట, ఆటతాలము, ఏకతాలము నని.

ఖండణము— ఇదియు వాద్యప్రబంధము. కూటాది పాట ఘటితమై ఖండ మంతమున ప్రయుక్త మగునేని ఖండణ మందురు. వాద్యప్రబంధమున కవసానము నిరూపించునది ఖండణము. ఈ

నిరూపించిన విధముగా యతి రిగవణి పదములచే శుష్కవాద్యమును ప్రవర్తింప జేయవలెను. ఈ శుష్కవాద్యానంతరము పేరణి రంగమున ప్రవేశించి నర్తన మొనరింప వలెను. కైవార మాలాపింప వలెను. పేరణీ ప్రవేశమున నొక నియమ మున్నది.

పైసార మను పేరు గల వాద్యప్రబంధమున ఉపశమనాత్మక మయిన యతివిశేషమున పేరణి ప్రవేశించి నర్తన మొనరింపవలెను. పైసార మనునది నలుబది మూడు వాద్యప్రబంధములలో చివరిది. ఖండములు పాటములు ఆతోద్యవాదితములు కాగా పైసార మను వాద్యప్రబంధ మగును. ఉపశమ మనునదియు వాద్యప్రబంధమే. శుద్ధాది పాటములచే నిబద్ధము సుకుమారాక్షరాన్వితము కోమల నాదము కలది యుపశమము. కోమల నృత్తమున నిది యభ్యస్త మగును. ఇట్లే వాద్యప్రబంధానుసారమున ప్రవేశించి కైవార మాలపించుట క్రమవిధానము.

కైవారాలాపానంతరము చరణచాలన మొనరింప వలెను. ఆ చాలనము తాలరహితముగా నుండ వలెను. ఘర్ఘరములు ఘల్లు మనునట్లు చరణచాలన మొనర్చునది. అనంతరము మార్గపద్ధతి గతములు, దేశీపద్ధతి గతములు నయిన తాలవిధానములతో రెండవ తాల మారంభించి వాదన మొనరించునది. అంతర మనునది వాద్య ప్రబంధము. అట్టి యొక యంతర వాద్యప్రబంధమున వాదనము కూర్ప వలెను. అంతరము = గీతవాద్యముల సంధిలో వాదిత మగునది అంతరవాద్యము. అంతరపదము అంతరా పదముగ స్త్రీలింగముగ గూడ నున్నది. అంతర ప్రబంధమున నిబద్ధవాదనమె యుండును. అనంతర మా వాదనమును సకలాతోద్యనాదములతో ప్రహారణములతో కూర్పవలెను. ప్రహరణమనునది వాద్యప్రబంధము.

సామాన్యముగా నిది నృత్తమున ప్రయుక్త మగును. ఇచ్ఛానుసారమున నితరసమయము లందును ప్రయుక్త మగుట కలదు. ప్రహారణమున ఉద్ధతనాద ముండును. కూటబంధ ముండును ప్రహారణయోజన మయిన పిమ్మట భ్రమరీ కరణాన్వితముగా పాటను కూర్చి విషమముగా వికటాంగముగా తాండవ నృత్య మొనరింప వలెను.

అప్పు డా పేరణి రాగ మాలాపింప వలసి యున్నది. దానిచే జను లందరు రంజితు లగుదురు. పిమ్మట సూడము అను గీతవిశేషము యొక్క ఆద్యాంశము గానము చేయవలెను. ప్రబంధము వాదనము చేయవలెను. ధ్రువపదమును గానమున కూర్చి తత్సమానముగా యతి వాదన మొనరింప వలెను. అదే సమయమున సమానములుగా నుండు తాయులు అను గీతములను ద్వి త్రి గుణముగా యోజనము చేయ వలెను. యతి వాదనానంతరము నందు ఘర్ఘరీ వాదములను గూడ కూర్చవలసి యున్నది. తుదకు ఆభోగము అను గానమును యతి వాదనమున ప్రహారణ ప్రబంధమున ప్రవర్తింప జేయవలెను. గజర మను తాలప్రబంధము ప్రవర్తించు చుండగా రంగమున నున్న నర్తకులు వికటముగా నర్తన మొనరింప వలెను. ఈ నర్తకులు ముఖ్యులు కారు. అనుయాయులు. అప్పుడు ప్రేరణి తకారము తోడుత ఖండన మొనరింప వలెను. ఇట్లే సూడము నందున్న ద్వితీయాది ప్రబంధముల గూడ ప్రయోగించినచో నిది ప్రేరణిపద్ధతి యగు నని తద్బుధు లనిరి. ఇది పేరణి పద్ధతి.

ఈ నిరూపణమునను మరి కొన్ని శాస్త్రీయములగు సాంకేతిక పదము లున్నవి. సూడ ప్రబంధము ధ్రువపదము ఆభోగము అను వాని అర్థవిశేషములను ఈవిధముగా గ్రహించునది.

సూడము– ప్రబంధము అనిర్యుక్తము నిర్యుక్తము నని ద్వివిధము. ఛందస్తాలాదినియమము లేకున్నచో అనిర్యుక్తప్రబంధము. నియమ మున్నచో నిర్యుక్తప్రబంధము. ప్రబంధములకు వేరొకవిధమున త్రైవిధ్య మున్నది. సూడస్థ ప్రబంధములు, ఆలి సంశ్రయప్రబంధములు, విప్రకీర్ణప్రబంధములు అని.

సూకుము అనునది గీతసమూహ వాచక మయిన దేశీశబ్దము. "అష్టభిః సూడ ఉచ్యతే" సూడము అష్టవిధముల నున్నది.

ఏల, కరణ, ఢేంకి, వర్తని, ఝొంబడ,
లంభ, రాస, ఏకతాల సూడములు.

ఈ ఏలాదులలో కొన్ని రూఢశబ్దములు, కొన్ని యన్వర్థములు.

౧. సూడ ప్రబంధములు ఎనిమిది.
౨ ఆలి ప్రబంధములు ముప్పది రెండు.
3. విప్రకీర్ణములు ముప్పది ఆరు.

విప్రకీర్ణము లెన్నియేని యుండును. కాని 3౬ అనుట ప్రసిద్ధి మాత్రమే

సూడప్రబంధము మఱల ద్వివిధము. శుద్ధసూడము, ఛాయాలగ సూడము నని. సాలగ ఛాయాలగ శబ్దములు పర్యాయములు. ఏలాదికము శుద్ధసూడము. భరతుడు ఏలాదికము ఛాయాలగసూడ మనుట ఔపచారికము. సాలగసూడము సప్తవిధము.

ధ్రువ, మంఠ, ప్రతిమంఠ, నిసారుక,
అడ్డతాల, రాసక, ఏకతాలీ సూడగములు.

సూడమునకు సంబంధించిన ఏలావిధానమున గాన మొనరింపవలెనని మూలము లోని భావము.

ధ్రువపదము- సాలగసూడస్థము లయిన గీతము లేదు కలవు. వానిలో ధ్రువము మొదటిది. ధ్రువపదము స్తుత్యనామాంకితమై యుండును మొదట సమాన మయిన గేయ ఖండ ద్వయము క్రముగా ఉద్గ్రాహ మొనరింప వలెను పిమ్మట కించిదుచ్చముగా అంతర మను ఖండము కూర్ప దగును. ఈ మూడు ఖండములను ఆవృత్తి మొనరించి రెండు పర్యాయములు గానము చేయవలెను. ఇంక నిట్టి విధానము లున్నవి స్తుత్య నాయక నామ ముండుట యుక్తము ఏకాదశాక్షరములు కల ఖండము మొదలుగా ఏకైకా క్షరవృద్ధితో ఇరువది యారక్షరములు కల ఖండము పర్యంతము పదునారు ధ్రువా భేదములు కలవు. జయంత శేఖరాదులు వీని పేర్లు. కొన్ని ధ్రువపదములలో అక్షరసంఖ్యానియమము కన్పించుటలేదు. లక్షణహీన మయినను లోకము పరిగ్రహించు చున్నది. అయిన నట్టి స్థలము లందక్షరపదమున పదములను పరిగ్రహింప వలెను. అదియు నుండ దేని యట్టి ధ్రువపదములలో అదృష్టఫల ముండక పోయినను జనరంజనాది దృష్టఫల ముండ వచ్చును. కావుననె లోక పరిగ్రహ మున్నది. ధ్రువపదములకు రసనియమ మున్నది. శృంగార మున జయంతధ్రువ పదము గాన మొనరించిన నది నేతకు శ్రోతకు గాతకు ఆయుఃశ్రీవర్ధన మగును. శేఖరము వీరమున బుద్ధిసౌభాగ్య ప్రదము. నిపుణముగా జయంతాదులను గాన మొనరించినచో సర్వ క్రతుఫలము లభించు నని ముని వాక్యము.

ఆభోగము గీతము గాంధర్వము గాన మని ద్వివిధము కాగా నందు గానము నిబద్ధమనిబద్ధము నని ద్వివిధ మయినది. అందు నిబద్ధ మనునది "బద్ధం ధాతుభిరంగైశ్చ" ధాతువులచే అంగములచే కూర్పుపొందునది నిబద్ధగానము. నిబద్ధమునకు మూడు సంజ్ఞలు ప్రబంధము, వస్తువు, రూపకము నని. అందు ప్రబంధావయవము

ధాతువు అది నాలుగు విధములు. ఉద్గ్రాహము మేలాపకము ధ్రువము ఆభోగము నని. ఈ యంశము నిరూపితచర మయినను పరిష్కృతావగాహనమునకై పునర్నిరూపితము. "ఆభోగ స్త్వంతిమో మతః" ఇది నాల్గవది. ఈ యంతిమ ధాతువు ప్రబంధమునకు పరిపూర్ణత నిచ్చును. కావున ఆభోగశబ్దము పరిపూర్ణతావాచకము. ఇది యిట్టిది కావుననే జాయనయు "ఆభోగం గాపయత్యాంతే" తుదకాభోగము పాడుట సూచించెను.

గజరము— ఇది యొక వాద్యప్రబంధము. దీనిలో ఉద్గ్రాహ మొకమా రుండును. నాతిదీర్ఘముగా నాత్యల్పముగా గంభీరధ్వని యుండును. కూటపాటములతో కూడి ఉపశమ ముండును. ఖండణము చివర కుండును. మొదట ఉట్టవణము గానము చేయవలసి యుండును. గజరములో తాలనియమము లేదు.

ఇట్లు నిరూపితము లయిన సాంకేతిక పదార్థముల నిశ్చితజ్ఞానమున జాయన నిరూపించిన పేరణిపద్ధతి భావార్థమును గుర్తించునది. జాయసేనాపతి గీతరత్నావలి గ్రంథములో గీతవాద్యములకు సంబంధించిన సర్వవిషయములను నృత్తరత్నావలిలో నృత్తవిషయముల నిరూపించిన విధమున నిరూపించి యుండును. ఆ గ్రంథ మీగ్రంథ మొకగ్రంథముగా జాయన భావించి యుండును. అందుననే గీతవాద్యములకు సంబధించిన సామయిక విశేషములను గ్రంథాంతరాధారమున నిరూపింపవలసివచ్చినది. ఇట్లే సర్వము సంభావ్యము.

పేరణీపద్ధతి నితరులు నిట్లే నిరూపించిరి. రంగమునందున్న సాంప్రదాయికులు ఆతోద్యధ్వనిని గంభీరముగా ప్రసరింపజేయవలెను. విలంబితప్రాయముగా పాదత్రయము ప్రసరించు నప్పుడు, రెండు రెండు పర్యాయములు వాదనముండునపుడు, హాస్యప్రధాన

ముగా నటుడొకడు నృత్యమొనరించునపుడు, రిగోణి ఉపశాంత మయినపుడు పేరణి రంగమున ప్రవేశించి నర్తన మాచరింపవలెను. పిమ్మట వాద్యసంఘాతము ప్రశాంతముకాగా పేరణి తాలధరుడై నర్తన మొనరింపవలెను. నిస్సారుతాలము ననుసరించి విషమముగా నర్తన మాచరింపవలెను. పిమ్మట సాలగనూడమున రేఖను స్థాపన ననుసరించవలెను. అప్పుడే విషమగీతనర్తనము, ప్రహరణాను గమనము, ఆభోగవాదనము, అనుసరింపవలెను. ఇది సంక్షిప్తముగా పేరణీపద్ధతి. ఇందు సరస్వతీకంఠాభరణ మను తాలపద్ధతి ప్రవేశ మును గలదు. సమయోచితముగా ఉత్ప్లుతికరణము హృదయం గమము లయిన ఘర్ఘరికా వాద్యవాదన ప్రకారములు.

దేశీపద్ధతిః

ఆతోద్యమేలనం పూర్వం సమహస్తమతః పరం
యతిప్రహరణే శూన్యే పుష్పాంజలిరతః పరం
ఝెంకారో రగవణ్యాఖ్యా తతః స్యాత్తుండుకాభిధం
చమత్కారోధ గీతాంగవాద్యముచ్ఛలితా యతిః
తద్వత్ప్రహరణంచైతద్దేశీపద్ధతి రుచ్యతే
కవితోట్టవణీఖండ యత్యవచ్ఛేదకాదయః
వికత్సేన భవేద్యత్రరిహోణ్యా సమనంతరం
పైసారాపరనామ్నాసా నర్తకీ రంగమండపం
సముదాయ ప్రబంధేన ప్రవిశేదపరేణవా
కేనచిచ్చిత్రవాద్యేన ముఖవాద్యం మతం తదా
పుటిలంత్వే తదేవోక్తం దేశీవాద్య విశారదైః
పుష్పాంజలిరనేనైవక్షేప్య ఇత్యుపచారతః
ఏతదేవ మతం లోకే పుష్పాంజలిరితిస్ఫుటం
హుడుక్కాకరటా దేశీపటహాద్యంతరాభవేత్

శబ్దే శ్రావ్యత్వ హేతుత్వాత్కాంస్య తాలంనివారయేత్
రిపోణ్యామేకతాలాడ్డతాల నిస్సారుకాస్త్రయః
తాలాః స్యుఃప్రాయశోనేతు రిచ్ఛయాన్యేపికేచన.

ఇట్టుపై ఈ దేశీపద్ధతియు భావనీయము. ఇందు ఆతోద్య మేలనము, సమహస్తము, యతి, పరిహారణము, పుష్పాంజలి, ఝేంకారము, తుంబురకము, చమత్కారము, గీతాంగవాద్యము, ఉచ్చలితయతి, ప్రహారణము అను ఏకాదశకము ఉండుట దేశీపద్ధతి యనదగును. కవిత, ఉట్టవణము, ఖండము, యతి, అవచ్ఛేదకము ననునవి వికల్పమున నుండును. పిమ్మట నర్తకి పైసారవిధానమున, సముదాయపరిబంధమున, వేరువిధమున గాని రంగము ప్రవేశించును. అప్పుడొక చిత్రవాద్యమున ముఖవాద్యముండును. దేశీవాద్యవిదులు దీనినే పుటిల మందురు. పుటిలముననే పుష్పాంజలి యొసరింతురు గావున నిది పుష్పాంజలియు నగును.

మధ్యలో హుడుక్క, కరట, దేశీపటహాదిక ముండును. ఇచట శ్రావ్యతకై కాంస్యతాలమును విడువవలెను. ఏకతాలము, అడ్డతాలము, నిస్సారుకము అను మూడు తాలములు రిఘోణి పరిబంధమున నుండును. ఇది సామాన్యముగా నుండవలయురీతి. సభాపతి యిచ్ఛానుసారమున ఇతరములును కొన్ని యిందుండ దగును. ఇది దేశీపద్ధతి.

ఇందలి సాంకేతికము లయిన పదముల భావముల నీవిధముగా గుర్తించునది. కొన్ని పదముల భావార్థము లిదివరలో నిరూపితము లయినవి.

పుష్పాంజలి— పుష్పపుట మను నామమున రెండవ యధ్యాయమున నిరూపిత మయినది. సర్పశీర్షాకారమున నుండి పుష్పముల

జల్లుటలో విసియుక్తమగును. తుండుక— ఇదియె తుడుక, ఇది వాద్య ప్రబంధము. దీప్తనర్తనమున తుడుక యుండును. శుద్ధపాటాదులతో నిర్మితమయిన ఖండమిందుండును. ఇది దేశీవిధాన మగుటచే నియమ ముండదు గావ ద్రుతాత్ ద్రుతతరమగు మానమిందుండును. తుడుకా విషయమున గొన్ని భావభేదములును గలవు. కవిత— శుద్ధాదినిర్మిత ములయిన ఖండములు కూటములు నుండును. వర్ణానుగుణ్యమున నిది దీప్తనర్తనమున నుండును. ఛేదము— ద్రుతములయిన వికృతము లయిన కరతలాఘాతములచే ఆగి ఆగి వాదన మొదరించినచో ఛేదమగును.

## ప్రేంఖణ పద్ధతిః

అతలాలాపసంయుక్తో ఝుంకారః ప్రథమస్తరః
పదరూపక యోర్మధ్యేస్యాదోతా నియతాస్పదా
అనంతరం తు కవితా తతోఽవచ్ఛేదసంజ్ఞకః
మలపోధప్రహరణం ప్రబంధాః ప్రేక్షణేమతాః
ఏషాం పాటాక్షరైస్తుల్య ముత్ప్లుతైః కరణైకృతం
భ్రమరీభిస్తథాచారీ మండలైరుద్ధతైరపి
నర్తనం ప్రేక్షణం ప్రోక్తం చమత్కారైకకారణం.

ప్రేంఖణము ప్రేక్షణ మనియు నున్నది. ఈపద్ధతిలో నీవాద్య ప్రబంధములు క్రమముగా నుండవలెను. మొదట తాలము ఆలా పములేని ఝుంకార ముండును. పిమ్మట పదప్రబంధము ఓతా ప్రబంధము రూపకప్రబంధ ముండుట విహితము. పదరూపకముల మధ్యలో ఓతాప్రబంధము నియతాస్పదమని ప్రత్యేకముగా నిరూ పితమయినది. పిమ్మట కవితాప్రబంధ ముండును. కవితాప్రబంధము కవితము అనియు నున్నది. జ్యాయన దీనిని స్త్రీలింగముగనె ప్రయో

గించెను. పిమ్మట మలపము పరిహారణము అను వాద్యప్రబంధములు ప్రేక్షణ - ప్రేంఖణ పద్ధతిలో నుండుట సమ్మతము॥

దీనిలో చమత్కారైక కారణమయిన నర్తన ముండును. ఈనర్తనము పాటాక్షరములతో సమముగా నుండును. ఉత్ప్లుతములు కల కరణములతో నీనర్తన మాచరితమగును. భ్రమరీవిశేషములతో నుండును. ఉద్ధతములయిన చారీమండలగతులతో నుండును. ఇట్లుండు నిది ప్రేక్షణ - ప్రేంఖణ పద్ధతి యగును.

ఇందు పద, రూపక, ఓతా, కవిత, అవచ్ఛేద, మలప, పరిహారణపదములు వాద్యప్రబంధ విశేషములు పదము దీప్తనర్తనమున నుండును. ఇందు ఉద్గ్రాహ మల్పము నాత్యంత దీర్ఘమయిన ధ్రువము తుదకు ఖండనము. ఇట్టిది పదప్రబంధము. ఇందు మతాంతరమును గలదు. రూపకము, ఓతా ప్రబంధాచరణానంతరము పాట సహితము లయిన వ్యాపకాక్షరములతో ఉద్గ్రాహ మాచరితమగునేని రూపకమగును. అంతమున గేయము ఖండణముండును. ఇట్టిది రూపకము. ఓతా పరిబంధస్వరూపముకూడ ఇందుండును. కావుననే జాయన పదరూపకముల మధ్యలో ఓత యుండవలయుననెను. ఈ పరిబంధములో ఉద్గ్రాహము రెండు పర్యాయములు పరియుక్తమగును. అనంతరము మేలాపకఖండము ద్వివారము పరియోజ్యము మొదటి పర్యాయముకన్న రెండవ పర్యాయ మధికముగా పరియుక్తమగును. అనగా పాటాక్షరము లధికముగానుండును. పిమ్మట ధ్రువాఖండ ముండును. వ్యస్తములు మిశ్రితములయిన సమస్తపాటము లుండును. పిమ్మట వర్ణసరసంజ్ఞ కల దీర్ఘఖండముండును తుదకు ఖండణము ఈ ఓతాప్రబంధములో సామాన్యముగా ఘోషాక్షరజీవితమయిన ఉద్ధతధ్వని యుండును. దీప్తనృత్త

మున నిది యావశ్యకము. దీనినే కొందరు కేదారప్రబంధ మని, ఆహావనీప్రబంధమని యందురు.

మలపప్రబంధములో శుద్ధాదులచేగాని వర్ణసరముచేగాని నిర్మితమయిన ఖండముండును. మొదటినుండి భాగత్రయమున ద్రుత లయము ప్రయోగింపవలెను. చతుర్థభాగమున విలంబితలయ ప్రయోగ మావశ్యకము. ఇట్టి యీ ప్రబంధాంగములతో గూడు కొనిన యీ ప్రేంఖణపద్ధతి చమత్కారసంపాదకమగును.

ఇటుపై రాసకనర్తనము నిరూపితమగును. గీత ప్రబంధము లలో రాసకప్రబంధ మొకటి కలదు. అది సూడప్రబంధాన్తర్గతము. రాసకప్రబంధమునకు ఈ రాసకనృత్యమునకు సంబంధము కలదు. దేశీనృత్తమున రాసకము నాట్యరాసకము దండరాసకము ననునవి యున్నవి అవియన్నియు రాసకానుసారమున నిరూపితములగును.

రా స క ం.

శుద్ధశ్చ సాలగశ్చేతి సూడస్స్యాన్నర్తనేద్విధా
ప్యాగేలాకరణం వర్ణసరః కైవారఝొంబడౌ
త్రిభంగిః వర్తనీప్రాంతే రాసకోఽథైకతాలికా
ఇత్యేతే శుద్ధసూడేఽస్మిన్ ప్రబంధాః కీర్తితానవ

సూడము అను గీతప్రబంధము శుద్ధసూడము సాలగసూడము అని రెండువిధములు. సాలగసూడమే ఛాయాలగసూడము. నర్తనము నందును సూడము శుద్ధసూడము సాలగసూడ మని రెండువిధముల నుండును. అందు శుద్ధసూడములో ప్రబంధములు తొమ్మిది కలవు.

ఏలా -- కరణము — వర్ణసరము — కైవారము — ఝొంబడము — త్రిభంగి — వర్తని — రాసక — ఏకతాలిక అని.

సంగీతరత్నాకరమున శుద్ధసూడ మెనిమిది విధములని నిరూపిత మయినది.

ఏలా — కరణ — ఢేంకి — వర్తని — ఝోంబడ — లంభ — రాస — ఏకతాలము.

లని జాయపతి నిరూపించిన వర్ణసర, కైవాదములు. ఆలిప్రబంధాంతర్గతములని, త్రిభంగి విప్రకీర్ణ ప్రబంధాంతర్గతమని సంగీతరత్నాకర మనినది.

ఏషాం స్వరాక్షరైస్తుల్యం సదృశం ధాతుకాకుభిః
వినిర్మితస్య వాద్యస్య సమానం నృత్తమాచరేత్.

ఈ నిరూపించిన గీత ప్రబంధములకు సంబంధించిన స్వరాక్షరములకు సమానముగా, ధాతుకాకువులకు సదృశముగునట్లుగా గీత ప్రబంధములకు తగిన విధమున వినిర్మితమయిన వాద్యమునకు తగినట్లుగా నృత్తము నాచరింపవలెను. గీతానుసారముగా వాద్యము తిదుభయానుసారముగా నృత్తము ఆచరింపవలెను.

సంగీతస్య యదాపాత్రం తదా సంగీతముచ్యతే.

సంగీతమునకు ఆవశ్యకత కలుగునేని అప్పుడది సంగీతమగును. సంగీత ప్రాధాన్యముండునేని నృత్తమనరు. నృత్త ప్రాధాన్యమున్ననే నృత్తమగును. సంగీతప్రసక్తి యుండుచో సంగీత మనదగు ననుట సంభావ్యము.

ధ్రువోమట్ఠః ప్రతిమట్ఠోనిః సారుస్సాటతాలకః
రాసకశ్చైకతాలీచసూడే స్యుస్సప్తసాలగే.

సాలగసూడము ఛాయాలగసూడ మనియు నుండుట యిదివరలో సూచిత మయినది సాలగసూడమున సప్తభేదము లున్నవి

ధ్రువము, మంఠము, ప్రతిమంఠము, నిసారుకము, అటతాలము, రాస కము, ఏకతాలము నని. ధ్రువము, మంఠము, ప్రతిమంఠము, నిసారుకము, అడ్డతాలము, ఏకతాలము నని రత్నాకరోక్త సాంకేతము.

శుద్ధసూడమున రాసకమున్నది. సాలగసూడమున రాసకమున్నది. ద్వివిధరాసక స్వరూపము ననుసరించి రాసకనృత్తము నిరూపించుట యిచట ముఖ్యమని జాయన భావించెను. ఇది నృత్తరత్నావలికదా! శుద్ధసూడప్రబంధముల స్వరూపమునుగాని, సాలగసూడప్రబంధముల స్వరూపమునుగాని ప్రకృతము జాయన నిరూపింపదలచలేదు. రాసకనృత్తమునే నిరూపింపదలచెను. సూడప్రబంధాంతర్గతములయిన రాసకముల సంగ్రహస్వరూపము నిట్లు గుర్తింపవచ్చును.

శుద్ధసూడరాసక మిట్లు భావనీయము. దీనిలో గమకస్థానరహితముగా రఘోంబడలక్షణ ముండును. రాసతాలమున నిది గీయమానమగును. ఇది రాసము. ఇందు కొన్ని భేదములు కలవు. గణనిబద్ధము రాసవలయము వర్ణనిబద్ధము హంసతిలకము. మాత్రానిబద్ధము రతిరంగము మరియొకటి మదనావతారము షడక్షరచరణారంభముగా త్రింశదక్షర చరణపర్యంతము ఏకైకాక్షరవృద్ధి ననుసరించి యిరువదియయిదు రాసములు కలుగును. షడక్షరచరణము సప్తాక్షరచరణము అష్టాక్షరచరణము నని. ఇట్లే అష్టమాత్రాచరణారంభముగా ఏకైకమాత్రావృద్ధితో షష్టిమాత్రాపర్యంతము పరిగణింపగా నేబదిమూడు రాసములు లభించునుగాని యవి లక్ష్యమున ప్రసిద్ధముగా లేవని యాదరింపలేదు. ఇది శుద్ధ సూడారాసము.

సాలగసూడారాస మిట్లుండును. రాసతాలమున గీయమానమగునది రాసము. దీనిలో వినోదము, వరదము, నందము, కంబుజము

అని నాలుగుభేదములు కలవు. ధ్రువపదమున కంతమున ఆలాపము కూర్చినచో వినోదము, ధ్రువము మధ్యలో కూర్చినచో వరదము, ఖండద్వయము కల ఉద్గ్రాహముయొక్క ప్రథమఖండ మాలాప నిర్మితమయినచో నందము ధ్రువమునకు ఆదియందే ఆలాపమున్నచో కంబుజము నగును. సర్వరాసకములందును ఉద్గ్రాహము ఖండద్వయముతో నుండవలెను.

ఇక నిచట రాసకనృత్తమునకు సంబంధించిన విశేషము భావించుట సముచితము.

బంధం పిండ్యాదిమాశ్రిత్య యస్మిన్ షోడశనాయికాః
నృత్యంతి ద్వాదశాష్టైవా రాసకం తత్ప్రకీర్తితం
పిండీశృంఖలికాభేద్య లతాభేదాచ్చతుర్విధః
అభ్యధాయిబుధైర్బంధః తత్రపిండీతు పిండనాత్
గుంఫనాత్ శృంఖలాభేద్యో భేదనాత్ జాలవల్లతా
ప్రత్యేకం బహుభేదాః స్యుః ప్రౌఢైస్తే నర్తకైః కృతాః

ఇందు రాసకనృత్తలక్షణ మున్నది. ఈ రాసకనృత్తమున పదునారు నాయిక లుందురు. పిండీబంధము ననుసరించి వారు నర్తన మొనరింతురు. ద్వాదశనాయికలుగాని అష్టనాయికలుగాని యుండవచ్చును. పిండీబంధాశ్రయమున నాయికానర్తన ముండుట రాసకమగునని కీర్తించిరి. ఇందలి నాయికల యవస్థానబంధము నాలుగు విధముల నుండును. పిండి శృంఖలిక, భేద్యము, లతానామములతో నవియున్నవి. పిండ్యాదిభేదములవలన బంధభేదము కీర్తితమయినది. ఈ నాలుగుపదముల వ్యుత్పత్తియు పరిగ్రాహ్యము. పిండనాత్ పిండీ, పిండన మొనర్చో చేయుట యుండును గావున పిండీ యయినది. గుంఫనము కూర్పు ఉన్నందున శృంఖలిక యయినది. భేదన

మున్నందున భేద్యమయినది. "సవృత్తో భేద్యకః స్మృతః" అని భరతవచనము జాలమువలె విచిత్రతరంబది యగును గావున లత యయినది. వీనిలో నొక్కొకటి బహుభేద భిన్నమగును. ప్రౌఢ నర్తకులు వాని నాచరింతురు. నర్తకీయోజ్యమయిన పరస్పరసంబంధము పిండీబంధము అది సజాతీయముగ నుండును. విజాతీయముగ నుండును ఏకనాలావబద్ధకమలయుగమువలె సజాతీయము, హంసవదన పరిగృహీత నాలకలినమువలె విజాతీయ ముండును. పిండీబంధము సజాతీయము. శృంఖలిక విజాతీయము. లతాబంధము సజాతీయ విజాతీయాత్మకము.

ఇక నిటుపై రంగమున ప్రవేశించి నర్తన మొనరించు పాత్రల సంఖ్య, వారి నేపథ్యము ప్రవేశము ప్రాశస్త్యము నిరూపితము కావలసి యున్నది.

షోడశైవ పరం తత్ర యత్తాభిర్బంధపూర్ణతా
చేలం అర్ధోరుకం యద్వా కార్పాసం కంచుకం తథా
ధమ్మిల్లం వేణికాం వాపి తత్తద్దేశానుసారతః
దధానాః సుభగం వేషం క్వణన్మంజీరకంకణం
యౌవనంచ మనోహారి పీవరోరుకటీస్తనం
వాద్యేన ద్వంద్వశస్తుల్య చారీప్రభృతయః క్రమాత్
రంగం యవనికాగర్భాద్విశేయుః పార్శ్వయోరిమాః
ఆదిరాజశ్రియం ప్రేక్ష్య స్వానురూపంచిరాద్వరం
స్వయంవరీతుం మాహాత్మ్య ప్రాప్తా ఇవ సభాపతిం
గోపికానాం సహస్రేభ్యోమానితా ముఖ్యనాయికాః
ఆగతా ఇవభూపేనక్రీడితుం రాసకోత్సవే
యాతాయాత క్రమశ్లిష్టాః స్త్రీరూపాః శశినః కలాః
అస్తదోషోదయాః ప్రాప్తా రాజానమివసేవితుం

ధృతా ఇవతటిల్లేఖాః చలత్కల్పలతా ఇవ
కామినీవేషధారిణ్యః సాక్షాన్నృత్తకలా ఇవ
శిక్షితా ఇవపార్వత్యా ప్రతిచ్ఛాయా ఇవశ్రియః

ఇచట నిరూపితమగు రాసకరంగస్థలమునందు షోడశనాయిక లుండుట యుక్తము. షోడశ సంఖ్యాక లున్నందున బంధపూర్ణత కలుగును. అష్ట - ద్వాదశ సంఖ్యతో నున్నచో సిట్టి పూర్ణత కలుగదు. ఇట్లు షోడశసంఖ్యానియమము పాలనీయము. వారు ధరింపవలయు ఆహార్య మీవిధమున నుండదగును. ఈ షోడశపాత్ర లందరు సమానవయస్కులు కారుకద! కావున ఆహార్యమందును విశేషముండును. చేలము - పైట ధరించువారు, అర్ధోరుకము - చిన్న లాగు ధరించువారు కొందరు నుందురు. కాదో, కార్పాసము కంచుకము ధరింతురు ఆయా దేశానుసారముగా ధమ్మిల్లమునుగాని వేణికనుగాని ధరింతురు సుభగమయిన వేషము ధరింతురు. భూష ధరింతురు. వారు ధరించిన మంజీరములు కంకణములు క్వాణనముతో కూడిన వైరమ్యముగా నుండును. ఇది వారి యాహార్యము. వారి యౌవనము మనోహరము. ఊరువులు కటి కుచములు పీవరములై పూర్ణస్ఫుట యౌవనము సూచించునవిగా నుండును.

వారందరు సమానము లయిన చారీగతులు కలవారు. మండల సంచారములు కలవారు గతిప్రచారములు కలవారు స్థాన కానుసరణము కలవారుగా నుండవలెను. వారు క్రమముగా ఇద్ద రిద్దరుగా వాద్యానుసారమున రంగము ప్రవేశింతురు. యవనికా గర్భమునుండి ప్రవేశింతురు. యవనికాపార్శ్వభాగముల ప్రవే శింతురు అటునుండి యిటునుండి మధ్యనుండి జట్టుజట్టుగా నిద్దరిద్దరుగా ప్రవేశించుటనె సభారంజనము సంపన్నమగును.

ఆదిరాజ శోభాసదృశ శోభావిశేషము కల సభాపతి నృత్త సభలో సముపవిష్టుడై యుండగా చిరకాలమునకు స్వానురూపుడయిన వరుడని చూచి, సభాపతి మాహాత్మ్యవిశేషమున స్వయముగా నాతని వరించుటకు వచ్చినవారివలె వారుందురు. వరించుటకు వచ్చిరో యను నట్లుందురు. వరణీయవరణమునకై వచ్చినవారు సముజ్జ్వల వేషమున సముత్ఫుల్లాకృతి విశేషమున సముత్సుకచిత్తమున వత్తురుకదా! ఇంకను వారిట్లుందురు. వేలకొలదియున్న గోపికలలో రూప యౌవనవిలాస లాలితలయిన మానినీలలితలయిన ముఖ్యనాయికలు రాసకోత్సవమున రాజుతో రాసక్రీడ లాచరించుటకు వచ్చిరో అనిపించును. యమునాతీరమున కౌముదీమహోత్సవములో మురలీనాదాకృష్టలయిన గోపికలు కతిపయ సంఖ్యాకలు కృష్ణునితో రాసోత్సవమున జేరిరను భాగవతార్థ మిచట భావనీయము.

చంద్రుని కళలు పదునారును యాతాయాతక్రమమున శ్లిష్టములై పూర్ణిమనాడు చంద్రుని సేవించుట శాస్త్రసిద్ధము. అపుడా సుధాంశువు సకలకలాశోభకలవాడై భాసించును. చంద్రకళలన్నియు స్త్రీరూపము ధరించి గతాగత విధానమున సంశ్లిష్టములై దోషోదయములేనివై రాజును సేవించుటకునై వచ్చినవిధముగా రంగమున ప్రవేశించిన షోడశకన్యలు భాసింతురు. ఈ భావము నిరూపించుటకో జాయన యిచట శ్లేషకూర్చినాడు. దోషోదయము - రాత్రియుదయము, దోషములు ఉత్పత్తి-రాజ-చంద్రుడు, సభాపతియగు రాజు ప్రకృతరాజసేవనమునకై శశికలలు స్త్రీరూపముధరించి నర్తకీభావమున వచ్చినారని యిందలి భావము రమ్యము.

ఇంక నీరంగప్రవిష్టలు స్థిరరూపము ధరించిన విద్యుల్లతలవలె, సంచలనముపొందు కల్పలతలవలె, కామినీ రూపము ధరించిన

సాక్షాన్నృత్తకళలవలె నున్నారనుట వారి స్వరూపసౌందర్య ప్రశంస. పార్వతీదేవిచే శిక్షితలయినవారివలె నున్నారనుట వారొనరించు లాస్యభంగ కౌశలప్రశంస. శ్రీదేవి ప్రతిచ్ఛాయవలె నున్నారనుట వారి సర్వశోభారమ్యత ఇట్లు రంగనర్తకీ ప్రశంసను జాయన సాదరముగా సాభిమానముగా నిరూపించుట రమ్యముగానున్నది. శ్రీదేవివలె నున్నారని యనెను. కాని పార్వతివలె నున్నారనక పార్వతిచే శిక్షితలవలె నున్నారనుట జాయన పార్వతీభక్తి యు భాసించును.

ఇక రాసకోచితమయిన గీతము గీతార్థోచితమయిన యభినయము, నర్తనమున ప్రదేశనిర్గమనాది విశేషములు నిరూపితములగును.

ఋతుప్రయోజ్యరాగేణ గీయమానేషు గాయకైః
చర్చర్యాది ప్రబంధేషు దేశీనూడస్థితేషుచ
వాద్యేషు చ ప్రయుక్తేషు సదృక్షేషు విచక్షణైః
ఖండమండలచారీభిర్లాస్యాంగ ప్రముఖైరపి
కుర్వత్యః ప్రసృతై రంగైర్గీతార్థాభినయం సమం
ప్రవేశై ర్నిర్గమై స్సంధిహీనై రప్యపసారణైః
ఛోటికాభిర్మిథో హస్తతాలికాభిర్లయానుగం
బంధురై ర్వివిధై ర్బంధై ర్నృత్యేయు రిహనాయికాః

ఒక్కొక ఋతువునం దొక్కొక రాగముచితము. ఏ ఋతువులో నేరాగము ప్రయుక్తము కావలెనో సూచించునియమమున్నది. ఆ నయమానుసారముగ నియత ఋతువునందు ప్రయోగింపదగు నియతరాగమున గాయకులు చర్చర్యాది ప్రబంధములను దేశీనూడగతములగు వానిని గాన మొనరించుచుండగా, ఆయా గీతప్రబంధగానములకు సమానములయిన వాద్యప్రబంధములను విచక్షణులగు

వాదకులు వాదన మొనరించుచుండగా రంగముననున్న షోడశ నాయికలు నృత్త మొనరింపవలసియున్నది. వారు ఖండమండల విధానమున చారీగతివిధానమున లాస్యాంగపరిధానములగు విధానముల నభినయింపవలెను. ఇచటి లాస్యాంగములు ప్రథమాధ్యాయ నిర్దిష్ట లాస్యాంగములు నగును. దేశీలాస్యాంగములు నగును. ఆయా విధానములకు తగిన అంగప్రత్యంగములచే తగిన విధమున గీతార్థాభినయ మొనరింపవలెను. ఆయా సమయములకు సముచితములయిన పరివేశములు నిష్క్రమణములు అపసారణములు అన్నియు సంధిరహితములుగా నుండదగును. వెలితి గోచరింపరాదు. పరివేశన నిష్క్రమణావసరణములలో విలంబమున సందు గోచరించును. అది లేకుండునట్లు సర్వమువిలంబముగ నుండునట్లు సమీక్షింపవలెను. ఆ నాయికలు ఛోటికలు = చిటికెయివేయుచు చప్పట్లు చరచుచు నర్తింపవలెను. ఆ చిటికెలు ఆ కరతాలములన్నియు లయానుగతములుగా నుండవలెను. బంధురములుగా నుండు వివిధబంధములను సంధానించుచు వారు నర్తింపవలెను. ఇట్లు నర్తింపగా నిది రాసకమగును.

## చర్చరీ.

ఛర్చరీమే తదేవాహుః వర్ణతాలాంచితేనచేత్
వాద్యేన ప్రవిశేయుస్తా గాయంత్యశ్చర్చరీం కలం
ద్విపదీం వాథశృంగారవీరాభ్యాం ఋతువర్ణనైః
నాయకస్య గుణఖ్యాతి ప్రఖ్యాపనపదోత్తరైః
మండలేన ప్రనృత్యంతి కాంతావాసంతికోత్సవే.

సూడపరిబంధము ఆలిప్రబంధము విప్రకీర్ణప్రబంధము అను మూడు ప్రబంధములలో మూడవదియగు విప్రకీర్ణప్రబంధమున

నానాభేదములు కలవు. అయినను ప్రసిద్ధి ననుసరించే షట్త్రింశత్ప్రకీర్ణ ప్రబంధములనే పరిగణించిరి. వానితో చచ్చరి అను ప్రబంధము కలదు. అదియే చర్చరీ ప్రబంధము. చర్చరీప్రబంధ స్వరూప మీావిధముగా నుండును. ఇందు రాగము హిందోలము తాలము చచ్చరి. షోడశమాత్రలు రెండురెండు పాదములను ప్రాససంయుక్తము లగును. దేశభాషానిబద్ధములయిన పదములతో రచితమగును. వసంతోత్సవమున దీని గానము చేయుదురు. చచ్చరీచ్ఛందమున నిది గేయమగునని కొందరందురు. క్రీడాతాలమున గేయమగునని కొందరందురు. ఈ చచ్చరి ఛ్ఛదోఽంతరమున గానము చేయుట యగునేని ఛందశ్శాస్త్రమున నిరూపించిన తత్తచ్ఛందోనామమున వ్యవహారముండును ఇది పదబద్ధము, తాలబద్ధము నగును గావున రెండు అంగములు కలదగును.

ఆలిప్రబంధమున వర్ణప్రబంధము కలదు. వర్ణతాలమున కర్ణాటభాషతో బిరుదములతో నిబధ్యమానమగునది వర్ణప్రబంధ మగును. తాలప్రకరణమున వర్ణతాల మున్నది. అది త్రివిధము, కావున వర్ణప్రబంధమును త్రివిధమగును.

ఈ యర్థభావనమున నీ చర్చరీభావనము యుక్తము. వర్ణతాలాంచితమగు వాద్యమున నాయికలు ప్రవేశింపవలెను. కలనాదమున చర్చరీగాన మొనరింపవలెను. ద్విపది నయిన గానముచేయవలెను. ఆ గానమున నాయకునకు సంబంధించిన శృంగార వీర విశేషము లుండదగును. నాయకుని గుణఖ్యాతి ప్రఖ్యాపనపరము లయిన పదములతో రమ్యము లయిన ఋతువర్ణనములతో నా గానము కూడియుండవలయును. ఇట్లు వారు గానముచేయుచు వసంతోత్సవమున మండలాకారమున నర్తన మొనరింపగా నది చర్చరి యగునని తద్విదులు నిరూపించిరి.

## నాట్యరాసకం.

చరితం భూపతేర్యత్ర పదార్థైరభినీయతే
నాయికాభిర్వసంతర్తౌ దేశీహిందోలగీతిభిః
యౌవనాసవమత్తాభి స్తదుక్తం నాట్యరాసకం.

ఇచట నాట్యరాసక స్వరూపముున్నది. ఇదియు దేశీనృత్తము పూర్వము నిరూపించిన రాసకముకన్న చర్చరికన్న నిది భిన్నరూపమున నున్నదని జాయనభావనము. చర్చరి వసంతముననె ప్రయోజ్యము. ఇదియు వసంతముననె ప్రయోజ్యము. హిందోలమంతట నున్నది. కాని యిది పదార్థాభినయాత్మకమని జాయన భావము.

దీని లక్షణ మిట్లు భావనీయము. వసంతఋతువునందు నాయికలు దేశీహిందోల గీతములతో భూపతి చరితమును పదార్థములతో నభినయింతు రేని యది నాట్యరాసకము పదార్థాభినయాత్మకముగా నృత్య మొనరించు నాయికలకు యౌవనాసవమత్త విశేషణమున్నది. బిగువయిన యౌవనమున గూడినవారని భావము. అట్టివా రిట్లు నృత్య మొనరింపగా రసమనోహరమగు ననుట భావ్యము.

## దండరాసకం.

పాత్రాణ్యష్టౌ సమారభ్యవర్ధంతే దండరాసకే
క్రమాచ్చత్వారి చత్వారినాయకేచ్ఛానుసారతః
చతుష్షష్టిర్భవేద్యావద్యావత్ ద్విగుణా పరైః
అరత్నిసమ్మితౌ దైర్ఘ్యాదంగుష్ఠపరిణాహినౌ
దండౌ కనకబద్ధాంతౌ మదనాది ద్రుమోద్భవౌ
సువృత్తౌ మసృణౌ నానావర్ణకై శ్చారుచిత్రితౌ
దధీరన్పాణిపద్మాభ్యామథవా దండచామరే
క్షురికా దండకౌ యద్వా తత్తద్దేశీయభంగిభిః

ఉ_క్తేషు వాద్యమానేషు చిత్రబంధేషు వాదకైః
లాస్యాంగ భ్రమరీపాదచారీభి శ్చారుచంక్రమం
సవ్యాపసవ్య తశ్చక్రభ్రాంత్యా ఖండప్రయోగజైః
సశబ్దం పంచభిర్ఘాతైః కుర్వీరన్దండమేలనం
న_ర్తకీన_ర్తనే ప్రోక్తాః ప్రబంధాస్సకలా అపి
కౌతుకా ద్భూమిపాలానాం వాద్యంతేఽత్రయథాక్రమం
న_ర్తనంచ తథాకుర్యాత్ప్రౌఢ న_ర్తకశిక్షితం.

రాసకనృత్తములలో నీ దండరాసకము నొక విశేషము. సామాన్యముగా రాసకవిశేషములన్నియు గోపీనృత్త విశేషముల నూచించును. గోపీకృష్ణుల రాసలీలా నృత్తవిశేషముతో నిది సంబంధించి యుండును. ఈ రాసకములోని రాసపదము రసమును రాసతాలమును సంబంధించియుండుట భావనీయము రాసకమును లాసకమనియు ననిరి. నూడగానము రాసకముతో సంబంధించి యుండుటను సంగీతవిదులు సంభావింతురు. రాసకము లయ ప్రక్రియను నంబంధించి యుండుట నభినవుడును సూచించెను.

ఈ ప్రఘట్టమునందు దండరాసక లక్షణము న_ర్తకీసంఖ్య దండస్వరూపము చామర చ్ఛురికములను ధరించుటను వాద్య చార్యాది విశేషములు దండమేలనము సకలవాద్య ప్రబంధముల యు_క్తత నిరూపితమగును.

దండరాసకమునందు ఎనిమిది మొదలుగా పాత్రలభివృద్ధి పొందుచుందురు. క్రమముగా నలుగురు నలుగురు రంగమున ప్రవేశించి వృద్ధి నాపాదింతురు. నాయకేచ్ఛానుసారముగా నది యుండును. ఆసంఖ్య చతుష్షష్టిపర్యంత ముండును. ఈ ప్రవేశించిన వారు రెండు బారులుగా నుందురు. ఒకరికొక రభిముఖముగా నుందురు. ఇట్లుండగా ఒక న_ర్తకి వెనుభాగము వేరొకన_ర్తకి వెను

భాగమునకుండును. ఇట్లు రంగప్రవిష్టులయిన వారిరీతి కోలాటమను నృత్తరీతిగా లోకమున ప్రసిద్ధము. ఇది దండరాసకము. కావున వారి హస్తములలో దండము లుండును. ఆ దండములు కోలాటపు కఱ్ఱలు. వానికిందు దండములని పేరు. అట్టి దండములతో నొనరించు రాసకము కావున దండరాసకము.

ఆ దండముల స్వరూప మీవిధమున నుండును. ఒకరొకరికి రెండు రెండు దండములుండును. ఆ దండములు అరత్ని సమ్మితములు· వాని పొడవు అరత్ని మితము. అరత్ని = మూరెడు వాని పరిణాహము లావు అంగుష్ఠమంతగా నుండును. బొటనవ్రేలి లావుగా నుండుట యుక్తము. అంతకన్న లావు తగదు. అది భారము. సన్నము తగదు. అది పేలవము. వాని చివరిభాగము కనకబద్ధకము, బంగారపు పొన్నుతో నుండును. మదనవృక్షపు = మంగకొయ్యతో నిర్మితములు కావలెను. గుండ్రముగా నున్నగా నుండవలెను. నానా వర్ణములతో రమ్యముగా చిత్రితములై యుండవలెను. ఇట్టి దండములు అర్జునవృక్షపు కొయ్యతో నిర్మితము లగుటయు కలదు. దండరాసకమున నియుక్తలయిన నర్తకీమణులు వారి పాణిపద్మములచే నీ దండముల ధరింపవలెను. ఇందు వేరొకరీతియు కలదు. అది ఆయా దేశీయభంగీవిశేషము ననుసరించియుండును. అందువనె దండచామరములు ధరించుటయు, క్షురికాదండములు ధరించుటయు నున్నది ఒకచేతితో కుడిచేతితో దండము వేరొకచేతితో ఎడమ చేతితో చామరము, ఇట్లే వామహస్తమున క్షురిక = చిన్న కత్తిపిడీ కల కత్తి యుండును. దక్షమున క్షురిక వామమున దండము, వామమున దండము దక్షమున చామరము ఆయా దేశీయవిధానమున సమయౌచిత్యానుసారమున ధరించుట యుండును. ఇది దండధారణరీతి.

ఇందు వాద్యాదివిశేషములలో నొక విశిష్టరీతి యున్నది. అది యిట్లు భావనీయము. వాదకులు రంగమున వాద్యములతో సన్నద్ధులై చిత్రబంధసహితముగా నిరూపిత సముచిత వాద్యములను వాదనమొనరించు చుండగా నర్తకీగణము దండమేలన మొనరింప వలెను. వాద్యగతుల ననుసరించుచు సవ్యాపసవ్య విధానమున దక్షభాగమునుండి వామభాగమునకు, వామభాగమునుండి దక్షభాగమునకు సంచరించుచు చక్రభ్రమణవిధానమున దండమేలన మొనరింపవలెను. నానావిధసముచిత లాస్యాంగముల విధానమున భ్రమరీ విధానమున పాదసంచారవిశేషమున చారీగత్యనుసరణమున చారు చంక్రమణము నాచరింపవలెను. ఖండప్రయోగజన్యము లయిన అయిదు ఘాతములతో సశబ్దముగా దండరాసక మాచరింపవలెను. వాద్యప్రబంధములలోని ఖండిభాగమును ఖండశః వాదన మొనరించు విధానమునకు ఖండక మందురు. అట్టి ఖండకముల సంబంధమున నర్తకీగణము పాదఘాతము లొనరించుట నృత్యమున రమ్యముగా నుండును. ఇట్టి ఖండకసంబంధమున పాదఘాతము లొనరించుచు దండరాసక మాచరించునది. నర్తకీనర్తనమునకు తగినవని నిర్ణీతము లయిన సర్వవాద్య ప్రబంధములను భూమిపాలుర కౌతుకానుసారముగా నిచట యథాక్రమముగా కూర్పదగును. తత్తద్వాద్యానుసారముగా నర్తకీనర్తనముండుటయు నావశ్యకము. ఇట్టి నర్తనము ప్రౌఢ నర్తకశిక్షితమై శోభించును. నృత్తము ననాయోజితము లగునవి యన్నియు పాలకుల యిచ్ఛానుసారమున వాద్యప్రబంధానుసారమున నుండుటయె ముఖ్యము. ప్రౌఢనర్తక శిక్షితమయిన నర్తనమనుట భావనీయము. ఈ దండరాసకమునందు వాద్యవైచిత్ర్యము నృత్తవైచిత్ర్యము బహునర్తకీ ప్రవేశకృతముగా శోభాసంపాదకమగును.

వాద్యప్రబంధములు నలుబదిమూడు కలవు వానిలో గీతానుగములుగా నుండునవి యని వేనిని వాద్యవాదనకలాదులు నిర్ణయింతురో వాని నాయోజన మొనరించుట యుక్తము.

రాజసన్నిధిలో నర్తకీమణులు ౪, ౮, ౧౬. ౩౨, ౬౪ సంఖ్యగా రంగమున ప్రవేశించి మూరెడు కోలాటపు కఱ్ఱలను బట్టుకొని, దేశీయరాగానుసారముగ దండచామరములను, దండచ్ఛురికములను, దండక్షేమములను ధరించి ఖండప్రహారజన్యము లయిన ఘాతప్రయోగములతో సంగతములై విడి పడి వాద్యానుసారముగా నర్తన మొనరింతురు. అగ్రభాగమున పృష్ఠభాగమున పార్శ్వభాగములందును చారీభ్రమరికాదుల ననుసరింపవలెను. చిత్రరీతుల ననుసరించి లయతాలానుగతముగా మండలరీతుల ననుసరించుచు నర్తన మొనరించినచో నది దండరాసకమగునని సంగ్రహము.

శివప్రియం.

మృదంగ కరటా కాంస్య తాలకాహల వాదకైః
వాద్యమానేషు వాద్యేషు యతి ప్రహరణాదిషు
కాంస్యేన ఘటితా న్యద్వా లోహేవ ఫణినః కరైః
వామైర్వామేతరైః కోణాన్ బిభ్రాణా స్తన్మయానపి
స్ఫురత్క్రికిటీకారం వాదయంతో లయానుగం
రుద్రాక్షాభరణాః శ్లక్ష్ణాః క్లుప్తభూతి త్రిపుండ్రకాః
శివైకతత్పరాభక్తానరాః నారీజనోఽథవా
శ్రేణీభూతాః ప్రమోదేన గాయంతశ్చంద్రశేఖరం
అంగైర్యథోచితైః పాదైర్లాస్యాంగైర్గతి సంయుతైః
అన్యోన్యాభిముఖీభూయ ద్విధాభూతాః కదాచన
కదాచిన్మండలీభూతా నృత్యే యుర్బహుభంగిభిః
శివోత్సవేషు కర్తవ్యం నృత్తమేతచ్ఛివప్రియం.

ఈ ప్రఘట్టమున శివప్రియమను నర్తనము నిరూపిత మగును. ఇందలి వాద్యవిశేషములు నేపథ్యవిశేషము నర్తన మొనరించువారు శివభక్తులుగా నుండుట, నారీనరులు పాత్రలుగా నుండదగియుండుట, గానము శివపరముగా నుండుట తన్నర్తనప్రకారము. దీనిని శివోత్సవములలో ప్రయోగింపవలయుట యనునవి యిచట నిరూపితములగును.

ఈ శివప్రియము నితరులు నిరూపించిరి. శివోత్సవములలో శివభక్తులు ఈ శైవనృత్యము నాచరింతురు. ఇందుపయుక్తములగు వాద్యములు విశిష్టములు. నారీనరుల వేషములు భస్మరుద్రాక్ష మాలాది విశేషములతో నుండదగును. రెండు వరుసలుగా నుండి గాని వలయముగానుండిగాని నర్తన మొనరింతురు. ఇది యిందలి సామాన్యరూపము.

ఈ శివనృత్తమునం దీవాద్యము లుపయుక్తములు కావలెను. మృదంగము, కరట, కాంస్యతాలము, కాహలము. వీని వాదన సంప్రదాయము గుర్తించిన వాదకులు వాదన మొనరించుచుండగా నారీనరులేతెంచి శివప్రియ మొనరింతురు. ఇందు కరటమనునది దేశీయ వాద్య విశేషము. ఇదియొక ఆతోద్యము. అవనద్ధవాద్యము ౨౧ అంగుళములు పొడవు ౧౨ అంగుళముల ముఖము, కోణద్వ యమున నిది వాద్యమగును. యతిప్రహరణాది విధానమున నీవాద్య ములు వాదితములు కావలెను. ఇందు యతి ప్రహరణము అనునవి వాద్యప్రబంధములు. గీతప్రబంధములవలె ఉద్గ్రాహ ధ్రువ కాభోగ ములచే వాద్యప్రబంధము లుపనిబద్ధము లగును. ఇవి యత్యాది పై సారాంతములు నలుబదిమూడు కలవని పూర్వము నిరూపితము. సామాన్యముగా వాద్యప్రబంధముల తుదిలో దేంకారము దేం అను శబ్దము ప్రయుక్తమగును. వాద్యఖండము బహువిరామము

లతో వాదితమగునేని యది యతి. ఇదియె జక్క. వాద్యప్రబంధములో మొదట నిది యుండునేని ఉట్టవణమందురు. ఉద్ధత నాదముననూటపాటములతో నిబద్ధమగునది పునఃపునర్గీయమానమగునది పరిహారణ ప్రబంధమగును. ఇట్లు వాద్యములు మ్రోగునపుడు వాద్యోపకరణము లనదగిన సర్పాకృతికల కోణములను శివప్రియనర్తన మొనరించువారు ధరింతురు. ఆ కోణములు కాంస్యనిర్మితములుకాని అన్యలోహనిర్మితములుకాని కావచ్చును. అట్టి కోణములను వారు సర్పరూపములుగానున్న వానిని వామ వామేతరహస్తములతో ధరింతురు. దక్షవామహస్తములందు ధరింతురని భావము. అట్లు ధరించి కిరికిటీకారము స్ఫురించునట్లుగా లయానుగముగా వాదన మొనరింతురు. ఈ కిరికిటి కిరికిట్టకమనియు వ్యవహృతమగుచున్నది. దీనిని శుక్తివాద్య మనియు నితరు లభివర్ణించిరి. ఇది సర్పాకృతిగా క్రిందిభాగమునకుండును. లోహనిర్మితము, మూడంగుల విస్తారము కలిగి సార్ధహస్తద్వయ దీర్ఘముగా నుండును. తిర్యగ్రేఖా విరాజితమై మృగశృంగాకృతిగా నుండును. సరళమయిన లోహకోణముచే నగు ఘర్షణమున నిది వాదనీయము. కిరికిట్ట యనునవి యిందు పాటవర్ణములు, ఈ వాద్యదేవతలు యక్షులు. ఈ వాద్యమున కేవలము యతిజ్ఞానమె ప్రయోజనము. ఇట్లీవాద్యములు మ్రోగునపుడు నరులు నారీజనులు రుద్రాక్షాభరణులై శ్లక్ష్ణరూపులై భస్మత్రిపుండ్రకము ధరించినవారై శివైకతత్పరులై భక్తులై శ్రేణీరూపముగా కూడుకొందురు. ప్రమోదమున చంద్రశేఖరుని గానము చేయుదురు. యథోచితములయిన అంగాభినయములతో పాటములతో గతిసంయుతములయిన లాస్యాంగములతో వారు రంగమున నర్తన మొనరింతురు. అన్యోన్య మభిముఖముగా సంచరింతురు.

ఒకప్పుడు రెండు బారులుగానుండి ఒకప్పుడు మండలాకారమున నుండి నానాభంగివిశేషములతో నర్తన మొనరింతురు. ఇట్టిదిది శివప్రియ నృత్తము. శివోత్సవములలో శివప్రియనృత్తము ప్రయోగింపదగును.

ఈ శివప్రియనృత్తము నితరులును గుర్తించిరి. ఆతోద్యములు యతి-ప్రహారణములను ప్రయోగించునవికాగా సౌష్ఠవముతో కూడుకొనిన రుద్రభక్తి కల స్త్రీలుగాని పురుషులుగాని రుద్రాక్షభ్రణయులై భస్మత్రిపుండ్రధారులై శివరూపులై రంగము ప్రవేశింతురు. వారు కాంస్యాది వినిర్మితములయిన సర్పాకృతి కల కోణములను దక్షవామహస్తములందు ధరించి నర్తనము చేయుదురు. బహువిధముల చంక్రమణము లొనరింతురు. మనోహరముగా గాన మొనరింతురు. బారులు తీర్చియుందురు. ఒకప్పుడు సమ్ముఖినులై యుందురు. లాస్యాంగములచే నృత్తముపబృంహిత మొనరింతురు ఇది శివప్రియము.

ఇటుపై చింతు నృత్యము నిరూపితమగును. దీనినే చిందు అందురు. చిందు అను దేశీయపదము సంస్కృతమున చింతు అయినది. చింతు నృత్తము నితరులు నిరూపించిరి ఇది ద్రవిడ వల్లభము. ఆంధ్రమున నిది జాతరల సమయములలో 'చిందు' అయినది. గ్రామములలో "చిందులు" కలవు. డప్పు తప్పెటల మ్రోతలతో గ్రామములలో నూరేగుచు చిందు పాటలు పాడుచు "చిందులు" త్రొక్కుదురు. గ్రామములలో నొక వర్గము వేరొక వర్గముపై దూకుడు సాగించుటలోకూడ 'చిందు' ఉండుట ఒకప్పుడు అస్వాభావికము కాదు. దీనిలో దీని లక్షణ మీవిధమున నున్నది.

## చిన్తునృత్తం.

తాలచ్ఛందానుగైః పాటైః యతిప్రహరణాదిభిః
కరతాలలయోపేతైః వాద్యవక్త్రోభవైస్సహ
పాదైర్లలితలాస్యాంగైః చారీభిర్గతిభిస్తథా
శ్రావ్యైర్ద్రవిడదేశీయైః క్లుప్తైస్తత్కాకురీతిభిః
గీతార్థాభినయోపేతైః ద్విపదైశ్చింతు సంజ్ఞకైః
ప్రయోగైశ్చాపితైః కిత్తుప్రచురైస్సులయైర్ముహుః
నృత్యేయః ప్రమదాయత్త సువేషా నవయౌవనాః
సుకలాసంవితన్వంత్యః పత్యుర్మధ్యే మనోహరం
చిన్తునృత్తమితి ప్రోక్తమిదం ద్రవిడవల్లభం.

చింతు నృత్త స్వరూప మిందున్నది. ఇది ద్రావిడదేశీయుల కభీష్టము. సముచితము సుందరము నగు వేషము ధరించిన నవయౌవనము కల స్త్రీలు సుకలాసమను దేశీలాస్యాంగము ప్రయోగించుచు నర్తన మొనరింతురు. ఈ చింతు నృత్తమున లలితలాస్యాంగములతో గూడుకొనిన పాదవిన్యాసములు చారీసంచారములు గతిప్రసారములు నుండును. ఇవియన్నియు తాలచ్ఛందానుగతము లయిన పాటములతో యతి-ప్రహరణాదులతో నుండును. కరతాలముల లయవిధానములతో నుండును. ఆయా పాటములు వాద్యప్రభవములు నగును. వక్త్రవాద్యప్రభవములు నగును. ద్రవిడదేశీయము లయిన శ్రావ్యములగు కాకురీతివిన్యాసములతో సంక్లుప్తములయిన గీతములతో నుండును. గీతార్థాభినయములతో చింతు సంజ్ఞకల ద్విపదములతో కూడియుండును. ఇంకను 'కిత్తు' ప్రచురములయిన లయాన్వితములగు ప్రయోగములతో నుండును. కిత్తు అనునది దేశీలాస్యాంగము షష్ఠాధ్యాయమున నిరూపితమయినది. స్తనములకు భుజములకు కటులకు తాలసమ్మితమయిన స్పందనము కిత్తు. దీనిని

కింతు అనియు ననిరి. ఇట్టి చింతునృత్తమును కిత్తు సుకలాసములతో సుందర మొనరింపగా నిది ద్రవిడవల్లభమగును.

దేశీనృత్తములలో కందుకనృత్తము కలదు. అది యిక నిరూపితమగును. కందుకఖేలనము కావ్యరూపములలో నిరూపితమయినది. దండి దశకుమారచరితములో కందుకావతి కథయున్నది. ఆమె ఆయాటలో నిపుణ. వింధ్యవాసినీ సేవకై కృత్తికాసమయమున కందుకనృత్య మొనరింతురు రంగముపై కందుకము విసరిపట్టి యాడుటలో లయగత్యనుసరణము లుండును. ఈ నృత్తమున చూర్ణ పాదాది విశేషములును కలవు. కందుకతంత్రము కలదట. కందుకముపై కరప్రహారము మృదువుగా నమృదువుగా నుండుటయు వర్ణితమయినది. దిక్కుదిక్కునకు కందుకమును ప్రసరింపజేయుటలో కరణమధురముగా విహారణము లుండును. మండలసంచారము లుండును. కందుకక్రీడనమున చాల విశేషములు కలవు. ఆడుటలో నాడుమనిషి అవనమనములున్న మనములు దృశ్యమనోహరములు. జ్యాయన కందుకనృత్త నిరూపణములో కొన్ని సాంకేతికములను, పద్మ — గోమూత్రిక — సర్ప — చక్రవిశేషములను భావింపవలసి యున్నది. ప్రమదలు కొందరు కందుకనృత్త మొనరించుట సమూహనృత్తముగా నిందున్నది. ఇందాకందుకరూప మున్నది. తత్క్రీడన మున్నది. సర్వము తద్రూపము.

## కందుకనృత్తం.

పద్మగోమూత్రికా నాగచక్రప్రభృతిషు స్ఫుటం
వాద్యమానేషు బంధేషు నానాపాటేషు వాదకైః
దేశీయనర్తన ప్రోక్త ప్రబంధేష్వథవాక్యమాత్
నర్తకీ వేషధారిణ్యః సుమధ్యా దీర్ఘలోచనాః

పీవరోరుకటీభారాః పీనోన్నత పయోధరాః
స్పర్ధమానామిధః కాంతిరూప యౌవనవిభ్రమైః
హేమ్నారూప్యేణ కాంస్యేన రచితాన్ దారుణాథవా
అంతశ్చలదయోగోల నిక్వాణముఖరీకృతాన్
దత్త్వాన్యాసాం నిజాన్ తద్వత్ గృహ్ణత్యః పరతః పరాన్
మిధోవినిమయే నైతాన్ స్వీకుర్వత్యః కదాచన
కుచవక్త్ర కృతాసక్తాన్ శకుంతానివకందుకాన్
కరైరుడ్డాపయంత్యస్తాన్ కౌతుకోత్కూలకూజితాః
ఉల్లలత్కందుకప్రాప్తి ధావల్లోలాక్షి లీలయా
రచయంత్య ఇవాకాశం సరోమీనాబ్జసంకులం
చారీభిర్గతిభిః పాదైః లాస్యాంగైరపికోమలైః
నృత్యంతి వనితా యత్తత్స్యాత్కందుకనర్తనం.

ఈ కందుక నృత్తలక్షణ ప్రఘట్టములో నర్తనలక్షణము, అందు గతివిశేషములు, అప్పటి వాద్యప్రబంధ విశేషములు, పాత్ర లక్షణము కందుకవర్ణనము నర్తనప్రకారము నిర్దిష్టమగును. మొదట వాదకులు వాద్యము లారంభింతురు. ఆ వాద్యములు నానావిధము లగు పాటవర్ణములతో సంబద్ధములై వాద్యమానములగును. పద్మ బంధము, గోమూత్రికాబంధము, నాగబంధము, చక్రబంధము మొద లయిన బంధవిధానములకు తగినట్లుగా వాద్యములను వాదకులు వాదన మొనరింతురు. సామాన్యముగా దేశీయనర్తనము లన్నిటి యందును కొన్ని వాద్యప్రబంధములు సర్వసాధారణముగ నుండును గావున, అట్టి వాద్యప్రబంధములు వాద్యమానము లగును. అవి యట్లు వాదితములగుచుండగా నర్తకీవేషము ధరించిన వనితలు వత్తురు. వారి సౌందర్యము స్పృహణీయముగా నుండును. వారు సుమధ్యలు, దీర్ఘలోచనలు, పీవరములయిన యూరుకటీభారములు

కలవారు. పీనము లున్నతములయిన పయోధరములు కలవారు. కాంతి రూప యౌవన విభ్రమములచే పరస్పరము స్పర్ధమానముగా నుందురు. ఈ నర్తకీరూపలు కందుకములను ధరించి యుందురు. ఆ కందుకము లీవిధముగనుండును. అవి బంగారముతోగాని వెండితోగాని కంచుతోగాని లేదా దారువుతోగాని నిర్మితములై యుండును. ఆ కందుకముల లోపలిభాగము డొల్లగా నుండగా నచట ఇనుప గుండ్లు ఉండవలెను. కందుకములు కదులునపుడు ఆ యయోగోళకముల కదలికవలన ధ్వనులు నిక్వాణము లుదయించును. అట్టి నిక్వాణముచే నా కందుకములు ముఖరీకృతములై భాసించును. ఆ కందుకములు ధరించిన వనితలు తమ కందుకముల నితరవనితల కిత్తురు. ఇతరవనితలనుండి వారి కందుకములను తాము గ్రహింతురు. పరస్పరమిట్లు వినిమయమున వారు క్రీడింతురు. తమ బంతులను వారికి వారికి విసరుట వారివారి బంతులను తాము స్వీకరించుట వరుసవరుసగా జరుగగా నది రమ్యముగా నుండును. ఇట్లు కందుకముల నెగుర వేయుచుండగా నవి వీరి కుచాసక్తములు ముఖాసక్తములయిన శకుంతములవలె భాసించును. ఆ కందుకముల నావనిత లెగుర వేయుచుందురు. అట్టి యుద్ఘాపనమున ఉడ్డీనములయిన ఆ కందుకముల భావించుచు వారు కౌతుకాతిశయమున సమధిక కూజన మొనరింతురు. ఆనందమున రేకలు కూతలు వేయుదురు. ఎగిరి విసురున వచ్చు కందుకములను పట్టుకొనుటకై పరువులెత్తుచు లోలాక్షీవిలాసముల ప్రసరింపజేయుదురు. అప్పుడాకాశసరోవరమును మీనాబ్జసంకుల మొనరించినట్లుండును. వారికన్నులు మీనములు, ముఖము లబ్జములు. ఇట్లు వీరు కేవలమిట్లు కందుకముల విసరుటయె కాదు. చారీవిశేషముల ననుసరింతురు. గతివిలాసముల ప్రసరింపజేయుదురు. పాదవిన్యాసముల జూపుదురు. కోమల లాస్యాంగముల ననుసరింతురు. ఇట్టి

నాట్యప్రక్రియానుసరణమున ఆ వనితలు నర్తనము చేయుదురు. ఇట్టి నర్తనము కందుకనర్తనము.

ఇక భాండికనృత్తము నిరూపణీయము. భండుడు హాస్యకారి విదూషకుడు ఇంక నట్టివారు భండులు. భండులాచరించు నృత్తము భాండికనృత్తము. భండులు సర్వపక్షుల కూతలు కూయుదురు. సర్వమృగముల అఱపులు అఱతురు. కుక్కకూతలు, నక్కకూతలు, గాండ్రింపులు, ఘీంకారములు, కిచకిచలు ఇన్నిటి ననుకరింతురు. బాలుర బెదిరింతురు. అశ్లీలము పలుకుదురు. అనుదాత్తముగ నుందురు. నవ్వుదురు నవ్వింతురు. ఇది హాసజనక మయిన నృత్తము. ఉదాత్తులకు మనోవ్యాకులత్వ మున్నప్పు డిది వినోదమిచ్చును. ఇందును కొన్ని గతి చారీపాటములుండును. లయానుసరణముండును. వాద్యానుసరణము నుండును.

భాండికనృత్తం.

వక్త్రోద్భవేషు వాద్యేషు వాద్యానుకరణేషు చ
వర్తమానేషు తాలేషు హస్తతాలయుతేనచ
ఖంజ వామన పోగండ వానరాద్యనుకారిణః
శిఖిసారసహేమాక్ష శుకాదిరుతకారిణః
ఖరోష్ట్ర సారమేయాది వాశితానువిధాయినః
తైస్తైర్వచోభిరశ్లీలైః చేష్టితైశ్చతథావిధైః
ఉత్సారణాయ జాడ్యస్య హాసయంతో నిరంతరం
అత్యంతం వామనీభూతాః పాదైరత్యంతదుష్కరైః
యత్ర నృత్యంతి భండాస్తద్భాండికం నర్తనం మతం.

ఈ భాండికనృత్తలక్షణమున వివిధ రూపరుతాద్యనుకారము హాస్యప్రాయత వినోదఫలిత నిరూపిత మగును. ఈ భండులు ముఖ

సముత్పన్నము లయిన వాద్యములు ప్రసరించుచుండగా వాద్యముల యనుకరణ రూపముగా వాద్యములు ప్రవర్తించునప్పుడు కాలములతో హస్తతాలములతో నవి సంయుతములై యున్నప్పుడు ఖంజ వామన పోగండ వానరాదుల ననుకరించుచు వ్రివర్తింతురు. పోగండ పదమునకు బాలుడని యర్థము. నెమలి హంస హేమాక్షుశుకాదుల ధ్వనుల ననుకరింతురు. ఖరము, ఉష్ట్రము, శునకము మొదలగువాని ధ్వనుల ననుసరింతురు. ఆయా అశ్లీలములగు వచనములతో నట్టి చేష్టితములతో ప్రవర్తింతురు. ఇట్టి వీరి నర్తనరీతి మాంద్యము పోగొట్టును. నిరంతరము హాసముత్పాదించును. మరగుజ్జుగానుండి యత్యంతము దుష్కరములయిన పాటవముల ననుసరించి నర్తనము సల్పుదురు. ఇట్లున్న నిది భాండికనృత్తము.

ఇక నిటుపై ఘటిసిశ్రీనృత్తము. ఈ నృత్తనామము సార్థముగ భాసించుటలేదు ఇది ఘటిసిణీవిధి యని లక్షణవాక్యములో నున్నది. అదియు నర్థమిచ్చుటలేదు. ఇది దేశీనృత్తమే. హుడుక్కా వాద్యసంబంధ మిందున్నది. హుడుక్కా పదము ననుసరించి ఘటిస పదమును లేఖకుల వ్రాతవలన సిద్ధమయినదిగా భావింపవచ్చునా? ఈ పేరు కల నృత్త మేగ్రంథమునను గోచరింపదు. ఘటిసాసి, ఘటిసిశ్రీ, ఘటిస ఘటస, ఘడస అను పదములు హుడుక్కా వాద్యవిశేషములు కాదగునో? ఘటిసినీ, ఘటిసిస్త్రీ అను పదములు ఘటిసనృత్త మొనరించువాని స్త్రీ వాచకము లగునా? అయినచో ఘటిసిస్త్రీ యనుటకన్న ఘటిసిశ్రీ యనుట యుక్తమగునో? ఘటిసినీ ఏమి? గడసాదన మొనరించు గడసానియగునా?

ఈ నృత్త మొనరించు స్త్రీ చండాలి, మాలెత మధురస్వరము కలది గాయని. ఆధ్యాత్మికగీతములను పాడును. కిరాత వేషమున

నున్న శివుని కీర్తించును. తనుస్కంధముపై హుడుక్కా వాద్యము ధరింపగా గీతాగాన మొనరించువారు చుట్టు చేరుదురు. పాడుదురు. వాద్యములు ప్రయోగింతురు. కరటావాదన మొనరింతురు. నృత్తరీతులు సుందరముగ నుండును గంభీరముగ నుండును. ప్రధానముగా నిది వనితా నృత్తము. పురుషుడును ఇట్టివాడై ప్రయోగించును. నృత్తభంగీభావనమునకు నిరూపించిన యీ భావభావనముతో దీని లక్షణభావనము యుక్తము.

ఘటిసి శ్రీనృత్తం

హుడుక్కాం స్కంధసంసక్తాం నాదయంతీ స్సఖీమివ
గాయనైర్గాయనీభిశ్చ వాంశికైశ్చ సమన్వితా
చండాలీ నర్తకీవేషా ధ్వనిశారీరపేశలా
చర్యాప్రభృతిభిర్గీతైః దేశీసూడస్థితైరపి
గాయంతీ ధ్వనినం క్రీడాకిరాతం పార్వతీప్రియం
కాహలైః మర్దలైః కాంస్యతాలైః కరటయాంచితైః
వాద్యేషు వాద్యమానేషు యతి ప్రహరణాదిషు
గతిభిస్సుకుమారాభిస్తాల చ్ఛందమనోహరం
యత్రనృత్యేదిదం ఖ్యాతం ఘటిసనీవిధిః?
ఏవం విధగుణేన్నైతత్ప్రయోజ్యం పురుషేణవా.

ఒక చండాలి — మాతెత — మతంగకన్య నర్తకీవేషము ధరించినదై నానాగాయన గాయనీమణులతో రంగము ప్రవేశించును. వేణుగాన నిపుణులగు వంశికులతో చేరును. స్కంధభాగమున హుడుక్కా వాద్యము ధరించును. ఆ వాద్యమును సఖివలె మానించును. హుడుక్కా వాదన మొనరించును. ఆమె కంఠధ్వని పేశలముగా నుండును. చర్యా ప్రభృతిగీతములను గానము చేయును. దేశీ

నూడగతులను గానము చేయును. ధనువు ధరించిన ఉమాదేవీ వల్లభుడగు క్రీడాకిరాతుని గానము చేయును. కాహలములు మద్దలములు కాంస్యతాలములు కరట యను వాద్యములతో గూడినదై యతిప్రమాణప్రబంధముల వాద్యమానము లగుచు డగా తాలచ్ఛంద మనోహరముగా సుకుమారగతి సంచారములతో నాచండాలి నర్తన మొనరించును. ఇట్టి యీ నృత్తము ఘటిసిశ్రీనృత్తమని దేశమున ప్రఖ్యాతమయినది. ఏవంవిధగుణోపేతు డయిన పురుషుడును ఈ నృత్తము ప్రయోగింపదగును. కాని చంచాలీప్రయోగమే రమ్యము, భావసంతర్పకము నగును.

ఇచట హుడుక్క, చర్యాగీతి, దేశీసూడ, కాహల, కరట, వాంశిక యను సాంకేతిక పదముల భావ మీవిధముగ గ్రాహ్యము.

౧ హుడుక్క— అవనద్ధవాద్యము. వల్లీవలయములతో నిర్మితమగును. యోజనమునకై స్కంధపట్టిక యుండును. స్కంధ వాద్యమని ప్రసిద్ధి ఝుంకారమిందు ప్రధానము. వాదనకాలము నందు వామకరము పట్టికాంతరమున నుండును. హస్తసమ్మితమై ౨౦ అంగుళముల పొడవుండును. నాదోద్బోధవిధాయకమయిన ఛిద్రము చతుర్థాంశమున నుండును. స్కంధమున నుంచికొని దక్షిణ హస్తమున వాదనము చేయుదురు. ఢేంకారమువినా పటహోక్తము లయిన వర్ణముల నిందు పలికింపవచ్చును. కొందరు మకార ఝుంకారములనుగూడ జెప్పిరి. ఈ హుడుక్కా వాద్యమును ఆవజమని స్కంధావజమనియు నందురు.

౨ చర్యాగీతి— ఇది గీతిప్రబంధము ౩౬ విప్రకీర్ణ ప్రబంధములలో చర్యాప్రబంధ మున్నది. పద్ధడీ రాహడీ ముఖ్యము లయిన ఛందస్సు లుండును. పాదాంతమనుప్రాసముతో నుండును.

ఆధ్యాత్మవాచకము లయిన పదములతో నిది నిబద్ధమగును. చర్య రెండువిధములు. ఛందః పూర్తియున్నచో పూర్ణచర్య. పూర్తి లేకున్నచో అపూర్ణచర్య. మఱల రెండువిధములు. సర్వపాదములకావృత్తి యున్నచో సమధ్రువచర్య. ధ్రువమునకే ఆవృత్తి యున్నచో విషమధ్రువ.

3 దేశీసూడము— రంజకస్వరసందర్భము గీతము. ఇది గాంధర్వము గానమని ద్వివిధము. గాంధర్వ మనాది సంప్రదాయము. లక్షణకారుల లక్షణాన్వితము గానము దేశీరాగాదులందుండును. ఇది నిబద్ధమని ఐద్ధమని ద్వివిధము. నిబద్ధము ప్రబంధమని వస్తువని రూపకమని మూడుపేరుల నున్నది. ప్రబంధములలో నవాంతరభేదములు కలవు వీనిలో సూడ—ఆలి—ప్రకీర్ణ భేదము లున్నవి. ఇందు శుద్ధసూడము సాలగసూడ మని సూడము రెండువిధములు. సాలగసూడమున ధ్రువాదిభేదములు కలవు. సాలగసూడమున ఏకతాలీ ప్రబంధ మొకటి. అది యిచట గ్రాహ్యము. ఈయంశము లిదివరలో నిరూపితములయినను ప్రసంగధారణమునకై మఱల నిరూపితము లయినవి.

4 కాహాల కరట వాంశికములు వాద్యవిశేషములు. కాహాలము సుషిరవాద్యము. దీని ముఖము ధుత్తూరపుష్పమువలె నుండును. దండమున రంధ్రములుండును. పొడవుగానుండును. తామ్ర రజత సువర్ణములతో నిర్మింతురు. మూడుమూరల పొడవు కలది. హాహూవర్ణ జనకము. వీరుల బిరుదముల జెప్పుటలో నిది సహకారి. ఇది కోలాహలము కలిగించును. కరటము అవనద్ధ వాద్యము. స్వరూపము నిరూపితమయినది. వాంశికము వంశసంజా

తము. వంశము వెదురు పిల్లనగ్రోవి వేణువు మురలి వ్యవహారము లతో ప్రసిద్ధము.

ఇటుపై చారణనృత్త ముపక్రాంతమగును. ఇది గుజరాత దేశ ప్రసిద్ధము. గుజరాతము సౌరాష్ట్రదేశము. ఉదాత్త నారీజనులాచరింతురు. దోహకనృత్తమున గానముచేయుట లలితోద్ధతరీతి ముఖవాద్యభంగి భ్రమరీవిధానము మొదలగునవి యిందు కలవు. చారణు లొనరించు నృత్తము చారణుడు కింకిణీవాద్యజ్ఞుడు వికటనర్తక పరీవృతుడు సర్వరాగ మర్మజ్ఞుడు చతురుడు నగువాడు చారణుడు.

## చారణనృత్తం.

నానానుప్రాస మధురాన్ దోహకాన్ రసనిర్భరాన్
రసోచితేన రాగేణ గాయంతో దేశకాకుభి:
వాద్యానుకరణైర్వ్యక్తైర్భవై: .... కృతోత్తరై:
ఉద్ధతై: పాదవిన్యాసై: భ్రమరైరపి భూషితై:
హస్తాభ్యాం బహుభంగీభి: తాలైశ్ఛందమనోహరై:
యత్రసౌరాష్ట్ర దేశీయాశ్చారణా లలితోద్ధతం
స్త్రియశ్చ దన్తరీయాణాం పల్లవైరవగుంఠితా:
నృత్యంతి మండలావృత్త్యా తత్స్యాచ్చారణ నర్తనం.

ఈ చారణ నృత్తలక్షణ వాక్యసమూహములో దోహద గానము వాద్యవిశేషములు నత్యాది విశేషములు సౌరాష్ట్రదేశీయత తన్నర్తనము నిరూపితమగును. నానానుప్రాస సుందరములై రసనిర్భరములుగా నున్న దోహకచ్ఛందోబద్ధగీతములను రసోచిత రాగమున గానముచేయుదురు. గీతములందనుప్రాసము తాలలయానుసారముగనుండి శ్రవ్యమనోహరముగా నుండును. ఏకవిధమయిన సానుబంధమగు ననుప్రాసము రసోచితము కాకపోవచ్చును. అనుప్రాస

ము. లం దేకవిధాను బంధమేకాక నానానుప్రాస సంబంధమున్నచో నది యొకవిధమున రమ్యముగ నుండును. అదియు రసభావముల నభివ్యంజనము చేయుటకు సమర్థముగ సమర్థముగ నుండవలయు ననియె యిచటి నిరూపణసారము. దోహాకచ్ఛందస్సంబద్ధమయిన గీతముల ఆలాపము గానము ఈ చారణనృత్తమున కనుకూలమని యిందున్నది. ఇది దోహాకనృత్తమున కనుకూలమని యితరుల యభివర్ణనమున్నది. అన్యుల యభివర్ణనమంతయు నీ చారణనృత్త వర్ణనోచిత పదరచనములతోడనె యున్నది.

రసోచితగానమున గానముచేయుట యిందు కలదు. ఇది యత్యంత మావశ్యకము. రాగము రసోచితముగా నుండుటను బాగుగా సమీక్షింపవలెను. వారట్లు గానముచేయుచు నాయా దేశీయములయిన కాకువిన్యాసములను కూర్చుకొనుచు వాద్యముల ననుకరించు పదవిన్యాసములతో నర్తింపవలెను. వక్త్రవాద్యముల ననుసరింపవలెను. పాటవిన్యాసములతో రమ్యత కూర్పవలెను. వారి పాదవిన్యాసములు ఉద్ధతములై భ్రమరవిధానములచే భూషితములై నుండవలెను. హస్తవిన్యాసములచే నొనరించు నానాభంగివిశేషములతో, ఛందమనోహరములయిన తాలములతో ననుగతములై శోభాసంపాదకములుగా నుండును. సౌరాష్ట్ర దేశీయులయిన చారణులు లలితోద్ధతముగా నిట్లు నర్తన మొనరింపదగును. వనితలీనర్తన మొనరింతురేని తత్తద్దేశీయ భూషాఢ్యలై మృదుకోమలములయిన యవగుంఠన వస్త్రాచ్ఛాదిత దేహలై, రమ్యముగ నవగుంఠనము కలవారై నర్తన మొనరింతురు. ఇట్టి వీరి నర్తనవిధానమున మృదువులయిన యంగహారము లుండును. మండలసంచారము లుండును. ఇట్టిదిది చారణనర్తనము.

ఇటుపై నిరూప్యమాణమగు బహురూప నర్తనము బహు గ్రంథముల నిరూపితమయినది. నేటికి నిది నర్తనమున నున్నది. లోకమునందలి బహుపాత్రల స్వరూపస్వభావములు సర్వసామాన్యములయిన నాటకములందువలె నిందు నుండును. ఆహార్యమాంగికము వాచికము తగిన విధమున నుండును. వారి భాషానుకారము నిందుండును. లోకమున స్వతః సిద్ధమగు విధాన మిందుండును. ప్రధానుడయిన బహురూపనర్తకుడు వేగముగా రూపముమార్చి భాషను మార్చి గేయముమార్చి నానాభాషా భాషణసమర్థుడై భాసించును. ఈతనికి స్త్రీలు పురుషులు సహకరింతురు. ఈ బహురూపవర్గముల వారు తమ ప్రదర్శనములచే పామరుల నుత్తేజితులను చేయగలరు. పాల్కురికి సోమనాథుడు "బహునాటకము లాడువారు, లలితాంగ రసకలాలంకార రేఖ లలవడ బహురూప మాడెడువారు" అని వ్రాసెను. ఈ దేశమున పగటివేషములు వేయువారొకవిధముగ బహురూపులు. వారొకరుగా నిద్దరుగా వచ్చి దినదినము వేషము మార్చి ఇంటింటికి దిరిగి తమ నైపుణ్యము ప్రదర్శింతురు. ఆగ్రామము విడిచి గ్రామాంతరమేగుదురు. వారిదంతయు నీ బహురూపవర్గ ప్రభావమే. ఇక నీలక్షణము చూచి సర్వము భావింపవచ్చును.

బహురూపనృత్తం.

బహురూపస్య లోకస్య తత్తద్రూపప్రదర్శనాత్
వేషచేష్టితభాషాభిః బహురూపం నిరూప్యతే
సర్వ............నావహం/............ప్రకల్పకః
రంజకో మంజువాగ్వాగ్మీకల్యః కైవారకోవిదః
సురేఖో రసికో రూపభాజనం భావకోయువా
.....................నాత్యుచ్చోనాతివామనః
సంస్కృతాదిషు భాషాసు నానాదేశోద్భవా సుచ

దక్షస్సదస్యతాభిజ్ఞో బలవాన్ విజితశ్రమః
ఆశువేషాంతరగ్రాహీ ప్రస్తావోచితపాఠకః
స్వతుల్యానుచరైర్యుక్తో ముండితశ్మశ్రుమూర్ధజః
మధురధ్వనిశారీరో బహురూపేనిగద్యతే
గుణైరేభిర్యుతా స్త్రీవా మతా ముండనవర్జితైః

ఇందా నృత్తాంశము మున్నది. బహురూపుని రూపమున్నది. లోకము బహురూపము, బహుభాషము. ఆ బహువిధములగు రూప ములప్రదర్శనముండునేని వేషచేష్టిత భాషావిధానములలోగూడ బహురూపత యుండునేని బహురూపమను పేరు కలుగును. ఇటుపై బహురూపుని స్వరూపనిరూపణపరములయిన పంక్తులలో కొంత త్రుటి యున్నది. అది పూరణశక్యముగ లేదు. భావమంతగా దురూ హము కాదు. బహురూపు డనదగువాడు సర్వవిధ నాట్యోపయోగి గుణసంపన్నుడై నానావేష భాషాచేష్టానుకార కల్పన సమర్థుడై యుండవలెను. లోకరంజనుడు మధురవచనుడు, కల్యః ఊహాకుశలుడు జ్ఞానకుశలుడు భావనాసమర్థుడు కార్యసమర్థుడు సంధానకుశలుడు సంకలనసమర్థుడుగా నుండదగును. క్రైవారమొనరించుటలో కౌశ లముకలవాడు, యోగ్యమగు ఆకృతిరేఖ కలవాడు రసికుడు - రస భావానుకూల సామగ్రీవిశేషముల గుర్తింపగలవాడు రూపభాజనుడు భావకుడు యువకుడుగా నుండదగును. సర్వావయవములు సమాన ముగా సువిభక్తముగా నుండువాడు కావలెను. మిక్కిలి పొడవువాడు కారాదు. మిక్కిలి వామనుడు కారాదు. సంస్కృతభాషాభిజ్ఞుడు నానా దేశములం దుదయించిన నానాభాషలలో నభిజ్ఞుడు కాదగును. దక్షుడు సదస్యత గుర్తించువాడు దేహబల మాత్మబలము సత్త్వ బలము కలవాడు శ్రమలేనివాడు, వేగముగా వేషాంతరము స్వీకరింప గలవాడు ప్రస్తావమునకు తగిన పాఠ్యము పలుకగలవాడు వారివారి వాచికము నిరూపింప గలవాడు కావలెను.

అట్టి లక్షణములు కల బహురూపుడు స్వసమానానుచరులతో గూడినవాడు కాదగును. ముండితశ్మశ్రుమూర్ధజః — ఆయుష్కర్మవిధానమున గడ్డము మీసము శిరోజములు తీయించినవాడు కాదగును. ఇట్టి యాతడు మధురధ్వని శారీరుడునై బహురూపి యనదగినవాడగును. ఈ సర్వగుణములతో గూడుకొనిన వనితయు బహురూప యగును. ఆమె ముండనము లేక కేశమండనమున నుండవలెను.

ఈ నిరూపితమంతయు బహురూపలక్షణము. బహురూప నర్తనలక్షణ మిక నున్నది.

త్రివిధాభినయేనాఢ్యం లోకధర్మముపేయుషా
సాత్త్వికేన పరిత్యక్తం హావభావైరలంకృతం
ద్విచతుశ్చరణావాద సంజీవాభినయాంచితం
ప్రథమం ప్రవిశేత్పాత్రం సకలాతోద్యసంయుతం
వాద్యప్రవర్తితైః పాదై ర్నృత్తై రపిమనోహరం
నృపవంశేనవా లోకప్రసిద్ధచరితేనవా
యన్నాట్యే దృశ్యతే సాక్షాత్తత్కుర్యాదకృత్రిమం
అత్యంత గ్రామ్యభాషాఢ్యమవిష్టం యత్సభాసదాం
[అశ్లీలమపివా] యచ్చబహురూపం న తన్మతం.

లోకధర్మము ననుసరించిన మూడు విధములయిన అభినయములతో, అనగా; ఆహార్యాభినయాంగికాభినయ వాచికాభినయములతో నీ బహురూపము పూర్ణమైయుండును. సాత్త్వికాభినయము మాత్ర మిందుండదు. హావములు భావములు దీని యందుండి యలంకరించును. ద్విపాతులు చతుష్పాతులు నయిన సంజీవముల యభినయములతో నిది రంజిత మగును.

ఇందు మొదటగా సకలాతోద్య సంయుతముగా పాత్రము ప్రవేశింపవలెను. ఆపిమ్మట నాట్యమున క్రమముగా దృశ్యమాన మగు నంశమును దీనిలో ప్రత్యక్షముగా ప్రదర్శింపవలెను. అట్లు దృశ్యమానచరితము నృపవంశచరితము కావచ్చును. లోకప్రసిద్ధ చరితమయినను గావచ్చును. ఇట్టి చరితమును వాద్యప్రవర్తితములగు పాటములతో నృత్తవిశేషములతో మనోహరముగా ప్రదర్శించునది. ఇట్లు పాటనృత్త ప్రయోగమున్నందున నిది సహజముగ భాసింప వచ్చును. అప్పుడు ప్రేక్షకసహృదయులు వస్తులగ్నమానసులగుదురు. ప్రయోగ ప్రవణమానసు లగుదురు.

ఇట్టి బహురూపమునకు కొన్ని విశిష్టాంశమున్నది. అత్యంతము గ్రామ్యమయిన సభ్యముకాని భాషాధ్యత యుక్తము కాదు. సభాసదుల కనిష్టమగు అశ్లీలముకాని అమంగలముకాని యుండుండ రాదు. గ్రామ్యాశ్లీలామంగలార్థకములగు భాషాప్రయోగము లిందుండరాదు. ఇట్లుండుట బహురూపముకాదు. ఇది సహృదయ సమ్మతమయిన మతము.

ఇటుపై కోల్లాటనర్తనము నిరూపింపవలెను. ఇదియు దేశీ నర్తనము. దొమ్మరివారు చేయు నర్తనము. త్రాడుపైకి ప్రాకుట, ఊగుట, వ్రేలాడుట, పొడవుగడపై కెక్కుట, ప్రమాదము లేకుండు నట్లుగా కత్తులు ఝుళిపించుట, బరువుమోయుట, దూకము దూకుట, ఎత్తు ఎగురుట, ఈ కోల్లాటములో నుండును. ఇందు వాద్యముల గతి విశేషములుండును. ఈ కోల్లాటమును కోల్హాటికమని కొందరు సంకేతించిరి. జ్యాయనవలె విస్తరముగా నిరూపింపలేదు దక్షిణభారతములో కత్తులు విసరుట, త్రాడుపై నడచుట మొదలయిన రూపములతో దొమ్మరియాట లున్నవి. విజయదశమి దసరా ఉత్సవము

లలో నివి పామరుల కాహ్లాదజనకములుగ దేశమున ప్రసరించుచునే యున్నవి.

ఉపరూపకములలో డోంబి యొకటి కలదు. డోంబి దొమ్మరి యాటను సూచింపగలదు. దొమ్మరి యాటగాండ్రు స్త్రీలలో పిల్లలతో త్రాడులతో గడలతో వాద్యములతో నూరూర దిరుగుచునె యుందురు. ఇక లక్షణము పరిశీలింతుము.

కోల్లాటనర్తనం.

కాహళై ర్మార్గపటహైః కాంస్యతాలసమన్వితైః
మర్దలైర్జయఘంటాభి ర్భేరీభిస్తంబకైరపి
వాద్యమానేషు వాద్యేషు వాదకై ర్భావ్యమద్భుతం
వరత్రాగమనైశ్చిత్రైః కరణై రంచితాదిభిః
ప్రాంశోరుపరివంశస్య భ్రమరై రతిదుష్కరైః
ప్రాణసందేహకరణైః శస్త్రధారాగ్రవంచనైః
మనుష్యదుర్వహైర్భారైః మృదంగ పరివర్తనైః
ఉచ్చైః ఖగవదుడ్డీనైః శస్త్రాణాం చాలనాదిభిః
యత్రనృత్యంతి కోల్లాటాస్తత్స్యాత్కోల్లాట నర్తనం.

కాహాలాది వాద్యములను వాదకులు వాదన మొనరించునపుడు కోల్లాటు లొనరించు అద్భుత నర్తనమును సహృదయ ప్రేక్షకులు భావింపదగును. కోల్లాటుడు సంగీతరత్నాకరమున కోల్హాటికుడు. ఆతడు బహుభారవోఢ, భ్రమరకాదులలో ప్రౌఢుడు, రజ్జుసంచారమున చతురుడు, ఛురికానర్తనమున పటువు, శస్త్రసంకటపాతమున దక్షుడు కాహాలములు మార్గపటహాములు కాంస్యతాల సమన్వితములై వాదితము లగునపుడు, మద్దెలములు జయఘంటలు భేరీవాద్యములు తంబటములు వాద్యమానము లగునప్పుడు అద్భుత

ముగా కోల్లాటులు నిరూపించు నర్తనమును భావింపవలెను. అప్పుడు కోల్లాటులు వరత్రాగమున మొనరింతురు. అటునిటు గడలు నిలిపి వానికి త్రాడు బిగువుగా గట్టి ఆ త్రాటిపై నడచుట వరత్రాగమనము. అంచితము మొదలయిన చిత్రకరణములు, ఎత్తుగానున్న గడపై అతిదుష్కరములయిన భ్రమరములు, ప్రాణసందేహము కలిగించు శస్త్రముల వాడిపదును కల ధారాగ్రముల మలచుటలు, మానవులు వహింప శక్యము కాని బరువు మోయుటలు, మృదువుగా నుండు అవయవములను వంచుటలు (కరివర్తనము) ఖేచరములగు పక్షులవలె ఎగురుటయు, శస్త్రముల చాలనములు మొదలగునవి యన్నియు నద్భుతావహము లగునట్లుగా కోల్లాటులు నర్తనము చేతురు. ఇది కోల్లాటనృత్తము.

ఇప్పటికీవిధముగా నిందు జాయసేనాపతి నిరూపించిన దేశీ నర్తన విధానముల నిరూపణము సమాప్తమయినది. గణపతిదేవుని పాలనసమయమున ప్రచారమున నున్నవానిని తానుపలక్షించి నిరూపించుచునని జాయన యనెను. అప్పటి నింకను కొన్నియుండ వచ్చును. అవి లక్షణయుక్తముగా నిరూపింపదగినవని జ్యాయన భావింపలేదు. నిరూపింపలేదు.

ఇటుపై కొన్ని సామాన్యములయిన యంశములను జ్యాయన నిరూపింపదలచెను. నర్తకీలక్షణము నర్తకలక్షణము పరికృతము ప్రతిపాద్యము. నర్తకి నర్తనాచార్యుని వలన శిక్షణము పొంది వాదక గాయకరీతుల ననుసరించునదై రాణించును. తదనుసరణమున బృంద మనుసరించి ప్రయోగాసక్త కాదగును. ఇదియంతయు సంప్రదాయసమాగతమగుట సమ్మతము. కావున నపేక్షితాంశము లిచట ప్రతిపాదితములగును. అందు ముందు నర్తకీలక్షణము రమణీయము.

## నర్తకీలక్షణము.

రూపయౌవన లావణ్య నృత్తవిద్యాశ్రయత్వతః
నేత్రానంద సుధాపాన భాజనత్వాచ్చ నర్తకీ
ఉపచార ప్రయోగజ్ఞైః పాత్రమిత్యభిధీయతే
తన్వీ తారుణ్య లావణ్య భాగ్య సౌభాగ్య సౌధభూః
కులీనా రూపవత్యాఢ్యాగ్రహణే ధారణే క్షమా
ప్రగల్భా రసభావజ్ఞా సోత్సాహాస కుతూహలా
కలాభిజ్ఞా విధేయాంగీ సుసత్త్వా మధురస్వరా
స్మితపూర్వకృతాలాపా సుమనాః శుద్ధలక్షణా
సుతారాఽనామయా శ్యామా గౌరీవాలాఘవాన్వితా
జితశ్రమా సభాధీరా చతురా త్రివిధేగ్రహే
అవధానవతీఖ్యాతా గీతవాద్య విశారదా
నాతిస్థూలా నాతికృశానాత్యుచ్చానాతివామనీ
వినయౌదార్య లజ్జాదిగుణరత్నై రలంకృతా
అంగప్రత్యంగ కోపాంగ చారీస్థానకమండలాన్
పాటాంగహార లాస్యాంగ భ్రమరీకరణాన్యపి
మార్గదేశీవిధానేన ప్రయోగాన్ జానతీస్ఫుటం
సదోఽభీష్ట ప్రయోగజ్ఞా నర్తకీ ప్రవరామతా.

ఇందు నర్తకీలక్షణమున్నది. నాట్యకారులందరీ రూపము ప్రతిపాదింపవలసియున్నది. భరతుడు పరిమితముగా లక్షణము నిరూపించెను. ఆ లక్షణ వచనవిస్తరమిందు కలదు. నాట్యోపచారములను ప్రయోగములను గుర్తించిన యభిజ్ఞులు నర్తకి నాట్యమున పాత్రమన్ని యందురు. నర్తకిరూపము యౌవనము లావణ్యము నృత్తవిద్య యనుదానికి ఆశ్రయము. నేత్రానందసుధాపానమునకు భాజనము. కావున పాత్రము, తన్వీ తారుణ్య లావణ్యములకు భాగ్య

సౌభాగ్యములకు స్థానము. కులీన రూపవతి ధనవతి సంపన్న. గ్రహణ మున ధారణమున సమర్థ. ప్రగల్భ రసభావజ్ఞ ఉత్సాహము కుతూహలము కలది. కలాభిజ్ఞ. స్వాధీనావయవ, సత్త్వసహిత మధుర స్వరస్మిత పూర్వభాషిణి సుమనస్క శుద్ధలక్షణ, మంచి కనుపాప కలది, అనామయ, శ్యామ, గౌరవర్ణయేని కాదగును. లాఘవాన్విత జితశ్రమ సభలో ధీర, మూడువిధములయిన గ్రహములందును చతుర. గ్రహమనునది తాలప్రాణము. ఇది మూడువిధములు. సమము అతీతము అనాగతమునని గీత నృత్తవాద్యము లాదిమ ధ్యావసానములలో న్యూనాధిక్యరహితముగ నున్నచో సమగ్రహము. తాలానంతరము గీతాదులున్నచో అతీతగ్రహము. నృత్తగీతాదుల యనంతరము తాలమున్నచో నానాగతగ్రహము. ఇట్టివానిలో నర్తకి నిపుణకావలెను. అవధానము కలది ప్రఖ్యాత గీతవాద్య విశారద కావలెను. ఆ నర్తకి అతిస్థూలముగా నుండరాదు. అతికృశ ముగా నుండరాదు. మరీ పొడవుగా నుండరాదు. మరీ పొట్టిగా నుండరాదు. వినయము ఔదార్యము లజ్జ మొదలగు గుణరత్న ములచే నలంకృత కావలెను. అంగాభినయము, ప్రత్యంగాభినయము, ఉపాంగాభినయము, చారీగతి స్థానకస్థితి, మండలసంచారము, పాట ప్రయోగము, అంగహార ప్రదర్శనము, లాస్యాంగప్రయోగము, భ్రమరీవిధానములు, కరణసంచారము నను సర్వవిధానములందును మార్గదేశీవిధానమున స్ఫుటముగా పరిజ్ఞానము కలది కావలెను. వెన్వెంటనే యభీష్టప్రయోగముల నాచరింపగలది కావలెను. ఇట్టి నైపుణ్యములన్నియు నున్నచో నా నర్తకి ప్రవరనర్తకి యగుననుట సమ్మతము. నర్తకీవిషయమున నిరూపించిన యీ సర్వలక్షణములను నర్తనాభిలాష కల వనితలు నర్తన దర్శనాభిలాష కల ప్రేక్షకులు సావధానముగా గుర్తింపవలెను.

రూపయౌవన యుక్తానాం సహస్రేఽపి మృగీదృశాం
కలాగుణ సమేతానాం నర్తకీ నైవ లభ్యతే
నర్తకీ గాయనీస్యాచ్చే ద్భోగినీపాత్ర మన్యథా.

రూపయౌవన యుక్తలయిన స్త్రీలు వేలకొలది యున్నను, వారు కలాగుణసమేతముగా నున్నను లక్షణలక్షితయయిన నర్తకి లభింపదు. నర్తకి కాగలిగిన నారీమణి గాయనియునై భోగినియునై యుండునేని పాత్రమగును. మూడువిధముల నామె సమర్థ కావలెను. నర్తనముకలది గానముకలది సౌందర్యము కలది. ఈ త్రితయము కలదయిననె పాత్రము అగును. పూర్వము నిరూపించిన సర్వలక్షణములు లేకున్నను నర్తకి గాయని భోగిని కావలెను. అప్పుడే పాత్రము.

## గోమండలీలక్షణం.

కల్యాణకటకే పూర్వం భూతమాతృమహోత్సవే
సోమేశః కౌతుకాత్కాంచిద్భిల్లీవేష ముపేయుషీం
నృత్యంతీ మథగాయంతీం స్వయం ప్రేక్ష్య మనోహరం
ప్రీతో నిర్మితవాన్ చిత్రగోండలీవిధిమిత్యయం
యతోభిల్లీ మహారాష్ట్రే గోండలీత్యభిధీయతే
కుండలీం నామమృద్వంగీం సుకేశీం దివ్యయోషితం
సంగీతం కోమలం నృత్తం శిక్షయామాసపార్వతీ
తన్నృత్తం కుండలీమాహుః తత్సంబంధాత్పురాతనాః

ఇచట్ల గోండలీ నర్తకీలక్షణ మొకింతగా గలదు. దేశీనృత్త విశేషములలో నిది ప్రధానముగా భావింపదగినది. గోండలీవిధి కుండలినీవిధి యను నానా నామవిశేషములతో నున్న దీనిని ప్రాచీను లర్వాచీనులు నిరూపించిరి. జాయసేనాపతి నిరూపణము సర్వసూత్రముగనున్నది. దీనినిట్లు భావింపవలెను.

కల్యాణకటకమునందు పూర్వ మొకప్పుడు భూతమాతృ మహోత్సవము జరిగినది. అప్పుడప్పటి ప్రభువయిన సోమేశ్వరుడు భిల్లవేషమునున్న యొక వనిత నాదరముగ జూచెను. ఆమె నర్తనము చేయుచున్నది. గాన మొనరించుచున్నది అప్పుడామెను స్వయముగా మనోహరముగజూచి భావించి సంప్రీతుడై చిత్రగోండలీవిధి నిర్మించెను. మహారాష్ట్రదేశమున భిల్లపురంధ్రిని గోండలి యందురు.

ఒకప్పుడు పార్వతీదేవి మృదుమనోహరానన మువములు కల రమ్య కేశపాశరమ్యయయిన "కుండలి" అను పేరుగల దివ్యవనిత నాదరించి సంగీతము కోమలనృత్తము నుపదేశించెను. దివ్యమానవము కల యా కుండలి పార్వతీదేవినుండి సంగీత నృత్త శిక్షణ ననుగ్రహముగ సంపాదించినది. కుండలీసంబంధమున ఆనృత్తము కుండలీనృత్తమను ప్రఖ్యాతి కలదయిన దని పురాణనులందురు.

భూతమాతృ మహోత్సవమనునది శ్రీదేవీయాగము, పరాశక్తిపూజ. ఆసమయమున దూతీయాగ మొనరింతురు. సువాసినీ పూజలు చేయుదురు. పరదేవత పరదేవతాపరివారము అట్టి సమయములందు యోషిదాకృతితో సాధకుల పూజల స్వీకరించి యనుగ్రహింతురు. అట్టి మహోత్సవసమయమున సోమేశ్వరునకు భిల్లీరూపమున దేవదేవి గోచరించినది. పాట పాడినది ఆట ఆడినది అది యంతయు నాదేవి సంతోషచర్యారీతి అప్పటి ఆ దివ్యవనితా భావ మహారాష్ట్రభాషగా నుండి యుండవలెను. దూతీయాగమున దేవత గోచరించి మహారాష్ట్రభాషలో పలికినదని మహార్థమంజరి గ్రంథ వ్యాఖ్యానమున మహేశ్వరానందుడు వ్రాసెను. దేవతా యోగినీ సమావేశభాగ్యము పొందినవారు ఆయా దేశభాషలలో పలుకుట దేవీ తంత్రవిషయముల గుర్తించినవారు గుర్తింతురు. సోమేశ్వరు

డానాటి నృత్తమును భావించి గోండలీనృత్త మనెను. గోండలీపదము కుండలీపద సంబంధము కలదియని జాయపతి భావించి పార్వతీ కుండలీవనితకై యుపదేశించిన కుండలీనృత్తమును పురాతన భావ ప్రసిద్ధముగా నిరూపించుట యుక్తముగ నున్నది.

సంగీతరత్నాకరమున శార్ఙ్గదేవుడు ఈ గోండలీవిధిని గౌండలీ విధి నామమున్నట్లు నిరూపించెను. ఇదియు ప్రకృతమున భావింపదగి యున్నది. గౌండలీనృత్తములో దీప్తనర్తన ప్రయోజ్యములయిన కఠిన వాద్యప్రబంధము లుండవు. ఆయా ధ్రువాశ్రితములయిన గీతములు సాలగసూడ ప్రబంధములు కేవల లాస్యాంగములు నిందుండును. నర్తకి కోమలాంగములతో నర్తన మొనరించును. స్వయముగా గానము చేయును. త్రివలీవాదనము స్వయముగ నాచ రించును, ఇట్లున్నచో నిది గౌండలీనర్తనము. కొందరిందు త్రివలీ వాద్యవాదనము లేదందురు స్కంధభాగమున త్రివలీవాద్యము ధరించి నోట పాటలేకుండగనే త్రివలీవాదనమున నర్తన మొనరిం చునేని మూక గౌండలి యందురు.

గౌండలీవిధానమున కర్ణాటదేశ మండన మొనరింపవలెను. ఆపద్ధతికె గౌండలీపద్ధతి యని పేరు. కర్ణాటమండల మండితులయిన సాంప్రదాయికు లీవిధానమున నింకను వాద్యవాదన విశేషములను గేయగాన విశేషములను నిరూపింతురు.

ఇట్టి యీ సంగీతరత్నాకర నిరూపిత గౌండలీవిధానమున జాయపతి నిరూపింపని రాగతాల వాద్యవిశేషములు భావనీయములు.

ఈ నృత్తము కుండలీనృత్త మని చిత్రకుండలీనృత్త మని కొందరు ప్రతిపాదించిరి. శ్రీ హైమవతీదేవి శివపత్ని యగుటకై చిరకాలము తప మొనరించి ఇక లాస్య మొనరింతునని సంకల్పిం

చినది స్ఫాటిక మండపమున, గాలికి మ్రోగు వేణుస్వనము పాంగ శ్రుతిగా భ్రమరీనినాదము గీతముగా కోకిలకూజితము కాహాలముగా లాస్య మొనరించినది. మహేశ్వరు డా లాస్యముచూచి యానంద మగ్నుడయినాడు. హైమవతితో నృత్త మొనరించినాడు. ఆదేవి కుండలిని కుండలి అని శ్రుతులనినవి. ఆనామముననే యీ నృత్తము ప్రసిద్ధమయినది. ఈ నర్తన మొనరించు నర్తకి గతిశిక్షావతి బహు ప్రజ్ఞ మధురభాషిణి సర్వభాషావిచక్షణ షట్త్రింశద్దృష్టిభేదజ్ఞ తాలభేద విశారద సాహిత్యరససమ్మోద కావలెను. గణాధిపతిని గిరాందేవిని పార్వతిని పరమేశ్వరుని స్మరించి నమస్కరించి ఆత్మశిక్షకుని సభా పతిని సంభావించి యర్చింపవలెను. రంగదేవత నారాధింపవలెను. "పూర్వం గానం తతో వాద్యం నృత్తం పశ్చాత్" నియమానుసార ముగా నుపక్రమవిశేషముల ననుసరించుచు ప్రాయోగికములయిన నృత్తహస్తములను క్రమశః అనుసరింపవలెను. సర్వాంగశోభా సంపాదకమగు గతివిశేషమున మఱల మఱల ఆగిఆగి లీలావిలాస శృంగార రసపూర్ణ విఘూర్ణనములతో శాస్త్రవిధానమున హస్త ప్రచార మొనరింపవలెను. ఉపాంగగానము వంశగానము వినుచు నతావయవములతోనున్నదై గాన మొనరించు చున్నట్లుండవలెను. యథావిధిగా నాచరింపవలయు వాని నాచరించి రంగదైవతమున్కై పుష్పాంజలి నర్పింపవలెను. ఇట్టి యీ కుండలీనృత్తము పాపకోటి వినా శనము. ప్రేక్షకులకు ప్రయోక్తలకు ఆనందసుఖకారణము. ఇట్టి కుండలి నర్తన మాచరింపజేయువారు ధన్యులు. ఇట్లుగా నింతింతగా కుండలీ నృత్తము నొక శాస్త్రకావ్యముగా నర్తనప్రియులు నిరూపించిరి.

కుండలీనృత్తము శృంగారరసబహులము మధురము సుకుమా రము ఆహ్లాదకరము. దీనిని శివుడు దేవికి మొదట ఉపదేశించెను.

దేవి కుండలి యను దివ్యకామినికి చెప్పినది. నాటినుండి యిది కుండలీ నృత్తమయినది. విబుధులందరు గుర్తించిరి. పార్వతీదేవి బాల కన్యకలు ఆమె గోపాంగనలకు వారు సౌరాష్ట్రసుందరులకు జెప్పిరి. అంతట దేశమంతట వ్యాపించినది.

ఈ కుండలీవిధానమునకు కుండలినీవిధానమునకు సంబంధము కలదని కొందరి భావన. మానవుని దేహమున మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ అను ఆరుచక్రములు బ్రహ్మాండము ననుసరించి కలవు. కుండలినీశక్తి మూలాధార కమలమునందున్నదై యోగావలంబనమున పైపైకి ప్రసరించును. ఆ కుండలినీశక్తి వికాసమున మానవుడు యోగసిద్ధి పొందును. ఇది యోగతంత్రవిషయము. కుండలినీవిశేషములు నర్తకిలో నుండుటచే కుండలీవ్యవహారము కలుగుచున్నది. ఈవిధముగా కుండలీవిషయమున ననేకభావము లనభిజ్ఞులు వెలయింప జేసినారు. ఆ భావములన్నియు నీ గొండలీనర్తకీస్వరూప గౌరవము సంపాదింపగలవి కాగలవు.

నర్తకీలక్షణ నిరూపణానంతరము నర్తకలక్షణ మావశ్యకము.

నర్తకలక్షణం

కులీనో నృత్య శాస్త్రజ్ఞః తత్త్వవేదీ జితేంద్రియః
ఊహాపోహ విశేషజ్ఞో దక్షోలక్ష్యప్రదర్శనే
కవి వాద్యప్రబంధేషు స్వయం వాదనకోవిదః
జ్ఞాతావాద్యశ్రుతిః సర్వాముఖ వాద్యవిశారదః
చతురః శిష్యశిక్షాయా నర్తనే నిపుణః స్వయం
సంగీతమేలనాభిజ్ఞో నానాదేశీయ నృత్యవిత్
కలావిత్ నిరహంకారః పారంపర్యోపదేశవాన్

తాలేషు కుశలో వాగ్మి వేదితా గీతవాద్యయోః
ప్రతీకల్పయితుం భంగీః తాస్తాః ప్రతినవాః క్షమః
కరాభ్యాం వాదపాటాది కర్మ దర్శయితుం ప్రభుః
అవ్యంగో౽ంతర్ముఖః కల్యోరూపవాన్స్తమత్సరః
నర్తకీ మనసాసార్ధ మేకీభావమివాగతః
సురేఖో రంజకో మంజువచనో నర్తకోమతః
గుణై రేవంవిధై ర్యుక్తా కించిద్గలిత యౌవనా
అంతఃపుర గతస్త్రీణాం శిక్షాయాం నర్తకీపరం

నృత్తశిక్షణమిచ్చు నర్తకుడు కులీనుడు యోగ్యకులమున జన్మించినవాడు మాతృమత్త్వము పితృమత్త్వము కలవాడు గౌరవ మర్యాదలు కల జననీజనకులు కలవాడు కావలెను. నృత్యశాస్త్రజ్ఞుడు తత్త్వవేది జితేంద్రియుడు కాదగును. ఊహాపోహములు గుర్తింప గలవాడును కావలెను. లేనిదానిని కల్పించుట ఊహము. అక్కఱ లేనిదాని విడనాడుట అపోహము. లక్షణము చెప్పుటయు కాక లక్ష్య ప్రదర్శనమున దక్షుడు కాదగును. కవి వాద్యప్రబంధముల స్వాయముగా వాదనకోవిదుడు కావలెను కవి వాద్యప్రబంధపదమున కీవిధముగా నర్థము భావింపవచ్చును. కవి ప్రబంధము వాద్యప్రబంధములలో సమర్థుడగుట. శక్తి వ్యుత్పత్తి అభ్యాసము అను మూడు కలవాడు కవి. ఆతని ప్రబంధములు కావ్యములు వాద్యప్రబంధముల విషయ మిదివరలో నిరూపితము. కవి నిరూపించిన గీతప్రబంధము లందును వాద్యప్రబంధములందును నర్తకుడు స్వయం సమర్థుడు కావలెనని భావము గీతవాద్య ప్రబంధములలో సమర్థుడని తాత్పర్యము గ్రాహ్యము. సర్వవిధ వాద్యశిక్షితులను గ్రహించినవాడు ముఖవాద్యవిశారదుడు కాదగును. శిష్యశిక్షలో చతురుడు స్వాయముగా నర్తన మొనరించుటలో నిపుణుడు కాదగును. ఇంకను సంగీత

మేలనాభజ్ఞుడు నానాదేశీయ నృత్తములను దెలిసినవాడు కలావిదుడు నిరహంకారుడు వంశపారంపర్యముగా వచ్చిన సాంప్రదాయికోప దేశము కలవాడు తాలకుశలుడు వాగ్మి గీతవాద్యవిదుడు, పరితినవ ములయిన ఆయా భంగీవిశేషములను కల్పింపగల సమర్థుడు కావలెను. తన హస్తములతో వాదకర్మలను పాటాదికర్మలను ప్రదర్శించుటలో సమర్థుడు కావలెను. అంగహీనుడు కారాదు. అంతర్ముఖుడు కావలెను. కల్యః- అనారోగ్యము లేనివాడు రూప వంతుడు మాత్సర్యము లేనివాడుగా నర్తకు డుండవలెను. నర్తకీ మనస్సుతో తానేకీభావము పొందినవాడుగా నుండవలెను. సురేఖుడు రంజకుడు మంజువచనుడుగా నుండువాడు నర్తకుడు కాదగును. ఇట్టి లక్షణములు కలవానిని నర్తనశిక్షణమున ఉపాధ్యాయునిగ నిర్ణ యింపదగును.

ఇట్టి లక్షణములతో గూడుకొనిని వనిత కొంతగా వయసు మరలియుండునది. కించిద్గలిత యౌవన అంతఃపురమునందు స్త్రీలకు నర్తనశిక్షణమున నుండవలెను. నర్తకలక్షణములు కల నర్తకు డుపదేశించుటకన్న, వయసుకల ప్రౌఢవనిత యుపదేశమిచ్చుటకన్న, వర్ధమానయౌవన యగు యువతి నర్తనోపాధ్యాయ యగుటకన్న కించిద్గలిత యౌవన నర్తనశిక్షణస్థానమున నుండుట యుక్తమగునన్న సేనాపతి భావము సముచితము.

నర్తనోపాధ్యాయుని నిరూపించిన పిమ్మట తదుపకరణ రూపము లయిన వాద్యముల వాదనమున అధికృతులగు వారిని నిరూపించుట సముచితము. అందు ముఖరి ప్రతిముఖరి బృంద ముఖ్య గాయకుల నిరూపణము ప్రసక్తము.

## ముఖరిలక్షణం.

.... తాలమాత్రాణాం గణితజ్ఞతా
మార్జన త్రయవేదిత్వం స్థిరతాలఘుహస్తతా
వాద్యప్రబంధకర్తృత్వంపాత్రచిత్తానువర్తితా
బృందమేలన దక్షత్వం రంజకత్వం సురేఖతా
న్యూనాతిరిక్తయోః సామ్యకృతిః వాద్యశ్రుతిజ్ఞతా
సంగీతయోజనజ్ఞత్వం గ్రహే మోక్షేచ పాటవం
చిత్రాదిక చతుర్మార్గ వివేచన విదగ్ధతా
బలిత్వం సావధానత్వం తాలానుగగతిజ్ఞతా
సర్వాంగదోష రాహిత్యం ఛిద్రావరణ నైపుణం
ధృతిర్ముక్తిశ్చ శబ్దస్య సౌష్ఠవం హృద్యవాదితా
ప్రస్తావోచిత కైవారచతురత్వం సభాపతేః
గాత్ర స్వరానుగామిత్వం వాజవాద్యే సుకర్ణతా
సుస్థిరోత్సాహితా చర్మలగ్న హస్తత్వమిత్యమీ
గుణాముఖరిణః ప్రోక్తా వాదకస్య విచక్షణైః

వాద్యములలో మర్దల మొకటి కలదు. మర్దలవాదకుడు మార్దలికుడు నాలుగువిధముల నీతని రూపము ప్రసిద్ధము. వాదకుడు ముఖరి ప్రతిముఖరి గీతానగతుడు అని. వాదము విద్యాకలహము. వాదకర్త వాదకుడు. పక్షపరిగ్రహణమును వాదమందురు. స్వపక్ష సాధనము పరపక్షదూషణము జల్పవితండాదులు వాదవిశేషములు. ప్రకృతమిచట ముఖరిలక్షణ మున్నది. సామాన్యముగా ముఖరి లక్షణ మిట్లుండును. ముఖరి వాద్యప్రబంధముల నిర్మాణించ సమర్థుడు నృత్తశిక్షావిచక్షణుడు పాత్రిలకు నటుడు మొదట నుపదేశింపగా ఆ ఉపదేష్టనటుడు సన్నిధిలో లేకపోయినను నృత్తాభ్యాస మిచ్చుటలో దక్షుడుగా నుండును. గీతవాదన నిష్ణాతుడు. మధ్య

మధ్యలో నాదానుకరణమున గీతరక్తి కలుగునట్లుగా వాదన మొనరించుటలో నిపుణుడగును. సురేఖుడు వాదనసమయమున దృశ్యాంగసన్నివేశము కలవాడు. అంతర్ముఖుడు అవహితమనస్కుడు. నర్తకి అర్ధాంగముగ నుండువాడు. నటికి కరచరణాద్యవయవములు నర్తనమున నుపయోగించునట్లు ముఖరికూడ నృత్తానుగుణము లయిన లయములనిచ్చు వంగములవలె సహకరించువాడగును. ఇతరవాదకుల వాదనము ముఖర్యధీనముగా నుండును. ఇట్టి లక్షణయుతు డగువాడు ముఖరి. ఈ సామాన్య భావనముతో ప్రస్తుతము జాయపతి నిరూపించిన ముఖరిలక్షణము భావించుట యుక్తము.

లక్షణారంభమున నొకింత త్రుటియున్నది. త్రుటితభాగములోని భారమీవిధముగ నుండవచ్చును. ద్రుత మధ్యవిలంబిత లయవిధానముల పటుత్వము ముఖరి కుండదగును అని. కాని లుప్తభావమభ్యూహించుట శక్యమగుటలేదు. ముఖరికి తాలమాత్రల గణితము తెలిసియుండవలెను. మార్జనముల మూడిని తెలిసినవాడు కాదగును. మాయూరి అర్ధమాయూరి కార్మారవి అను మూడును మార్జనాభేదములు స్థిరత్వము లఘుహస్తత వాద్యప్రబంధ కర్తృత్వము పాత్రచిత్తానువర్తిత్వము బృందమేలన దక్షత్వము రంజకత్వము సురేఖత న్యూనాధిక్యముల సామ్యాకృతి వాద్యశ్రుతిజ్ఞత సంగీతయోజనము తెలిసియుండుట గ్రహమోక్షములందు పాటవము తాల చిత్ర వార్తిక దక్షిణములను నాలుగుమార్గముల వివేచనావైదగ్ధ్యము బలిత్వము సావధానత తాలాంతగతమయిన గతి తెలిసియుండుట సర్వాంగదోషరాహిత్యము ఛిద్రచ్ఛాదన నైపుణ్యము ధృతి ముక్తి శబ్దముయొక్క సౌష్ఠవము వ్యాకృత్యవాదిత్వము ప్రస్తావోచితములయిన సభాపతి కైవారముల చతురత్వము గాత్ర స్వరానుగతి వాజవాక్యమున — ప్రక్క వాద్యమున చెవిపెట్టుట సుస్థిరమగు ఉత్సాహము

చర్మలగ్నహస్తత్వము అను నివి ముఖరి వాదకునకు సంబంధించిన గుణములని విచక్షణులు నిరూపించిరి.

ఈ లక్షణమున సంగీతశాస్త్రమునకు సంబంధించిన సాంకేతిక పదముల యర్థవివరణములను ఆ గ్రంథములనుండి గ్రహించుట యుక్తముగా నుండును.

ప్రతిముఖరీలక్షణం.

గుణైః కైశ్చిద్విహీనోపి భవేత్ప్రతిముఖర్యపి
కింతు యత్యాది వాద్యానాం కృతానాం ముఖవాదినా
ఉచితాన్యనుయాతీతి తద్వద్వాదయితుం క్షమః

ముఖరి వాదకుని గుణములన్నియు లేకున్నను ప్రతిముఖరి వాదకుడు ముఖరివలె వాద్యవాదన సమర్థుడగును యతి మొదలగు వాద్యప్రబంధము లొనరింపగా వానిని ముఖవాదనమున ప్రదర్శించు వాడై సముచితములగు వాని యనుగమనమున నుండును. వాదనమునను సమర్థుడగును. ఇట్టివాడు ప్రతిముఖరి యగును

వాద్యబృందలక్షణం.

కృతానాం వాద్యకవిభిః వాద్యానామాశుశిక్షణా
శ్రుతిజ్ఞాన పరత్వంచ స్వవాద్యగ్రహమోక్షయోః
తాలానుగత్వ మైకాగ్ర్య ముభయోర్మేలనజ్ఞతా
వామదక్షిణ దక్షత్వ మన్యోన్య స్తుతికారితా
ముఖానువృత్తితా చేతి వాద్యబృంద గుణామతాః

వాద్యబృందమునకు సంబంధించిన లక్షణ మిచటనున్నది. వాద్యవిధానముల గుర్తించినవారిచే నిర్మితములయిన వాద్యప్రబంధములను వేగముగా శిక్షణమున గుర్తింపవలెను. శ్రుతి జ్ఞాన పరత్వ

మావశ్యకము. స్వవాద్య గ్రహమోక్షములలో తాలవిధానము ననుసరించి యుండదగును. వాద్యముల యుపక్రమోపసంహారముల దెలిసియుండవలయును. గీతవాద్యముల మేలనము తెలియవలయును. వామహస్త దక్షిణహస్తములచే నొనరింపదగు వాద్యపాట వర్ణము లను తెలిసి దక్షుడుగావలెను. అన్యోన్యస్థుతికారిత్వ మావశ్యకము. ముఖానువర్తనము ముఖ్యము. ఇవి యన్నియు నిట్లుండగా నివి వాద్య బృందగుణములని నిర్దేశించిరి.

ముఖ్యగాయకలక్షణం

బృందమేలన చాతుర్యం రాసిక్యమనురంజనం
త్రిస్థానేషు గమకప్రాణగీతి ప్రవీణతా
గంభీరమధుర స్నిగ్ధ శ్రావకధ్వనిశాలితా
తాదృక్ శారీరసంపత్తిః వివిధాలప్తి నైపుణం
సర్వగీతప్రబంధానాం గాతృత్వం తాలధారితా
విజితశ్రమపాయత్త కంఠతా సావధానతా
నర్తకీ సుకలాసేన సమతా స్థాయకారితా
శుద్ధసాలగ రాగేషు భాషాంగాదేవ కౌశలం
గ్రహమోక్షేచ దక్షత్వం ధీరతాపాస్తదోషతా
సర్వరీతిషు వైదగ్ధ్యం పశ్చిమత్వం సురేఖతా
ఇత్యేతేకధితా ముఖ్యగాయకస్య గుణాబుధైః
ఈదృగ్గుణా ముఖరిణీ వాద్యబృందే ప్రశస్యతే
ప్రకృత్యైవాంగనాగానాం కోమలం మధురం యతః
కృతార్థైరుపదేష్టవ్యం కన్యాభ్యో గాయకైస్తతః

ఇచట ముఖ్యగాయకలక్షణము గాన శాస్త్రీయ పారిభాషిక పదములతో నిరూపితమయినది. ఇట్టి గాయకగుణములు వనిత ముఖరిణి. వాద్యబృందమునందు ముఖరిణి యుండవలెను. అందామె

యుండుట బృందమున ప్రశస్తి. స్వభావసహజముగా అంగనాగానము కోమలము మధురము. కావున కృతార్థులయిన గాయకులు కన్యల కుపదేశమిచ్చుట యుక్తము. ఇట్లు శిష్యాసంక్రాంతమైన వైభవము గాయకులకు కృతార్థత సంపాదించును. ఇట్టి కృతార్థతకు గాయకుడు ముఖ్యగాయకుడగుట కనేకవిధముల యత్నింపవలెను. ఆయత్నముల స్వరూప మీలక్షణమున నున్నది.

గాయకునకు బృందమేలనమున చాతుర్య మావశ్యకము. ఆతనికి సముచితరాసిక్యము గానసుధారస పరిణతి యుండవలెను. స్థానత్రియమునం దనురంజనము సంపాదించినవాడగుట ముఖ్యము. మంద్ర మధ్యమ తార రూపముగా స్థానత్రయమున్నది. ఏస్థానమున గాని గాయకు డుపరంజన మీగలవాడుగ నుండవలెను. కాకున్న స్థానభ్రష్టత యను గాయకదోషము కలవాడగును. ఇరువదియయిదు గాయనదోషములు కలవు. అందు స్థానభ్రంశ మొకటి. అవ్యవస్థిత ములయిన స్థానములతో గాన మొనరించుట స్థాన విపర్యాస మొన రించుట దుష్టము. ఇంకను ముఖ్యగాయకుడు గమకప్రాణగీతి ప్రవీణత కలవాడు కావలెను, గమకమనునది రాగావయవము. "స్వరస్య కంపోగమః" అది శ్రోతృ చిత్తసుఖావహము కాదగును. స్వశ్రుతి స్థానమున నుదయించి శ్రుత్యంతరము నాశ్రయించియుండు ఛాయను స్వరూపమును గోచరింపజేయునది గమకమని తల్లక్షణము. పదునైదు గమకభేదములు కలవు. కావున గమకప్రాణమయిన గీతిలో ప్రవీ ణుడు కాదగును. గంభీరము మధురము స్నిగ్ధము వయిన శ్రావక ధ్వని శాలిత్వ మావశ్యకము. గీతశబ్దమునందు పంచదశ భేదభిన్నము లయిన గుణములుండును. అందు శ్రావకత్వ మొకగుణము. "దూర శ్రవణాత్ శ్రావకోమతః" దూరమునకును వినబడునది శ్రావక

శబ్దము, కేవలము దూరము వినబడుటయే కాక అందు గంభీరతాదు లుండుట యావశ్యకము. తాదృశమగు శారీరసంపత్తియు నపేక్షి తము. ఇంకను వివిధాలప్తి నైపుణ మపేక్షితము.

ఇచట నీవిషయమును గ్రహింపవలెను. రాగావయవ రూప మయిన భాగమునకు స్థాయము అని పేరు. ఈ స్థాయిభేదములు తొంబదియారు కలవు వీనిలో వహానిసంబంధిస్థాయములని కొన్ని కలవు ఆరోహణమునగాని అవరోహణమునగాని వర్ణమునందు స్వరముల కంపనమును వహాని యందురు. సంచారివర్ణమునను స్థిరకంపనమును వహాని యందురు. ఈవహాని రెండువిధముల నున్నది. గీతవహాని ఆలప్తివహాని యని రాగాలప్తి, రూపకాలప్తి ఆలప్తివిశే షములన్నిటియందును నైపుణ్య మావశ్యకమని భావము ఈ సందర్భముననే శారీరపదభావమిట్లు గుర్తింపవలెను. అభ్యాసము లేకున్నను రాగములను అభివ్యంజన మొనరింపగల సామర్థ్యమును శారీరమందురు. శారీరముతోడనె యుత్పన్నమగును. కావున శారీర మనుట యుక్తము ఇది స్వభావసిద్ధము కాని ప్రయత్నమున లభించు నదికాదు. మాధుర్యము రక్తి గాంభీర్యము మార్దవము ఘనత స్నిగ్ధత మొదలగునవి శారీరగుణములు. శారీరదోషములున్నచో కుశారీరమందురు. అదృష్టమగు శారీర మదృష్టమునగాని లభింపదు.

ఇంకను సర్వవిధ గీతప్రబంధముల గానముచేయగల శక్తియు నావశ్యకము. తాలధారిత్వము నావశ్యకము. తాలధారిత్వము విజిత శ్రమత్వము ఆయత్త కంఠత్వము సావధానత్వము ఉండవలెను. నర్తకియొక్క సుకలాస మను దేశీలాస్యాంగమున సమత్వము స్థాయ కారిత్వము శుద్ధసాలగరాగములందు కౌశలము, భాషాంగాదులలో కౌశలము గ్రహమోక్షదక్షత్వము ధీరత దోషరాహిత్యము సర్వరీతి

వైదగ్ధ్యము సురేఖిత అనునవి గాయకునకు సంబంధించిన ముఖ్యగుణములు. ఈగుణము లీతనిలో నిట్లుండవలెనని బుధులనిరి.

ఈ దృశగుణములు కల ముఖరిణి వాద్యబృందమున నుండవలెను. వనితాగానము కోమలము. గాయకులు కన్యల కుపదేశించుట సముచితము. ఇట్టిది ముఖ్యగాయకి లక్షణము. ముఖ్యగాయకుడు బృందనిర్మాత, ఇక బృందలక్షణ మావశ్యకము

### బృందలక్షణం.

సమాన స్వరతా స్థానత్రయే గమకచాతురీ
అన్యూనాధికతా సాన తన్మనస్త్వమభీరుతా
న ర్తనావసరే నాదం ధృత్వాగాతుంవిదగ్ధతా
స్థాయాంతే ముఖదాయిత్వం నియమస్య ప్రతిగ్రః
ప్రబంధగాయితా చేతిగాయినాం బృందలక్షణం
బృందం నారీమయం సర్వమపి కార్యం విలాసినా
ద్రష్టుం కౌతుకినాన్నృత్తం శుద్ధాంత స్త్రీజనైస్సహ
రాజ్ఞాం విద్యావతాం చాగ్రే వైభవఖ్యాపనాయచ

బృందలక్షణ మిట్లుండును. మంద్ర మధ్య విలంబితములను మూడు స్థానములందును సమాన స్వరత్వముండుట, గమకములందు చాతుర్యము, అన్యూనాధికత్వము, ఆయాస్థానములందు తన్మనస్త్వము, అభీరుత్వము, న ర్తనావసరమునందు నాదమందుకొని గాన మొనరించుటలో వైదగ్ధ్యము, స్థాయాంతమునందు ముఖదాయిత్వము బృందమున కావశ్యకములు. గానమునకు సంబంధించి స్థాయభాగములలో నాయా వాద్యవాదకుల వాద్యవిధానములకు తగినంతగా నవకాశము ప్రాముఖ్యమిచ్చుటయు నావశ్యకము. ఇంకను బృందము నియమపాలన మొనరింపవలెను. నియమముల నవశ్యము స్వీకరింపవలెను.

ఇంకను గీతప్రబంధములను యుక్తముగా గానము చేయగలిగియుండుట గాయకుల బృందమునకు లక్షణము. విలాసి యగునాతడు బృంద మంతయు నారీమయముగా నుండునట్లొనరించుటయు యుక్తము. విలాసి కౌతుకి యగునాత డిట్లొనరించుటలో నొక విశిష్టభావమును గలదు. శుద్ధాంత స్త్రీజనులతో గూడి నృత్తము దర్శించుట కిట్లు చేయదగును రాజుల విద్యావంతుల సన్నిధిలో వైభవఖ్యాపన మునకు నిట్లు చేయుట యుక్తము రమ్యము నగును.

స ం ప్ర దా య ల క్ష ణ ం.

పాత్రానుజీవినాం బృందం సముదాయ ఉదీరితం
పారంపర్యోపదేశిత్వా త్సంప్రదాయశ్చ కథ్యతే
చతుర్భిరధికాశీతి రుత్తమోత్తమ ఉచ్యతే
విద్యావంతశ్చ తుష్టష్టిరుత్తమః పరికీర్తితః
ద్వాత్రింశన్మధ్యమోజ్ఞేయో వింశతిశ్చతురుత్తమా
అవరః షోడశ ఖ్యాతః కనిష్ఠశ్చేతిపంచధా
ఉత్తమోత్తమ సంజ్ఞాయా విద్యావంతోఽధికాయదా
తదా కోలాహలోఽయంతు నేష్టోరంగేన మాతియత్
సపునర్వినియోజ్యః స్యాదుత్సవాదిషు భూభుజాం

వర్తనమున నుపయోగించు వాదకగాయకుల బృందమును సంప్రదాయమందురు. ఇట్టిది లోకమున రూఢమయినది. పాత్రముల యనుజీవనమున నుండువారి సముదాయము బృందము. అట్టిబృందము యొక్క లక్షణము నిరూపితమయినది. ప్రస్తుతమిచట సంప్రదా యము నిరూపితమగును. పారంపర్యమున నుపదేశమిచ్చునది కావున సంప్రదాయ మనదగును. ఈ సంప్రదాయ మయిదువిధముల నున్నది. అందుండవలయు వారి సంఖ్యానియమమున నీ పంచవిధత్వము నిర్ణీత మాయినది.

| | | |
|---|---|---|
| ౧ | ఉత్తమోత్తమ సంప్రదాయమున | ౮౪ |
| ౨ | ఉత్తమసంప్రదాయమున | ౬౪ |
| ౩ | మధ్యమసంప్రదాయమున | ౩౨ |
| ౪ | అవరసంప్రదాయమున | ౨౪ |
| ౫ | కనిష్ఠసంప్రదాయమున | ౧౬ |

ఈ సంప్రదాయములందుండదగు వారందరు రూపవంతులు చిత్రాలంకరణాన్వితులు గీతాదిసామ్యనిపుణులు ప్రహర్షోత్ఫుల్లచేతస్కులు కావలెను సంప్రదాయమును కుటిలమనియు నితరులు పేర్కొనిరి. ముఖరి ననుసరించుట తల్లీనత న్యూనపూరణము తాలానువర్తన మనునవి సంప్రదాయగుణములు. ఇవి లేకుండుట సంప్రదాయ దోషములు. ఇట్టి గుణసాహిత్యమును దోషరాహిత్యమును సూచించుటకు జాయసేనాపతి "విద్యావంతః" విద్వాంసులుండదగు నని సంగ్రహముగా నిరూపించెను. విద్యావంతు లధికముగా నుండగా ఉత్తమోత్తమ సంజ్ఞ కలుగునుగదా! అట్లు వారు బహులసంఖ్యాకు లగుదురేని కోలాహల ముదయించును. రంగమున వారందరిముందర అట్టికోలాహలముండుట సమ్మతముకాదు. భూపాలకుల యుత్సవాదులలో నట్టి యుత్తమోత్తమ సంజ్ఞకల సంప్రదాయమును వినియోగింపదగును. ఇతరసమయములందవి యుక్తముకాదు. ఇటుపై ఉత్తమోత్తమాదులలో నుండదగు పాత్రసంఖ్య నిరూపితమగును.

## ఉత్తమోత్తమం.

ముఖరీ మర్దలీశ్రేష్ఠః స్వవిద్యాలక్ష్మలక్ష్యవిత్
తస్యచిత్రక్రియా ఛందానుగః ప్రతిముఖర్యపి
తయోర్మార్దంగికాః ప్రౌఢాద్వాత్రింశదనువాదకాః
హూడుక్కికాస్తు చత్వారో దేశీపాటహికావుభౌ

కరటావాదకౌచద్వౌ తతస్తాలధరావుభౌ
కాంస్యతాల ధరాశ్చాష్టౌ వాంశికౌ ద్వౌతయోః పునః
ఓతుకారాశ్చ చత్వారః శాంఖికౌ కాహలాధరాః
చత్వారో ముఖ్యగాయిన్యశ్చ తస్రః షోడశాపరాః
భవేయురనుగాయిన్యో బృందేఽస్మిన్నుత్తమోత్తమే.

ఉత్తమోత్తము సంప్రదాయమునందు చతురరీతి ౮౪ వ్యక్తు లుందురు. వారివారి ప్రతినియతసంఖ్య యీావిధముగా నుండును.

| | | | |
|---|---|---|---|
| ముఖరి, ప్రతిముఖరి | ౨ | వాంశికులు | ౨ |
| మార్దంగికులు | 3౨ | ఓతుకారులు | ౪ |
| హాడుక్కాకావాదకులు | ౪ | శాంఖికులు | ౨ |
| దేశీపాటహికులు | ౨ | కాహాలాధరులు | ౪ |
| కరటావాదకులు | ౨ | ముఖ్యగాయినులు | ౪ |
| తాలధరులు | ౨ | సహాయినులు | ౧౬ |
| కాంస్యతాలధరులు | ౮ | మొత్తమందరు | ౮౪ |

ముఖరి యగునాతడు మద్దలియై శ్రేష్ఠుడై తన విద్యయొక్క లక్షణములను లక్ష్యములను చక్కగా తెలిసినవాడు కాదగును. ప్రతిముఖరి యను నాతడు ముఖరియొక్క చిత్తమును క్రియను ఛందమును అనుసరించి యుండువాడు కావలెను. మార్దంగికులు ప్రౌఢులుగా నుండవలెను. ఇచట పదమూడు వర్షములంగా నెన్నదగిన వారున్నారు. వారందరు వారివారి విద్యానైపుణ్యము కలవారనుట స్పష్టము. ఇన్నివిధములుగ నుండువారయినను సముదాయమునకు విశిష్టశోభ నాపాదించువారుగనె యుండదగుదురు.

ఉత్తమం.

యత్త్రైకో ముఖరీ తస్య సమః ప్రతిముఖర్యపి
తతో మద్దలినో ధీరాః షోడశాన్యేఽను వాదకాః

హాడిక్కాస్తు చత్వారో దేశీపాటహికద్వయం
కరటావాదకౌ తాలధరౌ షట్కాంస్య ధారిణః
వాంసికా వోతుకారాశ్చ చత్వారః శాంఖికద్వయం
చత్వారః కాహలావాదాః గాయిన్యోర్ముఖ్యయోర్ద్వయం
షోడశైవానుగాయిన్యో బృందం తన్మతముత్తమం

ఉత్తమబృందమున నుండదగువారి సంఖ్య నిట్లు గుర్తింపవలెను. వీరందరు ౬౪ గురుందురు.

| | | | |
|---|---|---|---|
| ముఖరి | ౧ | కాంస్య తాల | ౬ |
| ప్రతిముఖరి | ౧ | వాంశికులు | ౨ |
| మార్దంగిక | ౧౬ | ఓతుకార | ౪ |
| హాడుక్కిక | ౪ | శాంఖికులు | ౨ |
| దేశీపటహ | ౨ | కాహలము | ౪ |
| కరటా | ౨ | గాయనులు | ౨ |
| తాలధర | ౨ | అనుగాయనీ | ౧౬ |

ముఖరి సమానత ప్రతిముఖరిలో నుండవలయుట అంతట సమానము. ఓతుకారులు నలువురు. ఈ పదార్థము విశదమగుట లేదు. ఓత అను వాద్యప్రబంధమునకు సంబంధించినవారగుదురా? ఆలోచనీయము.

## మధ్యమబృందం.

మధ్యమేహి ముఖర్యేకో బృందే ప్రతిముఖర్యపి
అష్టామార్దంగికాః పశ్చాత్తతో హాడుక్కికావుభౌ
కరటా వాదకస్తాలీ చత్వారః కాంస్యతాలినః
వాంశికశ్చొతుధృక్ శంఖవాదకః కాహలాధరౌ
ముఖ్యగాయనికే చాష్టేభవేయురనుగాయికాః

మధ్యబృందములో నుండదగువారి సంఖ్య యిట్లుండును. వీరి సంఖ్య ౩౨

| | | | |
|---|---|---|---|
| ముఖరి | ౧ | వాంశిక | ౧ |
| మార్దంగిక | ౮ | ఓతుకార | ౧ |
| హాడుక్కిక | ౨ | శాంఖిక | ౧ |
| కరటా | ౧ | కాంస్యతాల | ౨ |
| తాలధర | ౧ | గాయని | ౨ |
| కాంస్యతాల | ౪ | అనుగాయని | ౮ |

ఈ మధ్యమ బృందములో ముఖరి కాని ప్రతిముఖరి కాని యుండుట గ్రాహ్యము.

## అవర బృందం.

కేవలో ముఖరీయత్ర సప్తమార్దంగికాః పరే
హుడుక్కా కరటావాదీ తాలధారీచ కేవలః
కాంస్యతాలధరాధీరాః చత్వారో వాంశికాః స్మృతాః
ఓతుకారస్త ధైకోద్వౌబద్ధేసుబద్ధౌ కాహలాధరౌ
ఏకైవగాయినీ ముఖ్యా గాయిన్యస్త్వపరాః పునః
చతస్రోయత్ర బృందం తదవరం పరికీర్తితం.

ఇది అవరబృందము ఇందలివారి సంఖ్య యిరువది నాలుగు.

| | | | |
|---|---|---|---|
| ముఖరి | ౧ | కాంస్యతాల | ౪ |
| మార్దంగిక | ౮ | ఓతుకార | ౧ |
| హాడుక్క | ౧ | కాంస్యతాల | ౨ |
| కరటా | ౧ | గాయనీ | ౧ |
| తాలధర | ౧ | అనుగాయనీ | ౪ |

దీని లక్షణములో సప్తమార్దంగికాః అని యున్నది. సప్త సంఖ్యతో చతుర్వింశతి యగుటలేదు. అష్టసంఖ్య ఉపపన్నము. ఇట్టిదిది అవరబృంద మని కీర్తితమయినది.

## కనిష్ఠబృందం.

కనిష్ఠే మర్దలీబృందే పరేమార్దంగికాస్త్రయః
హుడుక్కా కరటావాదీ కాంస్యతాల ధరావుభౌ
వాంశికశ్చోతుకారశ్చ కాహలీముఖ్యగాయినీ
తాలజ్ఞాః సహగాయిన్యః చతస్రః కథితాబుధైః

చివరిబృందము కనిష్ఠబృందము. ఈ కనిష్ఠబృందమున నుండు వారి సంఖ్య ౧౬.

| | | | |
|---|---|---|---|
| మర్దలి | ౧ | వాంశిక | ౧ |
| మార్దంగిక | ౩ | ఓతుకార | ౧ |
| హుడుక్కా | ౧ | కాహల | ౧ |
| కరటా | ౧ | గాయని | ౧ |
| కాంస్యతాల | ౨ | సహగాయని | ౪ |

ఇట్టి బృందములలో నిట్టి నియత సంఖ్య యుండుట సమాలోచనీయము.

ఇక రంగమండప లక్షణము ప్రక్రాంతమగును. అది త్రివిధమగుట వాని కొలత నాట్యమండపవర్ణనము సభాపతిలక్షణము సభ్యగుణనిరూపణము అనునవి యీ యధ్యాయమున నిరూపింపదగియున్నది. నాట్యమంటప స్వరూపనిరూపణమునకై జాయసేనాపతి భరతాభిముఖుడై సమాలోచనము నిరూపించెను. నాట్యసమ్మితములయిన భావములీవిభాగమున సంగతములై యున్నవి. రంగమండపమున నుండవలయు విభాగములలో జాయసమ్మత విభాగము నిరూపించిన నృత్తవిధానముల కనుకూలముగా నుండునని భావింపవలెను.

## నృత్తమండపలక్షణమ్

శతమష్టోత్తరం షష్టిః చతుర్భిరధికాతతః
ద్వాత్రింశదితి హస్తానాం పృథక్తేషు భవేన్మితిః
క్రమాత్ గీర్వాణ భూపాల ప్రభృతీనాం భవంత్యమీ
జ్యేష్ఠే రంగస్య దూరత్వాన్మంద్రతోద్య గీతయోః
ప్రేక్షణీయస్యచవ్యక్తిః నహి సమ్యగ్విభావ్యతే
దూరస్థాస్తు జనాః శ్రావ్యా ఇతితారతరోధ్వనిః
క్లేశసంపాదితోనూనం వైస్వర్యమవలంబితే
ధ్వనిర్ముంచతి మాధుర్యం మండపేఽతికనీయసి
త్యక్త్వా జ్యేష్ఠ కనిష్ఠే ద్వేతతోమధ్యః ప్రశస్యతే
యత్ర నృత్యధ్వనీప్రేక్ష్య శ్రవ్యేతేభవతః సుఖం

నాట్య నృత్య నృత్త ప్రయోగములకు సముచితమైన రంగశాల ఆవశ్యకము. నియతమగు స్థాయి నుండి నటనర్తకులు ప్రయోగ మొనరింపవలసి యుండును. వారిగతి సంచారములకు తగినవిధముగా భూవిధాన మావశ్యకము. పాత్ర ప్రవేశ నిష్క్రమణములకు తగినట్లు తగినభాగ సన్నివేశములును నావశ్యకములు. ఆయా భూమికాధారణకై వర్ణయోజనము వేషభూషాధారణము మొదలగువానిని నియతస్థానమునందు సిద్ధపరచికొనవలసియుండును. కావున తగిన అవకాశము లపేక్షితములు. సముచితప్రయోగమును సందర్శించు సహృదయుల ఉపవేశనమునకై విశాలశాల కావలెను. రంగమున ప్రదర్శించువారి ఆహార్య - ఆంగికములను చక్కగా చూచుటకు తగిన సుందరసన్నివేశములును అవసరము. దూరమధికముగా నున్నచో రూపాభినయములు గోచరముకావు. నటనర్తకుల వాచికము సుశ్రవమగుటకు సముచితస్థాన మపేక్షితము. అత్యంతము దూరమున్నచో వాచికము శ్రవ్యముకాదు. ఇట్టి ఆవశ్యకాంశముల

పూరణకై రంగశాల యొక్కటి ఆవశ్యకము రంగశాల, రంగమంట పము, నృత్తమంటపము, నాట్యమంటపము, నృత్యమండపము, ప్రేక్షాగృహము, ప్రయోగశాల మొదలగు పేరతో వ్యవహరింప దగిన శాలావైభవమును సూచించుటకై జాయపతి ఇట్లు క్రమించు చున్నాడు. నాట్యవేద ఉపక్రమమునందే నాట్యమంటప సంగ్రహ వైభవము సూచితమై. దానిలో జ్యేష్ఠమంటపము, మధ్యమ మంటపము, కనిష్ఠమంటపము అని త్రివిధమంటపములు సూచితము లయినవి. వానిలో అవాంతరములగు భేదములును కలవు వానికి నియమితములగు కొలతలు కలవు. పదునెనిమిదివిధములగు భేదములు నిరూపితములైనవి. వాని స్వరూపపరిష్కార విధానమున అభినవ గుప్తుడు అభినవభారతిలో సుపరిష్కృతములుగా సూచించిన విషయ ములను జాయపతి సావధానముగా గుర్తించి అపేక్షితాంశములను రమ్యముగా నిరూపించుచున్నాడు.

ఈ నృత్తమండప లక్షణోపక్రమములో నిరూపింపవలసిన కొన్ని అంశములు పతితములై యుండవచ్చును. నాట్యమంటపము జ్యేష్ఠమధ్యమ కనిష్ఠరూపముగా నుండునని ఆరంభములో నిరూపిత మయినది. అట్టి భావాలంబనమున నిరూప్యమాణ మంతయు సంగ తము కాగలదు జ్యేష్ఠమంటపమునకు నూటఎనిమిది హస్తముల పరిమితి ఆవశ్యకము. మధ్యమ మంటపమునకు అరువదినాలుగు హస్తములుండవలెను. కనిష్ఠమంటపమునకు ముప్పదిరెండు హస్తము లుండుట పరిమితిక్రమముగా నిట్టి పరిమితిని నియతముగా గ్రహింప వలసియున్నది. ఈ మూడుమంటపములు గీర్వాణభూపాల ప్రభృతు లకు ఉపయోగించునవి అగును. గీర్వాణులు దేవతలు. వారి నాట్య మంటపము పెద్దది. అష్టోత్తర శతహస్తమిళితమై అది యుండును. ఇదియే జ్యేష్ఠమంటపము. "దేవానాం మానసీసృష్టిః" దేవతలు

మనస్సంకల్పమాత్రముననే సర్వమంటపములు ఎచటనైనను నిర్మింపగలరు. దేవమంటప నిర్మాణవిధులతో మానవులు స్పర్ధ పెట్టుకొనరాదు. ఆకారప్రకారము లందుగాని, గతిసంచారము లందుగాని దేవప్రకృతి విశిష్టముగా నుండును.

మధ్యమపరిణామముతో నుండు నాట్యమంటపము భూపాలురకు అభీష్టము. రాజప్రాసాదములలో అంతఃపుర పరివారముకూడ దర్శించుటకు తగినట్లుగా ప్రభువులు నాట్యశాల నిర్మాణము చేయుదురు. చతుష్షష్టిహస్తపరిమితమై భూపాలశాల యుండును. ఇక ప్రభృతి పదమున చెప్పదగినవారు లోకప్రకృతులు. ఇచట ప్రభృతిపదము కన్న ప్రకృతిపద ముచితము. సామాన్యలోకమానవులకు కనిష్ఠరంగశాల తగియుండును. ఇది ద్వాత్రింశద్ధస్తపరిమితము. ఇట్టి శాలాపరిమితికై 32, 64, 108 హస్తనియమములు సూచించుట సాభిప్రాయముగా నున్నది. ఇది వాస్తుతంత్రమునకును, మాంత్రిక తంత్రమునకును సంబంధించియుండునో!

ఈ చెప్పిన మూడు మంటపములలో జ్యేష్ఠమంటపము, కనిష్ఠ మంటపము ప్రయోగప్రదర్శనమునకు అంతగా అనుకూలములు కావు కేవలము మధ్యమమంటపముచే ప్రయోగానుకూలముగా భావింపవలసియున్నది. జ్యేష్ఠ కనిష్ఠ మంటపములలో ప్రయోగాననుకూలములైన కొన్ని విశేషము లున్నవి జ్యేష్ఠమంటపమునందు ఇట్టి అసౌకర్యములు కలవు రంగము దూరముగా నుండునుగావున ఆతోద్యముగాని గీతముగాని మంద్రముగా నుండును. కాని స్ఫుటముగా నవభాసింపను అట్లే వాచికము అస్ఫుటమగును ప్రేక్షణీయకమునకును వ్యక్తి చక్కగానుండదు. రంగము దూరముగానున్నందున చూడదగినది కనుచూపులో సరిగానందదు శ్రావ్యము కాక, దృశ్యము

గాని బాగుగా విభావితము కాకున్నచో ప్రేక్షకులకు సంతుష్టి యేమి కలుగును? రంగమున ప్రయోగించువారు దూరముననున్న జనులకును విన్పడవలయునని తారతర ధ్వనితో ఉచ్చరింతురేని నటులకు క్లేశ మధికము కలుగును. క్లేశసంపాదితమైన యా ధ్వని వైస్వర్యము పొందును. కళాసుందరములైన గీతాతోద్యములలో ఇట్టి విస్వరత, ఇట్టి విశ్రుతి రమ్యముకాదు. ఒక స్వరము వేరొకస్వరమై శ్రుతుల మేళనము సరిగా గోచరము కాకున్నచో ఆతోద్యరీతి వేరుగా, గీతరీతి వేరుగా నుండగా వాని సామరస్యము భగ్నమైపోవును. దూర మున నున్నవానికి విన్పింపచేయు యత్నము నటుల కావశ్యమైనపుడు ఇట్టి బాధయున్నది. మఱియొక బాధయు కలదు. నాట్యమంటపమున అత్యంతము దగ్గరనున్న వారలకు ఈ తారతరమగు ధ్వని, మాధుర్య మును విడనాడి విన్పడును. కోమలస్వభావముతో నుండవలసిన, మధురనిస్వనములతో నుండవలసిన గీతాలాపము మాధుర్యమును విడనాడి పారుష్యముపొందినచో నాట్యశోభ రాదు సామాజిక సంతుష్టియు కలుగదు. కావున జ్యేష్ఠమంటపము కాని కనిష్ఠమంటప ము కాని యుక్తములుగ తోచుటలేదు. దూరమైనచో వైస్వర్య ముదయించును. దగ్గరనున్నచో మాధుర్యము మగ్నమగును. ఈ రెంటిని విడనాడి మధ్యమమంటపమునే ఆదరింపవలెను. అదియే ప్రశంసాస్పదము. మధ్యమమంటపమునందు నృత్యధ్వనులు ప్రేక్షక శ్రావ్యములు కాగలవు. నృత్యము చక్కగా చూడచక్కనగును. అంగోపాంగముల వర్తనములు వలనములు విశదముగా గోచరించును. గీతాతోద్యధ్వనియు చక్కగా శ్రవ్యముగాగలదు అందువలన మధ్యమమంటపమే సముచితమైనదని నిర్ణయింపదగును.

చతుష్షష్టి కరాయామో ద్వాత్రింశత్కరవిస్తృతిః
వికృష్టో మండపోరాజ్ఞా చతురశ్రోఽద్యవావరః

సమంతాచ్చతురశ్రస్య ద్వాత్రింశత్కీర్తితాః కరాః
ఆయామస్తు వికృష్టస్య పూర్వపశ్చిమతో మతః
పూర్వతస్తత్రసంత్యజ్యకరా నష్టౌ ప్రకల్పయేత్
చతురశ్రంకరైః రంగశీర్షం సమ్మితమష్టభిః
రాసకాదౌ తతోఽప్యర్ధః ద్విగుణం వాయథోచితం
తతోఽప్యష్టౌ కరాన్ముక్త్వా స్థానం కుర్యాత్సభాపతేః

భూపాలున కనుకూలమైన రంగమంటపము వికృష్టమంటపము, చతురశ్రమంటపము, అవరమంటపము అని మూడువిధములుగా నుండును. వానిలో వికృష్టమంటపము అరువదినాలుగు హస్తముల ఆయామముతో పొడవుతో నుండవలెను. ముప్పదిరెండు హస్తముల విస్తృతి కలిగియుండవలెను. ఇట్టిది వికృష్టమండపము. రెండవదియైన చతురశ్రమంటపము అంతటను ముప్పదిరెండు హస్తములతో నుండుట కీరితిమైనది. చతురశ్రమంటపము నాట్యప్రయోగమునకు అంతగా సముచితము కాదు. వికృష్టమంటపము పూర్వపశ్చిమ భాగములకు ఆయామముతో నుండుట యుక్తము. పూర్వభాగమునుండి ఎనిమిది హస్తములను విడనాడి విభాగమును కల్పింపవలెను. మిగిలిన విభాగమంతయు సభ్యసన్నివేశమునకు తగినదిగా నుండవలయును. నాట్యవేదమునందు నాట్యశాలావిభాగ ప్రదర్శనముతో రంగశీర్షము రంగపీఠము నియమితములై యున్నవి. ఈ గ్రంథకర్త రంగశీర్షమునే నిరూపించెను కాని రంగవిభాగమును సూచింపలేదు. రంగపీఠమునందు మత్తవారణప్రదేశము నియతమై యున్నది. రంగశీర్షము కూడ యవనికాస్థాపనమునకు, రంగకల్పనమునకు సముచితములైన న్యాసవిశేషములు ఇతరగ్రంథములందు నిరూపితములైనవి. చతురశ్రమంటపములో ఎనిమిది హస్తముల పరిమితితో రంగశీర్షము నేర్పరచవలెను. రాసకము మొదలగు నృత్త

పరిధానములైన ఉపరూపకములను ప్రదర్శింపవలసియున్నపుడు యథోచితముగా రంగశీర్షము విశాలముగా నొనర్పవలెను. ద్విగుణముగానైన పాత్రసంచారమున కనుకూలముగా నుండునట్లు రంగశీర్షమున కనుకూలముగా నుండునట్లు రంగశీర్షమును కూర్పవచ్చును. రాసకాదుల పరిదర్శన మావశ్యకమైనపుడు అష్టహస్తపరిమిత రంగశీర్షముకాని, ద్వాదశహస్త పరిమితముకాని, షోడశహస్త పరిమితముకాని రంగశీర్షమును నిర్మించుట యుక్తముగా నుండును.

నాట్యవేదములో నాట్యమంటప విషయమున నిరూపితములైన భావములు ఈవిధముగా నున్నవి.

శుద్ధాదర్శతలాకార రంగశీర్షోపశోభితః
స్తంభైరుత్కీర్ణసింహాద్యైః విలసత్సాలభంజికైః
ప్రత్యుప్తానేక రత్నాంశుచయధ్వస్తతమోభరైః
విచిత్రచిత్రభంగీకైః ప్రేక్షణీయైరలంకృతః
హేమాచల గుహాకార స్వర్ణకుంభైర్విరాజితః

ఇంతకుపూర్వము నిరూపించి రంగశీర్షానంతరము ఎనిమిది హస్తముల భాగము విడనాడి సభాపతిస్థానమును నిర్మింపవలెను. సర్వలక్షణలక్షితమైన నాట్యమంటపము నాట్య నృత్త నృత్య ప్రదర్శనములకు సముచితమై యోగ్యముగా నుండునట్లు నిర్మింపవలసియున్నది. నాట్యమంటప శోభాసంపాదనకై అనేకవిషయము లావశ్యకములు. నాట్యమంటపము శుద్ధాదర్శతలమువలె శుద్ధముగా స్వచ్ఛముగా నుండవలెను. రంగశీర్షమునందు పవిత్రత, స్వచ్ఛత ఆవశ్యకము. స్నిగ్ధముగా నుండుటయు ఆవశ్యకము. నాట్యమంటపమునందలి రంగశీర్షము రమ్యముగానున్నచో మంటపమునకు శోభకల్గును. నాట్యమంటపమునందు నానావిధములగు స్తంభములు, ఆ స్తంభము

లందు సింహాదుల శిల్పములు ఉత్కీర్ణములై యుండవలెను. ఆయా పరిసరములందు సుందరములైన సాలభంజికములు శోభావహములుగ కూర్పవలెను. భిత్తిభాగములందు కాని, స్తంభసన్నివేశములందు కాని అనేకవిధములగు రత్నములు నానావర్ణవిరాజితములు కూర్పుపొందియుండునుకాన ఆ రత్నకిరణముల కాంతిచే తమోభరములు విధ్వస్తములగునట్లు నిర్మింపవలెను. నాట్యమంటపము చిత్రవిచిత్రభంగీసుందరములైన, చూచుటకు రమ్యముగానుండు దృశ్యములతో నలంకృతము కావలెను హేమాచల గుహాకారము కలిగి స్వర్ణకుంభములతో కూడినదై ప్రకాశమానముగా నుండవలెను. గుహాకారసామ్యము నిరూపించుటచే ధ్వని గంభీరతకు, సాంద్రతకు ఉపాయము సూచితమైనట్లు భావింపవలెను.

యంత్రనారీజనాలాప సంగీతాది విచేష్టితైః
సంపాదిత చమత్కారః కర్పూరోద్దీపితాంతరః
నీరంధ్రచ్ఛాదనోపేత ప్రేక్షణీయ ద్వితీయభూః
నానాద్వీపాంతరానీతైః దేవాంశాదిభిరంబరైః
విచిత్రేణ వితానేన నయనానందదాయకః
నానాపత్రలతాబంధైః ఇతిహాసాదిభిశ్శుభైః
విక్రమైః కేలిభిః త్యాగముఖ్యైస్స్వభావతేః
విచిత్రస్థైస్పష్టానాభిర్భిత్తిభి స్సుమనోహరః
[సింహాస్య] సుషమైర్ద్వారైర్వేదికా మత్తవారణైః
సంగీతావసరైస్సాంద్రః పుష్పతారకితక్షితిః
విసారివివిధామోద పుష్పమాల్యోప శోభితః
సమంతాద్ధూపితోఽజస్రధూపైః కృష్ణాగరూత్కరైః
నివాస ఇవభారత్యాః క్రీడాగారమివశ్రియః
కర్తవ్యో నాట్య నృత్తార్థః మండపో లక్షణాన్వితః

నృత్తమండపమునందు నానావిధముల చమత్కారము నాపాదింపవలసియున్నది. నారీజనుల వివిధసంతాషములచే చమత్కారము కూర్పవలెను. పురుషాలాపమునకన్న వనితాలాపమునందు కోమలత మాధుర్యము లాలిత్యము నుండును. వారి కలకల నినాదము చమత్కారభూమి వారి సంగీతగోష్ఠి సరసము చమత్కారస్థానము వారి కంఠ కాకలీధ్వని కలనాదమిచ్చును. విదగ్ధ వనితల విచేష్టితములు మనోహరములు. ఇట్లు నారీజనుల యాలాపాదికమున చమత్కారము నాపాదించి మంటపశోభ సంపాదింపవలెను. ఇట్లు సంపాదిత చమత్కారమయిన మంటప మ్మానందసంపాదకము. ఇంకను మండపాంతర్ప్రదేశమంతయు కర్పూరదీపకాంతులతో గూడియుండునట్లు, కర్పూర పరిమలవాసితమగునట్లు శోభ సంపాదింపవలెను. ప్రాకాలమున కర్పూరదీపముల ప్రకాశింపజేయు నాచారమున్నది. నృత్యమంటపమున నర్తకులు నటించు మంటపస్థలము కాక ప్రేక్షకుల యుపవేశనమునకు సమర్థ్యామయిన స్థానము నుండును. అది నృత్తమంటపమున ద్వితీయ భూస్థలి రెండవభాగము. అది దట్టమయిన ఆచ్ఛాదనముతో కూడియుండవలెను. రంగమండపమునందలి నర్తకుల వాచికము స్పష్టముగా విన్పడునట్లు, ప్రతిధ్వని రాకుండునట్లు, సముచితాచ్ఛాదనశోభ యుండవలెను. అదియె యిచట నీరంధ్రాచ్ఛాదనోపేత పదమున స్పష్టమగును. నానాద్వీపాంతరములనుండి సమానీతములయిన దేవతాంశ సముపేతములయిన విచిత్రాంబరములతో మంటపము శోభాయమానముగ నుండవలెను. విచిత్రవిలాసముతో భాసించునది కావలెను. ఇట్లుండ నది నయనానందదాయకముగ నుండును. అట్లుండుటయు నావశ్యకము. అట్టి విచిత్రాంబరములతో విచిత్రవిలాసము కూర్పవలెను. నానాపత్రములతో

నానాలతాబంధములతో నుండవలెను. శుభంకరములగు నానావిధములయిన ఇతిహాసములతో విక్రమోదాహరణములతో సభాపతికి సంబంధించిన త్యాగముఖ్యములగు కేలీవిధానములతో నుండవలెను. విశిష్టములగు చిత్రములందు సభాపతి కేలీవిక్రమ విశేషములను కూర్చవలెను. సమానములగు భిత్తిభాగములతో మనోహరముగా నుండవలెను. సింహాముఖ మనోహరములగు ద్వారములతో నుండవలెను. మత్తవారణములతోనున్న వేదిక రమ్యముగా నుండవలెను. సంగీతావసరములతో సాంద్రమైయుండవలెను. సంగీతమున కపేక్షితములయిన వివిధవాద్య విశేషములతో రంగమండపముండుట యుక్తము. రంగమంటపమునందలి భూమియంతయు పుష్పవికీర్ణమై తారకితమయినట్లుండుటయు సముచితము. వివిధములగు పరిమళయుక్తములయిన పుష్పమాల్యములతో గూడినదై శోభితము కావలెను. కృష్ణాగరు ధూపసముత్కరములతో నిరంతరమంతట ధూపితము కావలెను. ఇట్టి నృత్తమంటపము భారతీదేవీనివాసమువలె శ్రీదేవీ క్రీడాగారమువలె నుండునట్లు పరిశీలించవలెను. నాట్యనృత్తముల మహార్థమునకై నాట్యమంటపమును నృత్తమంటపమును నిర్మింపవలెను. నృత్తమంటపశోభ ప్రయోగశోభ సంపాదించును.

సభాపతిః

అభిజాతో గుణగ్రాహీ పాత్రాపాత్ర విశేషవిత్
క్రీడాకేలీగృహం దాంతః ప్రియకీర్తిః ప్రియంవదః
శృంగారీరసికః సర్వశాస్త్రకూపారపారగః
మార్గదేశీరహస్యాని జ్ఞాతా సంగీతతత్త్వవిత్
అభిజ్ఞం సర్వభాషానుభావకః ప్రతిభానవాన్
.................... విత్స్ఫత్యవసతిర్గతమత్సరః
వాదేషు ధృతి మాధ్యస్థ్యః కృతకార్యో నిరామయ:

ఆస్తికో విగతాలస్యః పరివారానుకూల్యవాన్
వివేకీ కౌతుకీ వాగ్మీ తరుణో గుణదోషవిత్
సులక్షణో జితారాతిః నిపుణో .... నర్మణి
స్వస్తుతే పరనిందాయామపి నిత్యం పరాఙ్ముఖః
త్యాగీ దయాపరః శ్రీమాన్ సభాపతిరిహోచ్యతే

సభాపతి నాట్యప్రయోక్త రంగశాలానిర్మాత. సర్వసంధాత. ఆతడనేక లక్షణలక్షితుడు కావలెను. ఆ సభాపతి లక్షణము లిందున్నవి. ఆతడభిజాతుడు, ఉదాత్తవంశసంజాతుడు, గుణగ్రాహి, పాత్రాపాత్రవిశేషవిదుడు కావలెను. ఆయా పాత్రధారుల గుణవిశేషముల గుర్తించి యాయాభూమికల ధరింపజేయువాడు కావలెను. క్రీడా కేలీ గృహవిషయమున దాంతుడగువాడును కీర్తిప్రియుడు ప్రియంవదుడు కావలెను. శృంగారి కావలెను. అనగా సముజ్జ్వల వేషము భూషకలవాడగుటయేకాక శృంగారోచితములయిన విభావానుభావ వ్యభిచారి భావముల పరిజ్ఞానము కలవాడు కావలెను. శృంగార మువలక్షణము. కావున సర్వరసములకు సంబంధించిన విభావాదిపరిజ్ఞానము కలవాడు కావలెను. అట్లే రసికుడు కావలెను. రసికుడనుట రసభావముల నాస్వాదింపగలవాడు సహృదయు డని భావము. సర్వశాస్త్రపారంగతుడు కావలెను. నాట్యధర్మి లోకధర్మి యని ప్రఖ్యాతములయిన మార్గ దేశీధర్మముల తత్త్వములను గుర్తించినవాడును సంగీతకుశలుడును కావలెను. సంగీతమునందును మార్గ దేశీధర్మములు కలవు కావున వాని గుర్తింపగలిగి యుండవలెను. సర్వభాషాభిజ్ఞుడై భావకుడై ప్రతిభాసంపద కలవాడై యుండవలెను. సర్వవిధౌచిత్యాభిజ్ఞుడై సత్యవసతియై మత్సరము లేనివాడై యుండుట యుక్తము. నాట్య నృత్త కలహములు వచ్చినప్పుడు వాదోపవాదములు విస్తరిల్లునప్పుడు మాధ్యస్థ్యము వహింపగల

వాడునై కృతకార్యుడై నిరామయుడై ఆస్తికుడై యాలస్యము లేనివాడై పరివారమున నానుకూల్యము పొందువాడై యుండవలెను. ఇట్లు వివేకి కౌతుకి వాగ్మి తరుణుడు గుణదోషవిదుడు, సులక్షణుడు శత్రువిజయము సంపాదించినవాడు నిపుణుడు రసముల విషయమున సర్మధర్మములను తెలిసినవాడు, ఆత్మస్తుతిలోకాని, పరనిందలోకాని నిత్యము పరాఙ్ముఖుడుగా నుండువాడు సభాపతిగా నుండును త్యాగియై దయాపరుడై శ్రీమంతుడై సభాపతికి ఉండవలయుట నాట్యవిదులకు సమ్మతము. నటులపై ప్రాశ్నికులపై గౌరవమర్యాదా భావములు కలవాడై యుండి రంగోత్తేజనము సంపాదించుచు సభాపతి మర్యాదగలవాడగుట సముచితము. ఇట్టి లక్షణలక్షితుడు సభాపతిగా నున్నచో నాట్య నృత్య శోభ స్పృహణీయముగా నుండును. నాట్యధర్మి లోకధర్మి మర్యాదానుసారముగా నున్న మార్గదేశి భేదములను చక్కగా గుర్తించినవాడు కాగా దేశీవిధానములను సమీకరించుకొని వానికి యథోచితమైన శాస్త్రీయతను సంపాదించుచు, సభాపతి సమర్థుడుగా నుండును. నాట్యకలహములు సంప్రాప్తమైనపుడు ప్రాశ్నికుల నిర్ణయములను పరిశీలించి ఆచరణమునందు ప్రవర్తింపచేయువలెను. కాని తానొకపక్షము వహించి పక్షపాతము సూచించువాడు కారాదు నాట్యనృత్యాభ్యుదయము సర్వము సభాపతి ఆధారముననుండును. నర్తన మొనరించుటలో అధికారము కలిగిన స్త్రీలు పురుషులు సభాపతి ఆధారమున నుందురు. వారల నీతిరీతులను సభాపతి రక్షించువాడగుటయు సమ్మతము.

## సభ్యగుణాః

ప్రస్తావోచితభాషిత్వం త్రుటితా త్రుటితజ్ఞతా
మాధ్యస్థ్యం మాన్యశాకాపినాటకాదిషు పాటవం

న్యాయాదిశాస్త్రవేదిత్వం వాగ్మితాశీలశాలితా
ధర్మధౌరేయతా ముక్త రాగద్వేషాదిమానితా
గుణవత్సలతాశేష దేశభాషాను కౌశలం
రసభావేంగితజ్ఞత్వం ధైర్యం మధ్యవయస్కతా
తౌర్యత్రితయ చాతుర్యం సుమూర్తిత్వం కులీనతా
ప్రాగల్భ్యం ప్రతిభాచేతిగుణాః ప్రోక్తాస్సభాసదాం

---

## సభ్య గుణములు.

సభాపతి స్వరూపనిర్ణయానంతరము సభ్యుల గుణములను నిర్దేశించుట యావశ్యకము. సభాసదులగు సభ్యులు నానాగుణములతో కూడియుందురు. ఆయాప్రస్తావములకు సముచితమైన సంభాషణా చాతుర్యము కలవారై సభ్యులుందురు నాట్య నృత్త శాస్త్రములకు సంబంధించిన సర్వవిషయములును సభ్యులు తెలిసియుండవలయును. అపుడే ఆయా ప్రస్తావములకు సంబంధించిన సర్వసంకేతములను గుర్తించి సాంకేతికములైన విషయములను నిరూపింపగల సమర్థులై యుండవలెను. రంగమున ప్రయోగ మొనరించునపుడు దోషము లున్నవో లేవో గుర్తింపగలవారు కావలెను. అపుడే త్రుటిత, అత్రుటితజ్ఞత కల్గును. వాదవివాదములు సంప్రాప్తమైనపుడు మాధ్యస్థ్యము వహించి నిర్ణయ మొనరింప కలిగినవారు కావలెను. వివాదగ్రస్తులగువారు విశ్వసించునట్లు మాన్యతకల్గినవారును కావలెను. ఇట్టి మాన్యత కేవల మిష్టజనులవలన సంప్రాప్తమైనది కారాదు.

అనుకూలురు కానివారును మాస్యభావమును ప్రదర్శించునట్లుగా సభ్యులు ప్రవర్తింపవలసియున్నది. రసప్రధానమైన నాటకాదులలో భావప్రధానములైన ఉపరూపకములలో ప్రయోగ మర్మధర్మములను గుర్తించినవారై పాటవము సంపాదింపవలెను. న్యాయశాస్త్రము నాట్యశాస్త్రము వాద్యవిధానము సంగీతశాస్త్రము మొదలగువాని యందు సముచితమైన పరిజ్ఞానము కలవారు కావలెను. సభ్యులకు వాగ్మిత అవసరము. సర్వవిధముల శీల శాలిత సభ్యుల కావశ్యకము వారలలో ప్రవృత్తిదోషము లుండరాదు. ధర్మ ధారేయత కల్గి రాగ ద్వేషములు విడనాడి మానిత్వము సంపాదించి గుణవత్సలత్వము ప్రదర్శింపవలెను. గుణగ్రహణ సామర్థ్యమే సభ్యులకు సభ్యత సంపాదించును. అశేష దేశభాషలలో కౌశలము సంపాదించినవారై రసభావేంగితజ్ఞులై యుండుట ఆవశ్యకము. రసభావవేదనమనునది కేవల మాయారసభావముల గుర్తించుట కాదు. ఆయా రసభావములను సముల్లసింపచేయు విభావాను భావాదులను తత్తత్సముచితములైన ఆహార్యాంగిక వాచిక సాత్త్వికములను గుర్తింపగల ప్రజ్ఞ యుండవలెను. అట్లు గుర్తించుటయు కాక రసభావాస్వాద సామర్థ్యము కల సహృదయ యువకులు కావలెను. ధీరులై మధ్యవయస్కులై యుండవలెను. మధ్యవయస్కులు కాకున్నచో వ్యుత్పత్తి యున్నను, ప్రతిభాసంపద యున్నను సముచితాభ్యాసము లేనందువలన విషయ నిర్ణయ మొనరింపజాలరు. వృద్ధులైనచో సర్వమున్నను స్మృతి శీలత తగ్గును కావున అంతగా నది యుక్తము కాదు. తార్యత్రికమునందు చాతుర్యము కలవారై వారుండుట ఆవశ్యకము. వాద్యము, గేయము, నృత్తము సర్వమును వారల కవగతమై యుండవలెను.

మూర్తి సౌందర్యము కలవారై కులీనులై ప్రాగల్భ్యసముపేతులై ప్రతిభాశూరులై సభ్యులుండవలెను. అభిజ్ఞులగువారు సభాసదులుగా నున్నపుడే ప్రయోక్త ప్రయోగము రాణించును. ఇట్టివన్నియు సభాసదుల గుణములు.

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ
గజసాధనిక శ్రీ జాయ సేనాపతి
విరచిత నృత్తరత్నావల్యాం
సప్తమాధ్యాయః

ఆంధ్రభోజ, సాహితీవల్లభ
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజ
భావసాధక శ్రీ మాధవరామశర్మ
విరచిత సాహితీవల్లభాఖ్యవ్యాఖ్య
సప్తమాధ్యాయము.

శ్రీ

శ్రీ జాయసేనాపతి విరచిత

# నృత్తరత్నావళీ

## అష్టమాధ్యాయః

---

### సభాపతి సమాగమనము.

సాయాహ్నే కౌతుకీ నేతా నృత్య సందర్శనోత్సుకః
నైపథ్యసదనే రమ్యే వివిక్తే చిత్రశాలిని
కర్పూరాగరు కస్తూరీ కాశ్మీర హిమవారిభిః
మిలితేన పరార్ధ్యేన చందనేనానులేపితః
మల్లికా కేతకీజాతీ చంపకైః కృతశేఖరః
చీనాంబరే శరచ్చంద్ర చంద్రికా కాంతిహారిణీ
వసానః సూచివిజ్ఞాన భంగ్యాలంకృతపల్లవే
పాదాంగులీయ పర్యంతైః మకుటాద్యైర్విభూషితైః
స్వస్వకాంతాంశ రూపోర్వీపతి నీరాజనేచ్ఛయా
దిగ్వధూరనుకుర్వాణైః సాంద్రానందం సమాగతః
మంగలైరివసోత్కంఠైః కామినీరూపధారిభిః
శంభోరివవరాన్ ప్రాప్తైః అణిమాద్యధిదైవతైః
దృష్టివేధ హరైర్దివ్యైః అవియుక్తాని మంగలైః
జ్వలితకర్పూరదీపాని హైమపాత్రాణి లీలయా
వహద్భిః పాణిపద్మాభ్యాం భ్రాంతిప్రాంతైర్మణిశ్రియః
గాయద్భిః పంచమం గానం కోకిలాలాప పేశలం
శుద్ధాం గీతిమపప్రేక్ష్యాం కుర్వద్భిర్దంత కాంతిభిః

నైరాజన శిరఃప్రాయరజలాస్వాం గతిం యతి?
యతిప్రహరణై ర్వాద్యైర్నానాతోద్య సమన్వితైః
సంయుక్తం కోమలం నృత్యం కుర్వాణై స్తరుణీజనైః
నిహితారాత్రికః శ్రీమాన్ ప్రహర్షోత్ఫుల్లలోచనః
తతః సభాగతో నర్మసచివైః నృత్తమండపే.

ఈ యష్టమాధ్యాయమున ప్రేక్షాకాలము సభాపతి సమాగమము తీన్నిరాజనమునకై దీపనర్తన మొనరించువారి విధానము సపరివారముగా సభాపతి సన్నివిష్టుడగుట మొదలగు సముదాత్తము లగు విషయములు నిరూపితములు కాచున్నవి. సాయంసమయమున కౌతుకము కల అధినేత నృత్యసందర్శనోత్సుకుడై తగిన వేషభూషా విశేషములు కలవాడై పరివారముతో నృత్తమండపమునకు వచ్చును. అప్పుడాతడు రమ్యము వివిక్తము చిత్రశోభితము నయిన నృత్తమండపము నందలి నేపథ్యసదనమున సముచిత నైపథ్యము ధరింపవలెను. అచటనాతని నేపథ్య మొనర్చువారు పరివేష్టించియుండి నానావిధముల సముచితాహార్యము కూర్పవలెను. చందనాను లేపన మొనర్పవలెను. ఆరాజచందనము కర్పూరము, అగరు, కస్తూరి, కాశ్మీరము, హిమవారి ద్రవ్యములతో మిశ్రితము కావలెను. కాశ్మీరము కుంకుమపువ్వు, హిమవారి పన్నీరు సుప్రశస్తమైన చందనముతో కర్పూరాదులను కలియకల్పి నేతయగు ప్రభువునకు లేపనము సంపాదింపవలెను. మల్లికా, కేతకి, జాతి చంపకములతో శేఖర మొనర్పవలెను. అట్లు పుష్పకృతశేఖరుడై రమ్యములగు చీనాంబరములను రెండిటిని ధరింపవలెను. ఆ చీనాంబరములు శరచ్చంద్ర చంద్రికా కాంతికలవై మనోహరముగా నుండవలెను. అట్టి వసనములను ధరించి సభామంటపమునకు వెలువడవలెను. ఆ వస్త్రములు నానావిధములగు కుట్టుపనుల పరిజ్ఞానము ప్రకటింపజేయు సుందర

పన్ని వేశములతో పరిసరాలంకారము కలిగియుండవలెను. ఇట్టి వస్త్రాలంకారము జరిగినపిమ్మట నానావిధములగు పురుషధార్యము లగు అలంకారములను ధరింపవలెను. పురుషులు ధరింపదగిన అలంకారములు వేరువేరుగా నియతముగా నుండును పాదాంగుళీయము మొదలుగా మకుటము పర్యంతము నియమితములైన సువర్ణాలంకారములతో రత్నాలంకారములతో సువర్ణప్రత్యుప్త రత్నాలంకారములతో ఇట్లు సర్వాలంకారములతో నాతడలంకృతుడు కావలెను. ప్రథమమున నియమించినట్లుగా బంధనీయములు, లంబనీయములు ఆవేధ్యములు మొదలగు అలంకారములను ఆతడు ధరింపవలెను.

నానావిధ మంగళసముపేతుడై ప్రభువు సభకు విచ్చేయవలెను. ఆ మంగళములన్నియు సోత్కంఠములై యుండుటయు, కామినీ రూపము ధరించినవిగా నుండుటయు ఇచట భావింపదగియున్నది. దిగ్వనితలను అనుకరించునవిగా నుండుటయు భావింపవలెను. అష్ట దిక్పాలకుల అంశములచే ప్రభువు లోకమున వెలయును కావున దిగంగనలందరు సాంద్రానందమున నున్నవారై వచ్చినవిధముగా నానావిధములగు మంగళములతో సభాపతి కూడుకొనియుండును. దిశాకన్యలు తమతమ పాలకుల అంశములతో ఉర్వీపతి నిర్మితుడైనాడని, ఆతనికి నీరాజనమీయవలెనని సంకల్పము కలవారై స్వయముగా విచ్చేసిన విధమున కామినీరూపమును ధరించి వారందరు ఉత్కంఠాసహితలైన మంగళదేవతలవలె ప్రకాశించుచుందురు. కైలాసము నధివసించియున్న పరమశివుని యనుగ్రహమున అభీష్ట వరములను పొంది అణిమాద్యష్టసిద్ధుల అధిదైవతములుగా మంగళ దేవతలున్నట్లు భావింపవలెను. "అణిమా మహిమా గరిమా లఘిమా ప్రాప్తిః ప్రాకామ్యం ఈశిత్వం వశిత్వం" అను అష్టవిధ సిద్ధులు. వాని అధిదైవతములవలె దిగ్వధువులు మంగళదేవతలుగా

భాసించుచున్నారనియు భావము. దృష్టి వేధదోషమును హరించు నట్టి దివ్యములగు మంగళద్రవ్యములతో పరిపూర్ణములైన సువర్ణ పాత్రికలను చేతులధరించి వనితలుండుటయు భావనీయము. ఆ హైమ పాత్రలలో జ్వలత్కర్పూరదీపము లుండుటయు ఆవశ్యకము. అట్టి హైమపాత్రిలను పాణిపద్మములచే వహించి వారుందురు. అచటి దివ్యమంగళములన్నియు కాంతికాంతములై శోభాప్రకాశమాన ములై మణిశ్రీసుందరములై శోభించును. కోకిలాలాపపేశలముగా పంచమస్వరమున గానాలాప మొనరించుచు వారు విచ్చేయుటయు, ఇచట సంభావ్యము. గాన మొనరించునపుడు గాయనీమణుల జంట గాండ్రచే వారి ముఖములనుండి వెలువడు గీతి శ్రుతి స్వర శుద్ధమై స్వచ్ఛముగ సాక్షాత్కరించునట్లు ఉండుటయు భావనీయము. అట్టి వారు పాణిపద్మములలో హేమపాత్రములను పట్టి నీరాజనమిచ్చు నపుడు సుందరగమనమున నున్నవారై శిరములువంచి పైకెత్తి హస్త ములచే నైరాజనపాత్రలను త్రిప్పియుంచుటయు భావసుందరము.

సభాపతియగు ప్రభువునకు నీరాజనమిచ్చు వనితలు కోమల ముగా నానావిధాతోద్య సమన్వితములైన వాద్యవిశేషముల కనుగత మగునట్లుగా సమయోచితమగు నృత్య మొనరించువారై పరివేష్టించి యుండవలెను. అప్పటి వాద్యవిధానములుకూడ యతిప్రహరణ మునను వాద్యప్రబంధములతో కూడినవై తాళ లయ శుద్ధములై శ్రవణమనోహరముగా నుండవలెను. కోమలముగా నట్లు నృత్య మొనరించుచు తరుణీమణులు ఆరాత్రికము ధరించి సభాపతి సమక్షు మున నాయారాత్రికము సమర్పింపవలెను. కమనీయ కామినీమణు లర్పించిన నీరాజనములను, ఆరాత్రికములను సాదరముగ, సాభి మానముగ నందుకొని శ్రీమాన్ సభాపతి హర్షసముత్ఫుల్లలోచ

నుడై నర్మసచివులతో కూడినవాడై పరివారజనపరీగతుడై నృత్తమంటపమునకు విచ్చేయుచలెను.

సభాపతి సమాగమము నుద్దేశించి ప్రేక్షాకాలమున ప్రేక్షాగృహమునకు ప్రేక్షకులతో విచ్చేయు ప్రభువైభవము నిరూపితమైనది. శివానుగ్రహముపొంది అణిమాదిసిద్ధులు విచ్చేసినవిధముగా స్వకీయ కాంతాంశములు కల దిగ్వసితలు వచ్చినవిధముగా మంగళదేవతలు దివ్యమంగళములు కూర్చుటకు వచ్చినవిధముగా సాలంకృత కన్యలు చిత్రవిచిత్రసంచారములతో సభాపతికి నీరాజన మిచ్చుటయు నిరూపితమైనది. రక్తిప్రధానముగా రాగాలాప మొనరించు రాగిణీమణుల రాగవిశేషములు రాగానుసారమున ప్రసరించు నానావిధములగు వాద్యవిశేషములు తదనుసారముగా ప్రసాదముపొందు నృత్యప్రయోగము నిదర్శితమైనది. వీనినన్నిటిని చూచి, భావించి, సంభావించి సభాపతి సచివసముపేతుడై సభారంగమునకు వచ్చుటయు ప్రతిపాదితమైనది ఇట్లు సర్వము స్పష్టాస్పష్టమున నున్న శ్లోకముల భావార్థసారముగా ఇచట నిరూపితమైనది.

రత్నసానుతటోత్తుంగ కల్పశాఖీవ భూపతిః
సహాసనమధిష్ఠాయ నిషీదద్భిశ్చితవ్రతః?
స్వర్ణకల్పతరుం కృత్వా పృష్ఠతః పురతః పునః
రత్నైరలంకృతం హైమం వారణం మకరాంకితం
తలేముక్తా వితానస్య వేష్టితస్య మణిస్రజా
భవేత్సింహాసనాసీన స్సార్వభౌమః సభాపతిః

రత్నమయములైన చరియలు కలిగిన ప్రదేశమునందు సముత్పన్నమైన కల్పవృక్షమువలె రత్నముల కూర్పు కలిగిన రాజసింహాసనమునందు భూపతి సముపవిష్టుడై ఉండగా, సముచిత

సహాసనములందు సహృదయవ్రతులైన సహృదయ సామంతులు కూర్చొని యుందురు. వారు కూర్చొనియున్న ప్రదేశమున పురో భాగమునను పృష్ఠభాగమునను స్వర్ణకల్పతరువును కూర్పవలెను. ఆనాటి రాజమర్యాదాసూచకముగా ఆయా ప్రదేశములందు ధర్మపరి పాలనము నిర్దేశించునట్టి సువర్ణ కల్పవృక్ష సన్నివేశము యుక్తము. ఆ స్వర్ణకల్పతరువు రత్నాలంకృతము, సువర్ణమయముగా నుండును. మకరాంకితమై వారణ చిహ్న శోభితమై యుండును. మంచిముత్య ములతో నిర్మితములైన వితానము వ్రేలాడుచుండును. మణిమాల లతో నది వేష్టితమై యుండును. అట్టి వితానశాలమున సభాపతియగు సార్వభౌముడు సింహాసనాసీనుడై యుండుట యుక్తము.

ప్రేక్షాగృహములో నానాజనులకు ప్రవేశములేదు. లోక పరిపాలకుడు ప్రయోక్తయై ప్రయోగ మొనరింప చేయునపుడు ప్రయోగతత్వము తెలిసినవారుమాత్రమే నృత్త మందిరమున నుండ దగుదురు. అందును రాజపరివారము, మంత్రిసామంతులు దండ నాథులు కవిపండిత నటగాయకులు ఉండదగుదురు. ప్రాశ్నికులును సభాసదులై యుందురు. నృత్త నాట్యములకు నిర్దేశించిన వివిధములగు ప్రయోజనములను ఆకాంక్షించువారును అందుందురు. పాలకులు ప్రయోగము కూర్చునపుడు విలాస వినోదమునకే కాక ప్రయోగము వివేక విజ్ఞానమునకు నగును. అట్టివారందరు ప్రేక్షాగృహమున నుండుటను అభ్యూహింపవలెను

తస్యవామే మహాదేవీ భవేదిత్యపరే విదుః
సేయంతు నేష్టా నీతిజ్ఞైర్దర్శనీయాహి కస్యచిత్
పతితాం పక్ష్మలాక్షీణాం కటాక్ష శరసంతతిం
చామరోల్లాస నైశ్శబ్ద్వాద్వారయంత్య ఇవాంతరా

కలకంకణనిక్వాణా లీలాజాగరితస్మితాః
పత్యుశ్చామరధారిణ్య స్తిష్ఠేయుః పృష్ఠభాగతః
విస్రంభాలాప నిపుణా నర్మజ్ఞా రాజవల్లభాః
లలితై రంగకై ర్యుక్తా భూషాణామపి భూషణైః
కామ్యాః కామకలాభిజ్ఞాః కాముకేంధనయౌవనాః
తౌర్యత్రితయవేదిన్యః సువేషాశ్శుభలక్షణాః
వామతః పృష్ఠతశ్చస్యుర్విలాసిన్యః సభాపతేః

నర్తవశాలలో స్వర్ణకల్ప వృక్ష పరిసరమున కల్పవృక్షరూప ముగా నుపవిష్టుడైన ప్రభువు సమీపమునందు వామభాగమునందు మహాదేవి మహారాజ్ఞి పట్టపుదేవి ఉపవిష్టురాలై యుండునని కొందరు భావించిరి. మహాప్రభువుల అంతఃపుర పరివారములో రాజభార్య లనేకవిధముల నుందురు. మహాదేవి మాత్రము నర్తనాగారమున ప్రేక్షకులకు గోచరించునట్లు ప్రభుసమీపమున ఉపవిష్టురాలై యుండుట యుక్తముగానుండునని మేము భావించుటలేదు. పట్టపుదేవి ప్రయోగదర్శనాసక్తురాలైనచో నియతమైన ప్రత్యేక ప్రదేశము నుండి ప్రయోగదర్శన మొనరించుట యుక్తము కాని సర్వాదృశ్య మాన యగునట్లు రాజ వామభాగమున ఉపవిష్టురాలై యుండుటను మేమంగీకరింపము. రాజనీతిజ్ఞులైనవారు ఇట్టి విధాన మంగీక రింపరు. ప్రభుపత్ని ఏరికిని గోచరింపరాదు. అనియే రాజనీతిజ్ఞులు విశ్వసింతురు.

భాసాదుల నాటకములలో ప్రయోగసమయములందు మహా రాజ్ఞి కూడ రాజసమీపముననే ఉపవిష్టురాలై యుండుట గోచరించు చున్నది. మాళవికాగ్నిమిత్రమునందు అగ్నిమిత్రుని మహాదేవి ధారిణీదేవి ప్రేక్షాశాలనుండి మాళవికానాట్యము దర్శించుట స్పష్ట ముగుచునే యున్నది. రత్నావళిలో వాసవదత్త, సాగరిక వాసవ

దత్తావేషమున రంగమున కవతరించినపుడు స్వయముగ వత్సరాజు రంగమున కేతెంచుట వాసవదత్తకు కోపముకల్గుట గోచరించుచునే యున్నది. ప్రాచీనులావిధముగ సంకేతించిరి. కాని జాయపతి దీని నాదరించుటలేదు.

"రాజానోఽబహువల్లభాః" మహారాజునకు వల్లభ లనేకు లుందురు. మహాదేవి, దేవి, స్వామిని, భట్టిని, భోగిని మొదలగు స్త్రీలు అనేకులుందురు. అదియుగాక రసికుడగు ప్రభువు నటీమణులపై కూడ ప్రేమాదరములు కలవాడుగా నుండవచ్చును. అట్టివారభిన యించునపుడు ప్రభువుపై రాగము ప్రకటింతురు. అదిచూచి ప్రభువు సంతుష్టుడగును మహాదేవి ఇట్టి ప్రేమవిధానములను సహింపజాలదు. కావుననే వారు ప్రేక్షాగృహమున నుండకూడదని జాయపతి భావించి యుండును.

ప్రభువు పరిసరమునందు పృష్ఠభాగమున వింజామరములను ధరించిన స్త్రీలు ఉందురు. చామరముల ఉల్లసనములచే ప్రభువులను వీచుచునుందురు. ఆ పరిసరములందున్న పక్ష్మలాక్షులయొక్క కటాక్ష శరసంపత్ ప్రభువుపై ప్రసరించగా వాని ప్రసారము లేకుండుటకై మధ్యమధ్యలో చామరములతో నివారమొనరించు చున్నట్లుగా వీచుచుందురు. కంకణనిక్వాణముల కల మధురధ్వను లతో కూడినవారై లీలావిలాస విశేషములచే స్పష్టస్మితము కల వారై చామరధారిణీలు వీచోపులు వేయుచుందురు. విస్రంభాలాప నైపుణ్యము కలవారై నర్మజ్ఞలైన రాజవల్లభలు సభాపతియగు ప్రభువుయొక్క వామభాగమునను, పృష్ఠభాగమునను విషణ్ణలై యుందురు. వారందరు ఆలాప సంలాప నిపుణులు. శృంగార నర్మ విశేషములు తెలిసినవారు. లలితములగు నవయవములలో నుందురు.

భూషణ సహితములైన వారి యంగకములు భూషణములకును భూషణములుగా నుండును. వారు కమనీయ రూపలు, కామ్యలు, కామకళాభిజ్ఞలు. తమ యౌవనమును కామేంధన మొనరించిన వారు. కామభావము కలిగించుటకు వృద్ధిపొందింప చేయుటకు వారి యౌవనము తగియుండును. తౌర్యత్రితయము గుర్తించినవారై వేష శోభితలై శుభలక్షణలై రాజ పరిసరమున ఉపవిష్టలై యుందురు. మహాదేవి బహిరాకర్షణ ప్రభావమున నుండదు లీలావిలాసములతో నుండదు. ఆమె విలాసిని కాదు. కామేంధన యౌవనగా నుండదు. అన్నియు దెలిసినదే ఐనను ఆమె ధర్మపత్ని, యజ్ఞపత్ని అయి నందున నాట్యమందిరములో ప్రభుసమీపమున నుండుటను జాయపతి అంగీకరింపలేదు.

.... ... .... .... .... ....

.... .... .... .... ... ....

శుచిక్షేత్రా విలాసభాజనం రూపశాలినీ
సువేషమధురాలాపా కలావిత్ప్రౌఢయౌవనా
సావధానేంగితాభిజ్ఞా నృపవంశ క్రమాగతా
మంజూషాందధతీ హైమీంనానారత్నవిభూషితాం
భూపాలోంచిత తాంబూలసామగ్రీ పరిపూరితాం
ఆసీతదక్షిణే పార్శ్వే రాజ్ఞ స్తాంబూలదాయినీ.

సభాపతియైన రాజుయొక్క దక్షిణ పార్శ్వమునందు తాంబూలదాయిని వనిత సావధానముగ నుండవలెను. ఆమె స్వరూపవిశేషము లిచట నున్నవి. తాంబూలదాయిని తాంబూల కరండవాహిని రూపముగా కాదంబరీ గ్రంథములో చంద్రాపీడ యువరాజ సమీపమున పత్రలేఖ అను నొక సుందరవనిత నియుక్త అయినది. యోగ్య

వంశమున జన్మించినది, సుందరవేషము కలది, అపారసౌందర్యము కలది, సువేషాఢ్య అగునది, సంభాషా చతుర వనిత యొకతె యుండును. పెద్ద లామెను నియమింతురు. చంద్రాపీడుని తల్లి విలాసవతి చంద్రాపీడుని పరివృత్తి వేదనమునకై ప్రవృత్తి రక్షణమునకై పత్రలేఖను నియమించెను. ఆమె తాంబూలదాయినియై నిత్యము ప్రభు సన్నిధానములో నుండును. యోగ్యమగు అంజనము ధరించిన నేత్రములతో వారిని వారిని అందరిని చూచుచు, వారి వారిని రాజునకు నివేదించుచుండును. రాజసన్నిధిలో నుండును. కాన సర్వవిషయములను చెవిదగ్గరగా చెప్పు సౌకర్యము ఆమెకు కలదు. ఆమె శుచిక్షేత్ర కావలెను. యోగ్యవనితయందు జన్మించినది కావలెను. విశ్వాస భాజనముగా నుండి రూప సంపద కలదై సముచిత నాగరక వేషము ధరించినదై మధురముగా మాటలాడునది కావలెను. నానా కళావిశేషములను తెలిసినది కావలెను. రంగమున నుండు నర్తకులను, గాయకులను తెలిసినది కావలెను. ఆమె ప్రౌఢ యౌవన సావధానముగా పరుల భావములను గుర్తింపగలదు. నృప వంశక్రమానుగత అయినది అగుట యుచితము. నానారత్నవిభూషయై బంగారపు మంజూష చేతిధరించినదియై యుండును. భూపాలోచితమైన తాంబూలసామగ్రి ఆభాజనములో నుండును. రాజసన్నిధిలో తాంబూల హస్తయై నిత్య సన్నిహితగా తాంబూలవాహిని ఉండుట రాజమర్యాద, రంగశాలా శోభ.

స్వస్యైవ దక్షిణేపార్శ్వే మంత్రిణశ్చ పురోధసః
వేత్రాసనే నివేశాః స్యుః నరేంద్రేణ సగౌరవం
ముండాసనేచ తన్మధ్యే యువరాజం నివేశయేత్
తస్య దక్షిణతః పార్శ్వే తద్వత్సేనాపతీనయం
ఆసనేషు యథార్హేషు సేనానీ పృష్ఠభాగతః

మండలేశ్వర సామంతపరమండలినః క్రమాత్
దైవజ్ఞ పతయో వైద్యాయుధ శ్రీకరణాధిపాః
హస్త్యశ్వర ధనేతారః కోశగోష్ఠగృహాధిపాః
తౌర్యత్రితయతత్త్వజ్ఞా మల్లాద్యారాజవల్లభాః
యథాస్థానం నివేశ్యాః స్యుః తదధ్యక్షైః నృపాజ్ఞయా.

రాజ దక్షిణ పార్శ్వమునందు మంత్రులు పురోహితులు కూర్చొని యుందురు. రాజు సగౌరవముగా వారిని వేత్రాసనమున కూర్చొన చేయవలెను. రాజ సమీపమునందు ఆసన విభాగము వివిధముగా నుండును. మంత్రి పురోహిత మధ్యభాగమునందు యువరాజును ముండాసనమున కూర్చొనచేయవలెను. సేనాని యువరాజులకు ముండాసనమున నుపవేశమును పెద్దలు నిరూపించుచున్నారు. ముండాసనమనగా ఆనుకొనుటకుగాని చేతులుంచుకొనుటకుగాని సన్నివేశముండదు. అదేవిధముగ పార్శ్వమున దక్షిణ భాగమునందు యువరాజును కూర్చొనచేసినట్లే సేనాపతులను ఉపదేశింపచేయవలెను. సమర్హమైన ఆసనములందు సేనాని వెనుకభాగముగా మండలేశ్వరులు, సామంతులు, పరమండలములవారు, క్రమముగా కూర్చొనదగుదురు. దైవజ్ఞపతులు వైద్యుడు, ఆయుధశాలాధ్యక్షులు, కోశాధిపులు, అధికరణమండపాధికారులు ఉపవిష్టులై యుండవలెను. హస్తిపాలకులు, అశ్వపాలకులు, రథపాలకులు, కోశగోష్ఠగృహాధిపతులు, తార్యత్రితయ తత్త్వజ్ఞులు, మల్లప్రముఖులు, ఇంకను రాజవల్లభులగువారు యథాస్థానమున నివేశము పొందతగియున్నారు. ప్రేక్షాశాలాధ్యక్షులగువారు రాజ నివేశానుసారమున ఆయా వచ్చినవారలను సముచితాసనములందు ఉపవేశింపచేయుట నాట్యశాలాశోభ సంపాదించును.

వాగ్గేయకార గాంధర్వస్వరాదీన్గాయనాన్నటాన్
నర్తకాన్వాగ్మినః పుణ్యపాఠకాన్కథకానపి
వామతోద్వివిధాతోద్య వాదకాంశ్చ నివేశయేత్.

వాగ్గేయకారులు సభారంగమున నుందురు. గాంధర్వవిదులు నుందురు. స్వరప్రత్యాది లక్షణములు గుర్తించినవారు నుందురు. వాగ్గేయకారులు సంగీతజ్ఞులలో సర్వప్రధానులు. వారు కృతులు నిర్మింతురు. క్రొత్తరాగముల కూర్తురు. సంగీతవిదులలో వీరు సర్వప్రధానులు. గాంధర్వవిదులు సంగీవిద్యా పారీణులు. సంగీతము నందలి మార్గదేశీవిధానములను వీరు తెలిసియుందురు. స్వరాదులను తెలిసినవారు మార్గసంగీతమున మాత్రము అభిజ్ఞులుగా నుందురు. ఇట్టి గాయకులను నటులను నర్తకులను వాగ్మివరేణ్యులను పుణ్యాపాఠకులను కథకులను వామపాదమున నుపవేశింప చేయువలెను. అదే విధముగ ఉభయవిధముల ఆతోద్యములను ఉపయోగించుటలో నిపుణులగు వాదకులను ఆ పరిసరములనే కూర్చొనచేయవలెను. రంగశీర్షమునందు మార్గదేశీవిధానములు రెండును ప్రయుక్తములగును. కావున వానికి తగినవిధముగా ఆయారీతులలో వాద్యవాదవ సమర్థులగు వాదకులుండుట ఆవశ్యకము.

మాన్యామాన్య విచారజ్ఞః స్వామిచిత్తానువర్తకః
నాతిదూరే ప్రతీహార స్తిష్ఠేద్వేత్రధరః పునః
కరవాలకరై రాప్తై రంగరక్షైః సమంతతః
పరివృత్యసదః స్థేయం స్వపరోజ్ఞానతత్పరైః

రాజునకు కొంత సమీపముగా ఎదుటగా ప్రతీహారుడు నిలబడి యుండవలెను. ఆతడు మాన్యామాన్య విచారసమర్థుడై యుండును. రాదగినవారిని, రాదగనివారిని ఆతడు గుర్తింపగలడు. స్వామి

చిత్తము ననుసరించి ప్రవర్తించువాడు నగును. వేత్రధరుడై యుండుట ఆతని స్వరూపలక్షణము. రాజపరిసరమునందే చుట్టుప్రక్కల నంతటను కరవాలహస్తులైన అంగరక్షకు లుందురు. వారు ఆప్తులు. యదార్థవచనులు. స్వపరజ్ఞాన పరాయణులుగా నుందురు. వారు ప్రేక్షాగృహము నంతటను ఆవరించియుందురు అట్లుండుటయు ఆవశ్యకము. భరతపుత్రులు నాట్యప్రయోగ మొనరించు నపుడు దేవ విజయమందు నిరూపితమగుచున్నదని దానవులు వ్యాకోపముపొంది విఘ్నము సంపాదించిరి. రంగ నటులకు వాక్ స్తంభము కలిగినది. బాహుస్తంభము కలిగినది. గతి ప్రతిష్టంభము కలిగినది. అపుడు దేవేంద్రుడు జర్జరముపూని విఘ్ననివారణ మొనరింపవలసి వచ్చినది. ఇది దేవలోకవార్త. భూలోకమునందు అన్యవిధములగు విఘ్నములు కలుగవచ్చును. రాజ వ్యతిరిక్తులు రంగవిఘ్న మాపాదింపవచ్చును. సదస్సులోనున్న సదస్యులును ప్రేక్షాకాములైనను ఏకభావులుగా నుండరు. ద్రోహచింత కలవారుండవచ్చును. ఇట్లన్యాన్యములగు విఘ్నములు కలుగవచ్చును. వాని దూరీకరణమునకై రాజసన్నిధిలో రంగశాలయందంతటను అంగరక్షకులు రాజభటులుండుట ఆవశ్యకము.

రత్నాభరణ సంక్రాంతైః ప్రతిబింబైర్బహూకృతాః
పూరితాగంధతైలేన స్ఫారకర్పూరవర్తయః
దీపికాః పురుషైర్ధార్యాః సువేషైర్వర్ణదండికాః

ప్రేక్షాగృహము నందంతటను మంచి వస్త్రాభరణధారణ మొనరించిన పురుషులు దీపికాదండములను ధరించి యుండవలెను. సముచిత వేషభూషా విశేషములతో కూడియున్నవారు సభాసదుల రత్నాభరణములందు ప్రతిబింబింపగా రత్నాభరణములచే బహూ

కృతులైనట్లుగా భాసింతురు. పరిమళ యుక్తమైన తైలములతో దీపికాదండములు కూడియుండును. విశాలములైన కర్పూర వర్తికలతో అవి పూరితములై యుండును. దీపధారణమున కనుకూలములైన దండములును సువర్ణదండములుగా నుండుటను గుర్తింపదగి యున్నది.

రాజ్ఞా పూర్వేద్యురాదిష్టా ప్రాతః స్నాతవతీతతః
ఇష్టేష్టదేవతా విప్రైః కారయిత్వా గ్రహాధ్వరం
ప్రీణయిత్వాద్విజాచార్య బృందవిద్యావతోఽఖిలాన్.

రాజు పరివారము యథోచితముగా నాట్యమండపమున నుపవిష్టులయిన పిమ్మట నర్తకి సముచిత నైపథ్యము ధరించి రంగము ప్రవేశించుట నిరూపితము కావలసియున్నది. ఆ నర్తకి పూర్వదినముననే రాజుచే నాదిష్టురాలై తానాచరింపవలసిన విధులనన్నిటి నాచరించినదై రంగము ప్రవేశించును. ఆ ప్రధాన నర్తకి యాచరింపవలసిన విధానము లిచట నిరూపితము లగుచున్నవి. పాలకప్రభువాదేశింపగా పూర్వదినముననె కర్తవ్యములను పాలనీయములను చక్కగా సమాలోచన మొనరించినది యగును. ఇక నానాడు ప్రాతఃకాలముననె స్నానమొనరించి శుచివేషమున సముచితేష్టదేవతలను సముచితముగా యజించినదై యుండుట ముఖ్యప్రధానవిధి నర్తకి నర్తనసిద్ధికి మంత్రిజపము దేవీదేవపూజాదిక మాచరించినది యగుటచే నానాడును సవిశేషముగా నిష్టదేవతారాధన మొనరించినది యగుట యుక్తము. పిమ్మట గ్రహాధ్వర మాచరింపజేయవలెను. ఇది గ్రహమఖము నవగ్రహారాధనము. మంత్రవిదులు వేదవిదులు క్రియావిదు లయిన విప్రులచే నా గ్రహముఖము నిర్వర్తింపజేయవలెను. అనంతరము ఉత్తమద్విజులను నర్తనాచార్యులను నర్తనబృందమున నధికృతులగువారలను ఆయా విద్వాంసులనందరిని వస్త్రా

భరణములతో చంద్రచందన కస్తూరీఫల తాంబూలములతో సముచితదక్షిణావిధానములతో సుప్రీతుల నొనరింపవలెను. వారి యనుగ్రహము ఆనుకూల్యము సంపాదింపవలెను. ఈ యనంతరమె నర్తకి రంగము ప్రవేశించును.

నర్తకీవర్ణనం.

గర్వోల్లసిత సౌవర్ణ సామిదర్శితకేతకం
ధమ్మిల్లం దధతీక్లుప్తం కుంతలైర్వకులప్రియం
అంగప్రభానుసారేణ తత్తత్కాలోచితేనవా
చందనేనవిధాయాంగోద్వర్తనం కుంకుమేనవా
మంజుశింజాన మంజీరమేఖలా వలయాదిభిః
రత్నాలంకరణైర్హీరస్థూల ముక్తాఫలోత్తరైః
తాన్యంగైర్భూషయంతీ స్వైస్వైరప్యంగేషు భూషితా
అంకాధిరోపితస్వాతీ శశిబింబ విడంబినా
ఆననేన విరాజంతీ నాసామౌక్తికశోభినా
కస్తూరీతిలకాంకేన వదనేనానుకుర్వతీ
ప్రాంతస్థిత కురంగస్య పూర్ణస్యామృతదీధితేః
ముఖపద్మపతత్కామి నయనాలిజిఘృక్షయా
సువర్ణవస్త్రమాల్యాద్యైర్భాండయుక్తేనరాజతా
స్మరేణ దధతీన్యస్తాం మేలౌమౌక్తికజాలికాం
రూపస్య ప్రతిరూపస్య దర్పణే ప్రతిమాంతదా
దృష్ట్వైవ వామమందాక్ష మందస్మితముఖీతతః
కనకాందోలికారూఢా ఛత్రచామరశోభితా
బృందేన సహితా సాయం యాయాన్నృపతిమందిరం.

నర్తకి ఆహార్యమిందు రమ్యముగా వర్ణితమయినది. ఆదినముల నాటి యాహార్యసౌష్ఠవము ఇందవభాషించుట భావనీయము. ఇది

యంతయు పాత్రమండనవిధానము. పాత్రమండనరీతిని రత్నాకరాదులును నిరూపించిరి. పాత్రమనదగిన ప్రధాన నర్తకి పృష్ఠభాగమున సునీలస్నిగ్ధ విస్తీర్ణ కేశపాశనివేశితము పుష్పమాలాలంకృతము నయిన గ్రంథి విలులితముగ వదులువదులుగ నయినదిగ నుండును. ఇది యొకవిధమగు జారుముడి. ఇట్లు ముడి కాదేని ముక్తామాలా మనోహారిణి దీర్ఘసరల వేణియేని సముచితము. ఫాలము కుంతలాధిష్ఠితము. ఆఫాలమున కస్తూరీ చందనాది కల్పితమయిన తిలకముండును. నయనయుగల మంజన మంజులముగా నుండును. శ్రవణయుగలము కాంతిసంతతి దంతురతాలపత్ర పరిష్కృత మగును. దంతమండలము రంగతట ప్రోన్మేషఘటనా పటుప్రభాపటలజటిలము, కపోలములు కస్తూరీ పత్రభంగకోమలములు, కంఠము తారావలీ పరిష్కృతము, కుచయుగలము స్థూలమౌక్తికదామశోభితము, ప్రకోష్ఠద్వయము లసద్రత్న కనకవలయ కమనీయము, అంగుళులు వజ్రమౌక్తిక కోమలములుగా నుండదగును. నర్తకి గాత్రము చందనచర్చితమై యుండవలెను. కుంకుమరంజితమేని కాదగును. దుకూలాదికవసనము, సూక్ష్మకూర్పాసకము కంచుకము ఇట్లు తత్తద్దేశానుసారమున ఆహార్యముండదగును.

ఈ భావభావనముతో జాయసేనాపతి వర్ణించినరీతిని భావించియందలి విశిష్టతను నిభాలనము చేయునది. నర్తకి ధమ్మిల్లము ధరించి యుండును. అది కుంతలక్లృప్తము వకులప్రియమయిన కేశబంధము. సుబద్ధమయిన యా కేశపాశమున కూర్చిన కేతకము - మొగలిరేకు గర్భోల్లసిత సౌవర్ణం మధ్యనుండి సముల్లసితమగు సువర్ణశోభకలదై సామిదర్శితము సగము గోచరించునదిగా నుండదగును. అంగప్రభానుసారమున్నగాని తత్కాలోచితమయిన చందనమునగాని కుంకుమమునగాని సర్వాంగములకు ఉద్వర్తనము సంపాదించి యుండును. నర్తకీ

దేహమంతయు చందనగంధమున కుంకుమరాగమున రంజితమై భాసింపవలెను. ఆ నర్తకి దేహభాగ్యానుసారమున ఆ మాసమున కావారమున కాదినిమునకు సముచితమగు విధమున, ఆ సమయ సముచిత విధానమున నామె మైపూతయుండుట నియతము. శ్యామ గౌరవిధానమున నేవర్ణ మే దేహవిభాగమున వర్ణపోషకముగ నుండునో ఆవిధాన మావశ్యకము. సర్వము దేశ కాల వయోవర్ణాను సారమున గూర్పదగును. ఆ నర్తకి నానారత్నాలంకారములు ధరించును. మంచి వజ్రమణులు కూర్చుపొందిన వాని ధరించును. స్థూలముక్తాఫలోత్తరములగు వానిని ధరించును. ఆ రత్నాలంకర ణములు మంజుళ జాన మంజీరములందును, మేఖలాదామమునందును కరకంకణములందును పరిత్యుప్తములై కూర్చుపొందినవై యుండును. అట్లు నానావిధములు నానాస్థానగతములు నయిన రత్నాలంకరణ ములను తన అంగములచే నామె యలంకరించునటు లుండును. ఆయా యవయవములందు ఆయా యలంకారముల గూర్పగా నా నర్తకియు భూషితయై భాసించును. వానిచే నీమె కలంకారము. ఈమె యవయవములచే వాని కలంకారము. ఇట్లు పరస్పరము భూషణ భూష్య భావనిరూపణమున శోభాతిశయము నిరూపిత మగుచున్నది

ఆ నర్తకి నాసామౌక్తికము ధరింపగా ముఖము శోభాసుంద రముగ నుండును. అప్పుడా ముఖ మంకాధిరోపితస్వాతితారకల శశిబింబము ననుకరించునదిగా నుండును. ఆమె ముఖమున కస్తూరీ తిలకముండును. అప్పుడాముఖము ప్రాంతమున కురంగము కల పూర్ణ చంద్రు ననుకరించును. ఆ నర్తకి శిరమున ముక్తామణులతో నిర్మిత

మయిన జాలకము ధరించును. ఆ మాలిన్యస్త మాక్తికజాలకము ఈవిధముగ భాసించును. సర్వవిధసుందరి యయిన నర్తకి ముఖపద్మము న పరిసరించు కాముక నయనభృంగములను గ్రహించుటకై మన్మథుడు సుందరమగు భాండమేర్పఱచి సువర్ణవస్త్ర మాల్యాదులచే శోభ సంపాదించినాడు. పద్మపరిమలాసక్తములయిన తుమ్మెదలను పట్టుటకు భాండముపై మంచివర్ణము కల వస్త్రమాల్యాదుల నుంచినచో నా శోభాకృష్టములై తుమ్మెదలటచేరును. రంగనర్తకి సముజ్జ్వలవేషమున రంగమునకు రాగా ప్రేక్షకుల స్థానములందున్న కాముకు లాసక్తిగా చూచునప్పుడు వారి దృష్టుల నన్నిటిని నర్తకీ శిరోగత మాక్తికజాలక మాకర్షించును. శిరముననున్న ముక్తాజాలకము రసికదృష్టుల నాకర్షించుననుట గ్రాహ్యము. అసమానమయిన తన రూపప్రతిరూపముయొక్క ప్రతిమను దర్పణమున జూచినదివలె ఆ నర్తకి సుందరముగా మందాక్షమును - లజ్జ మందస్మితమును ముఖమున ప్రసరింపజేయుచుండును. చిన్న నవ్వు నవ్వును. సన్నగా సిగ్గుపడును. ఆ మందాక్షము ఆ మందస్మితము మందగమనల కందము. ఆమె బంగారపు పాలకి నధిరోహించి వచ్చును. ఛత్ర చామర శోభితయై వచ్చును. తన బృందముతో వచ్చును. ఈవిధముగా నా నర్తకి నర్తన మొనరింపవలసిన నాటి సాయంసమయమున నృపతి మందిరమునకు విచ్చేయవలెను.

ఈస్థలమున నింత వైభవోపేతముగా నర్తకీవర్ణనమున్నది. ఇది నర్తకీగణ గౌరవమునకు సూచకము. ఆనాటి ప్రభువు లెంతగా నర్తకీనర్తకలోకము నాదరించినారో దీన స్పష్టమగును. నర్తకీలోక మీవిధముగా స్వాత్మగౌరవమర్యాదాసక్తులుగా నుండవలయుటయు నీవర్ణనమున గోచరించును.

ఇట్టి న ర్తకీ నేపథ్యము భావనీయము. ఆ నేపథ్యము చారీ చారణములకు స్థానకావస్థానములకు కరణకరణములకు సౌష్ఠవముతో నుండుట సమీక్షింపదగినది యగును.

నైపథ్యస్థాన మాసాద్యకౌతుకత్వరితం తతః
ఊర్వోరాలోకనం చారీకరణాద్యేషు లక్షణం
కూర్మాసజ్జుస్తూక్ష్ణంతమాదీయత మాస్మభూత్ ?
ఇతి సూక్ష్మతరం త్వంతరర్ధోరుక మపర్యధ
సూచీవిజ్ఞాన సౌవర్ణపత్ర రత్నాన్వితాంచలం
కార్పాసమథవాక్షేమం పట్టువస్త్రం విచిత్రితం
కర్ణాటీప్రియయారీత్యాయా సీతావసితం తతం.

అట్టి న ర్తకి కుతూహలమున త్వరితముగా రంగమునందున్న నైపథ్యస్థానము చేరవలెను. అచట న ర్తన మొనరించువారు వేష ధారణము భూషధారణము వర్ణయోజనము చేసికొందురు. న ర్తకి యటుచేం చారీకరణాంగహార లాస్యాంగ గతిసంచారములకు తగిన విధమున తన యవయవము లుండుటను తన యూరువులు తగిన విధమున సముచితాహార్యములతో నుండుటను ప్రసమీక్షింపవలెను. ఇది యత్యంత మావశ్యకము, ఇది యు క్తలక్షణము. సరియగు సంస్థానమున నుండుటను సమీక్షింపవలెను. చారీకరణాదులకు అనువగు నట్లుగా జఘనమునకు నితంబమునకు ఊరువులకు సమాచ్ఛాదన ముగానుండు సరిపడు బిగువుగానుండు ఆహార్యమును ధరింపవలెను. అది చిన్నదియు పొట్టిదియు నగుట యు క్తము. దానిపై ఆచ్ఛాదన ముగా నుండునట్టి కూర్పాసమయి వస్త్రమునుగాని పట్టువస్త్రమును గాని ధరింపదగును. ఆ వస్త్రము సుందరము లాకర్షకములయిన కౌశలము సూచించు కుట్టుపని నగిషీ చిన్నెలతో నుండవలెను. సరిగంచు కుట్టుపని జలతారు మిలమిలలాడు చేతిపని కమనీయముగా

నుండు కై వాటుపు వని విన్నాణముతో నవి ప్రకాశమానములుగ నుండవలెను. ఇట్లు అంతర్భాగమున సూక్ష్మమగు అర్ధోరుకము ధరించుట దానిపై సూచీవిజ్ఞానము సూచించు సూదిపనివాటము సూచించు సౌవర్ణపత్రికలు బంగారు జరీదారములతో కూర్చిన శ్రేష్ఠములయిన పత్రిరచనా విశేషములతో అంచలభాగములు కూడుకొని యుండదగును. కార్పాసము క్షేమము పట్టువస్త్ర మేదేని కాని నిరూపితప్రకారమున విశిష్టముగా చిత్రితము కావలెను ఇట్లు కాని కర్ణాట దేశాంగనాభీష్టమయిన రీతి సముచితముగ గాని యాహార్యధారణము నిశ్చిత మొనరించుకొని ధరింపదగును. ఆవిధాన మంతయు రత్నసౌవర్ణ పత్రాదులతో కూడియుంచుట అలంకృతమైయుండుట యావశ్యకము ఈ నిరూపిత భావము నిచట గ్రహించుట యుక్తము.

> ఆలోకనమిదం శ్లక్ష్ణం ప్రేక్షణీయం యథాభవేత్
> ...............పాత్ర ధృతార్ధోరుకకంచుకం
> ముక్తాహారాది నాత్యంతమంగ సంలగ్నభూషణం
> సజ్జీభూయతతః సర్వం బృందం రంగభువం విశేత్.

నర్తకి యాహార్యాలోకన మంతయు శ్లక్ష్ణమై ప్రేక్షణీయముగా నుండునట్లు సంధానింపవలెను నర్తన మొనరించు పాత్రము అర్ధోరుకము కంచుకము సుదృఢముగా ధరించి తగిన యాహార్యవిధానమున చూపరులకు చూడదగిన విధమున నుండవలెను. పిమ్మట అంగసంలగ్నము లగునట్లుగా భూషణములు ధరింపవలెను ముక్తాహారాద్యాభరణము లన్నియు సుశ్లిష్టములుగా నాయోజితములు కావలెను ఇట్లా నర్తకి సర్వసంసిద్ధయై యుండవలెను పిమ్మట సర్వబృందము రంగభూమి ప్రవేశింపవలెను.

బృందవిన్యాసః

పాత్రస్య దక్షిణే పార్శ్వే ముఖరీస్యాన్ముఖేస్థితః
క్రమాన్మార్దంగికాస్తస్య తిష్ఠేయుర్వామతస్తతః
హుడుక్కా శాంఖికా దేశీపటహీ కరటాధరః
కాహలావాదకాః కాంస్యతాలినశ్చ యథాక్రమం
తిష్ఠేయుః పృష్ఠతస్తేషాం ఏవం ప్రతిముఖర్యపి
తస్యానువాదకాద్యాశ్చ తిష్ఠేయుర్వామపార్శ్వతః
తిష్ఠేతాం ముఖ్యగాయిన్యే పాత్ర పాశ్చాత్యభాగతః
ఏతయోః పార్శ్వయోస్తాలధరాః ప్రౌఢాః కలాదిషు
తత్పృష్ఠే వాంశికాః కాంస్యధరాః స్యురనుగాయికాః
బృందం నారీమయం సర్వమపికార్యం విలాసినా
రాజ్ఞాం విద్యావతాంచాగ్రే వైభవఖ్యాపనాయచ.

బృందమున నిరూపింపదగు విశేషములు నిరూపితములయినవి. బృంద మయిదువిధముల నుండుటయు ప్రతిపాదితము. రాజసన్నిధిలో నర్తకీపాత్ర నర్తన మారంభింపనున్నప్పుడు పరిసరమున నుండదగు వారి విన్యాసరీతి యిచట నిరూపితమగును. బృందమున నుండవలయు వారి సంఖ్యయు యిదివరలో సూచితము. ఇచట నెవరెవరెటు నెటుగా నుండవలయునో యిచట నిర్దిష్టమగును.

పాత్రముయొక్క దక్షిణపార్శ్వమునందు ప్రముఖస్థానమున ముఖరి యుండదగును. అతని వామభాగమున క్రమముగా మార్దంగికులుండవలయును. ఆపిమ్మట క్రమానుసారమున హుడుక్కి శాంఖికులు దేశీపటహీ కరటాధరుడు కాహలావాదకులు కాంస్యతాల ధారులు నుండదగుదురు. వారి పృష్ఠభాగమున ప్రతిముఖరి యుండును. వాని వామపార్శ్వముగా అనువాదన మొనరించువారు నితరులు నుందురు. పాత్రమయిన ముఖ్యనర్తకి వెనుకభాగమున

ముఖ్యగాయిను లిద్దరు నుందురు. ఈ ముఖ్యగాయినీద్వయముయొక్క పార్శ్వములందు కాలకలాప్రౌఢు లయిన తాలధారకు లుందురు. వారి పృష్ఠభాగమున వాంశికులు కాంస్యతాలధారులు అను గాన మొనరించువారు నుందురు. ఇట్లు బృందవిన్యాస సన్నివేశము రమ్యముగా నుండును.

బృందమంతయు నారీమయముగా నుండునట్లు విలాసియగు పతిభువు కూర్చుటయు యుక్తము. ఇట్లున్నచో రాజుల సన్నిధానమున విద్యావంతుల యగ్రభాగమున ప్రదర్శించుట రమ్యముగా నుండును. వైభవఖ్యాపనమునకు నిట్లు చేయుట సముచితము ఈ యంశ మిదివరలో సూచితమయినను ఉపాదేయతా గౌరవమునకు మఱల సూచితము.

## ఆతోద్య మేలనం.

భావిరాగాంశభూతేన మధ్యసప్తకవర్తినా
వాదయే ద్వాంశికోనాదం స్వరేణాదౌ ప్రయత్నతః
మంద్రం గాతాక్షమః ప్రాప్తుంతారంచనవినామునా
యోజ్యస్తేన సమం నాదః సర్వాతోద్యసముద్భవః
యథానాదమయం సర్వం జగత్స్థావరజంగమం
స్యాదేవం సతి నాదాత్మా దేవోఽనంతఫలప్రదః
ప్రయోగస్సుభగస్సాంద్రః సమ్మతశ్చ సభాసదాం.

వాంశికుడు ప్రథమమున ప్రయత్నపూర్వకముగా భావిరాగమున కంశభూతముగానుండు మధ్యసప్తకమున వర్తించు స్వరమున నాదమును వాదనము చేయవలెను. గాయకులు మంద్రస్థాన ముత్పన్నములయిన సప్తస్వరములను అందుకొని గాన మొనరింతురు. అట్టి విధానమిచట వాంశికుడు మధ్యస్వర సప్తకము ననుసరించిన

స్వరము ననుసరించుట యుక్తము. మొదట మంద్రస్థానమున గాన మొనరించు నాతడు తారస్వరము నందుకొనుటకు అర్హుడగును. మంద్రవాదానుసంధానము లేక తారానుసరణము కుదరదు. కావున సర్వాతోద్య సముద్భవమయిన నాదమును ఆ స్వరమున సమమగు నట్లుగా సరిజూచుకొని వలసియున్నది. స్థావరజంగమాత్మక మయిన సర్వజగమును నాదమయమగునట్లు సమీకృత నాదమును గంభీర ముగా ప్రసరింపజేయవలెను. అట్లొనరించినచో నాదాత్మకుడయిన దేవు డనంత ఫలప్రదుడగును.

ఇటుపై నిరూపింపబోవు పద్యార్థమున కనుబంధముగా కొన్ని పాదభాగము లుండుట ఆవశ్యకమని తోచును. కాని అవిలేవు, ఉన్న దాని భావమిట్లు గ్రాహ్యము. ఆతోద్యమేలనమున గలుగు ప్రయోగము సర్వము సాంద్రమై సభాసదులకు సమ్మతముగా నుండవలెను.

ఆతోద్యమేలనానంతరము వాద్యవిశేషముల నిరూపించుట యావశ్యకము.

పూర్వోక్త లక్షణాత్తస్మాత్సమహస్తాదనంతరం
జోడనీక్రమతో వాద్యం వాదయిత్వా హుడుక్కినా
స్నిగ్ధతారతరం ప్రాంతే ఝుంకారే తత్ప్రవర్తితే
నర్త? తాలప్రమాణేన తద్ద్విగుణేనవా
హుడుక్కా కరటా దేశీపటహైః శ్రోత్రమంజులం
లహార్యాం వాద్యమానాయాం లయచ్ఛందానుసారతః
నిస్సారుకైక తాలాభ్యాం క్రమాన్మర్దలవాదకాః
వాదయేయుః యతిః శ్రోత్రం సుధాసారేణసించతీ
తాలద్విమానతః పూర్వం ప్రారభ్యాక్రమవర్ధితైః
యావత్ షోడశభిర్మానైః సంమితాస్తత్ప్రమాణతః
హస్తేన మృదునాస్నిగ్ధా ప్రారభ్యా ముఖవాదినా

వీణానినాదినీ పూర్వం పశ్చాదారభటధ్వనిః
దృఢహస్తప్రహారేణ ప్రహర్షాద్యాగమేదురా
హుడుక్కా కరటోద్దామవహనీభిర్మనోహరా
కాహలా కాంస్యతాలోత్థనినాదై రుపబృంహితా
తతః ప్రహరణం లగ్నం ఏకతాద్వైవ సంమితం
స్నిగ్ధారభటభేదేన వాదయే యుర్యథోచితం
కరటాం కాహలాం కాంస్య తామ్రజామత్రభూభుజః
రసార్ద్రహృదయాః కేచిత్పారుష్యాన్నానుమన్వతే
గీతనృత్త విహీనత్వాద్వాద్యం శుష్కమితి స్మృతం
ఇహస్నిగ్ధస్యపర్యాయౌ సమానోపశమౌ బుధైః
తద్వైవారభటస్యాపిగదితౌ గజరోచ్చలౌ.

వాంశికులు రాగాంశానుసారమున స్వరసంధాన మొనరింపగా నప్పటి నాదము సర్వభాగముల గంభీరముగా ప్రసరింపగా సర్వ విధాతోద్యస ముత్పన్ననాదము స్నిగ్ధగంభీరముగా ప్రసరంపగా ప్రయోగము రమ్యమగుట నిరూపితమయినది. అప్పటి వాద్య వాదవరీతి సహహస్త విధానమున నుండుటయు నిరూపితప్రాయము సర్వాతోద్య సముద్భవమగు ధ్వని సమహస్తమనుట సప్తమాధ్యాయమున నిరూపితమయినది. ఈ సమహస్త ప్రయోగ సమనంతరము హుడుక్కా వాద్యమున జోడనీక్రమముగా వాదన మొనరింపవలెను. జోడని యనునది వాద్యప్రబంధములలో నున్నది హుడుక్కా వాద్యవాదనవిధానములలో జోడనీవిధానమును గలదు. హుడుక్కా వాద్యవిశేషము లన్నియు నిరువదియైదు కలవు. బోల్లావణి మొదలగునవి ౧౨. వల్లాది చంద్రకలాంతములు ౧౩ జోడనీలక్షణ మీవిధమున నున్నది. చతురశ్ర త్ర్యశ్ర మిశ్ర ఖండములను నాలుగు తాలవిధానములలో ఖండతాలము విడనాడి మిగిలిన మూడు తాల

ములతో నిబద్ధములయిన పాటములు అర్ధరూపములయినను అర్ధార్ధ రూపములయినను క్రమవ్యుత్క్రమమున సంయోగము కలవయినచో జోడని యందురు. ఈ వాదనానంతరము స్నిగ్ధముగా తారతరముగా ప్రారంభమున ఝంకారము ప్రవర్తితము కావలెను. అప్పుడు తాలప్రమాణమునగాని ద్విగుణముగగాని శ్రోత్ర మంజులముగా హుడుక్కా కరటా దేశీపటహములతో లహరీవాద్యము లయచ్ఛందానుసారముగా ప్రసరింపవలెను. లహరి యనునది ఏలాప్రబంధములలో నున్నది. అందు గణముల కలయికలవలన గలుగు భేదములలో నీ లహరియున్నది. "ప్రథమ ద్వితీయ చతుర్థ పంచమ గణ వికారేణ లహరీ" యని తత్స్వరూపము. లయచ్ఛందానుసారముగా లహరీ వాద్యము ప్రసరింపవలెను. ఆ పిమ్మట మద్దలవాదకులు నిస్సారుకము, ఏకతాళము అను విధానముల వాదన మొనర్పవలెను. అప్పుడు యతి యను వాద్యప్రబంధవాదనరీతి సుధాప్రసారమున శ్రోత్రసేచన మొనరించునది కావలెను. ఆ యతి వాదనమును మొదట ద్విగుణ తాలమానమున ప్రారంభించి క్రమవృద్ధి పొందిన తాలమానములతో సంమితమగునట్లుగా మృదుహస్తమున స్నిగ్ధముగ సారింపవలెను. ఇట్లు షోడశ తాలమానవృద్ధితో నది సంమితము కాదగును. దీని యనుబంధముగా ముఖవాదనము వీణాదినాదము నుండును. ఇట్టిది పూర్వరీతి.

ఇట్లు స్నిగ్ధధ్వని ప్రసరణానంతరము ఆరభట ధ్వని ప్రసరణము ఉండదగును. అది దృఢహస్తప్రహారమున ప్రహర్షకృతమున నుదయించును. అది రాగమేదురముగా నుండును. హుడుక్కా కరటోద్దామ వహనీవిశేష విశేషములచే మనోహరముగా నుండును. ఇచట రాగ వహని పదముల సంకేతితార్థమును ఇట్లు గుర్తింప

నగును. రాగావయవమునకు స్థాయ మని పేరు. అట్టి స్థాయను లనేకములున్నవి. ఆ స్థాయములు ప్రధానముగా పది కలవు అవాంతర భేదములతో నివి షణ్ణవతిన్ ౬ అగుచున్నవి. వహాని విధానమున స్వరము లంతఃప్రజాళను పొందుచున్నట్లు ఒకప్పుడు స్వరము లుత్ఫుల్లములై వెలువడుచున్నట్లుండును. వాద్యశబ్దము లన్నియు రాగమగ్నము లయినట్లుండును ఇట్టి యీ మనోహరధ్వని కాహలానినాదమున కూడినదై కాంస్యతాలనినాదమున కలిసినదై సముపబృంహితమగును.

అనంతరము ఏకతాలీవిధానమున ప్రహరణము వాద్య ప్రబంధము సంమిత్రమై లగ్నమగుట యావశ్యకము ప్రహరణము ఘోషయుక్తమై కూటవర్ణములతో సుబద్ధమగును. ముహుర్ముహుః ప్రయుక్తమయిన ఖండమునకు ప్రహరణమని పేరు. ధ్రువాది పర్యావయవ పరిమితమయిన నృత్తము జరుగునంతవరకు ఆ నృత్తమున ఖండమునకు ముహురావృత్తి నొనరించి ప్రహరణమును ప్రయోగింపవలెను ఇట్టి ప్రహరణమిందు చక్కగా లగ్నము కాదగునని భావము. ఇట్లు యథోచితముగా స్నిగ్ధారభటభేదమున వాదన మొనరింపవలెను.

రసార్ద్రహృదయులయిన కొందరు రాజులు ధ్వని పారుష్యమున్నందున కరటావాద్యమును కాహలావాద్యమును కాంస్యతాల జన్యమయిన రీతిని అనుమోదింపరు. కోమల శ్రుతిబంధముకల సుకుమార నృత్తవిన్యాసమునందు పారుష్యముండుటను వారాస్వాదించుటలేదు. వారు రసార్ద్రహృదయులు గావున దీప్తిసంపాదక ధ్వని విశేషముల నంగీకరింపరు.

గీత నృత్త రహితమగు వాద్యమును శుష్కవాద్యమందురు.

సమానము సమము అను వాద్యప్రబంధము ఉపశమనము అను వాద్య ప్రబంధము అను రెండును స్నిగ్ధములనుటకు పర్యాయములు. గజరము, ఉచ్చాలనము నను వాద్యప్రబంధములు ఆరభటవిధాన మునకు పర్యాయములు.

ఈ ప్రఘట్టములో సమ, ఉపశమ, గజర, ఉచ్చాల పదములు వాద్యప్రబంధవాచకములు. వాని భావమిట్లు గ్రాహ్యము.

సమము— "గీతనృత్త సమోమానే ప్రబంధః ప్రోచ్యతేసమః" ప్రమాణమున గీతనృత్తములలో సమానముగా నుండునది సమమను ప్రబంధము.

ఉపశమనము— కోమలనృత్తమున నభ్యస్తమగునది కోమల నాదము కలది సుకుమారాక్షరాన్వితమగునది పాటబద్ధమగునది యగు ఖండము ఉపశమప్రబంధము.

గజరము— పటహాది సాధారణములగు నక్షరములతో నుండు నది వాదకోద్ఘోషగంభీరము ఉచ్చధ్వని వెలువరించునది గజర ప్రబంధము.

ఉచ్చలము ఉచ్చలితము— ఇది యతియను వాద్యప్రబంధ రూపము. దీని స్వరూపము నిరూపితము. ఏ వాద్యప్రబంధమునకేని మొదట నిది వాదితమగునేని ఉట్టవణము అనదగును.

## న ర్త కీ ప్ర వే శః

చతురశ్రా చతుస్తంభా రంగే - రత్నరాజితా
(రమ్యా) మండపికాస్థాప్యా హస్తద్వితయసమ్మితా
హస్తమాత్రాధికోత్సేధా తత్త్రత్వా ణాన్త........
విచిత్రమణి సందోహద్యోతమాన ప్రభావతిః

తిష్ఠే త్తత్రవిమానస్థానాకనారీవ నర్తకీ
వంద్యమానాభితః స్త్రీభిశ్చారురవ్య జవాదిభిః
తుల్యరూప వయోవర్ణ ప్రమాణాభ్యాం పరస్పరం
అనఘై శ్శోభమానాభ్యా మంబరాభరణాధిపః
వాద్యతాల ప్రమాణాభ్యాం తూణాభ్యాం పుష్పధన్వనః
నారీభ్యాం చోతికాగు ప్తకుచాభ్యాం విధృతాంచలాః
అష్టారత్నికృతాయామాః తదర్ధేనతు వి స్తృతాః
పురోఽయవనికాశ్చిత్రా స్సూచీవిజ్ఞానభంగిభిః
తిస్ర స్తతోఽధికా వాస్యుర్యథావాద్యం యథారుచి
తతః పుష్పాంజలేః పూర్వం పాటబంధై స్సహక్రమాత్
కర్తవ్యం ప్రతిపీరాణాయేతాభ్యా మపసారణం
ప్రథమామంతరే ద్వైకాం పాత్రస్య పురతః స్థితాం
కర్పూర ధూపసంకాశ పీతాంశుకతిరోహితా
సద్యః క్షీరాబ్ధిజాతేవ తిష్ఠే లక్ష్మీః పతింవరా
తృతీయా పాటబంధస్య శబ్దేనాంతేఽప సర్పితా
సర్వాతోద్యవినాదేషు యుగపత్ శ్రోత్రహారిషు.

ఇచటి భావసారము నీవిధముగా గ్రహింపవచ్చును ఇద్దరు వనితలు యవనిక పట్టుదురు. నర్తకి యవనికాభ్యంతరితగా నుండును. వనితలు యవనిక తొలగింతురు. నర్తకి ప్రవిష్టగా భాసించును. ఈ యంశభావనముతో నీ వాక్యార్థభావనము యుక్తముగా నుండును.

రంగమున నొక రమ్యమయిన మండపమును కూర్చవలెను. ఆ మండపము హస్తద్వితయసమ్మితముగ నుండవలెను. చతురశ్రముగ నుండవలెను. నాలుగు స్తంభములతో నుండవలెను. అది రత్నరాజిత మగుట యుక్తము. శరీరము పొడవునకు ఒక హస్తమాత్ర మెత్తుగా నుండదగును. ప్రవేశింపజోవు నర్తకి పొడవు ననుసరించి నిర్మిత

మగుట యిచట భావనీయము. ఆ మండపము విచిత్రములగు మణుల సమూహముల కూర్పు పొందియుండును గావున ప్రకాశించు ప్రభా సముదాయమున నుండదగును. చక్కగా మణికాంతులతో ప్రకాశించుచుండవలెను అట్టి మండపమున నర్తకి యుండదగును అప్పుడామె విమానమునందున్న నాకనారివలె ప్రకాశించును. ఆ పరిసరములందున్న స్త్రీలు చామరాదులు ధరించి వందన మొనరించుచుందురు.

అప్పు డిద్దరు సుందరీమణు లటునిటు వచ్చి యవనికలు ధరింతురు. వారిద్దరు తుల్యరూప వయోవర్ణప్రమాణములతో నుందురు. ఒకరివలె నొకరుందురు. అనఘములగు అంబరములతో ఆభరణములతో ప్రకాశించుచుందురు. మన్మథుని తూణములవలె నున్నవారు చక్కని చిక్కని కుచములను చోలికాగుప్త మొనరించియుండి యవనికల యంచలభాగములను పట్టుకొని యుందురు.

ఆ యవనిక లెనిమిదిమూరల పొడవు నాలుగుమూరల వెడల్పు గలిగి విస్తృతములై యుండును. అవి నానావిధములగు సూదిపనుల నగిషీల భంగీవిశేషములతో నుండవలెను. అట్టివి మూడు యవనికలు గాని అంతకన్న నధికముగగాని యుండవచ్చును. అది యంతయు వాద్యానుసారముగ అభిరుచ్యనుసారముగ నుండును. అప్పుడు పుష్పాంజలి ప్రసారముండును. అంతకుపూర్వము ఆ నారీమణు లిద్దరు యవనికల నపసరింపజేయుదురు. పాటబంధముల విధానములతో క్రమముగా యవనికలను తొలగింతురు. ప్రధాననర్తకీ పాత్రమునకు పురోభాగముననున్న యవనికనుకాక ఇతరములను అపసరింపజేయుదురు. తుదకు సర్వాతోద్యనినాదము లొక్కపర్యాయము మ్రోగుచు శ్రోత్రప్రహారులుగా నుండగా పాటబంధమునకు సంబం

ధించిన శబ్దమున తుదకు తుది యవనికను తొలగింపవలెను. అప్పుడా నర్తకి కర్పూర ధూపసంకాశమయిన పీతాంశుకమున తిరోహితయై పాలకడలియందు జన్మించిన పద్మాదేవివలె అప్పుడె పతింవరయగు పద్మాదేవివలె సాక్షాల్లక్ష్మివలె శ్రీదేవిగా నుండవలెను. ఇట్లనుట అట్లు గోచరింపవలెనని భావము.

ఇటుపై కొంత భాగము త్రుటితమయిన దనిపించును. యవనికాపసరణానంతరము నర్తకి ప్రవేశించి యొనరింపవలయు నృత్తవిధానముల స్వరూపవర్ణన మిచట ఉండుట ఆవశ్యకమనిపించును. ఆరంభ నృత్తమున నొనరింపవలసిన విధానములు కొన్ని యిదివరలో సూచితములయినను ప్రకృతము సూచించుటయు నపేక్షితము. ఇట్టి ఘట్టములందు కొందరిట్లు సూచించిరి.

యవనికాపసారణానంతరము నర్తకి ప్రవేశించి వైష్ణవస్థానకమున నుండి, వక్షమున్నత మొనరించి, భుజశీర్షములను ప్రసన్నముగ కూర్చి, నాభిస్థానమున దక్షిణహస్తమును ఖటకాముఖముగ కూర్చి వామము లతాహస్తముగా నుండగా, చిబుకమును వక్షః క్షేత్రమునకు చతురంగుళమితముగా కూర్చి నానారససమాశ్రయముగా ప్రవేశ మాచరింపవలెను. ఇట్టి నర్తకీ ప్రథమ ప్రవేశవర్ణనము జాయ వాక్యములలో నున్నచో రమ్యముగా నుండెడిది.

## నర్తకీసమ్మాననం

ఊర్ధ్వభూమౌ తరీష............తముద్యతైః?
హైమైర్మణిమయైః కాంచీ మంజీరవలయాదిభిః
అన్యైరాభరణైః కించ వస్త్రైః చామీకరోచ్ఛ్రయైః
శ్రీఖండాగరుజైః............కుంకుమజైరపి
తోషయేయురిమాం బృందయుక్తా మింగితవేదినః

మత్తద్విపఘటావాజిభై ర............ధురంపరం
క్రమేణ కుంకుమం దద్యాత్ ద్వంద్వా..........శక్త్యనుసారతః
..........క్రాంతా ..........గత్వావేశ్మవిశ్రామ్యతాంత్వయా
ఇత్యాదిశ్య మహీపాలో హర్షాదేనాం విసర్జయేత్.

నర్తనాగారమున పర్తకి నర్తన మొనరించిన యనంతరము సహృదయు సదస్యుల యభినందన సూచకములయిన సమ్మాన బహుమానములు అభినందించి రాజు విశమింప ననుజ్ఞనిచ్చుట యిందున్నది. ఈ భాగములో పాదపాదమున త్రుటి యున్నది. అయినను తద్భావపూరణము భావనీయము కాగలదు. నర్తన కాలలో నముచితాసనములం దుపవిష్టులయినవారు నర్తకీ నర్త నముచూచి హర్షించి హర్షసూచనముగా సమ్మానబహుమానము లిచ్చుట కుద్యుక్తులగుట యుక్తము. అట్టివారు సువర్ణమయములు మణిమయములు నయిన కాంచీదామముల నిత్తురు. మంజీరముల నిత్తురు. కరకంకణముల నిత్తురు. ఇంక నిట్టివిత్తురు. నానావిధములగు ఆభరణముల నిత్తురు. ఇంతియే కాక బంగారపు జరీలు కల పట్టువస్త్ర ములను వస్త్రములను సమర్పింతురు. శ్రీచందనము అగరుద్రవ్యము జవాది పునుగు మొదలగు పరీమళ ద్రవ్యములతో నిర్మితములయిన కాశ్మీరజములు కుంకుమ సంజాతములయిన రసద్రవ్యములను చూర్ణ ద్రవ్యములను ఇత్తురు. అట్లభిలషితముల నపేక్షితముల నావశ్యక ములను నముచితములను ఇచ్చి భావవేదులై బృందయుక్త యగు నా నర్తకిని సంతుష్ట జేయుదురు. నర్తకి తన నర్తన మెంతగా నర్తన విదుల కెంతగా నభిమానాస్పదమయినదో యని భావించును. అభిజ్ఞుల సమక్షమున నర్తనము శోభించును. ఈ పారిషదు లెట్లు భావించిరో యా నర్తకి తెలియుఁగలదును. అది గుర్తించిన భావక ప్రేక్షకులు తమ యభినందన సూచకములయిన బహుమానముల నిచ్చి నర్తకి

సంతుష్ట యగునట్లు చేయుదురు. అట్టి యభిజ్ఞనర్తకి పండితచతుర నర్తకి కేవల బహుమానముల సంతుష్టకాదు. భావకుల భావ బహుమానమున సంతుష్ట యగును.

ఇది కొందరి సాధువాదనసత్కారము. కొందరు ధీమంతులు శ్రీమంతులు నగుదురు. శ్రీమాన్యులు ధీమాన్య లొనరించు సమ్మానము వేరువిధమున నుండును. వారు మత్తద్విపఘటల నిత్తురు. ఆజానేయవాజిసమూహ మిత్తురు. పరభీకరములయిన భైరవబృంద మిత్తురు. శిబికల నిత్తురు. వాహనముల నిత్తురు. రథముల నిత్తురు. ఇంక నభిలషితముల నిత్తురు. దంపతులుగ విచ్చేసినవారు శక్త్యను సారమున సమ్మానముల నిత్తురు. శోభామాంగల్య చిహ్నముగా కుంకుమ మిత్తురు. ఇట్లీ సత్కార సమ్మానములు కాగా సర్వము సంభావించిన ప్రభువు సర్వ మభినందించి "ఓసి! వాసూ! నీవు శ్రమించితివి. ఇక గృహమున కేగి విశ్రమింపుము." అని యనుజ్ఞ నిచ్చును. ఆదేశించును. ఇట్లాదేశించి మహీపాలు డా నర్తకిని పంపును.

స్వామి సంభావనాధన్యం మన్యాం లక్ష్మీశ్రభరాలసాం
అపిస్వపరదేశీయా న్నానావిధ కలానిధీన్
ప్రస్తుత స్తుతి వాచాలాన్నమ్యా న్విద్యావతోఽఖిలాన్
పరమండలినోఽశేషాన్కవీ న్కీర్తివిధాయినః
అభ్యర్థ్యాపి యథాకామం సువర్ణాభరణాంబరైః
కృతార్థాన్విర్దధీః కుర్వాత్........కీర్తిలంపటః

ప్రభు వాదరించినందున ధన్యతను భావించుచు లక్ష్మీశ్రభరా లసయయిన నర్తకి నటుపంపించి నానావిధ కలానిధులను రాజు అర్చింపవలెను. వారు స్వదేశీయులు పరదేశీయులు నగుదురు. వారి నందరిని పూజింపవలెను. ఇంక నచట ప్రస్తుతస్తుతి నాచరించు

వాచాలురుందురు. వారి నాదరింపవలెను ఇంకను నమస్కార్యులగు విద్వాంసులనందరి నర్చింపవలెను పరమండలమునకు సంబంధించిన వారినందరిని కీర్తినికూర్పు కవులను యథాకామముగా సువర్ణములతో నాభరణములతో నంబరములతో నర్చించి కృతార్థుల నొనరింపవలెను పార్థివుడగు ప్రభువిట్లాచరించుట యుక్తము. కలాపోషణ మొనరించిన ప్రాచీన ప్రభువులు కొందరిట్లే యాచరించిరి. కావున వారి కీర్తియందనురక్తుడయిన పార్థివు డిట్లందరిని కృతార్థులను చేయువలెను.

సూచీముఖ గతిస్ఫ్యాతగుణాశిఖరశోభితమ్
జాయసేనాధినాథేన నృత్తరత్నావలీకృతా.

జాయసేనాధినాథు డీనృత్తరత్నావలి రచించినాడు. రత్నావలియొక కంఠమాల. నృత్తరత్నావలి యొకగ్రంథము. రత్నావలీ రచనమున, సూచీముఖమున సిద్ధపఱచిన గ్రంథమున గుణముదారము స్ఫ్యాతమై కూర్పు పొందినదై యుండును. రత్నావలీరచనములో శిఖరము మేరుస్థానము శోభసంపాదించుచుండును. అట్లే ఈ నృత్తరత్నావలియు సూచీముఖము గతిశిఖరము (హస్తవిశేషము శిఖరహస్తమనుట) కలవు సూచీముఖము గతి యనుట సర్వవిధాంగికాభినయముల కుపలక్షణము. వాని నిరూపణమున ననుస్ఫ్యాతములయిన నానాగుణవిశేషము లిందును శిఖరాదినిరూపణమున నిది శోభాసహితమయినది. శ్లేషమూలకముగా రత్నావలికి గ్రంథమునకు అభేదాధ్యవసాయమిందు సిద్ధమయినది. రత్నావలీసుందరమయిన నృత్తరత్నావలీ గ్రంథమును జాయసేనాధినాథుడు నిర్మించెను.

---

# స్థాపన.



సాహిత్యవల్లభాంచిత మయిన ఈ నృత్తరత్నావలీ గ్రంథమునకు నే నేమేని వ్రాయదలచి పేరు పెట్టుట కాలోచించితిని. ఆకస్మికప్రత్యవభాసముగా స్థాపన అను పేరు స్ఫురించినది. స్థాపనార్థము నీ రత్నావలియే సూచించినది.

"రేఖయాలంకృతా రమ్యా స్థితిర్మ్రుఖరసేన చ
నృత్యస్యాభినయానాం యదంతే సా స్థాపనా స్మృతా"

గ్రంథార్థానుగతార్థము గ్రంథమున గలదు. అచటి సాహిత్యవల్లభయు చెప్పవలయునది చెప్పినది. నా చెప్పదలచినది యిచట జెప్పెదను.

సాహిత్యవల్లభ వ్యాఖ్య వ్రాయుటలో విశదముగా రచన సాగింపవలెనని, అభిలాష కలుగు వారల కామోదము గలుగునట్లు వ్రాయవలెనని సాహిత్యవల్లభుల సూచనము. అట్టి సూచనమునే నేనిట్లు అనుసరించితిని శ్రీ జాయసేనాపతి రచన నృత్తరత్నావలి. నా రచన సాహిత్యవల్లభ. నా యీ రచన నృత్తరత్నావలీ గ్రంథమునకు అనువాదము. కేవల మనువాదమును గాదు నాట్యవేద గ్రంథవిషయములు నున్నవి. ఈ "సాహిత్యవల్లభ వ్యాఖ్యానము" అను భావము కలిగించునట్లు "సాహిత్యవల్లభాఖ్యవ్యాఖ్య" యని యంటిని. ఇది వ్యాఖ్యానియమ పాలనమున నున్నదా? భరతభారతికి శ్రీమదభినవుడు అభినవభారతి రచించి అది "నాట్యవివృతి" అనెను. నేను శ్రీమదభినవగుప్తపాదపదారాధకుడను. ఒక అభిఖ్యకై యిది వ్యాఖ్య యంటిని.

ఉపాదేయసంపాఠము - తదస్యప్రతీకనము - స్ఫుటవ్యాఖ్య - విరోధపరిహారము - సుపూర్ణత - లక్ష్యానుసరణము - శ్లిష్ట వక్తవ్యాంశవివేచనము - సంగతి - పౌనరుక్త్యసమాధానము - సంగ్రహము.

అను వ్యాఖ్యాప్రకారములను నే ననుసరింపగలిగితినా? శ్రీతిమ్మరాజు సాహితీవల్లభుడు. ఇది తదాఖ్యావ్యాఖ్య. కావున సాహితీవల్లభాఖ్య వ్యాఖ్య యగును. సహృద లిట్లు భావించి అందరామోదము పొందుదు రని నేనును సమ్మోదము పొందుదును. నా యీ రచనమున నా క్లేశములను జెప్పి కొనను. అవి గాలికి పోవలసినవి. కాలమున నిలుపవలసినవి గావు అందర కిట్టివి యుండును గదా యందురు. నా సహృదత యున్నచో నేను సరి భావింతును. నా వైయక్తికములను దూరముంచి ఎట్లో దేవీభావనమున నిర్వార చమత్క్రియను నిలువ చేసికొని దీని వ్రాసితి ననుట స్వస్పంద సమ్మోదము. నా యీ వ్యాఖ్యానమును సంస్కృతభాషలో ననువదించి ప్రకటించుట సంస్కృతహృదయులకు హృదయసంస్కృతిని సంపాదింపగలదు అన్నిటిని నేన చేయుదునా? చేయించువారు ముద్రించువారు సాహితీవాల్లభ్యము కలవారు కలవారును కావలయునుగదా !

ఒకనాటి సారస్వతసభలో స్వ త్తరత్నావలీ ప్రశస్తి వింటిని. తద్రచనలు చూచితిని. ముద్రితమగుటను తెలిసికొంటిని. అల్పకాలమున నావిష్కృత మగు ననుకొంటిని. ఔచిత్యము కృతి ఇచ్చునాడు ఈ ప్రసక్తి వచ్చినది. శ్రీతిమ్మరాజు జాయపతిని విన్పించెను. నేను చూచితిని సాహితీవల్లభసంకల్పము సాహితీవల్లభాఖ్య వ్యాఖ్యానిదానము సాహితీవల్లభసంకల్పము ఔచిత్యము నాటి విద్వత్సహృదయసమితిలో అవికల్పముగ ప్రసరించినది. జాయసేనాపతి రత్నావలి

ముద్రణము నోచి నోచి ఆచి ఆచి యున్న మాకు ఆమోదముగా నందినది. సాహితీవాల్లభ్య ప్రకాశము నాటి మహాసభలో నేను చూచి చూచి పలుకునపుడు సాలోచన లోచనములను ప్రసరింప జేయు సాహితీవల్లభుని చూచి చూచి శబ్దప్రతిబింబనమును సంశుద్ధ ర్పణమున జూచుకొని "వారన దలచిరి" అంటిని. "నృత్తరత్నావలి" నేన ఆంధ్రమున వ్రాయ వలయుటను వారు సూచించిరి. పుస్తక మిచ్చిరి హృదయ మిచ్చిరి గుంటూరు సాహితీసదస్య మావేశమున సచేతోऽభిజ్ఞభూయిష్ఠపరిషత్తులో కౌండిన్యగోత్రుడ నగు నాకు కర్పూరతాంబూల మిచ్చి చందనాదు లిచ్చి శాలువ లిచ్చి నవనవనేత్రము లిచ్చి సాహితీవల్లభులు నృత్తరత్నావలీ ప్రకాశ చోదనము చేసిరి. నా సక్తి శక్తి రక్తి గుర్తించిన వారు నామాటలకు నృత్తము నేర్పిరి. బహ్వాసక్తి నాకు సమాప్తి నిచ్చినది.

లోకతంత్రానుసారముగ భావించినచో నేనిందు వ్రాసినది "వ్రాయవలసి వ్రాసినది" యని యనిపింపవచ్చును. కాని యపేక్షితములగు వానిని చూడగా చూడగా వ్రాయవలసినది వ్రాయ దలచినది యింక నధికముగనున్న దనిపించును. చిత్తభాతభావ మంతయు వ్రాయుటకు నాకు నాలుగు చేతులు లేవు కదా! తన గ్రంథవిషయము గుర్తించి భరతు డభినందించునని యీ గ్రంథకర్త యనెను. ఈగ్రంథమున నంతట నభినవగుప్తపాదపదారాధన మున్నది. భరతుని వలె నభినవగుప్తుడు నభినందించు నని శ్రీ జాయ సేనాపతి యనలేదు. ఎందువలన నట్లన లేదని నేననుకొనను. ఆ మాట నే నందును. అభినవగుప్తుడు ప్రత్యభిజ్ఞామృతధారాప్రసార మున తన హృదయమునకు ప్రమదము కూర్చుకొనిన సిద్ధరసప్రజ్ఞుడు శ్రీజాయసేనాపతి గజసాధనికుడు నేనిందు ద్వయవేదిని అద్వయ

వేదిని నేనధ్యాపకుడను. నాట్యస్మృత్యస్మృతాధ్యాపకుడను గాను. అయినను నాట్యాధ్యాపకుడను. నాట్యమున నొక యంగ మయిన ఆంగికము నధ్యాపనము చేయలేదు. వాచికమున గీతవాద్యవిశేషాధ్యాపకత నా జనకునకును లేదు. అయినను అధ్యాపకుడను. ఈ యధ్యాపనవ్రతముననె అని యివి వ్రాసితిని. నా యీ సాహితీవల్లభాఖ్యావ్యాఖ్యానమునను నా యధ్యాపకత నాకు గోచరించును. అధ్యయనాసకుల కధ్యాపన మొనరించు నధ్యాపకుడనుగా దీని వ్రాసితి నని అధ్యాపకభ్రాత లనినప్పుడు నేను మౌనము కల ముని నైతిని. నన్నిట్లనుమని యభినవుడన్నట్లు సంభావించు కొని అభినవానందుడ నగుదునా?

ఈ గ్రంథము సర్వము భరతుని నాట్యవేదప్రసూతము. అభినవభారతీసంకేతము. నాట్యవేదవివృతిలో నభినవగుప్తుడు సూచించిన విషయములను శ్రీ జాయసేనాపతి సంకేతసారముగా నిరూపించినాడు. పరిష్కర్త శ్రీ రాఘవన్ కతిపయస్థలములందు అభినవభారతీమూలకత్వమును సూచించి సంస్కరించుట సహకారి యయినది. అభినవభారతిని చూచుచున్నప్పుడు రత్నావలీద్యుతి గోచరించును. జాయపతి దర్శించిన అభినవభారతి నిశ్చితార్థమిచ్చి యుండును. నేటి యభినవభారతి నుండి నిశ్చితార్థ మన్వేషింపవలసివచ్చినది. నేనిది వ్రాయుటలో నాకు అభినవుడె కలడు. కీర్తిధరుడు లేడు. సోమేశ్వరుడు లేడు. ఇంకను కొందరట్టివారు లేరు. ఇట్లు వ్రాయుట యయినది. ఒక మిత్రుడనెను. “భరతుడు చెప్పని వాని నితడేమి చెప్పెను? దేశరీతులను జెప్పెను. భరతుని లక్షణవచనముల నటునిటుగా కూర్చి చెప్పెను. అభినవభారతీ సూచితములను తానుగా జెప్పెను. వారు వారు చెప్పిన వానిని క్రమము మార్చి చెప్పెను. ఇట్లేల చెప్పెను? వారి వారి శ్లోకములనె తాను భావించిన క్రమమున

కూర్చినను గ్రంథమగును కదా! క్రమము మార్చుటలో నేమి విశేషము కలదు? తాను మార్చి కూర్చినను ఆకరములనుండి చేర్చుకొనవలసి యుండునట్లుగనె కూర్చె నేమి?" అని ఆచార్యబుద్ధ్యనుసారమున ప్రయోగమునకు తగినట్లు దేశీరీతులను శాస్త్రీయముగ లక్షణయుక్తముగ నిరూపించుట జాయపతి పని. అప్పటికి పలయునంత జాయపతి చెప్పుట యయినది కదా! లోకతంత్రానుసారమున గుర్తించిన వానిని జాయపతి శాస్త్రీయముగ పరిష్కరించుటకు యత్నించెను. భరతు డట్లొనరింపవచ్చుననెను. ఈత డట్లొనరించెను. కొన్నిటి నిట్టివానిని ప్రాక్తను లంగీకరించిరి. ఆయ గీకృతములను తాను నంగీకరించెను. ఏతదంగీకృతములను అర్వాచీను లంగీకరింతురు. కాని అభ్యాసమున ప్రయోగమున నవలంబితురా? ఉన్న వానినె విడిచిన వారు ఇట్టి వాని నెట్లవలంబింతు రని యనుటకు నేనభినవగుప్తుడను గాను. కతిపయవిశిష్ట వ్యక్తులు సవిశేషముగ వీని నవలంబించి సవ్యాఖ్యానముగ ప్రయోగించినచో వానిని పరిసరముల వారు విశిష్టముగ సంభావింపగలరు

తనగ్రంథమును చూచి భరతు డభినందించునని జాయనుడు యనెను నా యీ సాహితీవల్లభ రచన చూచువారెవ రన్న వైరాశ్యము నాకు లేదు. జాయన సంతగా నభిమానించిన ఆదరించిన శ్రీగణపతిదేవుడు జాయనగ్రంథము నభినందించి యుండును గదా! ఆ గణపతిదేవుడు సాహితీవల్లభ దర్శనమున నెంతగ సంతోషింపగలడో నను నిర్మాణకాయమున గాకున్నను నిర్మాణచిత్తమున భావింపజేసికొనగలనని యనుకొందును గణపతిదేవుని రూపధేయము నామధేయము తదనంతరమున ప్రతిభాత మగుచునే యుండును. భరతగ్రంథమునకనేకులు వ్యాఖ్యలువ్రాసిరట. అభినవభారతి ప్రకాశితముకాగా నవి చీకటిపడినవి. భరతభావగ్రహణమునకు అభినవభారతియె యా

ధార మయినది. అభినవుడు భరతుని తన మార్గమున జేర్చుకొనెనని కొందరనిరి. భరతమార్గమునను అభినవుడు సంచరించెనని జాయపతి భావించెను. అభినవగుప్తపదములనె జాయనుడు హృదయమున నిలిపికొని తన రచనకాకృతి వైభవము సంపాదించెను. ఇట్లొనరించిన తనను భరతుడభినందించునని జాయనుడు అభినవముగా బలికెను. జాయన దృష్టిలో భరతు డభినవు నామోదించెనని అభినవశిష్యుడయిన తనను భరతు డామోదించునని భావన యున్నదని గుర్తింపగలము, ఆ కొందరు ఈ యిద్దరి నట్లె యందురా? నేను తృతీయుడను. భరతుడు తన పదవిన్యాసములతో విశిష్టార్థము గుప్తము చేసినాడని దానిని గుర్తించిన గాని శిష్టార్థము స్పష్టము కాదని జాయసేనాపతి భావించి గుర్తించెను. అభినవగుప్త పదపంక్తి చూచి చూచి ప్రతి పద్య సిద్ధము చేసికొని పద్యము రచించెను. కొన్ని పట్టులందు అభినవగుప్త గుప్తమును జాయసేనాపతి యథాశక్తముగ గుర్తించెనా? అను భావమును గలుగును. ఉపక్రమోప సంహారములలో నిరూపితము లయిన సర్వవిషయములను సంగత పఱచుకొని సమన్వయించుకొని పూర్వోత్తరవైరుధ్యము లేకుండునట్లు రచయితలు రచనలు చేయుదురు, భరతహృదయార్థమును సాక్షాత్కరించుకొని శ్రీమదభినవగుప్తుడు డభినవభారతి రచింపగా సర్వసమన్వయము కలిగినది. అట్లు సమన్వితభావార్థమును జాయసేనాపతి నిరూపింపగా భారతాభినందనయోగ్యత కలిగినట్లు లోకము భావించినది అభినవజాయపతుల భావనిబంధనమున కుపక్రమించిన నేను వారి యత్నఫలము నిరూపించుటకు యత్నించితిని వారు సిద్ధపరచిన ఐకార్థ్యమును నా మాటలలో నేను వ్రాయుటయ నా రచయితృత యయినది. అందరభినవులు కారు అట్టి సాక్షాత్కారము దుశ్శకము, తద్భావవేదనమును సుశకముగ లేదు. శ్రీ జాయపతికి గల సర్వశ్రీ సంపత్తి నా

మనసున కందునది కాదు. అయినను నేనీ రచన నిట్లొనరించితిని. లాస్యహ్లాదిని ఉమాదేవి తాండవానందుడు మాధవుడు నాకు ఆత్మశ్రీసంపత్తి కాగా దీని వ్రాసితి నని స్వస్పందసంవిదుల్లాసమున భావింతును. ఈ రత్నావలి యంతయు (కొంతయనుట) భరతాభినవ ప్రతిబింబము. భరతశ్లోకభావము పలె అటుగా నిటుగా కూర్పు పొందినవి. అభినవభావాక్త మయిన భరతభావమె యంతట నున్నది. భరతశ్లోకమునె కూర్పక పోయె నేమి? చెప్పవలయునది యున్నపుడు తత్పరిసరమున తానుగా శ్లోకము వ్రాయదగును కదా! భావద్వయమద్వయభావముగా గుర్తించి ధారణ మొనర్చుటకు జాయపతి రత్నావలి కూర్చెను. మనమును రత్నావలీధారణమున అభినవనాట్య భరతులము కాగలము. నాట్యవేదము ప్రథమ ద్వితీయ భాగముల నింతకు పూర్వము ప్రకటించుటచే నీ గ్రంథరచనములో పర్యాప్తకల్ప మయిన సహకారము లభించినది. నాట్యవేదము మూడవ భాగము ప్రకటింపని నాకు తద్రచనములో నిది యుపకరించినది. ఈ గ్రంథరచనాపేక్షితములగు గ్రంథములన్నియు నాకుపకరించినవి నేనువానిని తగినవిధమున నుపయోగించుకొన గలిగినవాడ నయితినా! ఇంకనుపకరింపగల గ్రంథముల యుపయోగ మందుకొన గలిగితినా! కావున "అది సహకారి, ఇది సహకారి" యని నేను వేరుగా వేని నుట్టంకింపలేదు. దీని పరిష్కర్త శ్రీరాఘవ భావముల నయిన స్వీకరింపగలిగితినా? నా యీ రచన నిర్దోష అనినేనే ఎట్లందును?. "సర్వజ్ఞరచన సదోష" అనియు ననువా రుందురు. వేదము నదుష్టము కాదనువారుందురు. నాట్యవేద మట్టిదే యనువారుందురు. "నాయీ రచన సదోష" యని నా కేట్లు తెలియును.? తద్విదుల సంవాద మిందు ప్రమాసంపాదకము.

నేను నాకుగా నొకభాష నలవరచుకొంటిని. ఇది సాహితీవల్ల భాసంగతము కావలెనని తలచితినా? అది యట్లై యనుపక్రమయినదా? కాని నేను నాభాషకు యత్నించితి నని తలంపను. వానిలోని వీనిలోని భాష యింకలి భాష యయినది. "గ్రంధము నా దృష్టిలో నున్నది. ఈ భాష నా సృష్టిలో నున్నది." అనునంతటి యహంత నాకుకలుగునా? ఇట్టి గ్రంథముల కిట్టిభాషను నా కెవరెవరో నేర్పియుందురు. నేను నా సంవిత్సంవాదముతో నీభాషకూర్చితినా? ఇది స్వస్పంద మనుకొందునా? నా యీ భాష కేమి? ఇందొక యర్థము స్ఫుటితమై భాసించుటకు నా దిది యత్నము కాని యత్నము చుట్టలు చుట్టి బుట్టలనుండి తట్టలనుండి పెట్టెలనుండి నేను శబ్దములను గుమ్మరింపలేదు. శలాక వేసి చూచు వారల కీభాష నవముగా నుండవచ్చును. కాని యిది పునర్నవమని మొదటినుండి సానధానముగ జదువు వారనగలరు. "అరాళములు కాని సర్పశీర్షములు కాని స్వస్తికములై స్వసమ్ముఖమున నున్న గజదంత మగును" అనునది ప్రథమదృక్కులకు గోచరము కాకపోవచ్చును. అతాదృశులకిది సంగ్రహమె యగును. ఇట్టి రీతి సర్వగ్రంధము లందును సమానము. ఏ భాషలోని గ్రంధమునందయినను ఇట్టి సంభాషాసంవాదముండుట సహృదయులకు విదితమె. నాట్యవేదము నావిష్కరించుటలో నన్ని శ్లోకములను గ్రహింప లేదు. షట్సహస్రపరిమిత మయిన నాట్యవేదమును తగ్గించుకొని నిరూపించితిని. తగ్గించినా శ్లోకముల తాత్పర్యమును స్పష్టముచేసితిని. ముఖ్యముగా కంఠధారణ యోగ్యములని భావించిన వానిని ఉల్లేఖించితిని. ఈ కాలమున ప్రకటించు నాకు అట్టి సంగ్రహ మభీష్ట మయినది. ఈగ్రంధము నట్లు సంగ్రహపఱచలేదు. ఇదియే నాట్యవేద సంగ్రహము. ఈ సంగ్రహము

గ్రహించుటలో నాకాగ్రహము లేదు. కొన్ని స్థలములందుఁదు లేని వానిని, కాదు, ఇందున్నవానిచే సభ్యూహ్యములగు వానిని నాట్య వేదవిషయములను నిరూపించితిని. ఇది యీ ఆకృతికి స్వాకృతి యని మిత్రసంభాష.

నాటక ప్రయోగములలో నటించు నటులు తమ భావబలము నె విశ్వసించి నటింతురు. వారి యభినయములందు సంస్కారములను పరిష్కారములను సహింపరు వారభినయించినదె యభినయమని లోకము తలచుటయు వారికి బలమయినది. ఆ నటులకు హస్తము ద్రలు అంగోపాంగాభినయము లావశ్యకముగ లేవు నాట్య మొన రింప నుత్సుకంపడిన వారలకు నాట్యము నేర్చితి మని తలచువారు నాట్యాచార్య లయి తాము నేర్చిన వానికి తామూహించినవానిని కలిపి నేర్పిరి. నేర్చుకొనినవారు ధనమిచ్చి నేర్చికొన్నందున తాము నేర్చినదానితో ధనముసంపాదించు వారయినందున వారి నే వారును ఏమియు సూచీముఖమున సూచింప వలను పడదు. వారు హస్తముల నన్నింటి ననుకరింతురా? హస్తవినియోగముల గుర్తించి ప్రయో గింతురా? ప్రయోగించుటలో వారు ఎన్ని క్రొత్తలు కూర్చినారో గుర్తించుట కవకాశము లేదు. చూచువారలకు వారి దంతయు క్రొత్త యయినది. అందు మోజుకలిగినది. ఇక నెవరేమి యందురు? హస్తములు గతులు వారెట్లు చూపినను చూపినట్లె యయినది. శాస్త్రీయములయిన వినియోగములు వారిలో నుండవనను. ఉన్న నను ఉన్నవాని నొకడు చూచి మెచ్చుగా లేనివానిని మెచ్చినట్లె లోకము తలచును. ఇట్టి స్థితిలో నీ గ్రంథమును నాట్యాదు లొనరించు వారొల్లరు. వారు చేయునది చేయవలయునది యగునో కాదో మీాక్షింపదలచువారల కావశ్యకము. అట్టివారును కొందరుందురు.

ఆంగికాభినయముల నిరూపించుటలో భరతుడు నిర్దేశించిన క్రమమున అభినవభారతి గూఢభావము నచ్చట నచ్చట స్పష్టము చేసినది. అంగహారములను మొదట నామతః నిర్దేశించుటలో భరతాభిసంధి సాభిప్రాయ మనుటను అభినవుడు విశదముచేసెను జాయసేనాపతి నిర్దేశించిన క్రమము గ్రహించు వారి సౌకర్యసంపాదనకు తగి యున్నది, పూర్వాపూర్వ విజ్ఞాన ముత్తరోత్తరపరిజ్ఞానమునకు సహకరించుటకు జాయపతి సంభావించెను. ఆంగికాభినయమునకు సంబంధించిన విశేషములను వ్రాయునపుడు సేనాంగికముల ననుకరించుచు లక్షణము సంగతి పరచుకొనుచు వ్రాతలో నిరూపించెనో ? అన్నియు నంగప్రత్యంగములందు సంగతము లయినవో ? ఉభయవిదులు ద్వయానుసంధాన మొనరించువారు గుర్తింతురని నేనై యున లేను. ఆంగికనిరూపణములో భరతు డనుసరించిన క్రమమును జాయపతి యనుసరింపలేదు. నాట్యవిద్య కది ప్రథమావతారము కావున భరతు డట్లు నిరూపించుట యుక్తము. భరతు డంగీకరించిన క్రమ మీ విధముగ నున్నది, బ్రహ్మవచనానుసారమున భరతుడు అమృతమంథన సమవకారము రచించి ప్రయోగించెను. త్రిపురదాహ మను డిమమును రచించి శివసమక్షమున ప్రదర్శించెను. శివుడు నృత్తము స్మరించి తత్ప్రతిబోధనమునకై తండువును నియమించెను తండు వంగహారములను జెప్పెను. అవి కరణాధీనము లయినందున కరణములను జెప్పెను. అంగహారస్వరూపము నిరూపించెను. అంగహారానుబద్ధములను జెప్పెను. పిండీబంధములను జెప్పెను. ఇవి యన్నియు నంగోపాంగప్రత్యంగముల స్వరూపపరిజ్ఞానముతో నొనర్పవలసి యున్నవి కావున పిమ్మట భరతుడు వానిని నిరూపించెను జాయపతి యనుసరించిన క్రమ మీ విధముగ నున్నది. శివనాట్యమును సంకల్పపురస్సరముగ నిర్దేశించి తన్నిరూపణము పూర్వాపూర్వాపేక్షితము

కావున సర్వపూర్వములను ప్రథమమున నిరూపించెను. అందునె ఆహార్యము చెప్పి ఆంగికము నందలి అంగోపాంగ ప్రత్యంగాభినయ స్వరూపనివేదన మొనరించెను. ఈ నిరూపణమున పూర్వవిదు లుత్తరావగాహన సమర్థు లగుదురు. అనంతరము మహార్థ మయిన అంగహారరహస్యము గుర్తింపగలరు భరతప్రక్రియాక్రమములలో వేరొక విశిష్టభావము గోచరించును. సంయుతాసంయుతహస్తముల రూపము నఖిలను లోక మప్పుడప్పుడు చూచుచున్నది వానిని వేరువేరుగా జూచుచు చూచిన సంతసమును రుచిచూపువారుందురు. హస్తమున హస్తము కలుగుటలో నంతరాలక్రియల చిక్రిమున నెట్లు చూడగలము ? కొందరా యంతరాలక్రియాక్రమమును దృష్టి కందింపగలరు. వారయిన "ఇదిగో కరణము" అని ప్రదర్శింప గలవారయినపుడు కరణకరణ క్రియారూపమును గూడ ప్రదర్శింప గలుగ వచ్చును. వానిని జూచుటకు జూపుగలవారు చూడగలరు. అట్టి చూపు ఈ గ్రంథమున గలుగునని తద్విదులన వలెను. సామాన్యముగా పూర్వనిరూపితార్థములను తరువాత నిరూపించువానిలో సంగతపఱచుకొనుట గలదు ఉత్తరగ్రంథనిరూపితములను పూర్వగ్రంథనిరూపితములలో సంగతపఱచుకొనుటయు గోచరించును. భరతుడు నికుంచితము చెప్పి వృశ్చికము చెప్పెను. నికుంచితము చెప్పినప్పుడె వృశ్చికపాదము నిరూపించెను. అట్లె జాయపతియు జెప్పెను. ఇట్టి వన్నియు నాట్యతత్త్వజ్ఞులకు నిత్యసాక్షాత్కారకల్పము లయియుండున వారి ఝుటిత్యుపస్థితిని మన మభిమానించి యనుసరింపవలసియున్నది. కావుననె కరణముల క్రమములో విశిష్టత యుండదని జాయపతి భరతక్రమమును వీడి యిష్టక్రమము నిరూపించెను. అయినను పూర్వాపూర్వ పరిజ్ఞాన మావశ్యక మగుచునె యుండును. అభినవుడు తన వివృతిలో ఆవశ్యకపూరణము కావించెను తదాధారము సర్వాధారము.

నాట్యవేదము ప్రథమభాగమున సంస్కృతగ్రంథములో అష్టోత్తరశతకరణములు శిలాఫలకగతములుగా ప్రదర్శితములయినవి. ఆ కరణచిత్రము లన్నియు భరతాభినవనిరూపిత కరణలక్షణ లక్షితములై యగునా? వానితో గొన్ని అన్యలక్షణములతో గన్పడును. కొన్ని అన్యోన్యలక్షణములతో నున్నవి. ఆ శిలాఫలకనిర్మాణ సమయము నాటికి కొన్ని కరణలక్షణములు నాట్యనృత్యవిదుల సంప్రదాయమున రూపాంతరము పొంది యుండవచ్చును. కరణములాకృతివిశిష్టములై శిలాఫలకసముత్కీర్ణములై గ్రంథముద్రితములై కరణరూపభావన మొనరించు వారల కామోదమిచ్చుచున్నవి. శివసేవాసక్తమయిన శివసేవనియతక్రమానుసారమున శివసన్నిధిలో నానాకరణాచరణసమర్థ మయినది. ఉమాశంకరులు సంతుష్టులయిరి. ఇది లక్ష్యఫలముగా భావించి కరణక్రమమును కూర్చుకొందుమేని యుద్దిష్టభావసిద్ధి యుండును. భరతక్రమ మంతట లేదు. అట్టిక్రమ మనుసరించి యుపదేశించుటలో భరతు డపూర్వ మేదేని భావించెనేమో? అది సంప్రదాయరహస్యము. కాని తదపూర్వానుబంధి సంప్రదాయవిదులు కైలాసమున నున్నారు. అట్టి భావబోధక వచనోపదేశము నభినవభారతి సూచించును. కరణము లష్టోత్తరశతమగుట అంగహారములు ద్వాత్రింశత్సంఖ్యతో నుండుట, నృత్తహస్తాదులును నియతసంఖ్యతో నుండుట ఒక తాంత్రిక మయిన భావము నుద్బోధించుట కగునేమో? అజ్వరితులు సావధానులై సాలోచనమతు లగుట యావశ్యకము. కరణము లింక నుండ వచ్చును. అంగహారములు నుండ వచ్చును. ఇతరములు నుండ వచ్చును. ఇట్టి యభ్యనుజ్ఞ యున్నది. కాని లక్ష్యము చూచి లక్షణము నెవరు చెప్పలేదు. లక్ష్యము కూర్చుటకు లక్షణమును చెప్పలేదు. కరణముల లక్షణముల ననుసరించి కరణప్రయోగ మొనరించుట

కష్టమని భావించు వారలకు కరణచిత్రఫలకములు కరణకరణ సహా కార మీగలవు. వాని దర్శనమున నేనిని కరణముల నొనరింతురేని అంగహారముల గూడ ప్రయోగించుట కలవడగలరు ? ఆ కరణచిత్ర ఫలకములలో నంతట స్త్రీలె కరణప్రయోగ మొనరింపగలవారుగ నున్నారు. నృత్తనృత్యాభ్యాస మొనరించువారలలో నుత్సుకము కల స్త్రీలు కరణముల ప్రయోగింతురా? వారెంతటి శరీరావయవ చాలన లాఘవము కలవారు కావలెనో? కరణముల లక్షణములను వినియోగములను గుర్తించుటకై ఆ యా స్థలములందు వచనము లున్నవి. భరతుడు సూచించిన వినియోగములకు మరికొన్ని వినియోగములను అభినవభారతి సూచించినది. భరతుడు సూచింపని వినియోగములను అభినవభారతి సూచించినది. అభినవవినియోగము లను జాయపతి నిరూపించినాడు అన్యకర్తృక వినియోగములును కొన్ని స్థలములందు జాయ రత్నావలిలో నున్నవి. కొన్నిటికి వినియోగములను శ్లోకమున నిరూపింపలేదు. అట్టి వానికి విశేష కథనము లేనందున సామాన్యాత్మక మయిన వినియోగము నూహింప వలసి యున్నది. కరణముల నిరూపణములో భరతుడు నిరూపి చినదే యుక్తశాస్త్రమని అభినవుడు భావించెను. కరణాంగహార ప్రయోగములలో గౌరీహరుల ప్రీతి సంపాదనము భావించిన ఆ శివదర్శనులు సాక్షాత్కరించుకొనిన విధానమును వారు నిరూపించిరి ఆ నిరూపణములో కొందరి భావాంతరములను అభినవభారతి చూపి నది వాని యందభినవున కాదరమున్నదా? వారి భావమును సంభా వించుటకె యుట్టంకించెనా? అట్టివానిపై అభినవుడు కటాక్షము సారించెనని భావింపవచ్చును. అవి గౌరీహరప్రీతి సంపాదకములు కావని యనుకొనగలమా? అంతటి అభినవదర్శన మర్వాచీనులకు లేదు. కరణముల నిరూపించుటలో భరతుడు సాధారణముగా

నొక్కొక్క శ్లోకమునే లక్షణముగా వ్రాసెను. భరతభావనిబంధనో ద్యతుడయిన జాయసేనాపతి కరణలక్షణనిరూపణమునకు ఒక శ్లోకము పర్యాప్తము కాదని భావించుటకు ఇట్టిభావమున కభినవ భారతి హేతువు, అభినవభారతీపదములను, శ్లోకము లందారాధింప దలచినందున, అభినవసూచిత వినియోగములను నిరూపించినందున, కీర్తిధరాదుల భావములను సూచింపదలచినందున విస్తర మావశ్యక మైనది. ఈ శ్లోకవిస్తరణమును సూత్రసంగ్రహమైనందున అభినవ భారతీవర్ణన మావశ్యకమైనది. కొన్ని కరణముల కంగహారములకు, చారీనామములకు, స్థానకములకు, హస్తములకు, ఇంకనిట్టి అవయవ సంస్థానములకు వ్యుత్పత్తినామసార్థకత నిరూపితమైనది. ఇట్టి వ్యుత్పత్తి యంతట నిరూపితము కాలేదు. వీనికివలె వానికి వ్యుత్పత్తి నభ్యూహించుట శక్యమగునా? శివనృత్తమహార్థమును భావించువారు శివ లీలానుకరణదృష్టులు ప్రమథులు ప్రమథనాథు నారాధించుట కా యా భంగులలవరచికొనిరి వానినట్లు వ్యుత్పాదింపగలము? కరణ క్రమములలో నొక యనుగతి నుండవచ్చును. అది స్పష్టమగుట లేదు. కావుననే కొందరు భరతక్రమము విడనాడి ఆత్మక్రమము ననుసరించిరి. నామముల సామ్యము ననుసరించి క్రమము కూర్చుకొనుటయు బాగుగ నుండ వచ్చును. ఇట్టి విశేషమే చారీక్రమము నందును భావింపదగి యున్నది చారీగతులకు క్రమము కూర్చుకొని ఆయా చారీసంబంధము కల కరణముల క్రమము నిశ్చయించుటయు సుందరము కావచ్చును. అట్టి క్రమవిన్యాసములో నేదేని విశిష్టభావ ముండుట యుక్తము. కొన్ని కరణములు చాలునని, ఇన్ని కరణము లేల యని యను వారుండవచ్చును. అట్టివారు ఇన్ని అలంకారము లేల? ఇన్ని గుణములేల? ఇన్ని దోషము లేల? ఇన్ని రాగము లేల? ఇవి యేల? ఇన్నియేల? అన్ని యేల? పల్కువారి పల్కులు విని

యుందురు? గుణము లెన్నోయుండగా వానిని మూడుగా గణించిరి కదా! అందురు. మూడు గుణములలో నన్ని గుణముల నంతర్భావింప చేయుటకు కాని, దోషాభావరూపకముగా నెన్నుటకుగాని, ఆ యభిజ్ఞప్రౌఢులకు మూలాధారమున్నది. ఇవి యేల? అనువారల కది లేదు. అది లేనపు డయుక్తము లేదు. నాట్యవేదము, అభినవ భావ్యము వ్రాయునపుడు వి స్తరభీరువునై కరణముల అంగహారముల స్వరూపమును సంగ్రహముగా వ్రాసితిని. ఇపుడట్టి భీరుత లేదు. కరణాంగహారముల నట్లు వ్రాసితిని. జాయనుడు అభినవవివృతి నెట్లు దర్శించెనో నే నట్లే దర్శించితినా? నా దర్శనమున నా అభినవదర్శన మున కరణాంగహారముల దర్శనమున ఇది వ్రాసితినో సాభినవభారతి భరతనాట్య వేదప్రథమభాగమున లభించిన కరణచిత్రము లున్నవి అవి యన్నియు యథోక్తకరణలక్షణలక్షితములు గనే యున్నవన్న విశ్వాసముతో పరిశీలించుట ఆవశ్యకము. కరణచిత్రములలో కరణా నుసరణమున సిద్ధమైన రూపమే గోచరించును. అట్టి కరణరూపసిద్ధికి వలసిన వలన వర్తన భ్రమణ రేచన వేష్టన ఉద్వేష్టన కుంచన నికుట్టన పరిఘట్టన ప్రభృతు లందు గోచరములు కావు. ఆయా స్థితి పూర్వభావులుగా వలనాదులను భావింపగలవారల కా చిత్రము లసంగతములుగా నుండవు. అంగహారములలో భరతుడు చెప్పిన క్రమమును మార్చి జాయపతి చతురశ్రతాలమానమున త్ర్యశ్రతాల మానమున అంగహారములను విభాగించి క్రమమును వేరుగా నిరూ పించెను. ఇట్టి విభాగ మభినవసూచితమే అభినవుడు త్ర్యశ్రచతురశ్ర మానమున ప్రదర్శించిన క్రమమును జాయపతి అనుసరింప లేదు. తాను వేరు క్రమ మంగీకరించి చూపెను. కరణసమూహాత్మకాంగ హారమున తాలమానకృత విభాగ మున్నట్లు కరణములందుండును గదా! దానిని నృత్తతాలవిదులు భరతుడు సంకీర్ణముగా చెప్పినను

అసంకీర్ణముగా విభాగము సూచింతురా? క్రమమునిరూపింతురా? త్ర్యశ్రతాలమానమున నున్న అంగహారములలో నిరూపితములైన కరణములు చతురశ్రతాలమానముననున్న అంగహారములందున్నవి. అందుకల కరణములలో తాలమాన నియమము కుదరదందురా? కరణమూలములైన చారీగతులలో తాలమాననియమము లేదందురా? ఆంగికములలో నన్నిటను వాద్యానుగత తాలానుగత నియమముండును. కావున తాలప్రమాణభావులు సమాలోచన మొనరించుట యుక్తముగా నుండును. అందరనుభూతి సారము వ్రాయుదురనుటను జాయపతికి నన్వయించువారు నావిషయమున నన్వయింపరని సహృదయభావు డనుట నన్ను గుర్తించుట యయినది. నేను నాట్యనృత్తనృత్యసాధనికుడను గాను. చతుర్విదనాట్యప్రతిపాదక గ్రంథవ్యాసంగమున నాకు అభిరతి యున్నది. అత్యభిజ్ఞాదర్శన పరమార్థసారుడు మహామాహేశ్వరుడు శ్రీమదభినవగుప్తుడు నాకు సాహిత్యదర్శనములందు దర్శన మిచ్చునన్న స్వాత్మప్రత్యయమున నుందును.

ఈ యంగహారముల నన్నిటిని మనమెట్లు చూడగలము? నేడు నటీనటులుగా ప్రఖ్యాతులు ఇదిగో ఇదిగో అని చూపగలవారయినచో చూపు గలవారయిన చూడగలరు. ఈ నటీనటుల కీ యంగహారములు ప్రయోగసాధ్యము లగునా? అయినచో నిట్లు చూడగలము. సినీ తంత్రమునం దఘటమానఘటన మున్నది. సముచితాహార్యము కూర్చి సర్వాంగహారములను నలుగురు నర్తకీమణులచే నాయోజింప జేయవచ్చును. బహుల ద్రవ్యసాధ్యమందురా? గ్రహాంతరయానము లోకాంతరయానము భావించి యిది శివయాన మని సంభావింపుడు. చారీకరణాంగహారములలో నా

హస్తము లాగతు లాకరణములై యుండవలయు నన్న నియమ మేల? మరికొన్ని యుండగూడదా? అన్యాస్యము లుండగూడదా? ఇట్లే యుండవలయు నివియే యుండవలయు ననుటలో నుపపత్తి యేమి? అని యనువారల కభినయదర్శనమె సమాధాన మీయగలదు. కరణముల కలయిక కల యంగహారముల విభాగమున తాలమాన గతి నియామకముగ నిరూపిత మయినది. అట్లే యున్నట నియామక నియమనము సంగతము కాగలదా? సర్వము తండుముని వచన ప్రమాణపరతంత్రమా? ఇట్టి విచట సమాలోచనీయములు కాగలవు. చారీమండలగతులు యుద్ధనియుద్ధములం దుండునవి కావున "ఈ చారీగతులలో నీ మండలముండదు" అను నియతిరీతి యున్నను ఎదుటనున్నవారి గతిననుసరించి తనగతి పరిశీలించికొనవలసి యుండును. అప్పుడు చారీగతులలో మార్పు రావచ్చును. చారీగతి మార్పువలన మండలమును మారును. అప్పు డీ నిరూపితములయిన మండలములై కాక అన్యమండలములును భాసించును. కావున మండలము లెన్నియేని కలుగవచ్చుట భావనీయము. మండలములలో చారీవిశేషము లున్నవి. చారులలో కట్యూరుజఘనపాదకర్మ లున్నవి. వానిని సంచారమంగోపాంగముల కర్మవిశేషములతో నుండును. ఇట్టివి యన్నియు పరస్పరసంబద్ధములై సుశ్లిష్టములై యున్నవి. వీనిలో నే యొక్కటి తెలియవలసియున్న నన్నింటిని తెలిసికొనవలసి యున్నది. అంగహారములలో కరణములు, కరణములలో నవయవకర్మలు కూడుకొని యున్నవి. వాని పరిజ్ఞానమిట్లై సాంగత్యముతో నున్నది. అవి యన్నియు నానావిధసాంకేతిక పారిభాషిక పదములతో నుండుటయు వానిలో గొన్ని పునరుక్తప్రాయముగ నుండుటయు ఝటితి గ్రహణధారణముల కనువుగ లేవు. పాదజంఘోరుకర్మలకు సంబంధించిన వినియోగవిశేషములె చారీ

గతులకు నుండునని సూచిత మయినది. కాని నిపుణముగా నభ్యూహించి వేరువేరుగా చారీవినియోగమును నిర్దేశించుట ఆవశ్యకమని తోచును. నర్తకి నర్తన మొనరించునప్పుడు సూచించు వినియోగ రీతులు శాస్త్రీయములై యగునా? అని సందేహింప వలసి యుండు నను వారు వినియోగ వినిర్ణయ మొనరించుకొనుట యపేక్షితమగునా

జాయపతి రత్నావలి రచించుటలో సర్వవిశేషములను తన నర్తకుల ప్రయోగమున దర్శించి లక్షణసమన్వయము భావించి సంతుష్టి సంపాదించి యుండును. నర్తకులై ప్రదర్శించువారును శాస్త్రీయసంస్కారము కలిగి ప్రదర్శించి యుందురు. ఒకభంగిమ నుండి వేరొక భంగిమను ప్రవర్తించునపుడు అంగభంగీసౌందర్యమును భావించిన నర్తకులె తద్విశిష్టతను వెలయింపగా వాని స్వీకార్యతను గుర్తించి జాయపతి లక్షణము వెలయించి యుండును. ఇట్టివి శతనామములతో నుండుటయు సంగతము. అభినవుడు సూచించిన విశేషములను జాయ మూలమున జేర్చుటయు విశిష్టతాసూచకము. రసికుడై రసభావవిదుడై జాయపతి యింత చేయ గలిగెను. కొన్ని నిశ్చయాంశముల విషయమున భరతభావములను సమీక్షించి గుర్తింపవలెనని జ్యాయన యనుట భరతప్రామాణ్యామోదము ఈ గ్రంథము ను జూచినవారును భరతగ్రంథమును జూడవలయునని సూచించుటయు నగును. కాగా భరతవేదము చూచి రత్నావలి చూచి భరతగ్రంథము చూడవలయుటను జ్యాయన యభిమానించు చున్నాడు. కాన భరతవేదవేది జ్యాయనుడు భరతాభినవ భావ సూత్రసంధాత యనదగును. జ్యాయన సర్వము భరతానుసారమున వ్రాసితినని భరతుడు తన్ను మెచ్చునని యని శార్ఙ్గదేవుని సోమదేవుని అనేకస్థలములం దనుసరించి తదనుసరణమున భారతీయము

లను విడిచి యన్యదీయములు పట్టెను. అందు జ్యాయన యాదర మూహింపగలము. అభినవు నంతట భావించెను. కొన్నిపట్టులలో నన్యుల భావించెను. ఇట్లు తన యిష్టము సూచించి ఇదియు భరత సమ్మత మగునని యనెను. భరతుడు తన విషయమున నంతటి యుదారుడని జ్యాయన భావించుటయు బాగుగనె యున్నది.

జాయన వర్తమానన్నృత్తమును దేశీనృత్త మని భావించెను. అట్లు వ్యవహరించెను. భావినృత్తము "నావగమ్యతే" యనెను. జాయన దేశీనృత్తము కూడ నేటి మనకు భూతనృత్తమె యయినది. నేడు మనకు గోచరించు నృత్తము జాయనకు భావినృత్తము. జాయన గుర్తించిన దేశీనృత్తము భరతాదులకు భావినృత్తము. భరతుడు తన్నభినందించునని జాయన యనెను. జాయన నిరూపించిన దేశీనృత్త మును గూడ భరతు డభినందించునని జాయన భావమై యుండునో? నేడు మనకు గోచరించు నృత్తమును జాయనవలె పరిష్కరించి నిరూ పించుట కెవరేని యత్నింతురో? అట్లెవరేని యత్నించిన రొయన రించిన జాయన యేని యభినందించునని వారు భావింప వచ్చును. దేశీరీతి, నాట్యసంగీతకవితాదులలో నున్న విధముగా సాహిత్య లక్షణము నందును దేశీరీతి రాబట్టు రీతి సఫలమగునా? కేవల మది యిది బాగు గొప్ప లెస్స యని ప్రశంసావచనముల బలుకుటయగాని, ప్రశంసానిదానములను సంబంధించిన విధమున వలుకగల మని యనగలవార లెందరున్నారు? నేటి భారత దేశమున నేత ద్దేశీయములె యున్నవా? అన్యదేశీయములు వచ్చినవందురు. అవి యా దేశమున మార్గరీతులా? దేశీరీతులా? వాని నేతద్దేశీయములుగ భావించుట లోని మెతకదనము మనకు బలమిచ్చునా? వాని నెట్లు పరిష్కరిం తురు? వీని నెట్లు పరిష్కరింతురు? సంపాదిత పరిష్కార మెట్లగును? ఎట్టివి యవి పరిష్కృతము లయినను దేశీనామమాలలో జేరగలవా

ఇట్లాశంకించు వారల కిం దేమేని లభించును. జాయసేనాపతి భూత నృత్తము వ్రాయుటలో గ్రంథసహాకార మున్నది. వర్తమాన దేశీ నృత్తము వ్రాయుటలో నట్టిసహాకారము కలదా? కేవలనృత్తదర్శన మున సంపన్న మయిన దేశీవిజ్ఞానమును నిబంధించెనా? పాల్కుఱికి బసవపురాణములో పండితారాధ్యచరిత్రలో దేశీనామములతో నృత్తరీతుల వివరించుట సహాకరించెనా? ఆ దేశీనామము లాతని వేనా? లోకప్రసారము పొంది యాతని కంది యుండునా? వానిని జాయపతియు సంస్కృతమున నిబంధించెనా? దేశీనృత్తరీతుల నితరు లును జెప్పిరి. మతంగుడే బృహద్దేశీప్రవర్తనాచార్యు డయ్యెను. భరతోక్త మయిన లోకధర్మి యుండనేయున్నది. ఇన్ని యున్నవని తెలిసి జాయసేనాపతి దేశీరీతిని దెలియుట యుక్తము.

గాయనీగాయను లన్న మాచార్యకీర్తనము లావిష్కృతములు కాగనె స్వరకల్పన మొనరించి గానసభలలో గాన మొనరించుట కుత్సుకం పడుట లోకౌత్సుక్యమునకు నిదానమయినది. ఇందలి దేశీరీతుల నవలంబించి ప్రయోగించి లోకౌత్సుక్యము గుర్తించి నృత్తప్రవృత్తు లౌత్సుక్యము వహించుట యుక్తముగా నుండును. అట్టి నృత్తప్రయోగులు నవప్రచారమున నృత్తయోగులు కాగలరు. దేశీరీతులు సామాన్యముగా నేకవిధమున నున్నవని భావించుట, బహుభేదద్రష్ట ప్రతిపాదకుడు ప్రయోక్త దేశీరీతిప్రయోక్తృధర్మవిదు డయిన జాయసేనాపతి భావమును బాగుగా గుర్తించుట గాదు. ప్రయోగకౌశలము కల వ్యుత్పన్నులలో వీనిని సంక్రమింపజేసి వారు శిష్యసంక్రాంతవిద్యులు కాగా ఈ భేదప్రభేదము లం దనుగతము లయిన విశిష్టతలను గుర్తింప వచ్చును. ఇది కేవలము గజసాధనికుని సంభావనము కాదు. తన్నిరూపిత దేశీరీతి భావసంభావనము. దేశీ నృత్తరీతులని యనుట గాని కరణాంగహారములలో వలె నితరము

లయిన ఆంగికభేదములలో వలె భావనీయమగు విశిష్టవిధానము కన్పింపక పోవచ్చును. ఇట్టి యదర్శనము పూర్వనిరూపితముల సంస్కారబలవాసితము కావచ్చును. జనరంజనాత్మకము లయిన దేశీప్రవృత్తులలో నంతగా క్షోదక్షమములగు విశేషము లుండవు. అట్టివాని నపేక్షించుట గాక ఉన్నవాని నపేక్షింపక అభినందించుట యుక్తము.

నాట్యధర్మిప్రవృత్తులు లోకధర్మిప్రవృత్తి విశేషముల నంతగా నాదరింపక పోవుటలో వారి మార్గపద్ధతి దీక్ష హేతువు. అది అభినందనీయమే. భరతుడు లోకధర్మిని విడనాడుట గాని, అనాదర పాత్రముగ భావించుటగాని సూచింపలేదు. సముచిత లోకధర్మి విశేషముల ఉపాదేయతనే నిర్దేశించెను. మార్గకవితానుయాయులు దేశీకవితాదరము చూపలేదని దేశీప్రియు లందురు. అట్లనుటలో వారి మార్గరీత్యనాదరము సూచితమగును. మార్గవృత్తాభిమానులు దేశీనృత్తాదరము చూపరని అనరాదని గణపతిదేవుడే జాయసేనాపతిచే ననిపించెను. నేటి సినీరంగములలోకాని, నృత్తరంగములలో కాని కొన్ని దేశీరీతులు కన్పింప వచ్చును. అవి ఏకాంశమున జాయ లక్షణముతో సంగతములు కావచ్చును. వాని నన్నిటిని లక్షణ చ్ఛాయకు తీసికొని రాగలరా? ఈ లక్షణమునకు, అ లక్ష్యమునకు వ్యత్యాస మున్నచో దాని లక్షణ మే విధమున వచ్చినదో గుర్తించుట ఆవశ్యకము. అథవా దానికిని లక్షణము కూర్చుట ఆవశ్యకము. ఇన్ని ఆవశ్యకములను గుర్తించుటకు వారలకు తీరిక ఉండదు. కొందర కంతటి ఓపిక యుండదు. కొందరు తటస్థులు. తమ సంప్రదాయసిద్ధములుగ వచ్చిన ఆచారవిచారముల ననుసరించు కతిపయ వ్యక్తులకు లోకమున సర్వసాధారణముగా గోచరించు కొందరి ఆచారవిచారములు అభీష్టములు కాకున్నను అనాదరపాత్రములు

కావు అట్లే భారతనాట్యగతి ప్రగతులను ఆదరించుటలో దేశీరీతులు అనాదరపాత్రములు కావు. ఆదరమనాదరము వస్తుసత్తను ఏమియు చేయలేవు. దేశీరీతుల వస్తుస్థితి జాయపతి ఇట్లు నిరూపించుట శ్లాఘాస్పదము.

దేశీనృత్తవిశేషములను నేను ఈవిధముగనైనను వ్రాయుటకు శ్రీ రాఘవన్ పరిష్కృతి, శ్రీమానవల్లి భరతకోశావిష్కృతి హేతువనుట పునరుక్తమైనను భూష. భరతకోశము భావపరిష్కారమును, పాఠపరిష్కారమును, రూపపరిష్కారమును సంపాదించుట నామనమున వలె సుమనోమనముల గూడనుండును. భరతాభినవాధారముగా నిరూపించిన అంగోపాంగాభినయములలో కరణాంగహారములలో ఇంక నట్టి వానిలో భావనీయమగు భావము ప్రతివిభాగమునను బహుళముగ భాసించును. దేశీరీతులలో అట్టి భావనీయమమంతగా నుండదు. అవి రంజనప్రాణము లగుట, శోభావిధాయులగుట దృశ్యమనోహరములు. అయినను అంతట శివప్రీతి విధాయిత ఉన్నదనుట భావసారము. ఏతచ్ఛాస్త్రీయములైన పారిభాషికపదముల భావార్థనిరూపకములుగా నొక నృత్తకోశమును, నాట్యకోశమును, ప్రకాశితము కావలసి యున్నది. మానవల్లి భరతకోశమున్నది. తదాధారమున నాట్యకోశము రావలెను. కొన్ని సాంకేతిక పదములు దేశభాషల నుండి వచ్చినవా? అన్ని భాషలనుండి వచ్చినవా? దేశభాషాపదములకు సంస్కృతీకరణము వలన వచ్చినవా? అన్నిటిని సమీక్షించి కోశనిర్మాణ మొనరించు టావశ్యము. శాస్త్రీయముగనో, వేరువిధముగనో, నాట్యాచార్యాభిమానముననో, ప్రేక్షకుల అభిలాషముననో, నర్తకీవేషముననో, ఛాయాప్రతిగ్రహముననో దేశీరీతులు, ప్రచారమున ప్రసారము పొందినవి. అట్టివి పుష్పేషు కేళికాననము లైనవి. మనోభూక్రీడాస్థానము లైనవి.

కోమల తనువల్లరీ లీలావలనములు కూడుకొన్నవి. లోకము దృశ్య రమ్యతను భావించినదే కాని లక్షణసంగతిని భావింప లేదు. లక్షణ సంగమము తలచని వారి సంతృప్తికై నటులు అంతంత ప్రదర్శించిరి. ఇవియు దేశీవిధానము లని లక్షణవిదులకు అన్యులు ఉద్బోధము సాగించిరి. నేటి కాలమున దేశీరీతులన్న పేరు వహించిన దేశీరీతు లకు శాస్త్రీయత సంపాదించుట నర్తకీనర్తక సహృదయ ప్రేక్షక ప్రియోక్తుల కభీష్టమగును. ఇందలి దేశీరీతుల లక్షణములు గుర్తించి ప్రయోగప్రదర్శన మిచ్చుట, ఇదిగో లక్ష్యము ఇది లక్షణము అని ప్రయోగవ్యాఖ్యాన మొనరించుట జాయనునకు అభినందనాస్పదమే యగును. శాస్త్రీయముగా నొక సిద్ధప్రక్రియ యుండగా దేశీరీతి యేల కల్గినది? ఉన్నదానిని వ్యత్యస్త మొనర్పగా, వేరుగా చేయగా, ఉన్న దాని నున్నట్లొనర్పక బోగా భ్రమప్రమాదుల వలన కల్గిన అన్య విధానములను కలియగల్పి ప్రత్యయము సంపాదించుటకై "దేశి" అనగనే దేశి అయినదా! ఇట్లన్యాన్యములను కలుపుగొనుట అవ్యవస్థిత ముగా సాగుచునే యుండును కదా? అపుడు "ఇయత్త" యుండునా? నియత మవభాసించునా? యత్కించిత్ రంజనధర్మ మున్న మాత్ర మున అవి క్రొత్త లగునా? ఆ క్రొత్తలు తర్వాతి వారికి ప్రాతలు. ప్రాతలయ్యును ప్రాతలన్న ఏ శాస్త్రవిశ్వాసము నాపాదింపవు. జాయ సేనాపతి నిగూఢార్థముగా సూత్రప్రాయముగా నిరూపించిన కొన్నిటిని అవగతము చేసికొనుటకు వేమభూపాలుని చింతామణి సహకరించినదనుట భరతకోశసంధాత సంధానఫలమ్మందుకొనుట రత్నావలీసంపాదక సంభాషాసారము సంగ్రహించుట అగును. నృత్తరీతులకు సంబంధించిన పారిభాషిక పదములు సర్వభాషలందును సంగతములై యుండవచ్చును. దేశీనృత్తములు దేశీపదములలో నున్నవి. అవియట్లు మారినవి. ఆ మారుటలో హేతువులు వర్ణాగమ

వర్ణాదేశ వర్ణవికారాద్యాత్మకములు "దాధాదయో బహుళం" అన్నట్లు ఎట్లోవచ్చినవా? ఎట్లెట్లో వచ్చినవి. ఆ వచ్చినవానిని మెచ్చిన వానిని దేశీనృత్తప్రక్రియాలాక్షణికులు మూలసంస్కృతము గోచరింపమి నవసంస్కృతమున గూర్చిరి. సంస్కృతవికృతులు సరిగా సంగతములు కానట్లు గుర్తించుట యుక్తమగునా? మార్గచారీరీతులు కరణముల కంగహారములకు మార్గదర్శకము లైనవి. దేశీచారీ రీతులట్లు కరణాంగహారములకు సూచకములు కాగలవా? అవి అయినట్లు యివియు నగునని తద్విదులు దేశీకరణములు దేశ్యంగ హారములు నిర్ణయించుట కుత్సుకపడగలరా! ఇట్టిది సంగతమైన అన్నియు సంగతము లవి దేశీనృత్త హస్తములను దేశీయాంగికము లను నిరూపింప వచ్చునని భావించువారల నాపగలవారెవ్వరు? భరతుడా? అభినవుడా? మతంగుడా? జాయనుడా? సామాన్యముగా దేశీరీతు లన్నియు మార్గరీతులతో నేకొంతగనో సంబంధము కల్గి యున్నవి. దేశీరీతులను నిరూపించినవారు సామాన్యముగా ఒకేనామ సంకేతమును ఒకే విధమగు లక్షణము నంగీకరించిరి. వేరువేరు దేశ ప్రదేశముల నున్నవారును సమానలక్షణపరిష్కారములనే చూపిరి. దేశభేదమున నామరూపభావభేదము లేల రాలేదు? దేశవిధానము లను మార్గవిధానములుగనే యయినవా? ఇక దేశీవ్యవహారమేమి? నిరూపితములైన దేశీలాస్యాంగములు సామాన్యముగా లాస్యవిశేష మును ప్రతిపాదించినట్లు లేదు. అవి నర్తకీనైపుణ్యప్రశంసా నిరూప ణములుగా నున్నవి. నర్తకీ నర్తనస్వరూపమున గల దోషవిశేషముల సూక్ష్మముగా గుర్తించుటకు సామర్థ్య మిచ్చునవిగా వెలితిని గోచరింప చేయునవిగా నున్నవి. అట్లుండుట నివి నిరూపించునవి అయినను ఉండరాని విధమును గూడ స్ఫురింప చేయునవిగా నున్నవి. ఇట్టి

యీ విభాగమును నృత్యాభ్యాస మొనరించువారందరు సావధానముగా సంభావించుట సముచితము. ప్రాచ్యవిద్యైశ్వరతా సంపాదనకై బహుశ్రుతులు యత్న మొనరించుట యావశ్యకము. నాట్య నృత్త నృత్యముల విషయమున ననేకముద్రితాముద్రిత గ్రంధములు కలవు వాని సమీక్షాదక్షతకు సమర్థమైన వ్యుత్పత్తి సంపాదించి యత్నించిన భరతాది భావు లామోదింప గలరు. పాడంబరవచన స్థానమున సాధికారవచనము లుండుట అత్మగౌరవముగా నుండుట యుక్తము ఈ గ్రంధము నెవరు తెలుగులో రచించినను నాట్యవేదము నభినవభారతి ననుసరించి వ్రాయుదు రని గాఢవిశ్వాసము గల నేను నేనుగా నిట్లు వ్రాసితిని జాయపతి ప్రభువులు దీని నభినందింతు రని జాయపతిని భావించియే నేనును భావించితిని. జాయా! నా భావమును నీవు చక్కగా గుర్తించితి వని భరతు డనె నని గ్రంధకర్త యనును. భరతాభినవులు నన్నును ఇట్లందు రని యనుకొందునా? నేను జాయపతిని కాను. శ్రీతిమ్మరాజు గణపతి దేవు డగుదు నేను గజసాధనికుడనా? నేను అగజాసాధనికుడను. జాయపతి నభిమానింప జేయుటకు నారచనా వ్యవసాయము సాగినదని అందుననే ఆ యా స్థానములందు సక్తము లనుపక్తములైన విషయములను గూర్చి చేర్చి వారి వారి భావములను చేర్చి సర్వము జాయభావముగా నిరూపించుట యున్న దనువారిని నే నేమందును? జాయపతి సూత్రాత్మక రచన సర్వము సూచింప గలదని నావలె భావించువారు నన్నభిమానింప కున్నను ఏమియు ననరని నా స్వభావమున ననగలను. అముద్రిత నృత్తరత్నావలీ ప్రసంగము వచ్చినపుడు అది ప్రరోచన మిచ్చినది. తాదృశప్రాప్తియత్నమునకు నేను శక్తుడనా? ముద్రితము వచ్చుచున్నదని విని విని యిన్నినాళ్ళకు చూచితిని. శ్రీరాఘవన్ పరిష్కరణ మాలంబనము. శ్రీమాన్ జాయపతి గ్రంధమున

కుష జీవ్యముల పరిశీలనబలమున నిట్టి పరిష్కృతిరూపము సంపాదించెను. అభినవపదానుసరణ మెట్లున్నదో? అన్వ్యావలంబన మెట్లున్నదో ప్రదర్శించెను. ఆ పరిష్కృత ప్రక్రియల నేనెట్లుపయోగించుకొనకుందును? నేను స్వయముగా నా యభిజ్ఞత నెరుగుదును. అపుడే వారి విశిష్టత నభినందించుకొంటిని. తదీయగ్రంథానుశీలమున అది యుండనే యున్నది. ఇపుడది యున్నది. అభినవభారతీవిధాత శ్రీమదభినవుడు నాకు నిత్య మభినవానందసంధాత. అందువలన నాకు సర్వము సుగ్రహ మని నాలో నే ననుకొందును. సుగ్రహ మనుట కాని సుప్రతిపాదమైనదా? భరతభాషలో దురూహాములుగా నున్న వానిని జాయనుడు సావధానముగా భావించి యుచటి గూఢములైన భావార్థములను శ్లోకము లందు నిరూపించెను. ఇట్లు నిరూపించుటలో అభినవగుప్తుని అభినవభారతి జాయపతి కాధారమైనది. జాయపతి సూక్ష్మతరములైన భావములను అభినవభారతినుండి గ్రహించుటచే అభినవుని శ్రద్ధగా నత్యంతము సన్నిహితుడు గుర్తించిన విధముగా గుర్తించినా డనుట అనేకస్థలము లందు గోచరించును. అభినవగుప్తుడట్లు నిరూపించుటలో ఎంతటి తపస్వితను, శివోపాసనమును మహామహేశ్వరతను స్వస్పందయోగము నవలంబించెనో నేనెట్లు చెప్పగలను? "భరతసూత్రమిదం వివృణ్వన్" అని అభినవవాక్యము. నాట్యవేద మంతయు శ్లోకాత్మకముగా నుండుటయు, కతిపయ భావము లందుమాత్రము గద్యముగా నుండుట ప్రసిద్ధము. గద్యము చూచి అది సూత్రమని భావించి భరతగ్రంథము సూత్రముగా నుండెనని అది లభింపదని శ్లోకరూపమే లభించు చున్నదని తమ నవపరిశోధకతాప్రఖ్యాతిని కూర్చుకొనిన వారందురు. సర్వము తెలిసిన అభినవగుప్తుడు ఇట్టి మాట లనడు. షట్త్రింశత్కమైన భరత సూత్రమును వివరింతు నని యనిన యభినవుడు నేటిశ్లోకాత్మక భరత

గ్రంథమునే (షట్సాహస్రి) భరతసూత్రముగా భావించి అభినవభారత భాష్య మాభాషించెను. భరతభాష సూత్రాయితము ఒక్కొక్క వాక్య మొక్కొక్క సూత్రముగా కూర్చి అభినవభాష్య మను సంధింప చేయుట యుక్తము కాగలదు. నాటసూత్రము భరతాభినవగవీ నిష్యందము. భరతసూత్రము అభినవవివృతి రూపనిరూపణమును సచేతశ్చేత స్తర్పణ మీయ గలదు. సంస్కృతరచన సూత్రాత్మకము గ సారప్రాయము గ నుండును అట్లుండుట సుందరము ఆంధ్రమున గూడ అట్టి రచన సుందరమే యయినను నవలోక మా సౌందర్యము చూడక విస్తృతి నపేక్షించుచున్నది. సూత్రాత్మక సారసంగ్రహ రచన దుర్జ్ఞేయ మని అద్యతన భావము పలుకుచున్నది. తాదృశభావ సమారాధనమునకు ఆంధ్రరచన విస్తృతమగును. అట్టే యయినది. నాటకము లాడునటులు శాస్త్రీయాంగికాభినయరమ్యతలను పాటించుట లేదు వారు వారి లోకసంస్కార బలమున కల్గిన ఆత్మనిశ్చయము ప్రమాణ మని విశ్వసించి ప్రచార బాహుళ్యమున లోకమున కట్టి దృష్టిని కలుగచేసిరి. వారు "శాస్త్రీయము బాగులే" దనగల్గినంతటి ధైర్యము కల్గినవా రయినారు. అట్టివారిట్టి గ్రంథములను కాలాతీతము లన గల్గుదురు. వారి విధానములే నచ్చువారలకు కాలాత్యయాపదిష్టములు కాగలవు. వారు వారి యనుయాయులకు అపకారము కలుగకుండు నట్లు పరిశీలించుట కలవడినచో కలాసౌందర్య భావకులు కాగలరని విశ్వాస మున్నది. ఉత్తమ మధ్యమాధమ ప్రయోగవిధానమున సావధానులయి నాట్య ప్రయోక్తలు ప్రయోగ మొనరించుచున్నారా? అనుటయు, తద్విధాన సావధానచిత్తు లయి ప్రేక్షకులు భావించుచున్నారా? అనుటయు భావుకుల కభీష్టములుగా నుండును కాని శ్రేష్ఠమధ్యమ రీతులకన్న నితరము లగు వానిని లోకము దర్శించి దర్శింపగలవారును అంత

ర్ధర్మాత్ములై లోకము ననుసరింప వలసి వచ్చినది. దీనివలన నట్టి
వారి కది యదియే అని ఆత్మప్రత్యయము కల్గుచున్నది. ఇట్టి
ప్రవృత్తి భావవివేకమున పరివర్తనము పొంది పరిణతమై పరివర్ధనము
పొందుట నాట్యసంవిత్సంధుల కభీష్టము. నృత్త నాట్యములకు
సంబంధించిన పారిభాషిక పదములు లోకమున ప్రసిద్ధములై వ్యాప్తి
పొందలేదు సారస్వతాలంకారవ్యాసంగ మొనరించిన వారలకును
అపరిచితములుగనే యున్నవి. పారిభాషికపదముల కర్థవివరణ
మిచ్చినను కావ్యశాస్త్రప్రసిద్ధ పదములవలె నివి మనోధృతము
లగుట లేదు. వీని పఠనపాఠన ప్రణాళిక సంప్రదాయవిచ్యుత మైనం
దున సర్వమచుంబితముగనే యున్నది. సాహితీచుంబన లాలసులకు
నీ పరిభాషాచుంబనము మధురముగ లేదు. వాని వాని స్వరూప
నిర్వచన మొనరించినను స్థలాంతరమున నది పిహితగోపితముగనే
యున్నది ఇట్టి క్లేశమును సహించుచు వ్యుత్పిత్సువు లోపికతో
వ్యాసంగ మొనరించు టావశ్యకము. గ్రంథదృష్టియే కాని యను
భవదృష్టి లేని వారలకు ఆంగికాభినయ నిరూపణప్రతిపాదన ప్రసం
గములు ఆహార్యములుగనే యుండును. కతిపయాంగిక మొనరించు
వారు సర్వాంగప్రత్యంగాభినయసమర్థత యున్నట్లు భావింప జాల
రనుట పునరుక్తమైనను సముచితాలంకారము దృష్టి సమగ్రసృష్టి
కల వా రెందరుందురో! నవకాలలబ్ధప్రతిష్ఠులును సందిహానులే
యగుదురు. ఏవాక్యమేని యొక ఛందోవిశేషము కావచ్చును. ఏ
గీతమేని యొక రాగవిశేషము కావచ్చును. ఏ వాక్యమునేని ఒక
కావ్యాంగము భాసింపవచ్చును. ఏ వర్ణనమేని యొక కావ్యాలం
కారము కావచ్చును. ఏ యంగవర్ణనమేని యొక యాంగికవిశేషము
కావచ్చును. అయినను నియతికృత నియతరూపసిద్ధికై లక్షణ
మావశ్యకము. లక్ష్యమున లక్షణానుసరణము ప్రయోక్త వివక్షాధీన

మైననే శోధ నాపాదింపగలదు. భావవ్యాఖ్యానసమయమున నేనాంగికము నేర్చిన వానిని పట్టుడని సూచించి వారి భంగివిశేషములు గుర్తించి వ్రాయుదుననుకొంటినా? అట్లుగా భంగివిశేషములు ప్రదర్శింపగలవారు, తత్పరిభాషల రీతులు గుర్తించిన వారు ఎందరుందురో నేను పరిగణించుట కవకాశము కలుగలేదు కొందరు పరీక్షించుట కడిగినట్లు భావించి వైరస్యము పూనుదురు నేను నాట్యాచార్యుడ నని యనుకొన లేదు. నాకుగా నేను కొన్ని కొన్ని యాంగికముల నటు నిటు పట్టి చూచుకొని వ్రాసితినా? ఆ సమయములందు వినియోగవిశేషములు స్ఫురించిన నిందువ్రాయుట నేనే యంగీకరింపలేదు. అలంకారగ్రంథములలో నిరూపితము లయిన యలంకారములు అలంకారప్రియుల కావ్యము లందును కూర్పు పొందవు. కూర్పు పొందిన వైనను సుఘటితములు సుశ్లిష్టములు కావు. గాన గ్రంథముల లోని గానవిశేషములను గాయనులందరు గానమున నుపయోగింపరు. ఛందశ్శాస్త్రములలోని ఛందముల నన్నిటిని ఛాందసులయినను స్వీకరించుట లేదు. అట్లే నృత్తశాస్త్రము విశేషములను అందరు నర్తకు లవలంబింపరు. తత్సమయాంతఃపాతి కతిపయమిత్ర సహృదయ సమ్మతము లగు వాని నెన్నిక చేసికొని కలియ గలిపి యొక విశిష్టాకారము నిర్ణయింతురు, బోధింతురు, ప్రచార మొనరింతురు. తత్ప్రచారాసక్తులు వాని ప్రబోధప్రచారాసక్తులై సంచరింతురు. అట్టివారి యట్టివానినిజూచి అవిలేవని ఇవిలేవని యనుకొని మాటకు శాస్త్రప్రామాణ్యముండుటయు కాని వ్యవహారపదవీ ప్రామాణ్యము కలదని నేనును గ్రహింప గలిగితిని. సాహిత్యశాస్త్రసమీక్షాయణులు పూర్వాపూర్వగ్రంథనిరూపితముల యౌచిత్య సామంజస్య ప్రతిపాదనమున నుపక్రమించి కొన్నిటిని దూషించిరి. కొన్నిటిని భూషించిరి. పరిష్కరించి ప్రతిపాదించిరి. అవి యశక్యప్రతిక్షేప

ములుగా నున్నవి. వారు నాట్య నృత్య నృత్త ప్రభేదముల విషయ మున నంతగా ఖండనమండనముల కుపక్రమింప లేదు అభినవు డుపక్రమింపక పోలేదు. అభినవానంతర మనభినవములు వచ్చినవి. ఆ వచ్చుట సముల్లాసము కలిగించిన దని యింకను నవనవముల నిరూపించిరి. కాని యవి యనభినవము లయినవి అన్నిటిని జూచి శాస్త్రవాదబలమున నెవరును ఖండనపండితులు కాలేదు. వ్యుత్పత్తి బలము గట్టిగా లేని నర్తకులు నటీమణులు నర్తకీమణు లేమి చేసినను మార్గించిన సహృదయుల యుపేక్ష నిదాన మయినది ఈభావ మామోద యోగ్యము కాగలదా?

భరతాది ప్రసిద్ధ మయిన దేశీప్రారంభ రీతి యనంతరకాల మున నవాంతరకారణముల వలన మారి యుండవలెను. దాని సంస్కరించి పరిష్కరించి యర్వాచీనులు గ్రంథములందు నిబం ధించిరి. అదియు మారుటచే లక్షణకారులకు లక్షణకథనావశ్యకత కలిగినది అదియు మారగా వచ్చినరీతిని పరిష్కరించుటకు ఆ లక్షణ విదు లభిలాషము ప్రదర్శించినను కాల మనుగతము కాలేదు. లక్షణ విదులు విదితలక్షణమునె విశద మొనరించుట కలవడిరి. లక్ష్యాను సారులకు లక్షణవిదులకు సామరస్యము కలిగిననె యేదేని కుదురును. సర్వము నాట్యమె తదతిరిక్త మేదియు లేదు. నాట్యసంగ్రహము నందలి కొన్ని యంశములకు అపేక్షిత మయిన విస్తృతి వచ్చినది. సాహితీమూర్ధన్యులు సమీక్షించి సహృదయులు ధన్యు లగుటకు ప్రసిద్ధప్రస్థానము నిర్దేశించిరి. ఒక్కొక యలంకారవిషయమున గుణవిషయమున ఇంక నిట్టి సాహితీసామగ్రీవిషయమున వివేక మిచ్చు సమాలోచనములు నిరూపించిరి. అట్టి సమర్థసమాలోచన మాంగికాభినయవిస్తరమందు నావశ్యకము. అభినవగుప్తు డితరములకు పద్యానిర్మాణ మొనరించినట్లే ఆంగికమునకు ప్రసాదించినాడు. నాట్యవేదము రచనము చేయుటలో నా యుపధానము వాచిక సాత్త్వికములలో బహుల మయినది. అప్పట ఆంగికాహార్యములలో